# ముళ్ళపూడి వెంకటరమణ
## సాహితీ సర్వస్వం
### నాల్గవ సంపుటం
# కదంబ రమణీయం-I

సంపాదకుడు: ఎమ్బీయస్ ప్రసాద్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam-4
KADAMBA RAMANEEYAM-1 - *Editor: M.B.S. Prasad*

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350/13

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : అక్టోబర్, 2003



ముఖచిత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ. 150/-**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హిమాయత్‌నగర్, హైదరాబాద్.



ఎన్నీయస్ రాజుగారు

ఎంచక్క నవ్వువారు

నవ్వి నవ్వించువారు

మంచి మనసు ఎంచువారు

స్నేహాన్నే పెంచువారు

సహృదయులు సన్మిత్రులు

రామచంద్రరాజు గారికి

శిరసాభివందనాలతో

— బాపు - రమణ


నీ పిచ్చిగానీ - ఏం వినబడదు - వచ్చిపడుకో
అదీ నాగార్జున సిమెంట్ తో కట్టిన గోడే!


నా సౌందర్య రహస్యమా!
నే నెప్పుడూ
నాగార్జున సిమెంట్ తో కట్టిన
స్విమ్మింగ్ పూల్ నే వాడుతాను!


కేమలా నిన్ను రహస్యంగా
ముక్కలవడాని కారణం
ఏమిటంటారూ?
నాగార్జున సిమెంట్ వాడండర్రా అని
మొదట్నించి మొత్తుకుంటూంటే
విన్నాడా గాళ్ళు!

# డైవర్సిటీ... దై నేమ్ ఈజ్ రమణా!

కథారమణీయం 1, 2 భాగాల ద్వారా రమణగారి కథాకథనశైలి తెలుసుకున్నవారు ఈ కదంబరమణీయం ద్వారా ఆయన వైవిధ్యం, విస్తృతి గమనించవచ్చు. 1954లో ఆంధ్రపత్రికలో చేరడం ఆయనకెంతో మేలు చేసింది. ఒక స్థిరమైన ఆదాయంతోబాటు ఎందరో మేధావుల, పండితుల సాంగత్యాన్ని సమకూర్చింది. అప్పట్లో తెలుగుసాహిత్యరంగంలోని హేమాహేమీలెందరో ఆంధ్రపత్రికలో పనిచేసేవారు. వారిలో చాలామంది (ఆల్మోస్ట్ అందరూ) రమణ కంటె విద్యాధికులు, బహుముఖ ప్రజ్ఞావంతులు.

పనిచేసేది పత్రికాఫీసు కాబట్టి దేశవిదేశాలకు సంబంధించిన వార్తలు, సంగతులు తెలుసుకోవడం ఉద్యోగరీత్యా అలవడింది పైగా సహజంగా ఉన్న పఠనాసక్తి, పెద్దలతో చర్చలు ఇవన్నీ కలిసి రమణ మేధోపరిధిని పెంచాయి; విషయ గ్రహణకు తోడ్పడ్డాయి. కాలమ్ నింపడం తప్పనిసరి కాబట్టి ప్రతిరోజు కలం పట్టక తప్పదు. బద్ధకానికి, వాయిదాలకు తావివ్వలేని బాధ్యత. ఏ రోజు కారోజు కొత్త విషయం చెప్పాలి; కొత్తగా చెప్పాలి. సామాన్య పాఠకుడిని కూడా దృష్టిలో పెట్టుకుని సగటు మనిషికి అందేటంత సరళమైన భాషలో చెప్పాలి.

ఒకసారి ఆ విద్య పట్టుబడ్డాక రమణ విజృంభించారు; విశ్వరూపం ప్రదర్శించారు. దినపత్రికలో సబ్ఎడిటర్‌గా రెండేళ్ళు పనిచేసి వారపత్రికకు మారేక అనేక శీర్షికలకై రాశారు. స్టాఫ్ కాబట్టి తన పేరు తరచుగా కనబడితే బాగుండదు కనుక మారుపేర్లతో కొన్ని, ఏ పేరూ లేకుండా కొన్నీ రాశారు. సినిమా సంగతులు కావచ్చు, స్త్రీల సంగతులు కావచ్చు, సంగీతపు 'సంగతులు' కావచ్చు. ఏ విభాగాన్నీ వదిలిపెట్టలేదు. విషయాన్నిబట్టి ఒకప్పుడు గంభీరంగా, మరొకప్పుడు సరదాగా రాసినా అన్నిటా ఆయన పాండిత్యమూ, పాఠకుడిని ఆకట్టుకునే శైలీ కనబడతాయి.

ఆంధ్రపత్రికనుండి బయటకు వచ్చాక ఆయన ఫ్రీలాన్సింగ్ చేశారు, సినిమాలకు రాశారు. రాస్తున్నారు. అయినా అప్పుడప్పుడు - అరుదుగానే - పత్రికలకు రాస్తున్నారు. పీఠికలు రాస్తున్నారు, పద్యాలు రాస్తున్నారు, వ్యాసాలు రాస్తున్నారు, కథ అనడానికీ, వ్యాసం అనడానికీ వీలులేని స్కెచ్‌లూ రాస్తున్నారు. 2003 వరకు ఆయన రాసిన వివిధ రచనాప్రక్రియలను 'కదంబరమణీయం' మకుటంతో రెండుభాగాలుగా పాఠకుల ముందుంచుతున్నాం. ఇది మొదటి భాగం.

# నవ్వితే నవ్వండి

జోక్సుబుక్స్ వెలువరించడం విదేశాలలో పరిపాటి. ఆ విధమైన పుస్తకం తెలుగులో తీసుకురావాలని సంకల్పించారు బాపు రమణలకు గురుతుల్యులైన ఈసెన్‌బర్గ్. (ఆయన వివరాలకు 'బుడుగు' అంకితం పేజీ చూడండి). రమణను ఆదేశించారు, ప్రోత్సహించారు. అంతకుముందు మనకు చిలకమర్తివారి 'చమత్కారాలు' వంటి పుస్తకాలు ఉన్నాయి. వాటిలో వ్యాఖ్యానాలు, వివరణలు ఎక్కువగా ఉండేవి. పైగా భాష ఆనాటిది. పత్రికల ద్వారా క్లుప్తంగా, సూటిగా, చురుకుగా ఉండే వార్తాకథనాలకు, ఛలోక్తులకు అలవాటుపడ్డ పాఠకులకు నచ్చే రీతిలో జోక్సుబుక్స్ తయారుచేయడం ఒక ప్రయోగమే!

రకరకాల జోక్స్ సేకరించి, వర్గీకరించి, ఆకర్షణీయమైన కాప్షన్లు పెట్టి, అంతకంటె ఆకర్షణీయమైన లైన్ డ్రాయింగ్స్ చేర్చి (పాతపుస్తకాలలో బొమ్మలుండేవి కావు) ఫారిన్‌టైపులో. తెలుగుపుస్తకం తీసుకువచ్చే భాధ్యత రమణకు అప్పగించబడింది. అప్పట్లో ఆయనకు ఉద్యోగం లేదు. ఏడేళ్ళు పనిచేశాక ఆంధ్రపత్రికనుండి బయటకు వచ్చేశారు.

ఉద్యోగం మానేశాక, ఫ్రీలాన్సర్‌గా ఆంధ్రపత్రికకు రాసి అంతవరకూ ఉద్యోగిగా అందుకున్న నెలసరి జీతం కంటే ఫ్రీలాన్స్ కంట్రిబ్యూటర్‌గా ఎక్కువ సంపాదించారు. అదీ రమణ ప్రజ్ఞ! ఫ్రీలాన్సింగ్‌గా అవీ, ఇవీ రాస్తూ, కొన్ని ప్రాజెక్టులు చేపట్టారు. ఎల్.ఐ.సి. మాన్యువల్ తెలుగులోకి అనువదించే పని వాటిలో ఒకటి. సబ్బుల ప్రకటనలు అనువదించడం - మాటకి అణా చొప్పున - మరొకటి. ఆ సమయంలో వచ్చిన ఈ జోక్ బుక్ ఆఫర్ రమణకు నచ్చింది. రకరకాల, దేశవిదేశాల జోక్సుకు తెలుగుతనం అద్ది, తన శైలిలోకి మార్చి బాపుగారితో బొమ్మలు వేయించి పుస్తకం తయారుచేశారు. ఆ పుస్తకానికి తను రచయితగాకాక సంకలనకర్తగా ప్రకటించుకున్నారు. జోక్సన్నీ తన స్వంతం కాదని ముందే చెప్పుకున్నారు.

పుస్తకం వెలువడ్డాక సూపర్‌సక్సెసయింది. 'జోక్స్ చెప్పే తీరు ఇది' అనే ఒక ప్రామాణికత సంతరించుకుంది. అక్షరం పొల్లుపోకుండా దీనిలోని జోక్సును యథాతథంగా అప్పజెప్పగల పాఠకులు వేలసంఖ్యలో ఉన్నారు. పత్రికలో పనిచేసేటప్పుడు అలాటి ఇమేజి లేకపోయినా జోక్స్ రచయితగా రమణ జనసామాన్యంలోకి చొచ్చుకుపోయారు. 'ఏదో సామెత చెప్పినట్టు' అనే బదులు 'ముళ్లపూడి వెంకటరమణ జోక్‌లా' అనడం పరిపాటి అయింది. తెనాలి రామలింగడు, బీర్బల్ కథల విషయంలో జరిగినట్టు ఆయన జోకులు కానివి కూడా ఆయన ఎక్కౌంటులో పడిపోసాగాయి. ఈ జోక్సుకు అనేక వెర్షన్స్ తయారయ్యాయి. తర్వాత వచ్చిన అనేక జోక్సుబుక్స్‌కు ఇది ప్రేరణ నిచ్చింది.

అంతకుముందు ఎన్నిసార్లు చదివినా, మళ్ళీ ఫ్రెష్‌గా నవ్వు తెప్పించగల సత్తా ఉన్న జోక్స్ కాబట్టే పుస్తకం అనేక పునర్ముద్రణలు పొందింది. బాపుగారు బొమ్మలు రివైజ్ చేసి కొత్తరూపం ఇస్తూనే ఉన్నారు. ఈ పుస్తకాన్ని రమణ తన మిత్రులు, కథారచయిత, ఐ. (ఇచ్ఛాపురపు) జె. (జగన్నాథరావు) గార్కి అంకితం ఇస్తూ 'హాయ్‌గా నవ్వడం, హాయ్‌గా నవ్వుకోడం, హాయ్‌గా నవ్విపోడం, హాయ్‌గా నవ్వేయడం, హాయ్‌గా నవ్వించడం, హాయ్ జె. రావు గారికి హాయ్‌గా జాయ్‌గా కానుకగా ఇచ్చే రమణీయం' అని రాశారు.

## పీఠికా రమణీయం

రమణ ఇప్పటికీ పత్రికలూ, పుస్తకాలూ బాగా చదువుతూనే ఉంటారు. కాని తన అభిప్రాయాలను బహిరంగంగా వెల్లడించడం ఆయన పద్ధతి కాదు. సభల్లో ఉపన్యాసాలు ఇవ్వరు, సమీక్షించరు, పీఠికలు రాయరు. 'ఆశీః' అనే పేరు మూసపీఠికలపై వ్యంగ్యరచన చేశారు కూడా. తన పుస్తకాలకు ఆయన ఎప్పుడూ పీఠికలు రాయించుకోలేదు. (ఈ సీరీస్‌లో వస్తున్నవి పీఠికలు కావు, ఒక అభిమాన పాఠకుడు సాటి పాఠకులతో పంచుకుంటున్న అభిప్రాయాలు మాత్రమే!). అటువంటి వ్యక్తిచేత తొలిసారిగా పీఠిక రాయించుకున్న గొప్ప పుస్తకం సత్యం శంకరమంచి గారి 'అమరావతి కథలు.'

సాధారణంగా పీఠికలలో పీఠికాకర్త తనకు రచయిత ఎంత ఆప్తుడో రాస్తూంటారు. రమణకు అది బొత్తిగా గిట్టదు. అందువల్లనే 'అమరావతి కథలు' పీఠికలో రచయిత జీవిత విశేషాలుండవు. నిజానికి అది రాసేనాటికి రమణ గారికి, సత్యం గారికి ప్రత్యక్ష పరిచయం లేదు కూడా. ఆ కథలు ఆంధ్రజ్యోతి వీక్లీలో వెలువడేటప్పుడు చదివి ముగ్ధులైన రమణ అవి పుస్తకరూపంలో వస్తున్నాయని తెలిసి పీఠిక రాయాలని ముచ్చటపడ్డారు. ఆ విషయం తెలిసిన రచయిత పరమానందభరితులై పుస్తకం అచ్చయి రెడీగా ఉన్నా, రమణ పీఠిక రావడం కొన్ని నెలలు లేటయినా ఆగారు. అత్యద్భుతమైన పీఠిక, 'పీఠికంటే ఇది' అనేంత గొప్పగా తయారయింది. కథను ఇలా ఎంజాయ్ చేయాలి అని చెప్పడంతో బాటు బాపు బొమ్మలను విశ్లేషించి రమణ మరో మహోపకారం చేశారు. బొమ్మ అందంగా ఉందని మెచ్చుకోవడమే తప్ప తరచి చూడాలని తెలియని సామాన్య పాఠకుడికి ఆ వైపు దృష్టి మరలించారు. 'అమరావతి కథలు' పేరు విన్నప్పుడల్లా పీఠిక గుర్తు వచ్చేటంత అపురూపంగా రూపుదిద్దుకున్న రచన ఇది.

'తిరుప్పావై' పీఠికలో పాఠకుడికి ఆండాళ్ గురించిన పూర్వాపరాలు పరిచయం చేసి పూర్వసాహిత్యంపై తనకున్న అభిరుచిని, పట్టును ప్రదర్శించారు. 'బారిస్టర్ పార్వతీశం' రమణ అభిమాన పుస్తకం కావడంతోబాటు దాని సృష్టికర్త మొక్కపాటి నరసింహశాస్త్రిగారితో అనుబంధం ఉండడం ఆయనను పీఠిక రాయడానికి ప్రేరేపించి

ఉండవచ్చు. శాస్త్రిగారు నడిపిన ప్రింటింగ్ ప్రెస్సులో రమణ 1950-51 లలో కొంతకాలం ప్రూఫ్‌రీడర్‌గా పనిచేశారు. తెలుగు పలుకుబళ్ళు మరిన్ని నేర్చారు. తన 'బొమ్మా-బొరుసు' (1975) పుస్తకంలో 'ధన్యవాదాలు' అనే శీర్షిక కింద ఆ రోజుల్ని గుర్తుచేసుకుంటూ ఆ పుస్తకం వెలువడడంలో శాస్త్రిగారి మనుమలు చేసినకృషిని ముచ్చటిస్తూ అదంతా ఆయన ఆశీర్వాదబల మనుకుంటానన్నారు.

## పద్య రమణీయం

రమణకు పద్యాలు రాయడం మహాయిష్టం. ఋణానందలహరి వంటి హాస్యరచనలో కూడా 'ఋణదాశరథీ' పద్యాలు చేర్చారు. చిన్నప్పుడే పద్యాలు అల్లడం హాబీ అయింది. న్యాపతి రాఘవరావు గారి 'బాల' పత్రికలో రాసిన పద్యాలు చూడండి. వాటికి వచ్చిన ప్రోత్సాహంతో 'ఉదయభాను' అనే రాతపత్రిక ప్రారంభించారు. రమణ ఎడిటరు, బాపు రాయసకాడు. ఓ ప్రదర్శన ఏర్పాటు చేసి, పత్రికకు సైక్లోస్టయిల్ మిషను కొనేటంత నిధులు పోగేశారు.

సినిమాల్లోకి వచ్చాక 'పక్కలో బల్లెం' సినిమాకు పాటలు రాశారు. 'రమణ ఇలా పాటలు రాస్తున్నాట్ట' అని అదే సినిమాకై పాటలు రాస్తున్న మల్లాది రామకృష్ణశాస్త్రి గారితో ఎవరో అంటే 'అతను ఇప్పుడు కొత్తగా రాయడమేమిటి? అతను రాసే మాటల్లో రిథమ్ చూడండి. అవన్నీ పాటలే!' అన్నారుట మల్లాది! 'తెలుపు' పై పన్‌చేస్తూ రాసిన కలర్‌ఫుల్ పాట చూడండి. 'వలచినవాడె కా-వలసినవాడె' లో పన్ చూడండి. సినిమా బాగానే ఆడినా, రమణ ఓ నిర్ణయం తీసుకున్నారు - తనిక సినిమాలకు పాటలు రాయకూడదని. కథ, మాటలకే పరిమితం కావాలని నిశ్చయించుకున్నారు. ఆ విధంగా కవిగా రమణను మనం పోగొట్టుకునే వాళ్లమే - ఆయన నిర్మాతగా మారకుంటే! ఆయన బాగా ఇన్వాల్వ్ అయిన "మూగమనసులు" వంటి సినిమా పాటల్లో ఆయన భావసంపద, పదసంపద పుష్కలంగా కనబడుతుంది. ఆయన, బాపు తీసిన సినిమాలలో - రాసిన కవి ఎవరైనా సరే - రమణముద్ర ప్రస్ఫుటంగా తెలుస్తుంది. ఇన్నాళ్లకు ఈటీవీ 'భాగవతం'లో గేయరచయితగా వేటూరి, ఆరుద్రలతోబాటు రమణ పేరు బుల్లితెరపైనైనా కనబడడం అభిమానులను అలరించే విషయం.

"పక్కలో బల్లెం" సినిమాపాటలు ఆడియోలో దొరకటం లేదు గానీ, "ప్రేమించిచూడు" పాట మాత్రం ఇప్పటికీ పాపులరే! సినిమారంగంలో రచయితగా పైకి వస్తున్న రోజుల్లో ఒక డైరెక్టర్‌పై కోపం వచ్చి చేతిలో ఉన్న పిక్చర్లు కూడా వదిలేసి 'జ్యోతి' మాసపత్రిక పని చూసుకుంటాననంటూ విజయవాడ వచ్చి కూచున్న (ఆంధ్రపత్రికలో ఉద్యోగం కూడా తనమీద తనకున్న ధీమాతో వదిలేసిందే కదా!) రమణను రెట్టింపు రేటు ఇచ్చి మద్రాసు సినీరంగానికి మళ్లీ తీసుకెళ్లిన పి. పుల్లయ్యగారు తమిళంలో హిట్టయిన సంపూర్ణ హాస్యచిత్రం 'కాదలిక్క నేరమిల్లయ్'ను

తెలుగులో తీస్తూ మాటలు రాయడానికి రమణను నియమించుకున్నారు. ఆ సినిమాలో ఓ కామెడీ సాంగ్ కూడా రాయించుకున్నారు.

పాటకు తమిళమూలం "విశ్వనాథన్ వేలై వేణుం" అనే పాట. దాన్ని పూర్తిగా తెలుగైజ్ చేశారు రమణ. విశ్వనాథన్ బుచ్చబ్బాయ్ అయ్యాడు. 'కామందూ,... రా ముందూ' వంటి అంత్యప్రాసలూ, 'మీసకట్టు తీసివేసి కాసెపోసి కోకచుట్టడం' వంటి తెలుగు నుడికారం, 'డొక్క చీల్చివేస్తాము, డోలు కట్టి తెస్తాము' మిన్ను విరిగి మీదపడ్డా, మన్ను మిన్ను ఏకమైనా' వంటి తెలుగు జాతీయాలు - ఇవన్నీ ఒరిజినల్‌లో లేని అందాలే! 'అందుకుంటె జుట్టుపట్టి, అందకుంటె కాళ్ళుపట్టు...' అంటూ కొమ్ముమాసి తేడాతో అర్థభేదం కలిగే పదాలనీ వాడుకున్నారు.

చెప్పదలచినదాన్ని క్లుప్తంగా, పద్యాల్లో చెప్పడం రమణగారికి సరదా! అందువల్ల తనకు నచ్చిన వ్యక్తులమీద పద్యాలు చెబుతూంటారు. "ఆశీః" పద్యాలలో కనబడే కందా మోహన్ "పెళ్లి చేసి చూడు" వంటి సినిమాలలో బాలనటుడిగా నటించి ప్రస్తుతం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా చేస్తున్న రమణగారి మిత్రుడు, అభిమాని. వేటూరి పత్రికలో రమణకు సహోద్యోగి. రమణ సినిమాలకు పాటలు రాశారు. బాలూ బాపురమణలకు సినిమాలలో గాయకుడు, రెండు సినిమాలకు సంగీత దర్శకుడు. వారి ప్రాజెక్టులకు చేయూత నిస్తూండే వీరాభిమాని. గొల్లపూడి, రావిశాస్త్రి, అబ్బూరి సాటి రచయితలు.

## వ్యాస రమణీయం

మదరాసు కేసరీస్కూల్లో ఫిఫ్తఫారం చదివేరోజుల్లోనే రమణకు డిబేట్లలోను, వ్యాసరచన పోటీల్లోను పాల్గొనడం అలవాటయింది. కనబడిన ప్రతి పుస్తకం చదవటం, కనబడని పుస్తకం కోసం వెతకడం దినచర్యగా ఉండేది. అందువల్ల భావప్రకటన, దానికి దీటుగా అందమైన భాష పట్టుబడింది. పత్రికలో పనిచేసేటప్పుడు అనేక వ్యక్తులపై వ్యాసాలు రాయడం జరిగింది. వాటిలో ఒకటి - ఫన్ డాక్టర్ చంద్రశేఖరం. మామూలు వ్యాసరచనకు భిన్నంగా ఎత్తుగడ కనబడుతుంది చూడండి. వీణాప్రవీణ కూడా అలాటి వ్యాసమే. ఇక తను అభిమానించే, గౌరవించే భమిడిపాటికి ఆయన అక్షరరూపంలో అర్పించిన నివాళి ఆ వ్యాసం. శంభుప్రసాద్ గారిపట్ల ఆయనకు గల భక్తిప్రపత్తులు పాఠకుడి కంట కన్నీరు తెప్పిస్తాయి. ఇక సహచరుడు బాపు గురించి ఆయనకంటె ఆథెంటిక్‌గా, రమణీయంగా వేరెవరు రాయగలరు?

ఇవన్నీ వ్యక్తులకు సంబంధించినవైతే విషయాల గురించి రాసినవి తక్కినవి. 'అమెరికన్ జాజ్ సంగీతం' సమాచారం ఆంగ్లపత్రికల నుండి తీసుకున్న ఆ వాసనలు లేకుండా జాగ్రత్త పడిన వైనం ఈనాటి జర్నలిస్టులు గమనించాలి. అది ఆంధ్రపత్రికలో ప్రచురించబడగా మెంటాలిటీలు, పగటికలలు 'జ్యోతి' మాసపత్రికలో

వెలువడ్డాయి. 1963లో 'జ్యోతి' మాసపత్రిక ఒక కొత్త తరహా పత్రికగా రూపుదిద్దుకుంది. సంపాదకవర్గంలో అందరూ హేమాహేమీలే – నండూరి, బాపు, రమణ, వివికె రంగారావు, రావి కొండలరావు, వే.వి. రాఘవయ్య నిర్వహణలో పత్రిక నడిచేది. రెండు, మూడేళ్ళు పోయాక రాఘవయ్యగారికి పత్రిక వదిలేసి వీరందరూ తప్పుకున్నారు. రమణ ప్రభృతుల సారథ్యంలో 'జ్యోతి' ఎన్నో ప్రయోగాలు చేసింది. ఎన్నో శీర్షికలకు ఒరవడి పెట్టింది.

## స్త్రీ రమణీయం

పత్రికలో ఉద్యోగరీత్యా రమణ అనేకరకాల శీర్షికలకై రాయవలసి వచ్చేదనుకున్నాంగా! వనితలకు ప్రత్యేకమైన సబ్జక్ట్‌ల గురించి కూడా ఆయన వదిలిపెట్టలేదు. జడల గురించి, దుస్తుల గురించి, ఆరోగ్యం గురించి, నగల గురించి (శ్రావణమాసం – నగలమాసం, శెనగలమాసం అనే పన్ చూడండి) ఇవన్నీ ఒక ఎత్తైతే వ్యాకరణ సాయంతో సమాజంపై విసుర్లు విసురుతూ – 'స్త్రై తత్పురుష' రాసిన తీరు అద్భుతం. పిల్లలకోసం 'విమానంకథ' రాయడానికి పి. దక్షిణామూర్తి అనే మారుపేరు పెట్టుకున్న రమణ, సి.వి.విజయలక్ష్మి, సి.వి.వి.లక్ష్మి అనే మారు పేర్లు పెట్టుకుని ఇవన్నీ 'లేడీ టోన్'లోనే రాశారు. తెలుసున్నవాళ్ళ ఇంటికి వెళ్ళి ఆడవాళ్ళతో మాట్లాడి సమాచారం రాబట్టేవారట. స్త్రీ హృదయం బాగా మథించారు కాబట్టే రమణ తన సినిమాలలో స్త్రీ పాత్రలను కూడా సజీవంగా, చైతన్యవంతంగా మలచగలిగేరు.

## వైవిధ్య రమణీయం

దీనిలో కనబడే మొదటిరచన రమణ తొలిరచన. 1945లో "బాల" పత్రికలో ప్రచురించబడింది. అప్పటికి రమణకు 14 ఏళ్ళు. యాదృచ్ఛికంగా అదే సంచికలో ఆయన కంటె రెండున్నర యేళ్ళు చిన్నవాడైన బాపు వేసిన బొమ్మ కూడా అచ్చయింది. ఆ విధంగా వారిద్దరి అనుబంధానికి 'బాల' పత్రికలో అంకురార్పణ జరిగింది. ఆ అనుబంధానికి 50 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా 1995లో 'బొమ్మా-బొరుసు' అనే పేరుతో ఓ సంకలనం వెలువడింది. దానిలో ఈ రెండింటితోబాటు అప్పటిదాకా పుస్తకరూపంలోరాని రమణ రచనలు కొన్నిటిని దానిలో చేర్చడం జరిగింది. దానికి ముందుమాటగా రాసుకున్న ఆత్మ(ల)కథే వ్యాస రమణీయంలోని 'జేజేలు.'

తక్కినవి రమణ 'రాయని భాస్కరుడి'గా పేరు తెచ్చుకున్నాక రాసినవి. నిజానికి ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే 1953 నుండి ఆరేడేళ్ళపాటు విస్తృతంగా రాసిన రమణ సినిమాల్లోకి వెళ్ళగానే కథల జోలికి పోకపోవడం. (నాలుగు దశాబ్దాల తర్వాత 'కన్నీటిపాట' కథ ఒక్కటి రాశారు.) ఏళ్ళ తరబడి ఏమీ రాయకుండా ఉండి ఎప్పుడో ఒకసారి ఓ వ్యాసం రాస్తారు. సినిమా రచయితగా ఆగిపోకుండా నిర్మాతగా మారడం వల్ల అనేక బాధ్యతలుండి ఈ వ్యాసంగం వెనుకబడడం ఒక కారణం

కావచ్చు. ఏదో రూపంగా ప్రజలతో సంపర్కం ఉంది కదాన్న తృప్తి కావచ్చు. ఏది ఏమైనా పత్రికలకు రాయడం బాగా తగ్గిపోయింది.

ఎప్పుడైనా రాయబుద్ధేస్తే రాసిన వైవిధ్య రచనలు ఈ ప్రకరణంలో కనబడతాయి. ఈ సాహిత్య ప్రక్రియకు విజ్ఞులు కొత్త పేరు పెట్టాలి. ఆంధ్రప్రభ వీక్లీకై రాసిన 'అపార్థసారథి'లో సీన్స్ కటింగ్ అదీ సినిమా టెక్నిక్కును తలపింపజేస్తుంది. 'శృంగారచంక్రమణం' చాలా పరిణతి చెందిన రచన. శృంగారంలోని ఎన్నో కోణాలను స్పృశించడమే కాదు, కోటబుల్ కోట్స్, ప్యారడీకోట్స్ అన్నీ కలిసి అదొక వినూత్న రచనగా తయారయింది. 'రచన' పత్రికలో తొలిసారిగా అచ్చయి 'లీలా జనార్దనమ్' పుస్తకంలో ఓ వ్యాసంగా చేర్చబడింది. 'లెటరేచర్' విభిన్నతరహా ప్రక్రియ. 'జ్యోతి' మాసపత్రికలో కొంతకాలం శీర్షికగా నడిపారు. దానిలో చివరగా కనబడే రచన ఈ పుస్తకం కోసం రాసిందే!

కదంబరమణీయం రెండవభాగంలో 'గిరీశం లెక్చర్లు', "శ్రీకృష్ణలీలలు" వంటి పుస్తకాలతోబాటు ఇవే శీర్షికల కింద రమణ ఇతరులపై, ఇతర సబ్జక్టులపై రాసిన వ్యాసాలు, రచనలు చోటు చేసుకుంటాయి. సినిమా వ్యక్తులపై రాసినవి, సమీక్షలూ అవీ సినీరమణీయంలో కనబడతాయి. ఈ సంపుటిపై తమ అభిప్రాయాలు తెలుపదలచేవారు రచయిత (అడ్రసు - No.4, Greenways Road Extn. Raja Annamalaipuram, Chennai-600 028 Ph: 044-2493 7109) లేదా సంపాదకుడు (అడ్రసు - 502, Siri Enclave, 8-3-960, Srinagar Colony, Hyderabad-500 073 Ph: 040-2374 3567/5563 2764) కు రాయగోర్తాను.

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# ముళ్లపూడి వెంకటరమణ సాహితీ సర్వస్వం

రూ.

**మొదటి సంపుటం: కథారమణీయం-I** 150/-

సీతాకళ్యాణం, ఇద్దరమ్మాయిలూ-ముగ్గురబ్బాయిలూ, భగ్నవీణలూ-బాష్పకణాలూ, జనతా ఎక్స్‌ప్రెస్, సన్మానభంగం, రాజకీయ బేతాళ పంచవిశంతి - ఇతర కథలు.

**రెండవ సంపుటం: కథారమణీయం-II** 150/-

కానుక, రాధాగోపాలం లహరి, ఏకలవ్యుడు, ఋణానందలహరి, ఆకలీ-ఆనందరావు, జలప్రళయం, కృతజ్ఞత, సాక్షి విమానం కథ - ఇతర కథలు.

**మూడవ సంపుటం: బాలరమణీయం - బుడుగు** 80/-

**నాల్గవ సంపుటం: కదంబరమణీయం-I** 150/-

నవ్వితే నవ్వండి, పీఠికలు, వ్యాసాలూ, ఇతర రచనలు.

**త్వరలో...**

**ఐదవ సంపుటం: కదంబరమణీయం-II**

గిరీశం లెక్చర్లు, శ్రీకృష్ణలీలలు, వ్యాసాలు, ఇతర రచనలు.

**ఆరవ సంపుటం: సినీరమణీయం-I**

విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు, చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాలు సమీక్షలు.

**ఏడవ సంపుటం: సినీరమణీయం-II**

కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవితచరిత్ర), చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాల సమీక్షలు.

**ఎనిమిదవ సంపుటం: అనువాదరమణీయం**

ఎనభై రోజుల్లో భూప్రదక్షిణం, పిటి 109.

ప్రతులకు: **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,** విజ్ఞాన భవన్, హైదరాబాదు-1.
**విశాలాంధ్ర బుక్ హౌస్,** హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్), విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

# ఇదీ వరస...

పేజీ

## నవ్వితే నవ్వండి

## పీఠికా రమణీయం



## పద్య రమణీయం

# నవ్వితే నవ్వండి

## మాకు అభ్యంతరం లేదు



ఆబాలగోపాలాన్నీ నవ్వించే జోకుల కొల్లలు

# మొదటి జోకు

అట్టహాసం నుంచి మందహాసం వరకూ వున్న రకరకాల నవ్వుల్ని - మీ దగ్గర కనీ వినీ ఆనందించాలన్న ఆశతో ఈ పుస్తకం మీ ముందు నిలబడింది. కొన్నిటికి నవ్వొచ్చు, కొన్నిటికి నవ్వుకోవచ్చు. మరి కొన్నిటికి నవ్విపోవచ్చు. మీరే బుక్కుని బుకాయించాలని గడుసుగా, అట్టహాసం వచ్చేచోట నిభాయించుకు మందహాసం చేసి వూరుకుంటే ఇది మోసపోదు.

ఎందుకంటే, ఇందులో దేశాటనాలు చేసిన జోకులున్నాయి. స్వగ్రామం స్వదేశం ఏదో మరచిపోయిన బాపతున్నాయి. ఇంగ్లీషు నవ్వులు, అమెరికన్ నవ్వులు, యూరపియన్ నవ్వులు, ఆసియా నవ్వులు చూసిన జోకులున్నాయి. అసలుదీకాక, నవ్వుకి సాపేక్ష సిద్ధాంతం (రిలటివిటీ) వర్తిస్తుందని ఈ పుస్తకం అనుమానం - అంటే దేశ కాల పరిస్థితులను బట్టి ఒక జోకుకు వచ్చే నవ్వు రకరకాలుగా వుంటుందని దీని ఊహ.

వెనకటికో పెద్దమనిషి చెప్పాడు. 'ఆ యొక్క వాన చినుకు పెనంమీద పడితే ఇగిరి చక్కాపోతుంది. సముద్రంలో పడితే నామరూపాల్లేకుండా పోతుంది. తామరాకుమీద పడితే ముత్యంలా ప్రకాశిస్తుంది. ముత్యపు చిప్పలో పడితే ముత్యమే అయి వూరుకుంటుంది.' అని.

ఒక విధంగా జోకులు కూడా అంతే. ఒక జోకు మీరొక్కరూ కూర్చుని చదువుకున్నప్పుడు చిరునవ్వు ఉదయిస్తే అదే జోకు నలుగురితో కలిసి చదివినప్పుడు గొల్లున నవ్వొస్తుంది. చిరాగ్గా వున్నప్పుడు మీ ఆయన/మీ ఆవిడ చదివితే ఇంకో ఫలితాన్నిస్తుంది. ఇద్దరు రోమియోలు ఒక రెండు జడల సీతముందు ఉండగా ఒకడు ఈ జోకును చెబితే రెండో వాడికి నవ్వురాదు సరిగదా ఏడుపు రావచ్చు. ఏడుపు మార్కు నవ్వు రావచ్చు. మీ యింటి కొచ్చిన కొత్తచుట్టం వేస్తే మీచేత హుషారుగా నవ్విస్తుంది. నిలవ చుట్టం నోట పలికితే అసందర్భ ప్రేలాపనలా వినబడి చిరాకు కలిగిస్తుంది. శ్రీ ఆఫీసు మానేజరుగారి, మీకు అప్పివ్వబోతున్న ఆసామి గారి, చాలా గొప్పవాడుగారి వేస్తే పొట్టచెక్కలయేలా నవ్విస్తుంది.

*Money is honey*
*My dear sonny*
*And a richman's*
*Joke is always funny!*

- అన్నాడొక ఆసామి.

కాని, ఇవన్నీ గిట్టనివాళ్ళ మాటల్లెండి. మీరెక్కడ ఎప్పుడు విన్నా నవ్వుతారు. మీరు చాలా మంచివారు. మీ డ్రెస్ ఎంతో బావుంది. మీలా పొడి తీసి/తియ్యకుండా తుమ్ముకోవాలని నాకు చాల సరదాగా వుంది. ఆ వాచి ఎక్కడ కొన్నారు. మీ టేస్టు యమటేస్టండి.... చీరల సెలక్షను మీద మీరు మీ/మా వారపత్రికలో ఒక వ్యాసం రాయరాదూ. మీకు మంచి సెన్సాఫ్ హ్యూమర్ వుంది. ఈ తెలుగోడికి సెన్సాఫ్ హ్యూమరు లేదన్నాడో తెలుగా.... మీరు మంచి సరసులు. నవ్వుతారు.

(నవ్వకపోతే ఈ పుస్తకం చిన్నబుచ్చు కుంటుంది. అప్పుడు అక్షరాలు మరీ నలుసులై పోయి మరోసారి చదవాలంటే కనబడవు. చత్వారం కాబోలని మీరు కళ్ళజోడు కోసం పరుగెత్తాలి.)

అందుకని హాయిగా కడుపారా నవ్వండి. లేకపోతే ఈ పుస్తకం మీరు యింకోళ్ళకి ఎరువిచ్చినంత ఒట్టు.

- రమణ



# అన్ని అప్పులకూ అమృతాంజనము

"వత్సా, నీ భక్తికి మెచ్చితిని వరము కోరుము" అన్నాడు మహావిష్ణువు ప్రత్యక్షమై.

భక్తుడు లేచి "వరాలమాట దేవుడెరుగ్గాని ముందో ఫైవ్ రుపీస్ ఉంటే ఇవ్వండి చెప్తా. మళ్ళీ ఈసారి మీరు ప్రత్యక్షం అయినపుడు ఇచ్చేస్తా లెండి. బాబ్బాబు. అర్జంటు, లేదనకండి" అన్నాడు హడావిడిగా.

అతని పేరు అప్పారావు.

అతను అప్పులు చేస్తూ వుంటాడు. సర్వాంతర్యామి. ★

"ఏంవోయ్, ఓ పాతిక రూపాయలుంటే యిద్దూ. పెద్దాపురం వెళ్ళి రాగానే యిచ్చేస్తా" నన్నాడు అప్పారావు.

మిత్రుడు యిచ్చాడు. ఇచ్చి పాతికేళ్ళు కావచ్చింది. అయినా అప్పారావు అప్పు తీర్చలేదు. మిత్రుడింకోసారి నిల్దీసి అడిగాడు.

"నేనింత వరకు పెద్దాపురం వెళ్ళడం పడనేలేదోయ్" అన్నాడు అప్పారావు. ★

అప్పారావు: ఒక్క రూపాయి వుంటే యిద్దూ!

సుబ్బారావు: జేబులో దమ్మిడీ లేదు.

అప్పారావు: ఇంటి దగ్గర?

సుబ్బారావు: అంతా కులాసా దేవుడి దయవల్ల. ★

అప్పారావు: హల్లో, ఒక్క అయిదు....

సుబ్బారావు: కానీ కూ....

అప్పారావు: ..... నిమిషాలు నీతో మాట్లాడాలోయ్.

సుబ్బారావు:.... ర్చో ఆ కుర్చీమీద. ★

"నాకో రూపాయి అప్పుకావాలనుకోండి ప్రాణం పోయినా సరే స్నేహితుణ్ని మాత్రం ఎన్నడూ అడగను. అది నా మతం" అన్నాడు అప్పారావు.

"ఒట్టు?... ... అయితే యీ క్షణం నించి నన్ను మీ ఆప్తమిత్రులలో ఒకడుగా చేర్చుకోండి" అన్నాడో పరిచితుడు భక్తిగౌరవాలతో. ★

“రాస్కెల్! జేబు కొట్టేస్తున్నావా?”

“భలేవారే. వారి జేబులోంచి అప్పు తీసుకుంటున్నాను. వారిని డిస్టర్బు చేయడం ఎందుకని చెప్పలేదంతే. మళ్ళీ పువ్వుల్లో పెట్టి అక్కడ పెట్టెద్దామనీ.” ★

రాత్రి పడుకోబోతూ వుండగా ‘అప్పారావు’ వచ్చి తలుపులు తట్టాడు.

“మరేం లేదు సార్. మీ అప్పు పైనెల కూడా ఇవ్వలేను. ఇవ్వలేనందుకు మనసు తన్నుకుంటూంది. నిద్ర పట్టడం లేదు... ....” అన్నాడు.

“నీ దుంప తెగ. ఇప్పుడా చెప్తావు? ప్రొద్దుట రాకూడదూ? ఇక రాత్రి తెల్లవార్లూ నాకు మటుకు యెలా నిద్ర పడుతుందనుకున్నావు?” అన్నాడు ఋణదాత. ★

కుటుంబరావుగారు డబ్బు బొక్కసంలో సర్దుకుంటూ వుండగా అప్పారావు హఠాత్తుగా వచ్చాడు.

“ఈపళంగా నేను ఇదిగో మీ బాకీ అని పదిరూపాయలు ఠకీమని జేబులోంచి తీసిస్తే ఏమనుకుంటారు...?” అన్నాడు నవ్వుతూ.

“ఆ చొక్కా ఎవరిదో తొడుక్కొచ్చేశావనుకుంటాను.” ★

“అయ్యా, నా బాకీ నా మొహాన తగలేద్దురూ–రోజూ మీ యింటి చుట్టూ తిరగలేక చస్తున్నాను” అన్నాడో క్రూర – అప్పులవాడు.

“దానికేముంది. రోజూ రావడం వీల్లేకపోతే రోజు విడిచి రోజూ రండి సార్. ఆల్వేస్ వెల్‌కం!....” అన్నాడు అప్పారావు. ★

అప్పారావు బోర్డు రాసి పెట్టుకు కూర్చున్నాడు.

‘పండగ పదిరోజులే వుంది. పండగ తరువాత అప్పులు అడగబడవు. ఆలసించిన ఆశాభంగం! రండి....నేడే ఇవ్వండి.’ ★



"ఇదిగో అప్పారావ్! నన్ను వూరికే విసిగించకు. ఈ ఏటికి నేను ఒక్క పైస కూడ అప్పిచ్చే పరిస్థితిలో లేను. కావాలంటే వచ్చే ఏడాది ఇదే రోజున కనబడు. అప్పుడు వీలైతే చూస్తాను." అన్నారొక సుబ్బారావుగారు అప్పుకోసం అదే పనిగా వేధిస్తున్న అప్పారావుతో.

"సరేలెండి... మీరలా అంటే నేనింకేం చెప్పగలను. అయితే ఆ రోజు ఎన్నిగంటలకు తమ దర్శనం చేసుకోమంటారండీ?" అన్నాడు శ్రీ ఆశావాది అప్పారావు. ★

"ఒక్కటేమాట. తెల్లవారేసరికి వందరూపాయలు అప్పయినా పుట్టించాలి, లేదా ఆ లోపల ఉరేసుకు చావాలి. ఏం చెయ్యమంటావ్ చెప్పు"

"ఉరెందుకోయ్, మా యింట్లో చాకుంది ఇస్తాను. పట్టికెళ్ళి పని కాగానే పంపించెయ్యి. దాంతోపాటు నాకో పాతిక పాతబాకీ వుండాలి. అది కూడా పంపించేద్దువుగాని." ★

"ఏవయ్యా, దిగులుగా ఉన్నావు. ఇందాక వచ్చిన అప్పువాడి గురించే ఇంకా ఈ బాధ"

"బలేవాడివే. పుట్టెడప్పులూ పది పుట్ల తిట్లతో వున్నాను. నేనిపుడు తలుచుకుని ఏడుస్తున్నది క్రిందటి సోంవారం అప్పులాడి తిట్లకి. ఇవాల్టి వాడికి అప్పుడే ఛాన్సు రాదు. ఈ నెల ఆఖరు సోంవారం వస్తుందనుకుంటాను." ★

"ఏవండీ, మీ స్నేహితుడి దగ్గర అప్పుచేసి లాట్రి కట్టిన రూపాయివల్ల రెండు వేలు ప్రయిజు వచ్చింది గదా. పాపం ఆ మాటన్నా అతనికి చెప్పరేం?"

"ఓసి వెర్రిదానా. ఆ మాట చెబితే ఇప్పుడా రూపాయి తే తెమ్మని కూర్చోడూ?" ★

రెడ్డి ముఠాకీ, చౌదరి ముఠాకీ కొట్లాట చౌకు దగ్గర. పుచ్చపువ్వు లాంటి వెన్నెల్లో పుచ్చెలెగిరి పోతున్నాయి. ఊళ్ళో జనం అంతా తలుపులు బిడాయించుకొని కిటికీల్లోంచి చూస్తున్నారు.

అప్పుల్సామి మాత్రం చౌకు మధ్య గాంధీ విగ్రహం కింద కూచుని నిశ్చింతగా చుట్ట గాలుస్తున్నాడు.

మర్నాడు ఉదయం "ఏమి ధైర్యం! తలలెగిరిపోతుంటే చేత కర్రన్నా లేకుండా అంత ధైర్యంగా కూర్చున్నావే" అన్నాడు మునసబు.

అప్పుల్సామి నవ్వాడు. "బాబూ, ఆ రెండు ముఠాల్లోనూ పెతి ఒక్కడికీ మనం కాత్తో కూత్తో బాకీ వున్నాం గందా. మనమీ చ్చేయిజేసుకు సంపేత్తే ఆళ్ళ దబ్బే పోద్ది. అందుకనే మన్జోలికెవడూ రానేదు" అన్నాడు. ★



ఒక పత్రికలో మందుల ప్రకటన యిలా ఉంది:

"మాచే విశేష వ్యయప్రయాసలతో తయారుకాబడిన ఈ మందు ఎంతటి వ్యాధినైనా వారం రోజులలో నయం చేస్తుంది. గ్యారంటీ. అలా కుదరని పక్షంలో జబ్బు వాపసు యివ్వగలము." ★

40 ల నాటి పత్రికలలో అచ్చుతప్పులను సేకరించి, వాటినిబట్టి కొన్ని కల్పించి ఆరుద్ర ప్రకటించిన అచ్చుతునకలు కొన్ని ఉన్నాయి.

బాతా ఖూనీ

పానక మహాశయులారా!

మీ సానుభూతాలతో ఈ శీర్షిక సాటించగలుగుతామని ఆశ పుడుతున్నాము. దయతోసి మీకు తోలిన ముద్రారాక్షసాలను మాకు పండించ గోరుకున్నాం.

ఈ వారపు అచ్చు తిప్పులు.

ఆసుపత్రిక వచ్చి చాలా రోగులయింది.

సుభాస్ బాంబు.

దిన పచ్చికలో సంపాద కీరం.

శాంతమ లేక సౌఖ్యము లేదు.

ఇందుకు మా సానిబూతులు. ★

**ఆం**ధ్రా టాగూరుగా ఒకాయనను మెచ్చుకోబోతూ ఒక దిన పత్రిక పెట్టిన శీర్షిక:

ఆంధ్రదేశానికి టాగూరు వంటవాడు. ★

**ఒ**క ప్రముఖుడు చనిపోయిన సందర్భంగా ఉత్తరక్రియలపై ఒక వార్తా నివేదిక:

'బంధు మిత్రులంతా వచ్చారు.

నిన్న సాయంకాలం.... వారి ఆస్తి నిమజ్జనం జరిగింది.' ★

**యు**ద్ధకాలంలో ఒక సేనాధిపతి గాయపడి ప్రమాద పరిస్థితిలో ఉన్నట్లు వార్త వచ్చింది.

సాయంకాలానికి ఎలాగా చనిపోతాడులే అన్న ధీమాకొద్దీ ఒక దినపత్రిక సంపాదకుడు ఆ సేనాని మరణించినట్లుగా పతాక శీర్షిక పెట్టి వార్త ప్రచురించాడు.

సేనాని ఆ పూట చనిపోలేదు. మర్నాడు మధ్యాహ్నం అతడు పోయినట్లు వార్త వచ్చింది.

అందరితో పాటు తిరిగి ఆ వార్తను తాను ఎలా ప్రచురించాలో కుదరక చాలా ఆలోచించి చివరకు ఇలా వ్రాశాడు సంపాదకుడు;

'సేనాని.... నేడు పూర్తిగా మరణించాడు' ★



సవరణ

**ఒ**క పత్రికలో ప్రతినిత్యం దుమ్మెత్తి పోసే రాజకీయ నాయకుడొకరు విదేశం వెళ్తూ విమాన ప్రమాదంలో చనిపోయినట్టు వార్త వచ్చింది.

గత్యంతరంలేక, నలుగురితోపాటు నారాయణా-అన్నట్టుగా ఆ పత్రిక ఆ రోజు ఒక ఉపసంపాదకీయంవేసి, అందులో మృతుడి చిత్తశుద్ధి, దక్షత, నిస్వార్థసేవ వగైరాలను మెచ్చుకుంది. మర్నాడే ఆ పెద్దమనిషి ఊళ్ళో కొచ్చాడు-చావు తప్పి, కన్ను లొట్టకూడా పోకుండా!

పత్రికా సంపాదకుడి ప్రాణం ఉసూరుమంది. మర్నాటి పత్రికలో సవరణ వేశాడు;

'నిన్నటి ఉపసంపాదకీయం, శీర్షికలో పేరు అచ్చు తప్పు పడింది.' ★

పత్రికలో....ముఖ్యంగా దిన వార పత్రికలలో అప్పుతచ్చులకి సవరణలు కొన్ని దామాషాగా పడుతూ ఉంటాయి.

ఒక సుబ్బిరెడ్డిగారు అబ్బిరెడ్డిగారిని లాగి లెంపకాయ కొట్టగా రచ్చకెక్కారన్న వార్త ఒక పత్రికలో పడింది. మరునాటి పత్రికలో అది పొరబాటున పడిన వార్త - అంటూ వేసిన సవరణ:

'నిన్నటి పత్రిక 5వ పుట...2వ కాలంలో సుబ్బిరెడ్డిగారు అబ్బిరెడ్డిని కొట్టారన్న వార్త పొరబాటుగా పడనందుకు చింతిస్తున్నాము.-సం॥' ★

సినిమా కంపెనీ యజమాని ఒకాయన ఊళ్ళో కళాశాల కమిటీ విరాళం అడిగితే నోటితో లేదనే బదులు చేత్తో లేదందామని "ఐదు లక్షల రూపాయలు తీసుకోండి" అన్నాడు.

మర్నాడు స్థానిక పత్రికలో ఆ వార్త పడింది. కాని అందులో పొరబాటున సున్నా ఎక్కువ తగిలి యాభై లక్షలు విరాళం ఇచ్చినట్లు పడింది.

ఆ కోటీశ్వరుడు అది చూసి సంపాదకుడికి టెలిఫోను చేశాడు. "మళ్ళీ మీ పత్రిక తప్పు రాసిందని చెడ్డ పేరొస్తుందేమో. కాలేజీకి యాభై లక్షలూ ఈసారి కిస్తాగాని ఇంకెప్పుడూ ఇలాటి అచ్చుతప్పులు వెయ్యబోకండి" అన్నాడు. ★




జరిగితే జరమంత సుఖం లేదన్నారు. ఆ జరుగుబాటు ఆస్పత్రిలో సావకాశపడితే అది స్వర్గానికో చీడీ తరవాయిగా వుంటుందంటారు అనుభవజ్ఞులు.

ఈ కోవ మనిషి ఒకాయన ఆస్పత్రికి చుట్టపు చూపుగా వెళ్ళి అక్కడ చిలకలా వున్న నరసమ్మని చూసి ముచ్చట పడిపోయాడు.

"సిస్టర్! ఒక్కమాట చెప్పనా. మీ వార్డులో పేషెంటుగా చేరి మీ చేతి సపర్యలు పొందుతూ వుండాలనిపిస్తుంది. అంతకన్న గొప్ప అదృష్టం వుంటుందనుకోను" అన్నాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

"సార్! మీ కోరిక తీరాలంటే ఉత్త అదృష్టం చాలదు. అద్భుతం జరగాలి. నేను పురుళ్ళ వార్డులో నర్సుని" అంది నర్సు కిలకిల నవ్వి. ★




ఆస్పత్రిలో బయట రోగులకి మందులిచ్చే డిస్పెన్సరీ కిటికీ దగ్గర పూతరేకుల్లా ముప్ఫయి ముడతలుపడి వుంది రోగుల క్యూ.

సన్నగా పొట్టిగా వున్న ఒక మీసాలాయన క్యూ లెక్క చేయకుండా ముందుకు వెళ్ళిపోయాడు. యిద్దరు ముగ్గురు కేకలేశారు. చివరికి వాళ్ళకి ఒళ్ళుమండి ఆ చివర నిలబడమని తోసేశారు.

అతను మొండిగా మళ్ళీ ముందుకు వచ్చాడు. జనం మళ్ళీ తోసేశారు, ఇలా నాలుగైదు సార్లు జరిగింది. ఐదోసారి అతను లేచి బట్టలు దులుపుకుని "ఇలా అయితే ఇంక అసలు ఈపూట డిస్పెన్సరీ తెరవనంతే" అన్నాడు కోపంగా. ★

ఒకాయన సైకిలు మీదనుంచి కిందపడి లేవలేక బాధపడుతున్నాడు.

"పడితే పడ్డారుగాని ఆసుపత్రి గుమ్మంలో పడ్డారు. అదృష్టవంతులు" అన్నాడు దారినపోయే దానయ్య.

"నేనే డాక్టర్నయ్యా స్వామీ" అన్నాడు పడి లేచిన వాడు. ★

ఓ తల్లి అర్ధరాత్రి వేళ బిడ్డను తీసుకుని డాక్టరింటికి వచ్చింది. వాతం కమ్మింది చూడమని.

"ఏం చేశారు? ఏం చేశారు?" అన్నాడు డాక్టరు.

"మీ రిచ్చినదే. పిల్లడికి నెలకో మాత్ర చొప్పున వెయ్యమన్నారుగా. వాడికి తొమ్మిదో నెలగదా అని తొమ్మిది మాత్తర్లు తెప్పించి వేశాను సాయంత్రం." ★

ఎన్నికలలో పోటీచేసి ఓడిపోయిన ఒక రాజకీయవాది ప్రసూతి ఆస్పత్రి వరండాలో చాలా ఆదుర్దాగా నిరీక్షిస్తున్నాడు వార్త కోసం.

నర్సు వచ్చి "కంగ్రాచ్యులేషన్స్. మీకు కవలపిల్లలు పుట్టారు." అంది.

రాజకీయవాది "అసంభవం, మళ్ళీ లెక్కబెట్టండి." అన్నాడు. ★

పెద్దాసుపత్రిలో ఒకే ఒక్క టెలిఫోన్ బూత్ వుంది. అందులో ఒకాయన దూరి తలుపేసుకుని డైరెక్టరీలో తెగ వెతుకుతున్నాడు. అర్జెంటుగా ఎక్కడికో ఫోన్ చేయాలని వచ్చిన ఒక సుబ్బారావుకి చూసి చూసి ఓపిక చచ్చిపోయింది. తలుపు లాగాడు.

"అయ్యా! నేను అర్జెంటుగా ఫోన్ చెయ్యాలి. మీక్కావలసిన నంబరు చెబితే నేను వెతికి పెడతాను."

"నంబరు కాదు. ఇందులో చాలా పేర్లుంటాయి గదా. ఇప్పుడే నాకు తొలి కొడుకు పుట్టాడు - వాడికో మంచి పేరు చూద్దామనీ...." అన్నాడాయన. ★




"నాకు మతి మరుపు మహ యిదిగా ఉందండీ, ఏదీ ఒక్క క్షణం కూడా గుర్తుండదు" అన్నాడు రోగి.

డాక్టరు ఒక్క క్షణం పరకాయించి చూసి, "ఎంత కాలం నుంచి ఇలా ఉంది?" అన్నాడు.

"ఏది ఎంతకాలంనుంచి అంటారు?" అన్నాడు రోగి తెల్లబోయి. ★

ఒక ప్రౌఢ మహిళ వయసు మళ్ళిందని భయపడి ఒక వైద్యుడి దగ్గరకు వెళ్ళి "నన్ను మళ్లీ పాతికేళ్ళ యువతిగా మార్చడానికేం తీసుకుంటారు?" అంది.

"రెండువేల రూపాయలు"

"పదిహేనేళ్ళ పిల్లగా మార్చాలంటే?"

"ఇరవై వేలు"

సరేనందావిడ. రెండు నెలల్లో వైద్యం పూర్తి అయింది. ఆమె పదిహేనేళ్ళ బాలగా మారింది. కాని డాక్టరుకు డబ్బివ్వనంది.

"కోర్టులో దావా వేస్తా"నన్నాడు వైద్యుడు.

"వేసుకోండి. నాకు పదిహేనేళ్ళు. మైనరును. దావాలు గీవాలూ పనిచెయ్యవు" అంది ప్రౌఢ బాల. ★

"ఇదేలోకం? మీరు గినా యములాళ్ళా" అన్నాడు కాల్జారిపడి లేచినాయన.

కొంచెం వంగి నిలబడ్డాయన పరిచయాలు ఆరంభించాడు. "అయ్యా! వీరు డాక్టరుగారు, మీరు ఫీజుకి ఒప్పుకోగానే వైద్యం చేస్తారు. వీరు భీమా ఏజంటుగారు, ఇకనైనా పాలసీ తీసుకోమని చెప్పబోతున్నారు. వీరు ఫిలిం ప్రొడ్యూసరుగారు. మీరు కొట్టిన పల్టీలు చూసి ముచ్చటపడి కామిడీ పిక్చర్లో బుక్ చెయ్యాలని ఉబలాట పడుతున్నారు..."

"తమరెవరో?" అన్నాడు భీమా ఏజంటు కోపంగా.

"నేను దారినపొయ్యే దానయ్యని. ఈయన కిందపడే ముందు నన్నాసరా చేసుకోబోయి నా కండువా పట్టుకున్నారు. దాని రెండో చెంగు ప్రస్తుతం వారి కింద వుంది. విడుదల కాగానే పోతాను." ★




ధర్మాసుపత్రి హాలులో రోగులు చాలామంది పడిగాపులు పడివున్నారు. ఒక ముసలాయన చూసి చూసి లేచిపోయాడు.

"ఇంతకన్న యింటిదగ్గర సహజమయిన చావు చస్తాను. అదే సుళువు" అనుకుంటూ. ★

రైల్లో ఒకాయన వుండుండి బావురుమని ఏడ్చాడు.



"మాటబాగా వినపడదని తెలుసుగాని బ్రహ్మచెముడు పట్టుకుందని యిపుడు తెలిసిందండి బాబోయ్" అన్నాడు.

"అదేవిటి? ఇప్పుడు తెలీడమేమిటీ?" అన్నాడు ఎదురుగా వున్నాయన.

"ఘంటనించి మీరు ఒక్కలాగా నాతో ఏదో చెబుతున్నారు, ఒక్క మాట కూడా వినబడలేదు.

"చంపావయ్యా, నేను మాట్లాడటంలేదు. వక్కపొడి నవుల్తున్నాను." ★

ఒక డిటెక్టివ్ నవలా రచయిత ఆపరేషన్ చేయించుకోవలసి వచ్చింది.

"పేజికి ఐదుగుర్ని చంపుతారు పొడిచీ, పేల్చీ, మీకు భయమేమిటి" అన్నారు డాక్టర్లు నవ్వుతూ. రచయిత మాట్లాడలేదు. మత్తుమందిచ్చే ముందు కబుర్లు చెబుతూ అద్భుతమైన, భయానకమైన అపరాధ పరిశోధన కథ ఆరంభించాడు, కథ మంచి పట్టులోకి వచ్చింది "తరువాత ఏమైందీ?" అన్నారు డాక్టర్లూ, నర్సులూ.

"ఆపరేషన్ కానీండి. మేలుకొన్నాక పూర్తి చేస్తాను" అన్నాడు రచయిత.

(ఆపరేషన్ జయప్రదమైందా? రచయిత మేలుకొన్నాడా? మిగతా కథ చెప్పాడా? హంతకులెవరు? 374వ పేజీ చూడండి కావాలంటే... బహుశా ఈ పుస్తకంలో ఆ పేజీ వుండదు. ఉన్నా అందులో జవాబు వుండదు. అయినా మీకు సరదాగా వుంటే చూడండి.) ★

రోగులకు ఇచ్చే మందులూ, పెట్టించే పథ్యాలూ, వాటి ఫలితాలూ ఒక పుస్తకంలో రాసుకొని వాటిని బట్టి కొత్త రోగులకు వైద్యం చేస్తూ వుండాలని పెద్ద డాక్టరుగారు కొడుక్కి బోధపరిచారు.

కుర్ర డాక్టరు ఒకసారి ఒక దర్జీవాడికి విషజ్వరం ముదరడం గమనించి "ఇక లాభంలేదు. రెండుమూడు రోజుల్లో పోతావు" అని చెప్పేశాడు.

నెల్లాళ్ళ తరవాత దర్జీ వాడు బజారులో కనిపించాడు. డాక్టరు విస్తుపోయి "ఏం పుచ్చుకున్నావు? ఎలా బతికావు?" అన్నాడు. "ఏవుందండీ. ఇంకెలాగా బతకనన్నారుగా అని సుబ్బరంగా కోడి పలావు చేయించుకు తినేశానండి. అదే తగ్గిపోయింది" అన్నాడు దర్జీవాడు.

ఆరోజునే ఒక వడ్రంగి వచ్చాడు విషజ్వరంతో. "కోడి పలావు తిను" అని చెప్పాడు డాక్టరు. మూడోనాటికి వడ్రంగి పరలోకానికి చెక్కేశాడు. కుర్రడాక్టరు ఆ పూట డైరీలో వ్రాసుకున్నదిది:

'విషజ్వరం వచ్చినప్పుడు దర్జీలకైతే కోడిపలావు చాలా మంచిది. వడ్రంగులకు మాత్రం చాలా ప్రమాదం.' ★

# దంతెంతకథలు



**మ**లేరియా రోగిని పరీక్షించాడు డాక్టరు.

"రాత్రి చలిముంచుకొచ్చినప్పుడు పళ్ళు కటకటలాడతాయా?"

"ఏమోనండీ. రాత్రిళ్ళు పళ్ళు తీసి బీరువాలో పెడుతున్నాను. ఇవాళ రాత్రి తీసి చూస్తాను లెండి" అన్నాడు రోగి. ★

**దం**తవైద్యుడు పరీక్ష ముగించి, "పన్ను తియ్యడానికి ఐదు రూపాయలు ఫీజు" అన్నాడు.

"అదేవిటండీ: ఒక్క క్షణంలో ఇట్టే లాగి పారేసే దానికి ఐదు రూపాయలేవిటండీ?" అన్నాడు రోగి.

"దానికేముంది. కావలిస్తే అరగంట పీకుతాను. ఫీజు మాత్రం తగ్గదు." ★

**పై**కోవ మనిషే "ఒక్క పన్ను పీకడానికి ఐదు రూపాయలేవిటండి" అని బేరం ఆడబోయాడు.

"సరే టోకున ముప్పైరెండు పీకించుకోండి. పది రూపాయలకి మూడుపళ్ళు చొప్పున పీకుతాను." అన్నాడు వైద్యుడు. ★

**దం**తవైద్యుడు కొత్త పళ్ళసెట్టు తీసి ఇచ్చాడు బోసినోటి వాడికి.

"జాగ్రత్త. ఈ కట్టుడుపళ్ళను మామూలు పళ్ళకన్న శుభ్రంగా ఉంచుకోవాలి. తెలిసిందా?" అన్నాడు.

"కాదండీ మరి. ఆ పళ్ళు ఉత్తినే వచ్చిన బాపతువి. ఇవి డబ్బు పోసి కొనుక్కున్నాం గదా. జాగర్త అదే వస్తుంది" ★

**ప**న్ను పీకించుకుందికొచ్చి కుర్చీలో కూర్చున్న పున్నయ్యగారు భయం చొప్పున నోరు బిగించుకున్నాడు. డాక్టరు ఎంత చెప్పినా తెరవలేదు.

కబుర్లు చెబుతూనే డాక్టరు మెల్లిగా పక్కనే ఉన్న బెల్లు నొక్కాడు.

ఇంకో నిముషంలో డాక్టరు అసిస్టెంటు లోపలికివచ్చి "ఎవరో పున్నయ్యగారుట, వారికి లాట్రీలో లక్షరూపాయలు వచ్చింది ప్రయిజు." అన్నాడు.

"ఆ!" అని నోరు తెరిచారు పున్నయ్యగారు.

డాక్టరు పన్ను తీసేశాడు. ★

ఏడేళ్ళ కుర్రాడికి పన్ను పీకినందుకు పదిరూపాయలు అడిగాడు దంతాంతకుడు.

"ఇదెక్కడి విడ్డూరమండీ. ఒక్కపన్ను - అందులోనూ కుర్రవెధవది-పీకడానికి పది రూపాయలా?" అన్నాడు తండ్రి.

"మామూలుగా రెండేకాని, మీ పిల్లవాడు పెట్టిన కేకవిని పళ్ళు తీయించుకుందికి వచ్చిన నలుగురు పెద్దమనుషులు పరారీ అయిపోయారు. చూడలేదూ?" అన్నాడు వైద్యుడు. ★

పంటి నొప్పితో భోరున ఏడుస్తూ "వాహ్హూ, అయ్యించండి." అంటూ వచ్చిపడ్డాడు ఆపన్నుడు.

దంతవైద్యుడు రెండు నిమిషాలలో ఆ పన్ను తీసి ముందు వేశాడు. ఆపన్నుడు తెరిపిన బడ్డాడు.

"బిల్లు ఎంతా?" అన్నాడు.

"మీరు పన్ను తీసేముందు ఎంత ఇద్దామనుకున్నారో అందులో సగం చాలు" అంటూ బిల్లు అందించాడు డాక్టరు. ★

## వైద్యో హరిహి

ఒక డాక్టరు మొట్టమొదటిసారి తన దగ్గర కొచ్చిన ప్రతిరోగికి కన్సల్టేషన్ ఫీజు పదిరూపాయలు, రెండోసారి నుంచి అయిదు రూపాయలు ఛార్జి చేసేవాడు.

ఒక రోగి ఖర్చు కలిసి రావడానికి ఉపాయం ఆలోచించి "డాక్టరుగారూ! వచ్చేశానండీ మళ్ళీ" అన్నాడు సంతోషంగా.

డాక్టరు: వెరీగుడ్. కోలుకుంటున్నావన్నమాట. నేనిచ్చిన పాతమందులే వాడుతూవుండు ★

రోగి: ఈ బాధ భరించలేను డాక్టర్....ఇంతకన్న చావే నయం.

డాక్టరు: ఆగొడవ నాకొదిలేయండి నే చూసుకుంటాగా!? ★

ఎనభయ్యోపడిన అవధాన్లుగారికి స్త్రీ వాంఛ తగ్గిందన్న చింత పట్టుకుంది. వైద్యుడికి చెప్పుకున్నాడు తన గోడు. "వయసు మళ్ళింది. వింతే ముందండీ."- అన్నాడాయన

"మరి మా రావుశాస్త్రుర్లు తొంభయ్యో పడిలో పడ్డాడే - నాకన్నా ఐదేళ్ళు పైనే! వాడింకా తనకి భార్య దగ్గర్లో లేపోతే పూట గడవదనీ-స్త్రీ వాంఛ ముమ్మరంగా ఉందనీ అంఛాడే. దానికే వంఛారూ-" అన్నాడాయన.

"మీరూ అలాగే చెప్పుకుంఛూ ఉంఛే పోలా" అన్నాడు డాక్టర

డాక్టరు: నిద్దట్లో పీడకలలు అన్నారు, నా మందు తిన్నాక ఎలా ఉంది?
రోగి: ఏడిసినట్టుంది. ఇప్పుడు కల్లోకూడా నిద్దర్రావటంలేదు ★

## సీరియస్ కేసు



కొత్తగా పెళ్ళయిన డాక్టరుగారికి రాత్రి ఎనిమిదింటికి పేకాట స్నేహితులు ఫోను చేశారు.

డాక్టరుగారి భార్య ఫోను అందుకుంది.

"ఎమర్జన్సీ అని చెప్పమ్మా" అన్నాడు పేకాటవికుడు.

"గురూ, ఇక్కడ ముగ్గురమే ఉన్నాం, ఓ చెయ్యి తక్కువైంది. ఆటాగి పోయింది. రాక తప్పదు" అన్నాడు స్నేహితుడు ఫోనులో.

"ఏవండీ-కేసు సీరియస్సా" అంది భార్య.

"ప్చ్-చాలా. ఇప్పటికే అక్కడ ముగ్గురు డాక్టర్లున్నారు. నన్ను కూడా రమ్మంటున్నారు" అన్నాడు డాక్టరుగారు ★



## డెక్కర్లు

రోగిని పరీక్షించి, మందిస్తూ సిగరెట్లు పూర్తిగా మానెయ్యాలన్నాడు డాక్టరు. అంతగా మానలేకపోతే భోజనం తరువాత ఒక్కటి కాల్చమన్నాడు. ఆర్నెల్ల తరువాత రోగిని పరీక్షించాడు డాక్టరు.

"చూశారా గుండులా ఉన్నారు. నా మాట వినబట్టి కదా!' అన్నాడు

"ఏమ్మాట సార్. చస్తున్నా రోజుకి పదిహేనుసార్లు భోంచెయ్యలేక" అన్నాడు రోగి. ★

"ఏం?" అన్నాడు డాక్టరు.

"చిత్తం నా కాలు - దానికి దెబ్బతగిలిందండి"

"అలాగా. సర్లే. కొంచెం పన్లో ఉన్నాగాని అనక ఎవరిచేతన్నా పంపు. మందిస్తాను" అన్నాడు డాక్టరు పరాగ్గా. ★

"డాక్టరు గారూ నా కుడికాలు చూశారూ. చాల నొప్పిగా ఉందండీ" అన్నాడో ముసలాయన.

"పెద్దవయసు కదండీ. అలాంటి బాధలు వస్తూనే ఉంటాయి-"

"చిత్తం. మరి నా యెడమకాలుది కూడా కుడికాలు వయసే గదా! దానికి రాలేదెంచేతో?" అన్నాడు పెద్దాయన విలాసంగా నవ్వి.

"దానికేముందండీ, మందిస్తా పుచ్చుగోండి. ఇట్టే వస్తుంది దానికీ." ★

"శర్మగారూ, నిన్న మీరిచ్చిన చెక్కు బ్యాంకునించి తిరిగొచ్చేసింది తెలుసా?"

"మొన్న మీరు తెగ్గోసిన ఆనికాయలు కూడా అంతేస్మండీ. రంగున మళ్ళీ చక్కావచ్చాయినిన్న" ★




డాక్టరు: చూశారా, నిన్నటికన్న ఈ ఉదయం సాఫీగా, సునాయాసంగా దగ్గుతున్నారు?

రోగి: అదీ ఓ ప్రశ్నేనా. రాత్తిరి తెల్లవార్లూ సాధన చేశాను. ఆ మాత్రం కూడా రాదా? ★

డాక్టరుగారి అబ్బాయి డాక్టరీ చదివి ప్రాక్టీసు ఆరంభించాడు. ఒకసారి తండ్రి వూరికెళ్ళి తిరిగి రాగానే "నాన్నా, ఆ శాస్త్రిగారి కడుపునొప్పి కేసులేదూ-నువ్వు ఏడేళ్ళనించి ట్రీట్ చేస్తున్నావు. అది మొన్న ఒక ఆపరేషన్‌తో పూర్తిగా నయం చేసి పారేశాను" అన్నాడు ఉత్సాహంగా.

తండ్రి గాఢంగా నిట్టూర్చాడు "ఎంత పని చేశావు. నిన్ను డాక్టర్ చదివించింది ఆ కేసుతోనే. డిస్పెన్సరీ బిల్డింగు కూడా కట్టించాలని ఆశపెట్టుకున్నా దాని మీద" అన్నాడు. ★

"డాక్టరుగారూ, భోజనానికి సరైన వేళ ఏదంటారు?"

"లేనివాడికి దొరికినపుడు, ఉన్నవాడికి అరిగినపుడు" ★

# వైకుంఠయాత్రా స్పెషల్

(డాక్టరు రోగికి మందిస్తూ) "ఇదిగో రెండు మాత్రల్లిస్తున్నాను. పడుకోబోయే ముందు ఒహటి వేసుకోండి. పొద్దున్న లేస్తే రెండోది వేసుకోండి." ★

రోగి చిరాకు పడ్డాడు. "మీ రిచ్చే మందుతో ఈ జ్వరం తగ్గేట్టు లేదు. బాగా చమటలు పోస్తే జ్వరం దిగిపోతుందట, చమట పొయ్యడానికి మందివ్వండి" అన్నాడు.

"అయితే సరే. అలా ప్రక్కగా కూర్చోండి. బిల్లు వేసి చూపిస్తాను." అన్నాడు డాక్టరు. ★




ఒక రోగి ఆపరేషను బల్ల ఎక్కుతూ-

"మరే ప్రమాదం లేదుగా డాక్టరుగారు?" అన్నాడు.

"చాల్చాల్లేవయ్యా, నవ్విపోతారు, నువ్విచ్చే దబ్బుకి ప్రమాదకరమైన ఆపరేషనెవడు చేస్తాడు. బలేవాడివేలే." ★

# తుదికోరిక



చావు బ్రతుకుల మధ్య అల్లాడుతున్న రోగికి, తోచిన మందులన్నీ ఇచ్చాక నిట్టూర్చి పెదిమ చప్పరించాడు డాక్టరు, "ఇక లాభం లేదు. ఒక గంటకన్నా ప్రాణం నిలబడదు. చెప్పదలచుకున్న దేమన్నా ఉంటే ఇప్పుడే చెప్పండి" అన్నాడు మెల్లగా.

"ఆ. ఉంది ... ఇంకో డాక్టర్ని పిలిపించండి చప్పున" అన్నాడు రోగి నీరసంగా. ★

# లోకమంతా లోభులు

ఒక లక్షాధికారి కోటికి పడగెత్తాడని తెలిసి అతని జీవిత విశేషాలు అడగబోయాడు ఒక పత్రికా విలేఖరి.

"మీరు ఇంత డబ్బు ఎలా కూడబెట్టారో చెప్పండి ముందు–అసలు కీలకమైన కారణం కావాలి" అన్నాడు.

"అబ్బో అదంతా ఓ పెద్ద కథ. అడిగారు కాబట్టి చెబుతా. అన్నట్లు మనం మాట్లాడు కుంటున్నపుడు దీపం ఎందుకు? నూని దండుగ. ఆర్పేసి వస్తానుండండి." అంటూ లేచాడు కోటీశ్వరుడు

"ఇహ మీరేం చెప్పనక్కరలేదండి. అంతా బోధపడింది. వస్తా" అంటూ లేచాడు విలేఖరి. ★

కుడిచెవి · బాగా వినబడటం లేదంటూ వచ్చాడు ఒక పెద్దమనిషి. డాక్టరు పరీక్ష చేసి చెవిలోంచి ఒక ఠోళీ (దమ్మిడీలో సగం) తీసి పడేశాడు.

"అరె! ఇప్పుడు బాగానే వినిపిస్తోందే? ఇదేనన్నమాట ఈ మూణ్ణెల్ల నించీ మాట వినిపించకుండా చేస్తోంది!" – అన్నాడు మాజీ బధిరుడు.

"అంటే? ఇది చెవిలో ఉందని తెలుసన్నమాట, తీసేసుకోపోయారా?" అన్నాడు డాక్టరు ఆశ్చర్యంతో.

"ఎందుకూ... తీస్తే ఖర్చయిపోతుందని అక్కడే ఉంచాను." ★

ఒక పెద్దమనిషి చనిపోతూ ఆస్తిలో కొంత భాగం ముగ్గురు మిత్రులకు వ్రాశాడు. అయితే ఆ ముగ్గురూ తన చితి మీద ఐదేసి రూపాయలు పడెయ్యాలని షరతు పెట్టాడు.

చితి మీద ఒక ఆసామి ఐదు విచ్చురూపాయలు పడేశాడు – కరిగాక వెండి తీసుకోవచ్చు అంటూ.

వెంటనే రెండో అతను పది రూపాయల కాగితం పడేసి, చితిమీది రూపాయలైదూ తీసుకున్నాడు.

మూడో అతను చితికి నిప్పు పెట్టేదాకా ఆగి చచ్చిన సుబ్బారావు పేర పదిహేను రూపాయలకి చెక్కురాసి అది అందులో పడేసి పది రూపాయల నోటు తీసుకున్నాడు.

మర్నాడు ఆ చెక్కు బ్యాంకుకి వచ్చిందనీ, సుబ్బారావు స్వయంగా వచ్చి చెక్కు మార్చి పదిహేను రూపాయలూ తీసుకున్నాడనీ తెలిసింది. ఈయన పోయినట్టు బ్యాంకుకి తెలీదుట. ★

"మన పెద్ద సెట్టికి నత్తి ఇట్టే పోయింది. ఎలాగోయ్? ఎవరన్నా యోగి..."



"అబ్బే, మొన్న చెన్నపట్నంలో ఒక కంపెనీతో ట్రంకు టెలిఫోను మీద మాటాడాలిసొచ్చింది. ఆ దెబ్బతో ఎక్కడి నత్తి అక్కడ ఎగిరిపోయింది." ★

ఒక లుబ్ధుడు తెగించి బైస్కోపు చూడబోయాడు పావలా టిక్కెట్టు కొనుక్కుని. ఆట సాగుతూ వుండగా పంకా వూడి అతని నెత్తిన పడింది. బాగా దెబ్బలు తగిలాయి. సినిమా యజమాని కోర్టుకెళ్ళద్దని బ్రతిమాలి నష్టపరిహారంగా వైద్యుడి ఖర్చులు, రెండువేలు రొఖ్ఖం, యావజ్జీవితం ఉచితంగా సినిమా చూడడానికి ప్యాసు యిచ్చాడు. కట్నం అడక్కుండా అతని కూతుర్ని తన కొడుక్కు చేసుకుంటానని మాట యిచ్చాడు.

అన్నీ పుచుకున్నాక క్షతగాత్రుడు యింకా నసుగుతూ మూలుగుతూ కూర్చున్నాడు.

"ఇంకేమి టివ్వమంటారు" అన్నాడు సినిమాహాలు అతను దుఃఖం ఆపుకుంటూ.

"మరేంలేదు. ఆవాళ పావలా యిచ్చి టిక్కెట్టు కొని వచ్చాను. బైస్కోపు చివరంటా చూడనే లేదు గదా. ఆ డబ్బులుకూడా వాపసిస్తే...." అన్నాడు లుబ్ధావధాని. ★

ముసలాయన రైలాగినపుడల్లా దిగి స్టేషనులోకి పరిగెత్తి రైలు కదిలేసరికి ఒగురుస్తూ వచ్చి పడుతున్నాడు. రైల్లో. "ఏంకావాలో చెబితే నే తెస్తాను. మీరు హైరాణా పడకండి." అన్నాడో యువకుడు. "అబ్బే రైలు. టిక్కెట్లు కొంటున్నా" అన్నాడాయన. "ప్రతి స్టేషనులోనూనా?" అన్నాడు యువకుడు.

"మరే బాబూ, సుస్తీ చేసింది. బతకడం కష్టమనీ, ప్రాణం ఎప్పుడు పోయినా పోవచ్చనీ చెప్పాడు డాక్టరుగారు. ఒక్కసారి చివరికంటా టిక్కెటు కొనేశాక తీరా హరీ అంటే దండుగని-పక్కపక్క స్టేషనికి కొంటున్నా" అన్నాడాయన ఆయాసపడుతూ. ★

"ఏవేఁ ఏవేఁయ్. నేను యివాళ బస్సు వెనకే పరుగెత్తు కొచ్చేసి బేడ్డబ్బులు ఆదా చేశాను చూసుకో?" అన్నాడు ఆఫీసు నుంచి వచ్చిన భర్త సగర్వంగా వగురుస్తూ.

ఆవిడ మూతి విరుచుకుంది. "నిక్షేపంలా టాక్సీ వెనక పరిగెడితే మూడు రూపాయలు ఆదా అయేది గదా." అంది బేడకాసు లాక్కుంటూ. ★

"రాత్రి నాటకానికి మీర్రాలేదుగాని పిన్నిగారూ, మహా బావుంది. జనం బాగానే వచ్చారు. సగం హాలు నిండింది."

"పోదూ నీ కబుర్లకేం. సగం హాలంతా ఖాళీయేనట. మావారు చెప్పారు." ★

ఇరుగుపొరుగులుగా వుండి విడిపోయిన అమ్మలక్క లిద్దరు ఒక పేరంటంలో కలుసుకున్నారు.

"మాకిప్పుడు మంచి పొరుగు దొరికింది. హాయిగా ఉన్నాం. పోరు లేకుండా" అంది ఒకావిడ.

"మేమూ అంతే. మాకు మంచి పొరుగు దొరికి, మేమూ హాయిగా వున్నాం పోరు లేకుండా"

"ఏమిటి మీరు ఆ యిల్లు మారారా?"

"లేదు, మేం అక్కడే వున్నాం. మీరెళ్ళాక" ★

ఫైరాఫీసులో ఫోను గణ గణ మోగింది.

"హలో, ఎక్కడండీ అగ్నిప్రమాదం?" అన్నాడు అగ్నిమాపక దళోద్యోగి.

"చూడండి, మావారు మెడ్రా సెళ్ళినప్పుడు మళ్ళీ కొన్ని కొత్త మొక్కల విత్తనాలు తెచ్చారు..." అంది ఫోనులో కంఠం.

"హలో, నిప్పెక్కడండీ?"

"...అవి ఇప్పుడే పైకి వచ్చాయి. లేత మొక్కలన్నమాట...."

"నిప్పెక్కడండీ?"

"గులాబీల వరస, క్రోటన్ కుండీలు అవీ మీరు చూసే వుంటారు..."

"నిప్పెక్కడంటే చెప్పవేమిటమ్మా?....."

"అన్నీ బోలెడు డబ్బు పోసి శ్రమపడి పెంచిన మొక్కలు, ఆ తోట మా ప్రాణం లాంటిది."

"దేవుడా! ఎందుకు ఫోను చేశావమ్మా! మీ తోట గోల మాకెందుకు? కొంపకి నిప్పంటుకోలేదా...."

"వస్తున్నా, వస్తున్నా, అది చెబుదామనే. మంటలార్పే సందడిలో మా తోట మటుకు తొక్కకుండా మీ వాళ్ళని అదుపాజ్ఞల్లో పెట్టండి. మరేం లేదు. మా పొరుగు వాళ్ళింటికి నిప్పంటుకొంది. చప్పున రండి. ఆ కాకకి మా మొక్కలు వాడిపోతున్నాయి." ★



ఒక రచయిత పత్రిక ఆఫీసుకు వచ్చి పెద్దకట్ట (రచనలు) బల్లమీద పడేశాడు. "అయ్యా, నా లేత రెక్కలు విప్పి సారస్వత ప్రపంచం లోనికి ఎగిరి వచ్చానండి. రచనలు చేసి పత్రికలకు అమ్మి జీవించాలని ఆశయం." అన్నాడు.

"ఓహో ఏవైనా అమ్మేరా?"

"ఇంతవరకు నా సైకిలు, రిస్టువాచి, ఉంగరం, పోగులూ అమ్మేనండి." ★

కొదలచుకున్న మహాకవి నరసయ్య అంతపనీ చేసేలోగా డబ్బులేక, రాక అద్దె బకాయి పడ్డాడు. ఇంటాయన వెళ్ళగొట్టడానికి వచ్చాడు.

"చూడండి సార్. తొందరపడకండి. ఈనాడు నేను అనామకుడిని కావచ్చు. కాని త్వరలో నా రచనలు మహాకావ్యాలై నేను మహాకవిని కాగానే యీ ఇంటికి ఖ్యాతి కలుగుతుంది. వేలాది జనం వచ్చి మహాకవి నరసయ్యగారు ఒకప్పుడు రచనలు చేసింది యీ గృహంలోనే అని చెప్పుకుంటారు కొన్నాళ్ళలో..."

"ఏళ్ళెందుకు? యివాళ సాయంత్రానికి మీరు అద్దె కట్టకపోతే, రేప్పొద్దుటినించే చెప్పుకుంటారు" అన్నాడు ఇంటాయన. ★

"ఏమండీ, కుంపటి అంటించే చిత్తు కాగితా లయిపోయాయి. ఎలాగా?"

"అలాగా అయితే వుండు. ఈ పూట పిల్లలకి పరీక్ష పెడతాను"

"ఎందుకండీ! ఇవాళ మీ రచనలు పత్రికల్నించి తిరిగి వచ్చే రోజేగా?" ★




"ఏవోయ్ రంగా, మొన్న మశూచికం పోసి చనిపోయింది నువ్వా, మీ అన్న తమ్ముడా....' అని అడిగాడొకాయన.

"నేనేనండీ" అన్నాడు రంగడు వినయంగా.

పెద్దాయనకేం పాలుపోక మాటతోచక "బలే చమత్కారివే," అంటూ రంగయ్య భుజం తట్టాడు. చేతికేం తగల్లేదు, రంగయ్య మాయమైపోయింది. ★

"హలో కులాసా?" అన్నాడు అప్పారావు.

"అరె, మళ్ళీ ఎలా వచ్చావురా: నువ్వా మధ్య చచ్చిపోయావుగా. మళ్ళీ ఎలా వచ్చావు? నువ్వు చావలేదా?" అన్నాడు రెడ్డి జేబు గట్టిగా పట్టుకుని.

"చావకేం నిక్షేపంలా చచ్చాను. నా దహనానికీ దానికీ నువ్వేగా అప్పిచ్చావు మా అన్నయ్యకి?"

"మరి, మరి మళ్ళీ ఎలా వచ్చావు?"

"నేను రాలేదు. నువ్వే వచ్చావు... నువ్వు చచ్చిపోయి గంటయ్యింది." అన్నాడు అప్పారావు. ★




"నా కొత్త నవల మీద పత్రికలో విమర్శ వేయించండి" అంటూ రచయిత ఒక పుస్తకం అందించాడు.

పుస్తకం బాగా నలిగి చిరిగిపోయింది.

"పబ్లిషర్ నాకు ఒక్కటే కాపీ యిచ్చాడండీ, మా అబ్బాయి దాన్ని నలిపి చింపేశాడు. అంతే, మరోలా అనుకోకండి," అన్నాడు రచయిత.

"అయితే యింకా నా విమర్శ ఎందుకు? మీ అబ్బాయి అభిప్రాయం తెలుస్తూనే వుందిగా" అన్నాడు సంపాదకుడు. ★

# ప్రతియాచకులు



"భవతీ భిక్షాం దేహి" అన్నాడు యాచక శాస్త్రి.

"ఇస్తారా, ఇవ్వరా చెప్పండి," అన్నాడు యాచకరాజు.

"ఎట్టమ్మా యెట్టు. ఈ జన్మలో యెట్టావో పై జనమలో పట్టెడు దొరుకుద్ది. మద్ది న్నాకేటి" అన్నాడు శ్రేష్ఠి.

"ఆ యెడం చేత్తో కాసిని బియ్యం ఇటు కూడా తగలెయ్యండి" అన్నాడు యాచకరావు.

"అందులో కాసిని నాకివ్వరాదూ" అన్నది వీరముష్టి. ★

"బాబూ కుంటోడికి కానీ డబ్బియ్యండి బాబూ"

"అదేవిట్రా నీ కాళ్ళు నిక్షేపంలా వుంటే"

"నాక్కాదులెండి, రోజూ యిక్కడ కూకొనే కుంటోడియ్యాల మాట్నీకెల్లాడు. ఆడి తరుపున నాను కూకున్నా. మంది సెవుడు, మూగ, గుడ్డి లెండి. యీయన్టి (E.N.T.) డిపాట్రుమెంటన్నమాట." ★

రివాజుగా ధర్మం చేసే ఆసామిని చూడగానే చెయి చాచాడు యాచకుడు.

"అర్జంటు పని మీద పోతున్నా, వచ్చేటప్పుడు యిస్తాలే" అన్నాడాయన.

"అరువులెట్టకండి బాబయ్యా! అరువుల వల్ల శానా నష్టపోయాన్నేను." ★




నిగనిగ లాడుతున్న కొత్త కారులోంచి చెయ్యి ఒకటి యివతలికి వచ్చింది. "బాబూ, కానీ," అంది లోపలి కంఠం.

"ఇదేమిటీ వరస?" అన్నాడు దానయ్య తెల్లబోయి.

"లాట్రీలో కారొచ్చిందండి. పెట్రోలికి డబ్బుల్లేవుగా, అందుకని యిక్కడే కూకొని మామూలుగా ముట్టెత్తుకుంటున్నాను." అన్నాడు కారులో యాచకుడు. ★




సంగీతానికీ, హాస్యానికీ యితరత్రా బంధుత్వం మాట ఎలా వున్నా సంగీతం మీంచి సంగీతంలోంచి చాలా హాస్యం ఆవిర్భవించింది.

నాటకంలో సావిత్రి వేషం వేసినావిడ "ఏడవడం బాగా రాదండీ" అంటే, "దానికేం నీకు తోచిన పాట పాడేస్తే సరి" అన్నాడు కాంట్రాక్టరు. ★



న్యాయమూర్తి ఒక కేసులో ముద్దాయికి శిక్ష విధించబోతూ "నిన్నెక్కడో చూచినట్టుందే, ఎక్కడ చెప్మా" అన్నాడు.

"చిత్తం, మీరు ప్లీడరుగా వున్నప్పుడు మీ రెండో అమ్మాయికి సంగీతం చెప్పడాని కొచ్చే వాడినండి...."

"అలాగా! అయితే యిరవై ఏళ్ళు ఖైదు విధిస్తున్నాను." ★

ఒక గాయకుడు అడవిలో కూర్చుని పాడుతూ వుంటే సింహాలూ, ఏనుగులూ, పులులూ, చిరుతలూ వగైరాలన్నీ చుట్టూ చేరి విని ఆనందిస్తున్నాయి. ఒక చిరుతపులి మాత్రం హఠాత్తుగా దూకి గాయకుడిని మింగేసింది.

మిగతా జంతువులన్నీ దాన్ని మొఖం వాచేలా చివాట్లు పెట్టాయి. "అంత చక్కగా పాడుతున్న వాడినెలా పొట్టన బెట్టుకున్నావు?" అని

"ఛా! పాడుతున్నాడా! నాక్కాస్త చెముడుగదూ, వినపడలేదు" అని, నాలిక్కరుచుకుంది చిరుతపులి. ★




ఒక గానసభలో గాయకుడిని ఒక పెద్దమనిషి లేచి సినిమా పాటలు పాడమని కోరాడు.

ఆ గాయకుడు వెంటనే 'మూగమనసులు' లోని పాట పాడాడు.

"ఇంకా పాతది పాడండి." అన్నాడు పెద్దమనిషి.

'మాయాబజార్' లోని పాట అందుకున్నాడు గాయకుడు.

"అబ్బే ఇంకా పాతది" అన్నాడు.

కొంచెం విసుగుతోనే ఆ పాట ఆపి 'బాలరాజు'లోది మొదలెట్టాడు.

"ఏం అనుకోక ఇంకా పాతపాట పాడండి, వినాలని ఉంది" అన్నాడు పెద్దమనిషి.

గాయకుడికి ఒళ్ళు మండిపోయింది. మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"పాడరేం?" అన్నాడతడు.

"ప్రస్తుతం నేను పాడుతున్నది బాగా పాతపాట. మొట్టమొదటి మూకీ చిత్రం లోనిది" అని సమాధానమిచ్చాడు గాయకుడు. ★



ఓ తల్లీ కూతురూ రేడియో స్టేషనుకు వెళ్ళారు. అమ్మాయి పాట వినిపించింది.

"ఏవండీ-మా చిట్టితల్లి పాటెలా వుంది? గొప్ప గాయకురాలవుతుంది గదూ?" - అంది తల్లి.

"ఆ ప్రస్తుతానికి నోరుంది. మిగతాది నెమ్మదిమీద ఒక్కొక్కటే సమకూరితే కాకేం జేస్తుంది." అన్నాడు ఆడిషన్ ఆఫీసరు. ★



# చెలోక్తులు

"ఏమండీ, ఈ కవరు మీద 10 పైసలు స్టాంపులు ఎక్కువ అతికించారు."

"అయ్యో, చూణ్ణాయనా, అది రాజమండ్రీ దాకానే వెళ్ళాలి. బిళ్ళలు ఎక్కువున్నాయని విశాఖపట్నంలో మా వియ్యపురాలింటికి తోలీకుండా చూడు." ★

## చక్రధారి

ఇద్దరు స్నేహితులు తిరపతి కొండ మీంచి కార్లో దిగి వస్తున్నారు. పాములా మెలికలు తిరిగిన రోడ్డుమీద మలుపు వచ్చినపుడల్లా వెనక సీట్లో కూర్చున్నవాడు హడలిపోతున్నాడు. కారు నడుపుతున్నవాడితో "కాస్త నెమ్మదిగా పోనియ్యవోయ్. భయమేస్తోంది." అన్నాడు.

"నేను చెప్పినట్టు చెయ్. మలుపొచ్చినప్పుడల్లా నాలాగే కళ్ళు గాఠిగా మూసుకో. భయం పోతుంది." అన్నాడు కారు నడిపేవాడు. ★

## భర్తీ చేయుము

సింగిల్ టీచర్ స్కూల్ మాష్టారొకరికి భార్య పోవడంతో చాలా దిగులుపడి, పై అధికారికి ఇలా సెలవు చీటీ వ్రాసి పంపాట్ట.

"అయ్యా! మా ఆవిడ హఠాన్మరణం వల్ల నాకు నెల రోజులు సెలవిప్పించగోరుతున్నాను. మీరు ఈలోగా ఇంకెవర్నయినా పంపి ఈ లోటు భర్తీ చేస్తారని విశ్వసిస్తున్నాను." ★

## పాపం భర్తను

"ఎప్పుడూ లేనిది గుళ్ళోకెళ్ళి వొస్తున్నావు, దేవుణ్ణి ఏం వరాలడిగావు?"

"భార్యకు చాలా జబ్బుగా ఉంది, పెద్దవాడు చెట్టుమీది నుంచి పడి చెయ్యి విరగ్గొట్టుకున్నాడు, అప్పులవాళ్ళు కోర్టుకు యీడుస్తున్నారు... ఈ కష్టాలన్నింటికీ అలవడిన యీ సమయంలో మరేవైనా కష్టాలు నాకోసం ప్రత్యేకించబడి ఉంటే, వాటిని వెంటవెంటనే పంపమని దేవుణ్ణి వేడుకొని వొచ్చాను" ★

## మరీ బడాయి

ఒక శత కోటీశ్వరుడు కారులో జార్జి వాషింగ్‌టన్ వంతెన మీదుగా వెళ్ళాడు. వంతెన చివర ప్రభుత్వోద్యోగి కారుని ఆపి అంతా రివాజుగా కట్టే సుంకం 50 సెంట్లు ఇవ్వమన్నాడు.

"అబ్బాయి-నాదగ్గర 500 డాలర్ల నోటుకు తక్కువదేం ఉండదు మరి." అన్నాడు కోటీశ్వరుడు.

"అంతకి చిల్లర లేదే?" అన్నాడు ఉద్యోగి.

"పోన్లే - ఈ వంతెన ఖరీదెంతో చెప్పు. నేను కొంటే సరి!" అన్నాడు కోటీశ్వరుడు. ★

## వెలలేని కోటు

ప్రపంచం అంతా ఒకే కుటుంబం అని నచ్చజెబుతున్న పెద్ద మనిషి ఉదాహరణకు ఎదురుగా ఉన్నాయన కోటునే తీసుకున్నాడు.

"మాట వరసకి మీ కోటే చూడండి. ఊలు ఆస్ట్రేలియానించి వచ్చింది. నూలు ఇండియానించి వచ్చింది. రెండూ కలిపి లాంక్‌షైరులో బట్ట నేశారు. మద్రాసులో కుట్టించుకొని మీరు తొడిగారు. చూడండి, ఈ ఒక్క కోటువల్ల ఎన్ని పరిశ్రమలు నడుస్తున్నాయో...ఎందరు కార్మికులు, వణిజులు జీవిస్తున్నారో."

"చిత్రమేస్మండీ. ఇంతా జేసి నేను ఆ బట్టల షాపుకీ ... దర్జీవాడికీ డబ్బు ఇవ్వనే లేదు"... అన్నాడు శ్రోత - ఆశ్చర్య పడి లేస్తూ. ★

# జంతుజాలం

రెండు తలల పాము మట్టిలో చిన్న కలుగుచేసి దూరి, పక్కనే మరో కన్నంలోంచి ఇవతలకి వస్తూ అటూ యిటూ పరకాయించింది. పక్కనే ఒక చక్కని చుక్క కనబడగానే ముగ్ధురాలై గుటకమింగి-"చిన్నదానా! నిన్ను వలచాను, నన్ను పెళ్ళాడు." - అంది.

"నీ మొహంలావుంది. మనకి పెళ్ళిలాగా. నేను నీ తోకవేపు తలకాయని!" అంది ఉత్తరార్ధాంగి.' ★

ఒక చిరుతపులి కళ్ళ డాక్టరు దగ్గరకెళ్ళింది. "డాక్టరుగారూ! నా కళ్ళకేదో జబ్బు వచ్చిందండీ. నా భార్యకేసి చూసినప్పుడల్లా ఏవో మచ్చలు కనబడుతున్నాయండి" అంది.

"అవునుమరి, నువ్వు చిరతపులివి కదా?" - అన్నాడు డాక్టరు.

"నిజమేనండి, కానీ నా భార్య జీబ్రా కదండి" అంది చిరుతపులి. ★

# గుర్రప్పందాలు

"రాజుల అభిమాన క్రీడ అంటే మా వాడికీ అభిమానమే."

"గుర్రప్పందాలా?"

"కాదు, రాణీలు." ★

"పన్నెండేళ్ళయిందండీ మావారు వేటకి వెళ్ళి. ఇంతవరకూ జాడ తెలీలేదు" అంది పిన్నిగారు కంట తడిపెట్టి.

"అదేవిటమ్మా, క్లబ్బులో చదరంగబల్ల దగ్గర రోజూ చూస్తూనే ఉన్నాన్నేను, ఎత్తుకి పై ఎత్తు కుదిరినట్టు లేదు పాపం" అన్నాడు యింటికి వచ్చిన పెద్దమనిషి. ★

రాజుగారు పరివారంతో సహా అడవికి వేటకు బయల్దేరారు. చాలాదూరం పోయాక వున్నట్టుండి ఆయన గుర్రానికి జబ్బుచేసి కూలబడిపోయింది. ఆ దగ్గర్లో వున్న గ్రామంలో వాకబు చేయగా ఇద్దరు పెద్దరైతులకి చెరో గుర్రం ఉన్నట్టు తెలిసింది. రాజుగారు వాళ్ళకి కబురుచేయగా వాళ్ళు గుర్రాలతో సహా వచ్చారు. కాని, అవి వట్టి దండగమారి గుర్రాలనీ, పరిగెత్తలేవనీ వాళ్ళు మనవి చేసుకున్నారు.

గుర్రాలివ్వడం ఇష్టం లేకనే వాళ్ళు సాకు చెబుతున్నారని రాజుగారు గ్రహించారు. రెండు గుర్రాలకీ పందెం పెట్టి ఏది బాగా పరిగెడితే అది తీసుకుంటామన్నారు.

"లాభం లేదు ప్రభూ! వాళ్ళు గుర్రాల్ని సరిగా పరిగెత్తనివ్వరు." అన్నాగ సేనాని రాజుగారి చెవిలో.

"మా బాగా పరిగెత్తనిస్తారు. ఒకళ్ళ గుర్రాన్ని మరొకళ్ళని ఎక్కమను." అన్నాడు రాజుగారు. ★




"డాక్టరుగారూ, గురక ఎక్కువై పోయిందండి. వెధవది నా గురకకి నా గదిలో నాకే నిద్రాభంగం అవుతోందంటే నమ్మండి." అన్నాడో శాస్త్రీ.

"దానికేముంది. ఇవాళరాత్రి ప్రక్కగదిలో పడుకుని తలుపులు బిడాయించండి." - అన్నాడు డాక్టరు ★

"ఏదేమిటోయ్-ఈ మధ్య బొత్తిగా మరీ అలా గుర్రు పెడుతున్నావు?"

"నా కిలాగేవచ్చు. నచ్చకపోతే వినకు" ★

## మృగరాజసం

అప్పుడే నిద్రలేచిన సింహం అలా షికారుగా తిరిగొద్దామని బయలుదేరింది. దోవలో ఒక పెద్దపులి ఎదురయింది. సింహం దాన్ని నిలేసి "నేనెవరో తెలుసా?" అంది.

"ఎవరేమిటి సార్. తమరు మృగరాజులు. పంచాననులు. హర్యక్షులు" అని పొగిడింది పెద్దపులి.

"సరే పో" అని సింహం ముందుకుసాగింది. కొంత దూరం పోయాక తోడేలు ఎదురైంది. దాన్ని కూడా సింహం అడిగింది "నేనెవరో తెలుసా?" అని.

తోడేలు నక్కలా వణికిపోతూ "త...త...తమరు తెలియకేమండి. ఏలినోరు. దొడ్డపెబువులు. రచ్చించాలి." అంది.

"అయితే నీ దారిన నువ్వెళ్ళు" అని సింహం ముందుకు పోయింది.

దారికడ్డంగా ఒక ఏనుగు నుంచుంది. సింహం దాని దగ్గరికెళ్ళి "నేనెవర్నో తెలుసా?" అంది.

ఏనుగు దానికేసి చూసి తొండంతో ఉంగచుట్టి ఎత్తి గిరాటేసింది.

సింహం ఒళ్ళు దులుపుకుంటూ లేచి "తెలియకపోతే తెలియదనవచ్చుగా? ఎత్తి పడెయ్యాలేమిటి బడాయిగా?" అని రీవిగా వెళ్ళిపోయింది. ★

## తుదిమాట

**చి**లకని పెంచాలనే మోజుపుట్టి ఒకడు బజారుకెళ్ళి బేరం చేశాడు.

"మీకు గనక యాభైరూపాయలకే ఇస్తున్నాను. దీని అసలు ఖరీదు వందరూపాయలు. ఇది మాట్లాడ్డమే కాదు. పాటలు కూడా పాడుతుంది. అచ్చు లతా గొంతుకేననుకోండి"... అన్నాడు అంగడివాడు.

యాభైరూపాయలూ యిచ్చి కొన్న ఆసామి మూడోనాటికల్లా చిలకని తిరిగి తీసుకొచ్చాడు.

"ఏం సార్, చిలక బాగాలేదా? పాటలు పాడ్డం లేదా?" అన్నాడు అంగడివాడు.

"పాడకేం? పాడుతోంది. కాని లతా గొంతుక కాదు. ఆశాభోన్స్లేది. నాకక్కర్లేదిది" అన్నాడు ఆసామి. ★





## ఆలుమగలు

**చి**రాగ్గా వున్న భర్తని పరాగ్గా వున్న భార్య పిలిచి "ఈపూట అరటి కాయొండనా, వంకాయొండనా?" అంది.

"నా తలకాయ వండు"

"ఆవపెట్టి వండనా? వేయించమంటారా?" ★

భర్తచేత ఎలాగేనా సిగరెట్లు మాన్పించాలని మెల్లిగా మళ్ళీ దాడి ఆరంభించింది ధర్మపత్ని.

"అసల్నాకు తెలీకడుగుతా. అంత యిదిగా కాలుస్తారే. ఆ సిగరెట్టులో ఏముందీ అని!"

"పొగాకు" అని అక్కణ్ణించి లేచిపోయాడు మహేశ్వర్రావు. ★

ముద్దరాలికి ముచ్చటైన అనుమానం వచ్చింది.

"ఏవండీ, ఏవండీ! ఆవెధవ పేపరలా పారేసి ముందరిది చెప్పండి. ఏవండీ, నే నీవేళ రాత్రి చచ్చిపోతాననుకోండి; మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా మీరు?" అంది భర్తను కుదివి.

"అబ్బే వీల్లేదు. యివాళ రాత్రి కుదరదు. పనుంది" అన్నాడు పేపర్లో భర్త. ★

ఒకాయన చక్కటి చిలుకను కొని యింటికి తీసుకెళ్ళాడు. ఇంట్లో చిలకమ్మ చాలా ముచ్చటపడింది.

"అవుగాని, దీనికి రెండు కాళ్ళకీ దారాలు కట్టారెందుకండీ?" అంది భార్య పరకాయించి చూసి.

"ఒకటి లాగి చూడు" అన్నాడు భర్త.

కుడికాలు దారం పట్టుకు లాగిందావిడ.

"నమస్కారం. దయచెయ్యండి. అలా కూర్చోండి" అంది చిలక

రెండో కాలు లాగింది యిల్లాలు.

"సెలవండి. ఉంటాను మరి" అంది చిలక

"ఏమండీ, రెండు కాళ్ళ దారాలూ ఒక్కసారే లాగితే ఏమంటుందో?" అంది చిలకల కొలికి.

"ఏమనడమేమిటి నీ మొహం రెండుకాళ్ళూ పట్టుకు లాగితే కిందపడనూ?" అంది చిలక చిరాగ్గా. ★

"ఏమండీ, మీకోసం పాలకోవా చేసి పెట్టాను. మనకుక్క తినేసిందండీ" అంది యిల్లాలు దీనంగా.

"పోన్లే మరో కుక్కని కొనిస్తాను ఏడవకు" అన్నాడు భర్త. ★

సుబ్బారావుగారు పకపక నవ్వి "ఏవయ్యా, ఇదెప్పట్నించి? నీ కంచం నువ్వే కడుక్కోడం?" అన్నాడు.

"అబ్బే ఎన్నడూ లేదు!" అన్నాడు చక్రవర్తి.

"ఆ, ఇందాక నా కళ్ళతో నేను చూస్తినే"

"పిచ్చివాడా, అది నాదికాదోయ్, మా ఆవిడ తిన్న కంచం" అన్నాడు చక్రవర్తి విరగబడి నవ్వుతూ. ★




విదేశయాత్ర చేసి వచ్చిన దంపతులిద్దరికి విందు యేర్పాటు చేశారు మిత్రులు. సభకు వెళ్ళేముందు భార్య భర్తను హెచ్చరించింది.

"చూడండి, సభలో విదేశాల్ని గురించి మాటాడినపుడు జాగ్రత్త. పెళ్ళికి ముందు నాతో మాట్లాడినట్లు కాదు. అందరికీ విదేశాల సంగతి తెలుసు. కోతలు కోయకుండా కొద్దిగా మాట్లాడండి" అంది.

"ఫరవాలేదులే. అంతగా నేను మితిమీరుతున్నాననిపిస్తే మెల్లిగా నా కాలు తొక్కు, తగ్గిపోతాను" అన్నాడు భర్త.

విందులో ఉపన్యసిస్తూ అతను కొద్ది నిముషాలలోనే పెడదారి పట్టాడు. "ఆ వూళ్ళో మేము పార్లమెంటు భవనం చూశాం. ఎంత పెద్దదనీ, దాని పొడుగు పదిమైళ్ళు, వెడల్పు అయిదు మైళ్ళు...." ఇక లాభం లేదని అర్ధాంగి అతని పాదం తొక్కింది.

"ఎత్తు ఐదు అంగుళాలు" అన్నాడు భర్త. ★

ఏమండోయ్ బజారుకేగా వెడుతూంటా
అరకిలో కాఫీపొడుం పట్రండి
పంచదార కూడా అయిపోయింది

నేతి షాపుతో ఈమాటిచ్చిన సరుకు
వాసనేస్తోందనీ ఇలాగయితే
పద్దు మానేస్తామనీ గట్టిగా చెప్పండి

వచ్చేప్పుడు రెండు లక్స్ సబ్బుబిళ్ళ
తేండి. అలాగే తిలకం బాటిలు
కూడా తేసుకురండి

ఇదిగో_ అలా
బజారెడుతున్నానే
ఏమైనా కావాలా?









**ముం**దువరసలో చిలకా గోరింకల జంట ఒక్కలా ఎడ తెరిపి లేకుండా మాట్లాడుకుని నవ్వుకుంటున్నారు. వెనక వరసలో పెద్దమనిషికి కొంతసేపయ్యాక ఓపిక చచ్చిపోయింది.

"బాబూ, ఇందాకట్నించి చూస్తున్నాను. నాకు ఒక్కమాట వినబడ్డం లేదు" అన్నాడు కోపంగా ముందుకు వంగి.

ముందు వరుసలో భర్త మరింత కోపంగా వెనక్కి తిరిగి

"బాగుందండీ, మా మాటలు వినాల్సిన అవసరమేమిటి మీకు? పైగా వినబడ్డం లేదని ఫిర్యాదా? ఇదేం మర్యాదా!" అన్నాడు. ★

"ఏమండీ విన్నారా? పొరుగింటి సుశీలా, మొగుడూ ఈ వేసంగులికి రేపు ఊటీ వెళ్ళి పోతున్నార్ట చక్కహ"

"భేష్, ఇంకేం అయితే మనం యిల్లు కదలక్కరలేదు. వాళ్ళు రేపు పోతారు కాబట్టి, ఎల్లుండి మనం కొడైకెనాల్ వెళ్ళలేదని వాళ్ళకి తెలీదుగా?" ★

ఒకావిడ డాక్టరు దగ్గరకెళ్ళి "మావారికి కలవరింతలండీ, చంపేస్తున్నారు" అంది.

"మందిస్తాను పట్టుకెళ్ళండి అవే పోతాయి...."

"అబ్బే, పోవడానికివ్వకండి. కాస్త స్పష్టంగా మాట తెలిసేలా కలవరించడానికి మందివ్వండి.... ఆ పిల్ల పేరు తెలీటం లేదు." ★




తల్లి దగ్గర వుండి కొడుకుచేత కూరలు తరిగిస్తోంది.

"అదేమిటే నేను వంటచేస్తున్నానుగదాని వాడిచేత కూడా చేయిస్తావా!" అన్నాడు భర్త తటపటాయించి,

"బావుందండీ, రేపు వాడికి మటుకు పెళ్ళి కాదూ?" ★

ఒక భర్త ఆర్తనాదం:

"వందేళ్ళనాడు భూప్రదక్షిణం చేయడానికి ఎనభై రోజులు పట్టిందట. ఇప్పుడు ఎనిమిది రోజులలో అయిపోతుంది. పూర్వం ఢిల్లీ వెళ్ళాలంటే మూడు రోజులు పట్టేది. ఇప్పుడు విమానమెక్కితే ఒకపూట చాలు. పూర్వం జాబు అందడానికి వారాలకొద్దీ పట్టేది. నేడో... క్షణాలమీద వెళ్ళి పోతున్నాయి. నీ చీర సింగారింపు పూర్వం మూడుగంటలు పట్టేది. ఇప్పుడూ అంతే పడుతోంది. ఎప్పుడూ యింతేనా?" ★



అనసూయ భర్త భోజనం వరసచూసి నొచ్చుకుంది.

"ఏమిటండీ నానాటికీ మీకు తిక్క హెచ్చిపోతోందే. చూస్తున్నాగా... సోంవారం వంకాయ కూరచేస్తే అద్భుతంగా వుందన్నారు. మంగళవారం వంకాయ కూరొండితే బాగుందన్నారు. బుధవారం వంకాయ కూరొండితే భేషుగ్గా ఉందన్నారు. లక్ష్మీం వారం వంకాయ కూరొండితే తిన్నారు. సుక్కురారం వంకాయ కూరొండితే తీరా వడ్డించాక వంకాయ సయించదంటారు. ఏమిటంట మీ యిది, సవబుండాలి." ★

"అవునుగాని-అమ్మడూ నీచేతిలో యెప్పుడూ డబ్బు ఆడుతుంది కద-మీ ఆయన్నలా అంత చెప్పుచేతుల్లో ఎలా పెట్టుకున్నావే?...."

"ఏం లేదు పిన్నీ, నాకు కోపం వచ్చినప్పుడల్లా మా పుట్టింటి కెళ్ళిపోతానంటాను. అన్నప్పుడల్లా ఆయన రైలు ఛార్జీలకని పాతిక ఠంగున తీసిస్తారు. ఆ తరువాత నేను వెళ్ళడం మానేస్తాను. ఎప్పుడూ యింతే." ★

ఆలుమగ లిద్దరు విడాకులకోసం కోర్టు కెక్కారు. వారికి ముగ్గురు పిల్లలు. నాక్కావాలంటే నాక్కావాలని తగవులాట వచ్చింది. రాజీకి మార్గం ఆలోచించి న్యాయమూర్తి ఒక సూచన చేశాడు.

"మీరిద్దరూ ఇంకో ఏడాది కాపరం చెయ్యరాదూ! ఇంకో బిడ్డ కలిగితే చెరిద్దర్నీ తీసుకోవచ్చు గదా?"

"కవల పిల్లలు కలిగితేనో?" అంది భార్య. ★

పెళ్ళి చేసుకోబోయేముందు కళ్ళు పెద్దవి చేసుకుని సాకల్యంగా నాలుగూ చూసుకోవాలి, పెళ్ళి అయిపోయాక అవి మూసుకు తిరగడం మంచిది" అన్నాడు వానప్రస్థాని కెళ్తున్న ఒకాయన. ★

"నే నుట్టి బుద్ధిహీనుడిని, నిన్ను పెళ్ళాడాను."
"మరే, నేనూ అప్పటి కంగారులో మీ సంగతి కనుక్కోలేక పోయాను."★



"డార్లింగ్ - రేపు మన పెళ్ళి... గత జీవితంలో నేను చేసిన తప్పొప్పులు ఇంతకు ముందు ప్రేమించిన వాళ్ళ సంగతులూ మనసు విప్పి నీకు చెప్పేస్తాను. నువ్వు వినేస్తే నాకు తృప్తి, ధైర్యం...."

"పిచ్చిపిల్లా-ఆకథలన్నీ రెండు వారాల క్రితమే చెప్పేశావు గదా."

"అదే...చెప్పి రెండు వారాలయింది గదా... ఈ లోపల ...." ★

భర్త: ఇవాల్టికి మన పెళ్ళయి సరిగ్గా పాతికేళ్ళయింది. నమ్ముతావో లేదోగాని, అచ్చు మన పెళ్ళిరోజునెలా ఉన్నావో ఇవ్వాళా అలాగే ఉన్నావు.

భార్య: ఎందుకుండనూ? ఆవాళ కట్టుకున్న చీరేగా ఇది! ★

ఉంపుడుకత్తె: నాదగ్గిరలేంది ఆవిడగారి దగ్గరేముందని.... ఇంకా బోందాం పెళ్ళాన్ని పట్టుకు వేళ్ళాడుతారుటా?

భర్త: యాభై ఎకరాల మాగాణి, పదెకరాల మామిడితోట, నిమ్మతోట, మూడు వీశెల బంగారం ★

ఏటేటా పురుడు పోసుకుంటున్న అరడజనుమంది పిల్లల తల్లిని పక్కింటావిడ అడిగింది.

"ఎన్నో నెలమ్మా ఇప్పుడు?"

"ఇకనుంచీ నెలా లేదు, గిలాలేదు. ఏటా పురుడెందుకొస్తుందో మాకు తెలిసిపోయింది." ★

"ఏం దిగులుగా వున్నావ్?"

"మా ఆవిడ పుట్టింటికెళ్ళి రెండు నెలలైంది. ప్రతి ఉత్తరంలోనూ నేను రాత్రిళ్ళు ఎక్కడికీ వెళ్ళటం లేదనీ, ఇంట్లోనే ఉండి రాత్రి రెండింటిదాకా నిద్రపట్టక పుస్తకాలూ అవీ చదువుకుంటూ కాలక్షేపం చేస్తున్నాననీ రాసేవాణ్ణి. రేపావిడ వస్తోంది."

"వస్తే ఏం?"

"ఏమి టేమిటోయ్ భగవాన్లూ! నిన్నొచ్చిన కరెంటు బిల్లులో రెండు నెల్లకీ కలిపి ముప్పావలా అయింది." ★

**గా**వుపాటి పెళ్ళాం: నా దగ్గిర లేంది దాన్దగ్గిర ఏముందని దాని కొంపలో చస్తారు మీరు?

భర్త: దాందగ్గిరేవుంది? దాని మొహం తప్ప! ★

**వి**మానంలో ప్రయాణం చేయబోయే వారందరికీ ఆ ప్రయాణంలో ప్రాణానికి ప్రమాదం సంభవిస్తే పెద్దమొత్తం పరిహారం ఇచ్చే పద్ధతిపై భీమా పాలసీలు ఇస్తారు. దానికి అందరికీ ఒకటే రేటు... పది రూపాయలు వసూలు చేస్తారు.

ఒక లాయరుగారు విమానం ఎక్కుతూ ఆ భీమాపాలసీ పత్రాన్ని సాగనంప వచ్చిన భార్యచేతికిచ్చి "నీ దగ్గర ఉంచు" అన్నారు.

"ఆ.... ఇదేమన్నా వచ్చేదా చచ్చేదా. దాచడం కూడా ఎందుకు?" అంది ఆ యిల్లాలు నిర్లిప్తంగా. ★

**మ**తిమరుపు భర్త : ఇవ్వాళ నా జేబులోంచి ఎవడో పెన్ను కొట్టేశాడు.
భార్య : వాడు మీ జేబులో చెయ్యి పెట్టడం తెలియలేదా?
భర్త : తెలిసిందిగానీ, నా చెయ్యేననుకున్నా! ★

**న**లభై ఐదేళ్ళు పై బడ్డ ఒహాయన రాత్రి పడుకోబోయేటప్పుడు 'నవజీవన యవ్వన గుళికలు' ఆబగా ఓవర్‌డోసు పుచ్చేసుకున్నాడు. తెల్లారాక భార్య లేపగా లేపగా చివరికి మేలుకున్నాడు.

"అబ్బ ఏంటే అప్పుడే నిద్దర్లేపుతావు... నేనివ్వాళ బళ్ళోకి వెళ్ళను ఫో" అని గారాలుపోయాడు. ★



**భ**ర్త : నాకీమధ్య మరీ మతిమరుపు ఎక్కువవుతోంది. ఇవాళ గొడుగు తీసుకెళ్ళడం మరిచిపోయాను.

భార్య : ఎప్పుడు జ్ఞాపకమొచ్చింది?

భర్త : వాన వెలిశాక గొడుగు మూసేద్దామని చూస్తే .... చేతిలో గొడుగు లేదు! ★

**ఒ**క ప్రముఖుడు షష్టిపూర్తి ఉత్సవం జరుపుకున్నాడు. సభలో ఒకాయన....

"శ్రీవారు ఆజన్మబ్రహ్మచారులుగా ఉండిపోడానికి కారణం ఒకటిమటుకు బోధపడలేదు." అన్నాడు.

శ్రీవారు ఆ కథ చెప్పారు. "ఒకనాడు నేను ట్రాముబండిలో వెళుతున్నాను. రద్దీగా ఉన్నందువల్ల నిల్చున్నాను. కుదుపుకి ఓమారు తూలి, నా పక్కావిడ కాలు తొక్కాను. 'బుద్ధి లేదూ? ఒళ్ళు తెలీపోతే సరి!.... యాభై ఏళ్ళు నెత్తికొచ్చినా....-' అంటూ పళ్ళు పటపటకొరికి, నాకేసి ఉరిమిచూసి 'క్షమించండి. మీరు మా వారనుకుని మాట తూలాను' అందావిడ నాలిక్కరుచుకుని. అదీ కథ! ★



"**అ**య్యా పోలీసువారు, చప్పున నన్ను ఖైదులో వేసి తాళం పెట్టండి. మీకు పుణ్యం ఉంటుంది" అన్నాడాయన ఒగురుస్తూ వచ్చి.

"ఏం చేశారండీ?"

"మా ఆవిడని కర్రతో కొట్టాను."

"చచ్చిపోయిందా!"

"లేదండీ, అందుకే ముందు ఖైదులో వేసెయ్యండి నన్ను" ★




ఒక పెద్దమనిషి డాక్టరు దగ్గరకు వెళ్ళాడు.

"రోగం ఫలానా అని చెప్పలేనుగానీ... ఏవిటో ఎప్పుడూ చెవులు హోరెత్తిపోతూ ఉంటాయండి. ఇంట్లో ఇంత చిన్న చప్పుడయినా అదిరి పడతాను. జుట్టు నెరవకపోయినా భగవద్గీత చదవాలనిపిస్తుంది. రాత్రిళ్ళు నిద్దర పట్టదు. విసుగు... చిరాకు... భయం... కంగారు... తొట్రుపాటు ఎక్కువై పోయాయండి..."

"అవునవును. తెలుసు. నాకూ పెళ్ళయింది లెండి!".... అన్నాడు డాక్టరు... సానుభూతి ప్రకటిస్తూ. ★

రాజమండ్రిలో కోర్టుపనీ, ఫస్ట్‌షో సినిమా చూసుకుని భోంచేసి నిడదవోలు ఆఖరి బస్సుకోసం వచ్చిన కుటుంబరావు బస్సు మిస్సయిపోయాడు. కానీ బస్టాండులో ఓ మిస్సమ్మ తగిలింది. మాట కలిపింది. ఆ పూటకి మనసూ కలిసినట్టయి... వెనక సందులో తన యింటికి తీసుకెళ్ళింది. ఆనందం చేసుకున్నాక తెల్లారుఝాము బస్సెక్కించింది.

పొద్దుటే ఇల్లాలు నిలదీసి అడిగింది.

"నీ మీద ఒట్టేసి నిజం చెప్పేస్తానే..." అంటూ ఆయన నిజంగా జరిగిన కథంతా చెప్పేసి... "ఇంక ఎప్పుడూ పరాయి ఆడదాని జోలికి పోను" అని ఒట్టుపెట్టుకున్నాడు.

భార్య అతని జేబులో పర్సుతీసి చూసింది.

"కోతలు కోయకండి. మీకు మళ్ళీ ఆ పేకాట ముఠా తగిలింది. తెల్లవార్లూ పేకాడి డబ్బు తగలేసి .... నా కళ్ళు తుడవడానికి కట్టుకథలు చెప్తున్నారు".... అంది ★

"ఏరా అబ్బాయ్ నువ్వూ, మీ ఆవిడా మాటామాటా అనుకున్నారట రాత్రి?"

"లేదు బాబాయ్, నేను అనుకున్నాను. ఆవిడ అంది." ★

"కొకపోయినా అంతలేసి మీసాలేమిటి? మీసాలతో కాఫీ అదీ తాగడం కష్టం కాదండీ" అంది అర్ధాంగి

"కష్టమేమిటి. అసాధ్యం. అంచేత నేను మీసాలతో ఏదీ తాగను. నోటితోనే తాగుతాను" అన్నాడు భర్త ★

"ఇవాళ మా ఆయన కోటుమీద లిప్‌స్టిక్ మరకలు కనిపించగా ఎవరివని నిలదీసి అడిగాను. అవి లిప్‌స్టిక్ మరకలు కావనీ, టొమాటో జూస్ మరకలనీ దబాయించారు. నీవైతే ఏం చేస్తావ్?"

"ఆ టొమాటో ఎవరో, పేరేమిటో, ఎడ్రసేమిటో కనుక్కుంటాను.".... అన్నది ఆమె స్నేహితురాలు. ★

"చెప్పినమాట వినమంటే నీక్కాదూ?"

"చెప్పుడు మాటలు వినొద్దని మీరే గదండీ చెప్పారు?"

"అది మట్టు కెందుకు విన్నట్టూ?" ★



పెళ్ళయిన మర్నాడు భర్త భార్యను దగ్గిరకు తీసుకుని – "చూడు మన పెళ్ళి అయిపోయింది కాబట్టి నాలో ఉన్న కొన్ని లోపాల్ని గురించి నీకు చెప్పదలచు కున్నాను" అన్నాడు.

"ఏవక్కరలేదు, నాలోనూ కొన్ని ఉన్నాయ్. అందుకే మిమ్మల్ని పెళ్ళాడాను. చెల్లు" అంది ఇల్లాలు. ★

కొత్తగా కాపరం పెట్టిన రతీమన్మధులిద్దరూ తగవులాడుకున్నారు. అమ్మాయి అలిగి పక్కవీధిలో పుట్టింటికి పరుగెత్తుకొచ్చేసి ఏడుస్తూ పడుకుంది. "ఇక వెళ్ళను గాక వెళ్ళను" అంది.

ఆ పిల్ల తాతగారు ఓదార్చి ఉపాయం చెప్పారు.

"పిల్లా – అది కాదే పద్ధతి. నే చెప్పినట్టు చెయ్యి. వెంటనే నీ యింటికి వెళ్ళు. రేపట్నుంచీ పొద్దుట ఆరింటికి లే. అక్కడనించి అతనికి కావలసినవన్నీ అమర్చు. సకలోపచారాలూ చెయ్యి. ఎదురుమాట చెప్పకు. ఇలా అన్ని విధాలా ఆర్నెల్లు

సుఖపెట్టి–అతను బాగా సుఖం మరిగి నిన్నింక వదలలేని పరిస్థితిలో పడతాడు. అప్పుడు లేచి చక్కారా. అదీ పగదీర్చుకునే పద్ధతి. మొర్రోమని మొత్తుకుంటాడు!"

మనవరాలు తాత మాటప్రకారం ఆరునెలలు వ్రతం చేసింది. గడువు తీరిన మర్నాడు – తాత ఆ పిల్ల యింటికి వెళ్ళి, "ఏవే – రా మనింటికి పోదాం." అన్నాడు.

"అమ్మో! ఒక్క ఘడియ కూడా ఇల్లు కదలి రాలేను తాతా! నే లేకపోతే ఒక్క క్షణం ఉండలేరాయన. అంతా మారిపోయారులే! పూర్వంలా కాదు. ప్రాణంలా చూసుకుంటున్నారు నన్ను." – అంది రతి. ★

ఒక ఆసామి చనిపోగానే భీమా సంస్థ లక్షరూపాయల భీమా మొత్తం పంపింది ఆయన భార్యకు.

ఏడుస్తూనే ఆ డబ్బు లెక్కపెట్టుకుంటూ – "ఎందుకీ వెధవ డబ్బు. ఆయన ప్రాణం తిరిగొస్తుందంటే ఇందులో ఓ పదివేలు వదిలేస్తాను." అందావిడ ఏజెంటుకేసి చూసి. ★







"…. రేఘుమితో మదర్పిత చందన తాంబూలాదులు స్వీకరించి నన్నానందింపజేయ… అంటూ శుభలేఖల్లో బంధువులందరికీ ఊ రాస్తూ పోతాంగాని కొందర్ని చూస్తే ఒళ్ళు చిర్రెత్తిపోదూ?…" అన్నాడు అవధాన్లుగారు.

"అదేం ముక్క, నన్నడిగితే పనికిమాలిన బంధువు, బాధపెట్టే బంధువు అంటో ఎవ్వడూ లేడు. కొందరు వచ్చి ఆనందపెడతారు. మరికొందరు వెళ్ళి ఆనందపెడతారు. అందరున్నూ ఆనంద పెట్టేవారే" అన్నాడు శాస్త్రులవారు. ★

సుబ్బారావు బామ్మగారు తిరపతెళ్తూ మనవడింట దిగింది. అంతకు ముందురోజే దిగిన సుబ్బారావు అత్తగారి కీ వరస నచ్చక రుస రుసలాడసాగింది.

దీపదీపాలవేళ కూతురు నట్టింట్లో కెళ్ళేసరికి తల్లి తారాట్లాడుతున్నట్లు కనబడింది. ఇదే అదనని దగ్గరకెళ్ళి "చూడమ్మా, ఆ ముసలి పీనుక్కి అంతలేసి మర్యాదలేవిటని విసుక్కోకు. పదివేల రూపాయల ఆస్తిట. అంతా మీ అల్లుడికి వస్తుంది రేపు హరీమంటే. నువ్వుకూడా కాస్త సరదాగా వుండు" అంది.

"ఏమిటే, అవ్వా మనవరాలూ చీకట్లో ముచ్చట్లాడుతున్నారు?" అంటూ సుబ్బారావు అత్తగారు పెరట్లోంచి లోపలికొచ్చింది. ★

"దూరపు బంధువంటే ఎవర్రా బాబీ"

"ఎప్పుడూ మెద్రాసులోనే వుండిపోయి మనింటికి అస్సలు రానివాడు."

"దగ్గిర బంధువంటే?"

"ఎప్పుడూ మనింటోనే వుండిపోయేవాడు" ★

లక్షాధికారి చనిపోయాడు. సావిట్లో అయినవాళ్ళంతా శోకాలు పెడుతున్నారు. అందరకన్నా కాస్త ధాటీగా ఏడుస్తున్నాడొకాయన.

"మీరెందుకండీ అంతగట్టిగా ఏడుస్తారు. అసలువాళ్ళ ఏడుపు సరిగ్గా వినపడనీకుండా? చచ్చినాయన మీకేమన్నా బంధువా?" అన్నాడు యిద్దర్నీ ఎరుగున్న ఒక ఆసామి.

"కాదండీ, అందుకే ఈ ఏడుపు." ★

ఒక గృహస్థు భోజనాలదగ్గర తన అతిథిని లాగి లెంపకాయకొట్టి భోరున ఏడ్చేశాడు. నలుగురూ ఓదార్చాక అతను చెప్పిన కారణం:-

"ఆయన నా చొక్కాలన్నీ తొడిగేస్తే ఊరుకున్నాను. నా పడక్కుర్చీలో కూర్చుంటే పోనీలే అనుకున్నాను. నా చుట్టలు కాల్చేస్తే సరేలే అనుకున్నాను. కాని... చివరికి నాకట్టుడు పళ్ళు పెట్టేసుకుని నన్నే హేళన చేసి ఇకిలిస్తే ఇక ఉండబట్టలేకపోయాను!" ★

## చమత్కార హాస్యాలు

"ఏంవోయ్ హనుమాన్లూ, మీ ఊళ్లో పెద్ద వాళ్ళెవరన్నా పుట్టారా?" అన్నాడు పల్లెటూరు వచ్చిన పెద్దమనిషి.

"లేదండీ, అంతా చిన్న చిన్న పిల్లలే పుడుతున్నారు." ★

"ఈ రోడ్డెక్కడి కెళ్తుందయ్యా?"

"పాతికేళ్ళాయి చూస్తున్నాను. కదలకుండా యిక్కడే పడుందండి" ★

"బాబు రంగయ్యగారిల్లెక్కడా?"

"ఎక్కడండి, ఇల్లెక్కడాని కాయన కేం పని? పైగా పెద్దవాడు" ★

"బ్రదర్ నీకు మొన్న పెళ్ళయిందట. ఎవర్ని చేసుకున్నావ్?"

"ఆడపిల్లని"

"బలేవాడివే. ఆడపిల్లని కాకపోతే మొగాణ్ణి చేసుకుంటావేమిటి"

"అదేం మాటా? మొన్న మా చెల్లెలు మొగాణ్ణి. పెళ్ళాడలేదూ" ★

"అమ్మలగన్నయమ్మ అంటే ఎవరురా?"

"అమ్మమ్మండీ" ★

"మీ పేరు తెలుసుకోవచ్చా?".

"ఆహా, నిక్షేపంలా దానికేం 'భాగ్గెం'." ★




"రాయలసీమనించి యింకో మెమోరాండం వచ్చిందండీ, ఎక్కడా నీటి బొట్టులేదట, జనం నాలుకలు పిడచకట్టుకుపోతున్నాయట" అని నివేదించాడు కార్యదర్శి.

"ఆ పోదూ మరీ బడాయి. బొత్తిగా ఆపాటి నీళ్ళుండవా?" అన్నాడు మంత్రిగారు.

"నమ్మొచ్చుననుకుంటానండీ, ఈసారి ఈ ఉత్తరం పెట్టిన కవరుమీద పోస్టుబిళ్ళని గుండుసూదితో గుచ్చి పంపారండీ." ★

"మీ వూళ్ళో పేరుగలవాళ్లెవరైనా పుట్టారోయ్?"

"లేదండీ అందరికీ పుట్టాకే పేర్లు పెడుతున్నారు." ★

ఒకాయన గడియారాల షాపుకెళ్ళి గడుసుగా అడిగాడు.
"ఏవండీ, గడియారం పదమూఢు గంటలు కొడితే ఏ వేళైందంటారు?"
"మరమ్మత్తువేళ" అన్నాడు షాపువాడు. ★

"ఏవండీ సబ్బులున్నాయా?"
"లేవండీ"
"హేరాయిలుందా?"
"లేదు సార్"
"టూత్ పేస్టో"
"అదీ లేదండీ?"
"తెల్ల కాయితాలు?"
"అయిపోయాయి"
"పోనీ తాళం కప్పలున్నాయా?"
"ఉన్నాయి"
"అయితే కొట్టు తలుపులేసి తాళం బిగించండి" ★

"ఈ వెధవ కాఫీ మానేస్తే, ఆ మిగిల్చే డబ్బుతో సుబ్బరంగా పుణ్యక్షేత్రాలన్నీ చూసిరావచ్చు" అంది అత్తగారు – కోడల్ని కూకలేస్తూ.
"దానికేం, భోజనం మానేస్తే ఏకంగా వైకుంఠవే చూడవచ్చుగా" అంది వియ్యపురాలు. ★

"పాతికేళ్ళ కుర్రాడుంటే చెబుదురూ; మా అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తాను"
"పాతికేళ్ళవాడొకడు దొరకడనుకోండి. పది, పన్నెండేళ్ళ వాళ్ళిద్దరైతే పనికొస్తారా?" ★

ఎదుగూ బొదుగూలేని వేమిటని మాష్టరుగారు అడిగారు
"తెలుగు సినిమా." అన్నాడు ఎడిటరు గారబ్బాయి.
"నీ జీతం నాన్నా" అన్నాడు సుపుత్రుడు.
"వడ్డీలేని అప్పు" అన్నాడు సెట్టిగారబ్బాయి.
"సినిమా తార వయసు" అన్నాడు ఎదుగుతున్న బిడ్డడు.
"గొర్రెతోక" అన్నాడు ఎదుగూ బొదుగూలేని విద్యార్థి.
"సరే, నీ బుర్రకూడా వొకటనుకో" అన్నాడు మేష్టారు ★

తలాతోకాలేనివి: తెలుగు సినిమా కథ, ఎన్నికల వాగ్దానాలు ★

ఆగనిది: "మూడే ముక్కలు చెప్పి విరమిస్తా" అని ఆరంభించే వ్యక్తి ఉపన్యాసం. ★



"సున్నా ఉభయాక్షరం అంటారెంచేత?"
"అది తెలుగులోనూ, లెక్కలలోనూ వస్తుందని." ★

ఒక సాధువూ, శిష్యుడూ శ్మశానానికి అడ్డుపడి పోతున్నారు.
శిష్యుడిని హడలగొట్టాలని, సాధువు ఒక పుర్రె తీసి "ఇది రావణాసురుడి పుర్రె" అన్నాడు.
"గురూ ఆయన పెద్ద రాక్షసుడు గదా, పుర్రె యింత చిన్నదిగా ఉందేం?" అన్నాడు శిష్యుడు.
"ఇది చిన్నప్పటిదిలే" అంటూ చురుగ్గా ముందడుగేశాడు సాధువు ★

"నాకు ఈ పళంగా సరిగ్గా బిర్లాగారి కున్నంత ఆస్తి వచ్చేసిందనుకో. అప్పుడు నేను బిర్లాకన్నా గొప్పవాడినైపోతాను" అన్నాడు కిళ్ళీకొట్టు వీర్రాజు.
"అదెలాగ! బిర్లాకున్నంత ఆస్తి వస్తే సరిగ్గా అంతే గొప్పవాడివవుతావు గదా"
"బలే వాడివే. ఆ ఆస్తి ప్లస్ ఈ కిల్లీబడ్డీ గదా, ఇది బిర్లాకి లేదుగా మరి." ★

"ఈపూట మీ ఇంట్లో కూరేం చేశారు?"
"ఏం చేస్తాం, తిన్నాం." ★

"అయ్యా అసుపత్రికి దగ్గర దారేదో చెప్పగలరా?"
"గలను" అన్నాడు చమత్కారి.
ఇంకో ఆసామి చెప్పిన దారి: కళ్ళు మూసుకుని రోడ్డుమధ్య పదినిమిషాలు నడవండి. కళ్ళు తెరిచేసరికి ఆస్పత్రిలో ఉంటారు. ★

ఓ చమత్కారప్పిల్లడు, అతి చమత్కారంగా మాట్లాడి అందరినీ హేళన జేసే ఒకానొక మిఠాయివాలా కొట్టుమీద కెళ్ళి ఓ పావలా పకోడీలు కట్టమన్నాడు.
పొట్లం అందుకొని ఓ క్షణం పట్టుకుని "ఇవొద్దుగాని ఈ పావలా పకోడీల బదులు మిఠాయి కట్టి ఇయ్యి" అన్నాడు అది వాపసు యిచ్చి.
మిఠాయి పొట్లం చేతికివ్వగానే డబ్బు చెల్లించకుండా పోబోయాడు. దుకాణదారు డబ్బు అడిగాడు.

"డబ్బేమిటి! పావలా పకోడీల పొట్లం బదులు ఈ మిఠాయి తీసుకున్నాను. చెల్లుగా" అన్నాడు కుర్రాడు.

"ఓహో అలాగేం, పోన్లే పకోడీల పొట్లానికి పావలా యిచ్చి వెళ్ళు" అన్నాడు దుకాణదారుడు గడుసుగా.

"ఎందుకూ? పకోడీల పొట్లం నేను తీసుకోలేదుగా?" అన్నాడు కుర్రాడు. ★



"మీరు నమ్ముతారో లేదో గాని ఎదుటివాడి మనసులో ఊహ ఏమిటో ఇట్టే పసిగట్టి చెప్పగలను" అన్నాడొక కోతలరాయుడు కొత్త ఆనపకాయ అందుకుని.

"అలాగా.. అయితే నన్ను క్షమించండి" అన్నాడు విసుగెత్తిన శ్రోత. ★

ఒక వంద అప్పడాలు కావాలన్నాడొకాయన. దుకాణదారు వందా లెక్క పెట్టి పట్టుకొచ్చాడు. "పొట్లం కట్టిమ్మంటారా?" అన్నాడు దూరం ఆలోచించి.

"అబ్బే ఎందుకూ – ఇలా ఇచ్చెయ్యండి – దొర్లించుకు పోతానింటికి!" ★

"అదేమిటిసార్! మీకు బట్టతల వచ్చేస్తోంది. మా హేరాయిల్ వాడారా?"

"అబ్బే లేదండీ. వృద్ధాప్యం వల్లే అయివుంటుంది." ★

"ఏయ్, ఈ చెర్లో స్నానం చెయ్యగూడదు. బైటికి రా?"

"నేను స్నానానికి రాలేదయ్యా మగడా, చావడానికొచ్చా. ఆ పనిమీదే వున్నాను. పో." ★

"పో, గాడిద కొడకా" అని తిట్టాడొక మూర్ఖుడిని.

"వీడా నా కొడుకు, ఛీ" అంది దారేపోతున్న గాడిద. ★

"అయ్యా... ఇలా ఈ రోడ్డంటపోతే రాజమండ్రి ఎంతసేపట్లో వస్తుంది."

"రెండు మూడేళ్ళు పట్టొచ్చు. ఇది విశాఖపట్నం రోడ్డు. రాజమండ్రి అటు." ★

"అయ్యా హనుమాన్లుగారూ! ఐదో నంబరు బస్సు ఏటిగట్టునే ఆగుతుందన్నారు. నమ్మకమేనా?"

"చచ్చినట్టాగుతుంది. ఆక్కపోతే ఏట్లో పడిపోదుటయ్యా..." ★

"ఈ నెక్‌టై ఎంతక్కొన్నావురా?"

"పది రూపాయలు నాన్నా."

"ఓరి వెధవా! డబ్బు ఊరికే తగలేస్తున్నావ్ - మెళ్ళో గోచిపాత ఎందుకని? దాని బదులు మంచి చెప్పుల జోడు వచ్చేదిగా!?"

"బలేవాడివి నాన్నా. చెప్పులు మెడకి కట్టుకుని తిరగమంటావా?" ★

గోళ్ళు కొరుక్కోవడం గొప్పపనేనని చెప్పి, బామ్మఎదుట మనవణ్ణి ప్రోత్సహిస్తున్నాడు తాతయ్య.

"ఆ మాటకొస్తే మీ బామ్మకి యాభై ఏళ్ళు దాటేదాకా గోళ్ళు కొరుక్కునే అలవాటు పోలేదు, తెలుసా?" - అన్నాడు ఆవిడకేసి ఓరకంట చూసి.

"ఏభయ్యవ ఏటమాత్రం ఎలా పోయింది తాతయ్యా? గోళ్ళయి పోయాయా?" - అన్నాడు మనవడు - తాతకి తోడై.

"ఎబ్బే, పళ్ళూడిపోయాయి!" ★

ఒకరైతు పట్నం వచ్చాడు. "పోస్టాఫీసుకు దారి తెలీక దారే పోతున్న ఒక యువకుడ్ని ఆపి, "అయ్యా, పోస్టాఫీసుకి దారి చెప్పగలరా?" అన్నాడు.

"చెప్పగలను" అని కుర్రాడు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. ★

## ఇంత లేటు వయసులో

తొంభైయేళ్ళ లక్షాధికారికి తొమ్మిదో మనువుమీద మనసయింది. కంటికి నదరైన బాల వితంతువు కనబడింది. పురోహితుడిని పిలిపించాడు.

"యాజులుగారూ! ఆపిల్లని చేసుకుంటే బావుణ్ణనిపిస్తోందండి. వయసు కాస్త తగ్గించి ఏభైయేళ్ళని చెప్పి చూస్తే ఒప్పుకోదంటారా?" అన్నాడు.

"అయ్యో! మీరు లక్షాధిపతులు గనక తప్పక ఒప్పుకుంటుంది. ఇహ వయస్సంటారా? తగ్గించి చెప్పడంకన్న, ఉన్న తొంభైకీ ఇంకో నాలుగు కలిపి చెబితే మంచిది. వెంటనే ఒప్పేసుకుని రేపే ముహూర్తం పెట్టమంటుంది." ★

ప్రధాన ఉపన్యాసకుడికి అవకాశం వచ్చే ముందరే, అప్రధానులంతా వరసగా వేదిక ఎక్కి తనివితీరా ప్రసంగించారు. రాత్రి బాగా పొద్దుపోయింది. చివరికి అసలు పెద్దమనిషిని పిలిచారు.

"అయ్యా, నమస్కారం. నేను తొమ్మిది గంటలకి పడుకుంటాను మామూలుగా, పదిన్నర కావస్తోంది. సెలవు." అని వేదిక దిగి వెళ్ళిపోయాడాయన. ★



## సా...రీ

ఒక రాజుగారు ఇష్టాగోష్ఠి జరుపుతున్నారు. ప్రసంగవశాత్తు ఒక సభ్యుడు "రాజుగారి పెద్దభార్య మహాపతివ్రత, ఆమె స్త్రీలందరికీ ఆదర్శప్రాయురాలు." అన్నాడు.

మిగతావారంతా అదిరిపడి ఆయనకేసి చూశారు. – అయితే చిన్న భార్య కులటా? – అన్నట్టుగా. ధ్వనిదోషం పరిహరించడానికింకేం మార్గం తోచక తన వాక్యం ఉపసంహరించుకున్నాడా సభ్యుడు: "రాజుగారి భార్యలందరూ పతివ్రతలే. పెద్దభార్య మాత్రమే కాదు." ★

## పునర్జన్మ

ఒక శరభయ్యగారికి పునర్జన్మలంటే తిరుగులేని గురి.

అంచేతాయన ఈసారి జన్మ చాలించి చనిపోయేముందు తన ఆస్తి యావత్తూ పక్కజన్మలో తనకే చెందాలని వీలునామా వ్రాయించాడు. ★

## అతిరిక్తం

నౌకర్లకు సున్నితంగా మంచిచెడ్డలు చెప్పే మంచి పద్ధతికి మచ్చుతునక. ఒక ఇంజనీరుగారు ప్రవచించారు. "చూడు చింతాలూ, నీళ్ళు తోడడం, బట్టలు తేవడం, పక్కలు వెయ్యడం, కాఫీ సిగరెట్లు పట్రావడం వంటి పనులు నువ్వు చెయ్యి. ఆ కాఫీ తాగడం . సిగరెట్లు కాల్చడం లాటివి నాకు వదిలెయ్యి.. అలాటి పన్లు నేనే చేసుకుంటాను." ★

ఇద్దరు వ్యక్తులు ఒకే రౌడీమీద పగబట్టారు. ఒక రాత్రివేళ అతను ఇంటికి వచ్చేదారిలో పొంచి కూర్చున్నారు... రాగానే చంపెయ్యాలని.

రాత్రి మూడు ఝాములు అయినా రౌడీ రాలేదు.

"కొంపతీసి వాడిని ఎదర ఇంకెవరేనా చంపేశారేమో?"... అన్నాడు ఒకడు దిగులుగా.

"నాకూ అదే భయంగా ఉంది..." అన్నాడు మిత్రుడు. ★



రెండు ప్రశ్నలకు పది రూపాయలు అని బోర్డు కట్టి కూర్చున్న ఒక జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్ళి. "అయితే రెండు ప్రశ్నలకు పదిరూపాయలు పుచ్చుకుంటారా?" అన్నాడు.

"అవునండి, మీ రెండో ప్రశ్న ఏమిటి" అన్నాడు జ్యోతిష్కుడు. ★

టెక్సన్‌లకి రాష్ట్రభక్తి అపరిమితం. అంతకన్నా గొప్పరాష్ట్రం లేదని చాటడానికి వాళ్ళు నిర్మించే వాక్యాలు బ్రహ్మాండంగా ఉంటాయి.

ఒకసారి ఒక టెక్సన్ నయాగరా జలపాతం దగ్గరకు వెళ్ళాడు. "ఇంత గొప్పది మీ రాష్ట్రంలో లేదని మీరు ఒప్పుకోక తప్పదు" అన్నాడు మిత్రుడు.

"లేదుగాని. ఈ చిల్లుకు మాటుపెట్టే పనివాళ్ళు బోలెడుమంది ఉన్నారు" అన్నాడు టెక్సన్ వీరుడు. ★

## కుటుంబమంట

ఒక గృహస్థు జనన మరణాల రిజిస్ట్రారు ఆఫీసుకు వచ్చి "అయ్యా, మొన్న మా పిల్లాడి పేరు రామారావని చెప్పాను. పొరబాటండి, సుబ్బారావని మార్చిరాసుకోండి."... అన్నాడు.

"ఏం--సుబ్బారాయుడికి మొక్కుకున్నారా?"

"కాదండి. ఆ పేరుతో ఇంటో ఒకడున్నాడండి. పదోవాడో... పదకొండోవాడో! కంగారులో చూసుకోకుండా మొన్నటి వాడికీ రామారావని పెట్టాం."




ఒకాయన క్షౌరశాలకు వెళ్ళి గడ్డం చెయ్యమన్నాడు. రెండు నిముషాల తరువాత "అబ్బాయ్, యింకో కత్తి వుంటే యిలా యిద్దూ" అన్నాడు.

"ఏం మీరే చేసుకుంటా నంటారా?"

"అబ్బే ఆత్మరక్షణ కోసం." ★

మంగలిషాపు యజమాని కొత్తగా పనిలో చేరినవాడితో

"అడుగో ఎవడో గడ్డానికొస్తున్నాడు"

"ఆయనతో మొదలెడతాను పని." అన్నాడు కుర్రాడు.

"జాగర్త. చెయ్యి కోసుకునేవు?" ★



"అదేం చిత్రమోగాని నా గదినిండా అందమైన సినిమాతారల బొమ్మలు పెట్టుకుంటానా అండీ--"

"వాళ్ళు కల్లోకొస్తారు కాబోలు అదేనా?"

"అబ్బే, వాళ్ళొస్తే చెప్పేదేముంది-ఎంతసేపూ ఆ విలన్‌వేషాల వాళ్ళు అఘోరిస్తారు కలల్నిండా." ★

# హోటళ్ళు



"ఏవిటోయ్ ఇవాళ వంకాయకూర యిలా తగలేశారు. కంపు కూడాను. కిందటి వారం అంత బాగుందే మరి.'

"బలేవారే. ఇది ఆ కూరేనండి, మళ్ళీ యెక్కడ వండాం-? మీరు వంటవాడు మారాడని పేర్లు పెడతారు గాని-" ★

సర్వ: సార్, ఆశ్చర్యంగా వుంది! ప్లేట్లు కడిగే కుర్రాడిని మేం మార్చినట్లు మీరెలా కనిపెట్టారు?

ఆసా: వేలి ముద్రల్లో తేడా కొట్టొచ్చినట్లు తెలిసిపోతుంటే....! ★

ఒకతను కాఫీ తెప్పించి సర్వర్ని పిలిచి, "చూశావా. ఇందులో ఈగ ఉంది" అన్నాడు హేళనగా.

"బేడ కాఫీకి ఈగలు కాకపోతే ఏనుగు లొస్తాయటండీ?" అన్నాడు సర్వరు. ★

హోటల్లో జనం పల్చగా వున్నారు. సర్వరు మిత్రులతో కబుర్లు చెబుతున్నాడు. "అదిగో, ఆ మూల బల్ల మీద మీసాలాయన్ని చూశావా? బ్రహ్మ చెవుడులే. తమాషా చేస్తాను చూడు" అంటూ అతని దగ్గరకు వెళ్ళి "ఏరా మీసాల వెధవా. ఏం మింగదల్చుకున్నావు? గేదిలా ఉన్నావు. కాసేపు పిండి రుబ్బి పెట్టరాదూ?" అన్నాడు మెల్లిగా వినయం అభినయిస్తూ.

సర్వరు మిత్రులంతా విరగబడి నవ్వారు.

"ఓ కప్పు స్ట్రాంగ్ కాఫీ, కాసిని మంచినీళ్ళూ పట్రా... ఇదిగో చూడబ్బాయ్. చెవుడు నాక్కాదు మా అన్నయ్యకి" అన్నాడు మీసాలాయన మృదువుగా. ★

ఒక మధ్యతరగతి మహారాజు పెద్ద హోటలులోకి జొరబడ్డాడు.

"అబ్బాయీ-నా దగ్గిర ఒక్క బేడకాసుంది. అంతే, దానికేం వస్తుందో చెప్పు" - అన్నాడు సర్వరుతో.

"అది సత్తుది కాపోతే చిల్లర వస్తుంది!" - అన్నాడు సెర్వరు. ★

హోటల్లో భోజనం చేస్తున్న ఒక పెద్దమనిషి "సెర్వరూ యిలా రా. నేనడిగేది వెయ్యకుండా ఆ మూలకూర్చున్న వాణ్ణి పందికొక్కులా మేపుతున్నావు కదూ, మేనేజర్ని పిలూ నీ పని చెప్తా" అన్నాడు.

"వారేనండి మేనేజరుగారు" అన్నాడు సెర్వరు అంతర్ధానమవుతూ. ★

ఒక పూటకూళ్ళమ్మ చిన్న మిళ్ళి గరిటెలో మైనం మెత్తి మరీ వడ్డించేది నెయ్యి. ఈ వరసచూసి విసుగెత్తిన ఆసామి, ఒక రోజు సంజవేళ భోజనానికూ్కచుని ఆమె నెయ్యి వడ్డించగానే. "అమ్మా దీపం పట్రా వోసారి" అన్నాడు కంగారుగా. ఆవిడ దీపం దగ్గరగా తెచ్చి. "యేం పడింది నాయనా?" అంది.

"అబ్బే, ఏదో ఇట్టె మెరిస్తే జెర్రిపిల్ల అనుకున్నాను. నేచ్చుక్క గాబోల్లెండి" అన్నాడు. ★

గారడీ వాళ్ళకి ఆ విద్య విసుగేస్తే హోటళ్లలో సెర్వర్లుగా వస్తారు; వీళ్ళకిది విసుగేస్తే అందులోకి పోతారు. అందువల్లనే సెర్వర్లు ఇరవైఐదు ప్లేట్లు టిఫిను, పది కప్పుల కాఫీ ఒక్కసారి పట్టుకుని అవలీలగా వాటిని బాలెన్స్ చేస్తూ వస్తారు. ★

ఒక సెర్వరు ఒక ప్లేటులో ఒక పెసరట్టు పెట్టి అందుమీద రెండో చెయ్యి వేసి పెట్టి, పట్టుకు వస్తున్నాడు. తినబోయే పెద్ద మనిషి విస్తుబోయి "అదేవిటయ్యా తినే దాని మీద అరచెయ్యి పెట్టి పట్టుకొస్తావు" అన్నాడు.

"మళ్ళీ కిందపడిపోకుండానండీ" అన్నాడు సర్వరు. ★

"ఈసరయ్య హోటల్లో ఈ మధ్య కాఫీ, భోజనం చాలా సజావుగా వుంటోందేవిటోయ్?".....

"దానికి చాలా కథుందిలే. కొత్త మేజిస్ట్రీటుగారు లోగడ ఇక్కడ చదూకుంటున్న రోజుల్లో ఈసరయ్య హోటల్లో తిండి తినేవాట్ట. ఇప్పుడు మేస్ట్రీటుగా వచ్చాక మొన్నేదో కేసులో ఈసరయ్య దొరికాడు. పూర్వపు విశ్వాసం కొద్దీ మేస్ట్రీటుగారు అతన్ని ఖైదులో వేయించినా భోజనం, కాఫీ ఫలహారాలూ మటుకు అతని హోటల్నించే కొని పట్టుకెళ్ళి పెట్టాలని తీర్పు చెప్పాడు. విడుదలై వచ్చినప్పట్నించీ వంటలు మార్పించేశాడు ఈసరయ్య." ★

మహాపురుషుడు ఐన్స్టీన్ను యెరగనివారు చూస్తే ఆయన ప్రతిభను ఏమాత్రం పోల్చుకోలేరు. గొప్ప వాళ్ళందరిలాగే ఆయనా వెర్రివాడిలా వుంటాడు. ఒకసారి ఆయన హోటలుకు వెళ్ళాడు. మెనూ కార్డు (ఫలహారాల విషయానుక్రమణిక) చదవబోయి కళ్ళజోడు లేదని గుర్తుకొచ్చి, వెయిటర్ను పిలిచి "నువ్వే చదువు, వింటాను" అన్నాడు.

వెయిటర్ అటూ యిటూ చూసి కొంచెం వంగి "నాకూ మీలాగే చదువురాదండీ" అన్నాడు. ★

ఒక పెద్దమనిషి హోటల్లో సుష్టుగా మేసి డబ్బివ్వకుండా జారుకున్నాడు.

"పాపాత్ముడు. ఎక్కడికి పోతాళ్ళేండి. దేవుడు వాడికి తగ్గ శిక్ష వెయ్యకపోడు" అన్నాడు మేనేజరు జనాంతికంగా.

"వేరే యింకా శిక్షేమిటి. తిన్నదే శిక్ష. ఇప్పుడు తిన్నదే వాణ్ణి పట్టి హతమారుస్తుంది లెండి" అన్నాడు బిల్లు చెల్లించవచ్చిన యింకో ఆసామి. ★

చెన్నపట్నంలో జనసమ్మర్దం విపరీతంగా ఉండేది ఒకప్పుడు. (ఇప్పుడూ అంతే; ఎప్పుడూ యింతే) ఒక మనిషి భోజనం చేస్తూ వుంటే వెనకనే పదిమంది క్యూలో నిలబడేవారు. ఆ సందర్భాన్ని చూపిస్తూ ఒక పత్రిక కార్టూన్ వేసింది. దానికి శ్రీశ్రీ వ్రాసిన వ్యాఖ్య:

కాలే కడుపుకు కూడా

క్యూలే దిక్కయ్యేరన్న గువ్వల చెన్నా ★

సుబ్బారాయుడు సూటూ బూటూ హేటూ బనాయించి దర్జాగా హోటలు కెళ్ళి కూచుని స్వీటూ హాటూ యింకోహాటూ, కాఫీ ఇంకో మాటూ ఆరగించి బ్రేవుమని తేన్చి సిగరెట్టు ముట్టించి సెర్వరు వీర్రాజు బిల్లు తేగానే చిరునవ్వి కన్నులరమోడ్చాడు. "వీర్రాజూ, నీకు జ్ఞాపకం ఉందిటోయ్? ఆర్నెల క్రితం నే నిలాగే ఓసారి వచ్చి సుష్టుగా కాఫీ టిఫిన్లూ పుచ్చుకున్నాను. జేబులో డబ్బుల్లేవు. అప్పుడు ఆపళాన నువ్వు నా మెడమీద చెయ్యేసి గుమ్మందాకా నెట్టుకొచ్చి మురిక్కాలవలోకి ఒక్కతోపు తోశావు-గుర్తుందా?" అన్నాడు హుందాగా.

వీర్రాజు సిగ్గుపడి, నీళ్ళు నమిలి. "చిత్తం. ఏదో అప్పట్లో పొరబాటయిపోయింది" అన్నాడు.

"ఆ తప్పేముందిలే. ఇప్పుడు మళ్ళీ ఓసారి అలాటి సందర్భం వచ్చేట్టుంది. చూడు ఈసారి కాలవలోకి తొయ్యకేం. కాస్త అసుంటా తొయ్యి." ★

ఒకాయన హోటలుకొచ్చి నాలుగు గ్లాసులు మంచినీళ్ళు తాగి వెళ్ళబోబోయాడు.

"అదేవిటండి. మంచినీళ్ళు తాగేసి అలా చకచకా వెళ్ళిపోతారు!".... అన్నాడు మేనేజరు విసుగ్గా.

"బావుందయ్యా. కాఫీ తాగితే అడిగినా బావుందిగాని. నీళ్ళుతాగి కూడా ఎక్కడ డోకమంటావయ్యా?" ★

"ఏదేమిటోయ్ కాకరకాయ కూరన్నావ్....తియ్యగా వుందేం?"

"అది అరిటికాయ కూరండి."

"అరిటికాయైతే చేదుగా తగలడిందేం?" ★

"మీరిచ్చిన నోట్లలో దొంగనోట్లు రెండు కలిసొచ్చేశాయండ...." అన్నాడు హోటలు మేనేజరు.

"మీరు పెట్టిన తిండీ అంతేగా! చాలా కల్తీ వుంది" అన్నాడు నెలవారీ అతిథి. ★

రంగయ్య హడావుడిగా లోపలికొచ్చి "మళ్ళీ రభస ప్రారంభం కాకుండానే రెండిడ్లీ....ఓ పెసరట్టూ పట్రా. ఓ కాఫీ కూడా తే." అన్నాడు.

మారుమాటాడకుండా తెచ్చినవి భోంచేసి త్రేన్చాడు.

"రభస అన్నారు. ఎక్కడా.... ఏమిటీ?" అన్నాడు ప్రొప్రయిటరు ఉత్సాహంగా.

"అదే....నా దగ్గర ఇప్పుడు కానీ లేదని చెప్పేస్తున్నానుగదా. బిల్లు గురించి రభస జరగదూ?" ★



సర్వరుతో ఒకడు: ఏమిటయ్యా.... ఈ ఇడ్లీలు రోజురోజుకీ చిక్కి శల్యమైపోతున్నాయి?

సర్వరు: అబ్బే మీకు వూరికే అలా అనిపిస్తోంది. హోటలు ఈ మధ్య పెద్దదై పోతోంది కదండీ. అందుకని ఇడ్లీలు చిన్నవైనట్టుగా కనిపిస్తున్నాయి, అంతే. ★



"బాబాయ్, యివాళ మా కాలేజీలో నాకు రెండు బహుమతులు వచ్చాయి" అన్నాడు భావిపౌరుడు.

"దేనికోయ్"

"ఒకటి జ్ఞాపక శక్తికి, రెండోదేమో....అదేమిటీ....అదేదో.... గుర్తుకు రావటంలేదు బాబాయ్." ★

అద్దె వసూలు కోసం యింటాయన రాగానే కోనేటిరావు మండిపడ్డాడు.

"చూడండి, రాత్రి వర్షాని కిల్లంతా కోనేర్లై... చెరువై పోయింది. ఇలా ఎన్నాళ్ళు?" అంటూ దులిపేశాడు.

"బావుంది. వర్షాలెన్నాళ్ళో చెప్పిందికి నేనేం వెదర్‌బ్యూరో పెట్టాననుకున్నారా? సోది చెప్పగలననుకున్నారా? నాకేం తెలుసు?" అన్నాడింటాయన. ★

ఇద్దరు తాతయ్యలు తమ తమ దారుఢ్యాల గురించి చెప్పుకుంటున్నారు.

"వయసు మీదున్నపుడెంతో, వయసు మీదపడ్డాక్కూడా అంత దారుఢ్యమూ ఉంది నాకు. అంతెందుకూ; అల్లదిగో ఆ గడియార స్తంభం చిన్నముల్లు మీద వాలిన ఈగ నా కంటికి స్పష్టంగా కనిపిస్తోంది. చూడండి." అన్నాడొక శతవృద్ధుడు.

శతాధికవృద్ధు చెవులు రిక్కించి విన్నట్టభినయించి

"నిజమే స్మండీ, అదిగో దాని అడుగుల సవ్వడి జేఘంటలా వినబడుతుంటేనూ. నిజమే మీ దృష్టి చెడలేదు" అన్నాడు. ★

ఆరడగుల పొడుగు, ఎకరం బాతిక ఛాతీ, గజమున్నర మీసాలూ వున్న భారీ రైతు సోదరుడు బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరుగారిని చూడడానికి వానలో తడిసివచ్చాడు. ఆఫీసరుకు కోపం వచ్చినా ఆ పెద్దమనిషిని చూసి తమాయించుకున్నాడు. "విలేజి బ్రూట్స్" అని గొణుక్కున్నాడు.

"కనీసం బురద గొట్టిన ఆ జోళ్ళు గుమ్మం దగ్గిర విడిచి రారాదా?" అన్నాడు గదంతా బురదమయం చేసిన వెంకటేశ్వర పాదరక్షలు చూస్తూ.

"జోళ్ళా, జోళ్ళేందయ్యోవ్, నేను జోళ్ళు తొడుక్కోందే" అన్నాడు రైతు సోదరుడు ఆశ్చర్యంతో. ★

కెప్టెన్ ఓడమీంచి తూలిపడిపోయాడు రాత్రి వేళ సముద్రంలోకి. ఒక నావికుడు తాడు విసిరి అతన్ని పైకి లాగాడు.

"తెల్లవారగానే పెరేడ్‌లో అందరి ముందు నీకు కృతజ్ఞత తెలుపుకుంటాను. చాలా థాంక్సు" అన్నాడు కెప్టెన్.

"అంత పని మాత్రం వద్దు. ఈ సంగతి తెలిస్తే మిగతావాళ్ళంతా నన్ను సముద్రంలోకి తోసేస్తారు" అన్నాడు నావికుడు. ★

ఒక బస్తీలో పోలీసు అధికారి దొంగనోట్లు పట్టుకున్నట్టు రాజధానిలో పై అధికారికి వ్రాశాడు. వెంటనే వాటిని పంపవలసిందని ఉత్తర్వు వచ్చింది.

ఒక వారం తరువాత ఇంకో ఉత్తరం వచ్చింది. "మీరు పట్టుకున్న దొంగనోట్లు యింతవరకూ ఎందుకు పంపకుండా వుంచుకున్నట్టు? ఇకనైనా వెంటనే పంపండి" అని.

బస్తీ ఉద్యోగి ఆశ్చర్యపడి జవాబు రాశాడు.

"నేను వారంరోజుల క్రితమే వాటిని మీ పేర మనియార్డరు ద్వారా పంపి ఉన్నాను. ఇంతవరకూ మీకు అందకపోవడం వింతగా ఉంది. నేనే పోస్టాఫీసుకు ఫిర్యాదు చేస్తున్నాను" ★

"వెబ్స్టర్స్ డిక్షనరీ (నిఘంటువు) చూశావోయ్..." అన్నాడొకడు మిత్రుడితో.

"ఆ ఎందుకు లెస్తూ. ఓపికలేదు. యెలాగా సినిమా వస్తుందిగా అప్పుడు చూసేస్తే సరి" అన్నాడు చిత్రాలద్వారా సాహిత్యమధువు పీల్చేస్తున్న ఒక ప్రేక్షక భ్రమరుడు. ★

అమెరికాలో ఒక పెట్రోలు కంపెనీ యజమాని బ్యాంకుకు చెక్కు రాసి పంపాడు.

"అంతడబ్బులేదు." అని వ్రాసి చెక్కును తిరిగి పంపింది బ్యాంకు.

ఇంధనస్వామి మండిపడేలోపల, "డబ్బులేనిది మీ ఖాతాలో కాదు. మా దగ్గిర" అని విన్నవించుకున్నాడు బ్యాంకుమనిషి వచ్చి. ★

అమ్మగారు పనికుర్రాణ్ణి మందలించింది. "వెధవా, అలా చప్పున తలుపు తోసుకు నా గదిలోకి రాకూడదు. ఒకవేళ బట్టలు కట్టుకుంటున్నానుకో. అందుచేత ముందర పిలవాలి"

"ఎందుకండీ! తలుపుసందులోంచి ముందరే సూత్తానుగా" అన్నాడు కుర్రాడు. ★




కేసు పునర్విచారణ కోరారు లాయరుగారు.

"ఏం? ఏమొచ్చింది?......" అన్నాడు జడ్జి.

"మా క్లయింటుకి మళ్ళీ ఓ పెద్ద మనియార్డ రొచ్చిందట." ★

క్లయింటుని అడగవలసినవన్నీ అడిగి విషయం తెలుసుకున్నారు ప్లీడరుగారు.

"అయితే కేసు పట్టుతున్నాను. చాలా పాయింట్లున్నాయి."

"గెలుస్తామంటారా?" అన్నాడు క్లయింటు.

"నిస్సందేహంగా, నువ్వు నిర్దోషివని రుజువు చేసే భారం నాది. గెలుపు ఖాయం. చెప్పవలసిన విషయాలన్నీ చెప్పావుగా దాపరికం లేకుండా?"

"ఆహా. అన్నీ చెప్పానండీ – ఒక్క ఆ డబ్బు కప్పెట్టిన చోటు తప్ప." ★

సాక్షిని పరీక్షిస్తున్నాడు లాయరు.

"ఏ వూరు నీది."

"ఎవరిదీ - నాదేనా - "

"ఆ నీదే"

"దౌళేసరం"

"ఏం పనిచేస్తావు?"

"ఎవరూ నేనా?"

"ఆ నువ్వే"

"తల పని చేస్తా"

"నీ కెన్నేళ్ళు?"

"ఎవరికీ నాకా?"

"అబ్బే కాదు నాకు" అన్నాడు లాయరు మండిపడి.

"మీ కంటారా, ఏం, నలభైదాటి యాభయ్యో పడిలో పడుందరూ?" ★

"అయితే ముద్దాయి నిన్ను విద్వేషోద్రేకాలతో కొట్టాడన్నమాట."

"కఱ్రతో కొట్టిండని చెబితే నీగ్గాదయ్యా.... ఆ మాయదారి మాటలు మనకొద్దు" ★

ఉభయ పక్షాల వాదాలు విని మేజిస్ట్రేటు వాటిని సమీక్షిస్తూ ఇలా అన్నారు.

"రామయ్యకి సూరయ్య వందరూపాయలు చేబదులిచ్చానంటాడు. అందుకు పదిమంది సాక్షులున్నారు. ఆ బదులు తీర్చగా చూసినట్లు సూరయ్య తరపున పదిహేను మంది సాక్ష్యం చెబుతున్నారు...."

రామయ్య మండిపడ్డాడు. "అయ్యా మేజిస్ట్రేటుగారూ, ఆ సూరయ్య చెప్పేది అబద్ధం, వాడి సాక్షులు చెప్పేది అబద్ధం. అది రుజువు చేసేందుకైనా నిజం చెప్పేస్తా వినండి. నేను నా జన్మలో వాడికి నూఱ్రూపాయలు బదులివ్వలేదు." ★

ఖూనీ కేసులో సాక్షిని పరీక్షిస్తున్నాడు లాయరు.

"మీరు ఆ ఇంట్లో సరిగ్గా అయిదు నిముషాలున్నానన్నారు. మీ దగ్గర వాచీ లేదు... మీ వూహ అంచనా తప్పు కావచ్చు. యిప్పుడు చూదాం. ఇదిగో నేను నా జేబు గడియారాన్ని చూస్తూ వుంటాను. సరిగ్గా అయిదు నిముషాలు కాగానే చెప్పండి. చూద్దాం."

సరిగ్గా అయిదు నిముషాలు కాగానే." అయిదు నిముషాలు అయింది" అన్నాడు సాక్షి.

కేసు పోయింది. లాయరు దిగాలుపడినా తరువాత కోర్టు బయట సాక్షిన్ని కలుసుకొని యధాలాపంగా అడిగాడు "మీరు అంత ఖచ్చితంగా ఐదు నిముషాలు కాగానే ఎలా చెప్ప గలిగారండీ" అని.

"దానికేముందీ. సరిగ్గా కోర్టు హాల్లో మీ వెనకాలే గోడగడియారం వుంది గదా" అన్నాడు సాక్షి. ★

టైపురైటరు దొంగిలించాడన్న నేరాన్ని ముద్దాయి ససేమిరా ఒప్పుకోలేదు. చివరికి ప్లీడరు విసుగెత్తి ఆ టైపు రైటరు తెప్పించి ముద్దాయి ఎదుట పెట్టాడు.

"ఇది నువ్వెత్తుకు రాలేదూ?" అన్నాడు.

"అరి మీ. ఇదా మీరడిగేది. ఇది టైపు మెషినా. గల్లా పెట్టి అని ఎత్తుకొచ్చా గదండీ. నాకేం తెల్సూ?" అన్నాడు దొంగ. ★

లాయరు : ముద్దాయి అంటుండగా నువ్వు విన్న మాటలన్నీ కోర్టు వారికి చెప్పు.

సాక్షి : శా. బాగోదండి. అయన్నీ పెద్దమడుసు లినాల్సిన మాటలు కావు.

లాయరు : సరే జడ్జిగారి చెవిలో మెల్లిగా చెప్పు. ★

ఒక కేసులో పోలీసు యించుమించు యింతగానూ న్యాయాధికారిని మన్నన చేశాడు.

"... ముద్దాయి నోటికొచ్చిన మాటలన్నీ కూస్తున్నాడండీ. వెంటనే నువ్వు పెద్దమనుషుల మధ్య ఉండతగ్గ వాడవు కావని చెప్పి మీ దగ్గిర కీడ్చుకొచ్చానండి" అని నివేదించాడు. ★

"సుబ్బారావుగారి పని బాగున్నట్టుందే. మంచి రోరింగ్ ప్రాక్టీసు చేస్తున్నారుటా"

"ఆ ఆ. రోరింగే ప్రాక్టీసు చేస్తున్నారు." అన్నాడు అదీ రాని ప్లీడర్ల లీడరు. ★

నిజానికి లాయరు పైకొచ్చి రోరింగు ప్రాక్టీసు చెయ్యగలగాలంటే, ముందర రోరింగు (అరవడం) సాధన చెయ్యడం అవసరం. లాయర్లు కొత్తల్లో పడే అవస్థ ఇంతా అంతా కాదు. ★

కేసు గెలిస్తే ముద్దాయి మరి పత్తా దొరక్కుండా పోతాడు ఫీజు ఎగేసి. ఓడితే అడిగే దమ్ములు లాయరుకీ ఉండవు. ఇచ్చే సరదా క్లయింటుకీ ఉండదు.

పోనీ అని-ముందరే ఫీజు తేవయ్యా అంటే, "ముందు డబ్బిస్తే నువ్వేవిటి అల్లాడి కృష్ణస్వామి గారే వాస్తారు" - అంటాడు. ★

లాయరు జడ్జితో : యువరానర్, మా తరపున సాక్షులిద్దరూ రాలేదు. కేసు వాయిదా వెయ్యాలని కోరుతున్నాను.

జడ్జి : అరుగో మీ సాక్షులిద్దరూ ఇప్పుడే వచ్చారు.

లాయరు : అయినా వాయిదా కోరుతున్నాను. వీళ్ళు రామని ప్రమాణం చేసి వచ్చారు. ★

కేసు విచారణ ఆరంభిస్తూ "అన్నట్టు మన కథానాయకుడేడి?" - అన్నాడు ప్రాసిక్యూషన్ లాయరు.

"దొంగవెధవండి. పది నిముషాలక్రితమే తెలిసింది- ఖూనీ చేసింది వాడేనని. పో వెధవా అన్నాను. పారిపోయాడు!" అన్నాడు ముద్దాయి తరపు ప్లీడరు. ★

లాయరు: చూడు, మొన్న ఆదివారం రాత్రి నువ్వు ఖూనీ జరిగిన చోటలేననీ, ఇంకో ఇంట్లో ఉన్నాననీ సాక్ష్యంతో రుజువు చేస్తే - నీకు జైలు తప్పిపోతుంది.

సుబ్బారావు: రైటేసార్. ఆ సంగతి నాకూ తెల్సు. ఆ రోజున లేను నిజంగా. ...నేనూ, మా సెక్రటరీ మిస్ మేరి ఊరిచివర రాదారిబంగాళాలో వున్నాం- ఆఫీసు పని చూసుకుంటూ. ఆ మాట చెప్తే మీరు వదిలేస్తారు. కాని, మా ఆవిడ పట్టుకుంటుందే-!? ★

"నరసింహారావుగారూ-కోర్టు విషయంలో వున్న లిటిగేషను చెప్పమంటారా? అబద్ధం చెబితే నరకం, నిజం చెబితే జైలు!" ★

మేజిస్ట్రేటు : ముద్దాయి నేరమేమిటి?

ప్రాసిక్యూటర్ : మంచాడే, కాని కెమేరా పిచ్చండి

మేజిస్ట్రేటు : అయితే... ఫోటోలు తీసుకునే పిచ్చివుంటే - అది నేరమెలా అవుతుంది?

ప్రాసిక్యూటర్ : ఫోటోలు కాదండి. కెమేరాలు తీసుకునే పిచ్చండి. ★

ఒక ఆసామి కారు ప్రమాదంలో దెబ్బతిన్నాడు. కాలుపోయింది. కర్రదున్నలు పెట్టారు.

మూణ్ణెల్లయినా అతను ఆ కర్రలు పట్టుకునే నడవసాగాడు - కట్లు అలానే ఉంచి.

"అదేమిటి? ఈ పాటికి నయమై పోయుంటుందే. కట్లువిప్పి ఆ కర్రలు కూడా పారెయ్యొచ్చుగా." అన్నాడొక మిత్రుడు.

"డాక్టరుగారూ అదే అంటున్నారు ఇవన్నీ తీసెయ్యొచ్చని. ప్లీడరుగారు ఒప్పుకోటం లేదింకా." ★

"డాక్టర్, మంచినీళ్ళకు వెళ్ళి వస్తూండగా మంచం కోడు తగిలి కాలు బెణికింది. ఏం చెయ్యమంటారు?" అడిగారెవరో ఫోనులో.

"కుంటండి" అన్నాడు డాక్టరు మండిపడి.

"అలాగేనండి. అర్ధరాత్రిగదా, ప్రస్తుతానికి నిద్రపోతాను. రేప్పొద్దున్న మీ సలహా పాటిస్తా వీలైతే." అన్నాడు ఇవతలి మనిషి తొణుకూ బెణుకూ లేకుండా.

మర్నాడు డాక్టరుగారు ఒక పెళ్ళికి వెళ్ళారు. అక్కడ లాయరు మిత్రుడు కనిపించాడు. మాటల సందర్భంలో ఈ వైనాలన్నీ చెప్పి. "ఇలాటి వాడికి బిల్లు పంపాననుకోండి ఫోను చేసినందుకు దావా వేస్తే డబ్బొస్తుందంటారా?"

"నిక్షేపంలా. బిల్లు పంపండి. వృత్తిరీత్యా మీరు చెప్పే ప్రతి మాటకీ డబ్బు పుచ్చుకోవలసిందే." అన్నాడు లాయరు.

మర్నాడు ఉదయం డాక్టరుగారికి ఒక బిల్లు అందింది. నిన్నటి సలహాకి లాయరుగారి ఫీజు బిల్లు అది. ★

"మిమ్మల్నిలా చితక్కొట్టిన వాడి రూపురేఖలు ఎలా వుంటాయో కాస్త వర్ణించి చెప్పగలరా?"

"భలేవారే. ఆ పని చేసినందుకే కొట్టాడండి... మళ్ళీ వర్ణిస్తే." ★

"నిందితుడు నిర్దోషి అని జూరీ అభిప్రాయ పడింది" అన్నాడు న్యాయమూర్తి.

"అంటే?" అన్నాడు ముద్దాయి.

"నువ్వు దొంగవు కావుట. నిన్ను విడుదల చేస్తున్నాను"

"అంటే ఆ నగల మూట ఇవ్వక్కర్లేదా?" అన్నాడు ముద్దాయి. ★

"నీ తరపున వాదించడానికి లాయర్ని పెట్టుకోవా?" అన్నాడు న్యాయమూర్తి విచారణ ఆరంభిస్తూ.

"అక్కే ఎందుకండీ. నే నెలాగా నిజం చెప్పేద్దామనుకుంటున్నాను. లాయరెందుకూ?" అన్నాడు ముద్దాయి. ★

కోర్టుతో జోస్తి జాస్తీగా ఉన్న ఒక ముద్దాయి లాయర్లు వాదించే పద్ధతులు చూసి చూసి ఒకసారి తన తరపున తనే వాదించబోయాడు.

"నువ్వు బ్యాంకులో దొంగతనానికి వెళుతుండగా చూసినట్టు ఈయన సాక్ష్యం" అన్నాడు ప్రాసిక్యూటరు.

"ఏవయ్యా సాక్షి, నేను బ్యాంకులో కెళుతుండగా నువ్వు చూశావా?" అన్నాడు దొంగ.

"అవును చూశాను"

"మళ్ళీ తిరిగి యివతలకి వస్తూండగా చూశావా?"

"లేదు"

"చూశారాండి. సాక్షి ప్రకారం నేనింకా అక్కడే ఉన్నానన్న మాట. కాని నిజానికి ఇక్కడే ఉన్నాను గదా. ఈ కేసు అబద్ధం అన్నమాట" అన్నాడు దోషి. ★

"నీ జన్మలో ఎక్కడేనా ఓ రూపాయి డబ్బులు గడించిన పాపాన పోయావూ?" అని గర్జించాడు లాయరు.

"చిత్తం. కిందటేడు మీరు ఎలక్షనుకి నిలబడ్డప్పుడు ఓటివ్వడానికి మీ దగ్గర అయిదురూపాయలుచ్చుకున్నా గదండీ." ★

# మాయాబజారు

"ఈ వాచీ కొన్నధర వంద రూపాయలండీ. ఆ ధరకే అమ్మేస్తాను. నా కొట్లో గడియారాలన్నీ అంతే"

"మరయితే మీకు లాభం మిగలొద్దూ?"

"అమ్మకంలో ఏం వుండదు. రిపేరు కొస్తుందిగా; అప్పుడు లాభం రాబట్టుకోవాలి." ★

"పది రూపాయల సరుకు కొంటే నూటికి పదివంతులు డిస్కోంటు ఇస్తామండీ. ఇరవై రూపాయలకి నూటికి ఇరవైవంతులు తగ్గిస్తాం...." అన్నాడు దుకాణదారు ఉత్సాహంగా.

"నూటికి నూరుపాళ్ళు డిస్కోంటు ఇవ్వడానికి ఎంత సరుకు కొనాలి?" అన్నాడు కొనబోయినవాడు. ★



ఒక పెద్దీ వ్యాపారస్తుడి దగ్గర కొలువుకి వచ్చాడు ఒక గుమాస్తా.

"నూటికి పన్నెండు రూపాయల మీద అప్పిచ్చాం అనుకోండి ఆరువందలు. ఏడునెలల కెంత అవుతుంది; లెక్కకట్టండి చూదాం" అన్నాడు యజమాని.

"చిత్తం. అప్పు పుచ్చుకొనేవాడు చదువుకున్నవాడా? చదువుకోని వాడా? అది చెబితే దాన్నిబట్టి...."

"లెక్క చెయక్కర్లేదు. ఇవాళే పనిలో చేరండి" అన్నాడు యజమాని తృప్తిగా. ★

"నాయనా; నేను వృద్ధికి రావడానికి రెండే ముఖ్య సూత్రాలు పాటించాను. ఒకటి నిజాయితీ, రెండోది వివేకం" అన్నాడు లక్షలార్జించిన వృద్ధ వర్తకుడు కొడుకుతో.

"అంటే?"

"నువ్వు ఒకరికి ఒక సరుకో డబ్బో ఏదో ఒకటి ఇస్తానూ అంటే అన్న ప్రకారం అన్న వేళకి ప్రళయం వచ్చినా సరే దివాలా ఎత్తినా సరే అది అందచేసి మాట నిలబెట్టుకోవడం నిజాయితీ అన్నమాట"

"రెండోది"

"అసలు చచ్చినా సరే మాట ఇవ్వకపోవడం వివేకం" ★

"ఏవండీ. ఈ హేరాయిల్ మంచిదేనా? జుట్టు బాగా పెరుగుతుందా?"

"ఏవిటిసార్ అలా అంటారు. మొన్న ఓ సీసామూత విప్పి కొంచెం రాసుకోబోయాను. ఒలికి దువ్వెన మీదపడింది. ఇంకో గంటలో ఆ దువ్వెన బ్రష్షుగా మారిపోయింది. ఇదే చూడండి" ★

దీపావళికి ప్రత్యేక ధరలు, ఆలసించిన ఆశాభంగం. నేడే కొనండి – అని ఎడతెరిపిలేకుండా అరుస్తున్నాడు గుడ్డలకొట్టు గుమాస్తా.

"ఏమిటోయ్ ఆ హైరాణ. దీపావళి దాటిపోతే ఏమవుతుంది? ధరలు పెంచేస్తారా?"

"లేదు సార్. ధరలు పడిపోతాయి.... తొరపడండి. దీపావళి ధరలు. నేడే కొనండి. ఆలసించిన....." ★

ఒకాయన కొత్తగా ఒక ఫ్యాన్సీషాపు పెట్టాడు. అమ్మకం దగ్గిర అదివరకెక్కడా అనుభవంలేని కొత్తవాణ్ణి గుమాస్తాగా పెట్టాడు. ఒకరోజున షాపు యజమాని ఏదో అర్జంటు పనివుండి బయటికి వెడుతూ గుమాస్తాకు షాపు అప్పగించి వెళ్ళాడు. తిరిగి వచ్చేలోగా గుమాస్తా ఒక చిన్న ప్లాస్టిక్ కారును ఎవరికో అమ్మి యజమాని రాగానే ఆ సంగతి చెప్పాడు.

"ఈ ప్లాస్టిక్ కారు పదిహేను పైసల కమ్మావా? నీకు బుద్ధుందా లేదా?" అని యజమాని గర్జించాడు.

గుమాస్తా హడిలిపోతూ "అవునండి. దానికి కట్టిన చీటీమీద పదిహేను పైసలనే ఉందండి." అన్నాడు.

"నీ మొహం పదిహేను పైసలు కాదు, పదిహేను రూపాయలు. సరిగ్గా చూడద్దూ? నీకు కళ్ళులేవూ?" అంటూ అరగంటసేపు తిట్టాక శాంతించాడు. "పోన్లే. ఎలాగూ మనకు ఐదుపైసలు లాభం వచ్చిందనుకో. ఐనా, ఇలాంటి పొరపాటు యెప్పుడూ చెయ్యకు" అని నెమ్మదిగా మందలించాడు. ★

ఒక వ్యాపారస్థుడు, అతని కంపెనీ మేనేజరూ కలిసి ఒక కంపెనీ పెట్టి కొత్త వ్యాపారం ఆరంభించ నిశ్చయించి ఒప్పందం వ్రాసుకున్నారు. వ్రాత కోతలు ముగిశాక మేనేజరు తన భాగస్వామికి ఒక సలహా చెప్పాడు.

"చూడండి. నేను మీ దగ్గర గుమాస్తాగా చేరి మేనేజరుగా వచ్చి ఇప్పుడు భాగస్వామినయ్యాను. ఈ పదేళ్ళూ నేను మీకు చేసిన రకం దగా మళ్ళీ మనకింకెవడూ చెయ్యకుండా జాగ్రత్త పడాలి. కొత్త మేనేజర్ని వేసినపుడు అది చూసుకోండి." ★

"జుత్తు ఒత్తుగా పెరగడానికి దీన్ని మించిన హేరాయిలు లేదండి."

"నిజమేనా? మీ మాట నమ్మొచ్చునంటారా?"

"కావలిస్తే కనుక్కోండి. మీ వీధిలో ఒకావిడ నిన్న సీసా కొంది. కార్కు మూత ఊడిరాక పళ్ళతో పీకిందట. అంతే, కాస్త నూనె తుళ్ళింది కామోసు. క్షణంలో జహంగీరు మీసాలొచ్చేశాయి." ★

## ఎత్తి పొడుపులు

"ఆహా, కోట్లార్జించినా - శ్రీమంతులైనా మీలో ఆవంతకూడా మార్పులేదండీ. నాడెంతో నేడూ అంతే!" అన్నాడు పాతమిత్రుడు.

"మార్పులేకేం. పూర్వం నేను పొగరుబోతుని. ఇప్పుడు నాది ఆత్మవిశ్వాసం. లోగడ మొండి రాస్కెల్ని, ఇపుడు చిత్తశుద్ధి-దృఢసంకల్పం గలవాడిని. ఆ మధ్య జడ్డివెధవని. ఇపుడు సజ్జనుడిని. లోగడ నోరు విప్పితే అవాకులూ - చవాకులూ దొర్లేవి. ఇప్పుడు చాలా చమత్కారంగా.... సరసంగా మాట్లాడుతున్నాను."-అన్నాడు శ్రీమంతుడు. ★




రచయిత ఆస్కార్ వైల్డ్‌కీ, చిత్రకారుడు విజ్‌లర్‌కీ ఒక్కక్షణం పడేది కాదు. 'మాటలాట'లో తన చమత్కారాలన్నీ వైల్డ్ నూరుకు తాగేస్తాడని విజ్‌లర్‌కి చిరాగ్గా ఉండేది. ఒకసారి విజ్‌లర్ చక్కని చమత్కారం ప్రయోగించాడు.

"అద్భుతంగా ఉంది ఇది నాకే తట్టి ఉండకూడదా - అనిపించేటంత బావుంది" అన్నాడు వైల్డ్.

"తడుతుంది వైల్డ్, తడుతుంది. ఇప్పుడు విన్నావుగా. ఇంకాసేపటికి తడుతుంది." అన్నాడు విజ్‌లర్. ★

## వెరీ సింపుల్

షెర్లాక్ హోమ్స్ : మైడియర్ వాట్సన్ నీ కుడితొడమీద పుట్టుమచ్చ వుంది.
వాట్సన్ : అరె... ఎలా కనిపెట్టారు సార్?
షెర్లాక్ హోమ్స్ : వెరీ సింపుల్ మైడియర్ వాట్సన్. నువ్వు ప్యాంటు తొడుక్కు రావడం మరిచి పోయావు! ★

## ఎందరో మహానుభావులు

జార్జిమూర్ అనే ఐరిష్ రచయిత ఎనభయ్యో ఏట గూడా దృఢంగా, ఆరోగ్యంగా, నిర్విచారంగా వుండేవాడట.

"మీ ఆరోగ్యానికి కారణమేమి?"టని ఒకరు అడగ్గా దానికి మూర్ సమాధానం

"నాకు తాగుడు అలవాటు లేదు, స్త్రీ వ్యసనం లేదు, చుట్టకూడా అలవాటు లేదు - పదకొండేళ్ళు వచ్చేవరకు!" ★

ప్రసిద్ధ బ్రిటిష్‌చిత్రకారుడు విజ్‌లర్ చిత్రపటం ఒకటి చూసి, ఒక ఉన్నత కుటుంబిని చీదరించుకుంది. "ఛీ.... ఆ గుడ్డలు విప్పివేస్తున్నట్టున్న ఆడదాని బొమ్మ మీరు వెయ్యడం బాగులేదు. చాలా అసభ్యంగా ఉంది." అంది.

విజ్‌లర్ మందహాసం చేశాడు. "అమ్మా! అవినీతి.... ఆసభ్యత వస్తువులో ఉండవు - దృష్టిలో తప్పు. అది గుడ్డలు విప్పివేస్తున్న స్త్రీ బొమ్మ అని మీరెందుకనుకోవాలి? గుడ్డలు కట్టుకుంటున్న స్త్రీది కాకూడదా!" అన్నాడు. ★



## పసి మనసు

ఆవాళ నవంబరు 14వ తేదీ నెహ్రూగారి పుట్టింరోజు. ఆయన పొద్దున్న చాలాసేపు ఢిల్లీ బాలబాలికలతో కాలక్షేపం చేశారు. పిల్లలంతా వెళ్ళిపోయాక నెహ్రూగారు సెక్రటరీతో – "ఇవాళొక కుర్రాడేం చేశాడో తెలుసా?" అన్నారు.

"ఏం చేశాడు?"

"నన్ను వెక్కిరించాడు"

సెక్రటరీ నిర్ఘాంతపోయి "ఎవడా కొంటివెధవ?" అన్నాడు.

"అప్పుడు నేనేం చేశానో తెలుసా?"

"ఏం చేశారు?"

"మళ్ళీ వెక్కిరించాను!" – అన్నారు నెహ్రూగారు. ★

ఆధునికచిత్రకళ ఆదిమానవుడితోనే ఆరంభమైంది – పికాసో. ★

## గాడిదలే మంత్రులైతే

లింకన్ ప్రభుత్వంలో ఒకసారి మంత్రిపదవి ఒకటి ఖాళీ వచ్చింది. సెనెటర్స్‌లో చాలామంది తమతమ అర్హతలు వుదహరిస్తూ మెమోరాండాలు తీసుకువచ్చారు. వారందర్నీ కూచోబెట్టి యీ కథ చెప్పాడు లింకన్.

"అనగనగా నొకరాజు. ఆ రాజుకొక మంత్రి. రాజూ, మంత్రీ ఒకనాడు వాహ్యాళికి బయలుదేరుతూ వుండగా ఒక చాకలి ఎదురుపడి "ప్రభువు వారు అట్టేదూరం వెళ్లొద్దండీ; ఎందుకంటే వర్షం వస్తుంది –" అన్నాట్ట. మంత్రిగార్ని సలహా అడగ్గా "అదేంలేదు; పదండి వెళదాం" – అన్నాట్ట.

రాజూ మంత్రీ అలా కాస్సేపు వెళ్ళగానే వర్షం ప్రారంభమైంది. ఇద్దరూ నిలవ నీడలేని ఎక్కడో చెట్టుకింద చిక్కుపడి తడిశారుట.

మర్నాడు ఆ చాకలికి కబురు చేసి "నీకు వర్షం పడుతుందని ముందుగా ఎలా తెలిసింది?" – అని ప్రశ్నించేరుట రాజుగారు. "దానికే ముందండీ, మా గాడిద నడిగితే చెబుతుంది–" అన్నాట్ట చాకలి. "గాడిద ఎలా చెబుతుందయ్యా" అంటే, "ఆకాశం వేపు మోర ఎత్తి చూసి, తిరిగి దించేటప్పుడు చెవులు టపటపలాడిస్తే వానవచ్చేటట్టూ, ఊరికే దించేసి వూరుకుంటే వర్షం రానట్టూ..." అని భాష్యం చెప్పేట్ట చాకలి. గాడిదకి తెలిసినపాటి తెలియక పోయిందే.. అని మంత్రి మీద ఒకటే చిరాకు పడి, రాజుగారు మంత్రి స్థానే గాడిదని నియమించుకున్నారు."

"తరవాతేమైంది?" అన్నారు అభ్యర్థులు కుతూహలంగా.

"తరువాత యింకేముంది? అప్పట్నుంచీ ప్రతిగాడిదా తనకి మంత్రి పదవి యిప్పించమని అడగడం పరిపాటైపోయింది!" అన్నాడు లింకన్. ★

## స్వర్గ నరకాలు

షేక్స్పియర్ నాటకాలన్నీ బేకన్ రాశాడని వాదించే ఒకాయన మార్క్‌ట్వైన్‌ను ఆ వాదాలతో చాలాసేపు బాధించాడు.

"అయ్యా, ఇదిలా తేలేదికాదు. నేను స్వర్గానికెళ్ళాక షేక్స్పియర్‌నే కనుక్కుంటాను" అన్నాడు మార్క్‌ట్వైన్.

"హాహాహా. షేక్స్పియర్ స్వర్గంలో ఎలా ఉంటాడండీ?"

"ఓహో, అయితే మీరే కనుక్కోవచ్చు" అన్నాడు మార్క్‌ట్వైన్. ★



# కొస(మ)జోకులు

"నీ మొహం మీద ఆ నల్ల చుక్కేవిటి బాబూ?"

"పుట్టు మచ్చండి"

"అలాగా ఎన్నాళ్ళనించి వుందేం?" ★

## దృష్టిదోషం

ఒక కళాసృష్టి జరిగినపుడు:

రసికుడు: అందులో మంచినీ అందాన్నీ వెతుకుతాడు.

విమర్శకుడు: అచ్చుతప్పుల్ని - తతిమా దోషాల్నీ వెతుకుతాడు.

సెన్సారువాడు: బూతునే వెతుకుతాడు ★

## నిధి చాలా సుఖమే

పెళ్ళయిన మూడోనాడే జానకి భర్తకి తన మనసులో కోరిక చెప్పింది. "ఏవండీ - నేను బియ్యే పాసయ్యాను గదా - వుద్యోగం చేస్తే మీకేవన్నా అభ్యంతరమా?"

"బలేదానివే - అది నమ్ముకునే గదా నిన్ను కట్టుకున్నాను." ★

## ఆ-రంభ శూరులు

వక్త: ఆంధ్రుడికి ఉద్రేకం ఎక్కువని ఒకాయన కూశాడు.... ఎవడండీ - ఆ మాట అనడానికి....ఎవడా గాడిద కొడుకని. ఎవడు వాడు - అసలెవడూ అంట... వాడిని, వాడ్ని పట్టుకు చీరి పారేసి... కాకులకీ గద్దలకీ వేసి... కాదు, ఉప్పు పాతర్లో వేసి.. కాదు ఊర మిరప... ★

## ఏం శిశువా!

చర్చికి వందరూపాయలు విరాళం ఇస్తానని మాటిచ్చి పెళ్ళి జరిపించుకున్నాడు ఒకడు.

పెళ్ళికాగానే వెళ్ళిపోతున్న దంపతుల్ని పిలిచి విరాళం సంగతి గుర్తు చేశాడు ఫాదర్.

"డబ్బు కుదర్దయ్యా... ఈ కాస్త పనికి వంద కాదు, ఒక్క రూపాయిచ్చినా దండగే" అన్నాడు పెళ్ళికొడుకు.

"అంతేనంటావా-సరే అలాక్కానీ....చూడు, ఇవాల్టి నించీ పెళ్ళిళ్ళన్నీ ఫ్రీగా చేసి పెడతానులే - మీ అమ్మా నాన్న ఉంటే తీసుకురా - ముందు వాళ్ళ పెళ్ళితోనే ఆరంభిస్తాను కొత్త పథకం" అన్నాడు ఫాదర్. ★

## రాంగ్ నంబర్

భర్త: ఏం-ఇవాళ ఫోను అరగంటలోనే వదిలేశావు - కబుర్లకి టాపిక్ దొరకలేదా?

భార్య: అబ్బే - రాంగ్ నంబరు - సుబ్బాయమ్మగారి నెంబరు తిప్పితే ఎవరో వరహాలమ్మగారి నంబరు పలికింది. ముక్కూ మొహం తెలీని వాళ్ళతో కబుర్లేముంటాయి గనక. ★

## వినయ భూషణ్

వినయ భూషణుడికి ఎంత పొగరంటే తన పుట్టినరోజు పండగనాడు - తన తల్లిదండ్రులను అభినందిస్తూ టెలిగ్రాం పంపాట్ట! ★

## అదే ఓ కళ

"అయ్యా. బహు కుటుంబీకుడిని. దయచూసి ఏదోపని యిప్పించండి భార్య పధ్నాలుగు మంది పిల్లలూ."

"అదే - నీకు ఇంకే పనులొచ్చునో చెప్పు మరి-" ★

## పెంచు - ప్రేమించు

పనిమనిషి మళ్ళీ ట్రే పడేసి నాలుగు కప్పులూ సాసర్లూ పగలగొట్టి బిక్కమొహం పెట్టింది.

ఇల్లాలు: నీ జీతం పది రూపాయలయితే, నువ్వు పగలగొట్టే గాజు సామాన్లు పాతిక రూపాయలు. ఎలాగే నీతో. ఈ నష్టం ఎలా రాబట్టుకోవాలిట.

పనిమనిషి: పోనీ నా జీతం యాభైకి పెంచండమ్మా. అందులోంచి పట్టుకుందురుగాని. ★

## పెద్ద మనుషులు

"నారయ్యగారూ! అరవయ్యోపడిలో పడికూడా మాతో చెడుగుడాడి పారేస్తున్నారంటే నమ్మలేక పోతున్నాం స్మీ"

"భలేవారే! మా నాన్నకి తొంభై ఏళ్ళు. ఆయన మా వూళ్ళో ఇంకా ఫుట్‌బాల్ మాచ్‌లో ఫుట్‌బాల్ ఆడతాడు. వస్తాదు. మా తాతగారి పెళ్ళికెళ్ళాడు. రాగానే చూపిస్తా."

"ఏవిటీ-మీ తాతగారికి పెళ్ళా!"

"ఎనిమిదోది - ఇద్దరు పెళ్ళాలున్నారు - అయినా వాళ్ళకి ఏం వయసు మళ్ళిపోయిందని-"

"మీ తాతగారి వయసు?"

"నూట తొమ్మిదండి"

"ఆశ్చర్యం - అంత వయస్సులో ఇంకా పెళ్ళి గురించిన ధ్యాస కలగడం"

"ధ్యాసకాదండీ - ఖర్మ, అగత్యం. సరైన పెళ్ళాం లేక బజార్నపడితే ఆరోగ్యం చెడుతుందని." ★

## దస్త్రో
## (చూసి లాభం లేదు)

దస్తూరి మన గుణాల కస్తూరి అన్న ముక్క అక్షరాలా నిజమైతే పెద్దపెద్ద అధికారులూ, చెక్కుమీద సంతకాలు పెట్టేవాళ్లూ వుట్టి గందర గోళపు గలీజు మనుషులనుకోవాలి. డాక్టర్ల బుర్రలు అయోమయంగా వుంటాయనుకోవాలి.

ఒకాయన ఒకసారి విసుక్కున్నాడు. "ఈ డాక్టరు కాస్త తెరిపిగా విషయం తెలిసేలా రాస్తే బాగుణ్ణు" అని.

ఆయన మిత్రుడు ఒప్పుకోలేదు. ఆయన దగ్గిర ఒక డాక్టరుగారు రాసిచ్చిన మందుచీటి వుంది. దాన్ని ఆయన సినిమా హాలులో ఫ్రీ పాసుగా చూపించి వాడుకున్నాడు.

రైల్వే పాసుగా కొన్నాళ్ళు వాడాడు. రెండు ఉద్యోగాలకు హెల్త్ సర్టిఫికెట్‌గా చూపించాడు.

"డాక్టర్లు సంగతి తెలిసేలా రాస్తే ఇవన్నీ ఎలా సాగుతాయి?" అంటాడాయన. ★

## జోస్యం

"మీరు డభ్బై ఏళ్ళు ఖచ్చితంగా బతుకుతారండీ"

"ఏడిసినట్టుంది మీ జోస్యం. నాకు యిప్పుడు డభ్బైయేళ్ళు."

"చూశారా, నే చెప్పలే?" ★

ఎం.బి.బి.యస్ విద్యార్థి ప్రిన్సిపాల్ దగ్గరకి ఇంటర్వ్యూకి వచ్చాడు. ఆయన ఒక మనిషి పుర్రె చూపించాడు.

ప్రి : ఇదేవిటి?

వి : మోకాలు చిప్ప.

ప్రి : కాదు. మనిషి పుర్రె. సరే – ఇదేవిటి?

వి : మోకాలు.

ప్రి : కాదు. వెన్నెముక. ఇదేవిటి?

వి : తొడ ఎముక.

ప్రి : కాదు. చిటికినవేలు. అయినా అబ్బాయ్–రేపు పరీక్ష పెట్టుకుని ఇవాళ నువ్వింత అధ్వాన్న స్థితిలో వస్తావా?

వి : పరీక్షలు ఇవాళ కాదు, రేపు కదా సార్. ★

## నాచురల్లీ ఖాన్

ఒకడో మంచి కుక్కపిల్లని రూపాయిన్నరకి కొనుక్కున్నాడు. చెరువు గట్టుకి వెళ్ళి – ఓ జీలుగుబెండు ముక్కని విసిరి కుక్కని ఇస్కో అన్నాడు.

కుక్క ముందుకి దూకి అన్ని కుక్కల్లా మునిగి తేలి ఈత కొట్టకుండా దర్జాగా నీళ్ళమీద పరుగెత్తు కెళ్ళి జీలుగుబెండును తెచ్చి యజమాని కిచ్చింది.

అతను విస్తుపోయి – తన ఫ్రెండు ఒక నాచురల్లీ ఖాన్‌ని పిల్చుకు వచ్చి – మళ్ళీ బెండు విసిరి, తెప్పించి విడ్డూరం చూపించాడు.

"ఎంతక్కొన్నావు?" అన్నాడు నాచురల్లీ ఖాన్ ఆశ్చర్యపడకుండా.

"రూపాయిన్నర - కారుచౌక కదూ?"

"నీ మొహం. మోసపోయావ్ - దాని కీతకూడా రాదన్నమాట. అందుకే అంత చవగ్గా నీకంటగట్టాడు." ★

## ఆరు పెగ్గులు - పిల్లి మొగ్గలు

ఆస్పత్రిలో ఒంటినిండా కట్లతోవున్న స్నేహితుణ్ణి పరామర్శించాడు తుకారాం.

"ఏమైందిరా - రాత్రి నన్నెవర్రా ఇంతగా చావగొట్టారు?" - అడిగాడు క్షతగాత్రుడు.

"లేదు గురూ. ఎవరూ కొట్టలేదు. రాత్రి పార్టీలో ఆరు పెగ్గులు తాగాక నువ్వు మేడ మీంచి దూకి గాలిలో ఎగురుతానని ఓపది రూపాయలు పందెం కాశావు. దూకి పందెం గెల్చుకున్నావు"

"ఓరి దరిద్రుడా. పదిరూపాయల పందెంకోసం నన్ను మేడమీంచి దూకనిస్తావా - ఆపితే వందిచ్చే వాడిని కదా"

"బలేవాడివే. మిగతా వాళ్ళతో నీమీద వంద పందెంకాసి గెలిచాను. ఇదిగో ఈ పదీ నీది" ★

## జేబుదొంగలు



ఖైదులో పడ్డ తోడుదొంగను చూడబోయాడొక జేబుదొంగ.

"నీ కోసం ఓ ప్లీడర్ని మాట్లాడాను. డబ్బు తెమ్మన్నాడు. నెల మధ్దిన. సరే మొన్న తెచ్చిన వాచీ తాకట్టు పెట్టేసాను ఆడికాడె" అన్నాడు.

"ఆడికాడే ఉంచుకున్నాడా?"

"ఆ. ఉంచుకున్నాననే అనుకుంటున్నాడనుకో;" అన్నాడు జేబుదొంగ చిరునవ్వు నవ్వి. ★

శీతాకాలం జేబుదొంగలకు మంచి సీజను కాదుట.

ప్రతివాడూ చలిమూలాన చేతులు జేబులోనే పెట్టుకు నడుస్తాడు మరి. ★

జేబుదొంగ చాకచక్యం విని జడ్జిగారు విస్తుపోయారు.

"అవతలివాడికి బొత్తిగా తెలీనంత చులాగ్గా జేబులో పర్సు ఎలా లాగుతావు?" అన్నారు.

"అయ్యా. ఆ ఒడుపులు చెప్పడానికి పాతిక రూపాయలు ఫీజవుద్దండి. ఇట్టవైతే రేపు మాట్నీ ఆటకి రండి" అన్నాడు దొంగ. ★

ఒకతను ఒగురుస్తూ పరుగెత్తుకువచ్చి. "ఏవండీ యీ దారిన ఒక పోలీసు జవాను యెక్కడేనా కనబడ్డాడా..." అన్నాడు కంగారుగా.

"లేదండీ. నేనెక్కడా చూళ్ళేదే," అన్నాడు పెద్దమనిషి జాలిగా.

"సర్లెండి. మీ జేబులో పరుసిలా పారెయ్యండి. వాడొచ్చే వేళైంది" అంటూ చాకు చూపించాడు దొంగ. ★

చోర శిరోమణి చిన్న భార్య అలిగింది. నెక్లెస్ తేలేదని.

"ఏం జెయ్యమంటావు సెప్పు. ఆ నగల కొట్టుకు మూడు సార్లెల్లాను. యదవ నాయాళ్ళు పద్దులు సూత్తన్నారంట - రేతిరి పన్నెండైనా కొట్టు ముయ్యలేదు. మరి" అన్నాడు భర్త. ★

ఖైదులో వేసిన మూడోనాడు అపరాధి వార్డెను దగ్గరకు పరుగెత్తి తనని విడుదల చెయ్యమన్నాడు.

వార్డెను తెల్లబోయి కారణం అడిగాడు.

"నా సావాసంవల్ల మీ ఖైదులో జనం అంతా పాడవుతారని నాకు భయంగా వుంది" అన్నాడు ఖైదీ.

"ఎంచేత?"

"ఈ ఖైదు మొత్తంమీద నిజంగా నేరం చేసింది నే నొక్కడినేలా వుంది. వాళ్ళంతా అమాయకులేట." ★

"ఏరా వెధవా. నా జేబులో బేడకాసు తీసుకున్నావా?" అని కొడుకును గద్దించాడు తండ్రి.

"ఏవండీ. వాడే తీశాడని మీకెలా తెలుసు? నేను తీసి వుండకూడదా?" అంది ఇల్లాలు నవ్వుతూ.

"నువ్వు చెయ్యి పెడితే జేబు పూర్తిగా ఊడ్చేస్తావుగా అదే గుర్తు." అన్నాడు భర్త. ★

## అ(బ)ద్ధం

ఒకడు పెద్ద అద్దం మోసుకుపోతున్నాడు. పోలీసుకి అనుమానం వచ్చి అడిగాడు ఎక్కడిదీ అద్దమని. ఆసామి చాలా ఠీవిగా నిర్భయంగా చూశాడు.

"నేనేం ఎత్తుకు రాలే. ఇందాక ఆ మలుపులో లారీ మీంచి పడిపోయింది .... తీసుకెళ్ళి వోనరుకిచ్చేద్దామని" ★

# శ్రీ దొంగలు

**దొం**గల్లో దొరలుంటారు. ఒక గొప్ప గజదొంగని ఖైదుకు తీసుకు రాగానే అక్కడున్న సన్నకారు దొంగలంతా చుట్టూ పోగై సినిమాతారని చూసిన ప్రేక్షకజనంలా మురిసిపోయారు.

"కాస్తలో దొరికిపోయానుగాని ఆ బాంకు దోపిడీ కడతేరా చేస్తే నేనూ ఇంతవాడిని అయేవాడిని." అన్నాడు గుంపులో ఒకడు - నిట్టూర్చి. ★

**ప**ర్సు లాక్కుని పారిపోతూన్న దొంగ కాలుజారి కాలవలో పడ్డాడు. పర్సు పోగొట్టుకున్నాయనే దూకి అతన్ని పైకి లాగాడు.

"అబ్బ. ఆ రెండునిముషాలూ యమచెరపడ్డానండి." అన్నాడు దొంగ ఒగురుస్తూ.

"ఈ జన్మలో నువ్వుచేసిన పాపాలన్నీ కళ్ళకట్టినట్టు కనబడి ఉంటాయి. అవునా?"

"అబ్బే... అన్నీ ఎక్కడ కనిపిస్తాయండీ, మునిగి ఉన్నది రెండు నిముషాలేగా." ★

**మూ**దుసార్లు ఒకే గుడ్డల దుకాణంలో కన్నంవేసిన కన్నయ్య మొత్తంమీద దొంగిలించిది ఒకే చీర. అదేవిటని లాయరు అడిగాడు.

"మా యాడదానికి కోక కావాలందండి. నేనొట్టికెల్లింది నచ్చలేదు. అది పడేసి ఉంకోటి... ఉంకోటి తెచ్చానండి మరి." అన్నాడు కన్నయ్య. ★

**ఇ**ద్దరు దొంగలు బట్టలషాపులో జొరబడ్డారు.

"చూశావా ఈ చీరల ధరలు! వీళ్ళ దుంప తెగ, దోపిడీ, నిలువు దోపిడీ" అన్నాడు దొంగ గుండెలు బాదుకుని. ★

## బాలవాక్యం

"దేవుడు మన పాపాలు పోగొట్టి మన్ని క్షమించాలంటే మనం ఏం చెయ్యాలి?"

"ముందస్తుగా పాపం చెయ్యాలండీ." ★







ఆసుపత్రివున్న ఒక రోడ్డుమీద - 'ఇక్కడ కార్లు, బస్సులూ హారన్ చెయ్యకూడద'నే హెచ్చరిక ఆంగ్లంలో రాసి ఉంది. దానికింద ఓ కుర్రవాడు వచ్చి తెలుగులో ఇలా రాశాడు. 'మీ కారు కూతలు ఇక్కడ కట్టిపెట్టండి.' ★

తండ్రి ఇంటికి వచ్చీ రాగానే, మేనేజరుమీద కోపం అంతా పిల్లలమీద చూపించి చితగ్గొట్టేశాడు. ఓ గంట తరువాత పిల్లలమీద జాలేసి పలకరించబోయాడు. పెద్దకొడుకు పదేళ్ళవాడు పలకమీద ఏదో రాస్తున్నాడు. తండ్రి వెళ్ళి మెల్లిగా వంగి చూశాడు.

'ఒరేయ్ నాన్నా! నీవు, నీ పిల్లలనిలా గట్టిగా కొట్టకు. కొట్టకపోతే వాళ్ళు అల్లరి చెయ్యరు' ఇట్లు, 'దేముడు' అని రాసి ఉంది. ★

చవితి చంద్రుణ్ణి చూసి ఒక ఐదారేళ్ళ కుర్రాడు అన్న చక్కని ముక్క:

"నాన్నా! చందమామ జీడిపప్పులా ఉన్నాడు కదూ?" ★

తండ్రీ కొడుకూ పశువుల సంతకెళ్ళారు.

"నాన్నా నాన్నా - ఆ అబ్బి ఆ యెద్దుని ఎందుకలా వీపుమీద కొట్టి గిల్లుతున్నాడు?" అన్నాడు కొడుకు.

"వాడు ఆ యెద్దుని కొంటాడన్నమాట. బాగా కండపట్టిందో లేదోనని చూస్తున్నాడు." అన్నాడు తండ్రి.

మర్నాడు మధ్యాహ్నం కొడుకు సావిట్లోకి పరుగెత్తుకొచ్చాడు.

"నాన్నా నాన్నా - మరేం .... మరేం.. పక్కింటివాళ్ళ రాజు లేడూ... వాడేం... మన అక్కని కొనేస్తున్నాడు -నూతిదగ్గర. చూద్దాం రా" అన్నాడు.

ఏడేళ్ళ రంగడు బడినుంచి విసుగ్గా ఇంటికొచ్చాడు... "రేపణ్ణుంచి ఆ వెధవ బళ్ళో కెళ్ళనమ్మా"- అంటూ.

"ఏం బాబూ...కొట్టారా?" అంది అమ్మ.

"కాదమ్మా. నాకేమో చదవడం రాదు. రాయడం రాదు. పోనీ మాట్లాడదాం అంటే 'ఉష్...మాటాడకు' అంటారు. ఇంక వెళ్ళి లాభం ఏమిటి?" ★

తల్లి పదేళ్ళ ఖావిపొరుడిని మందలించబోయింది.

"అబద్ధాలు చెబితే ఏమవుతుందో తెలుసా?"

"ఆ - తెలుసు. రైల్లో అరటికెట్టు మీదెళ్ళచ్చు!" ★

పిల్లల ప్రపంచం వేరు ఆ భాష వేరు. అందుకే మనభాష వాళ్ళకింకోలా అర్థం అవుతుందెప్పుడూ.

"ఒరేయ్ రాముడూ-ముందా మురిగ్గుంటలోంచి ఇవతలికిరా." అంటూ పెద్దన్నయ్య వచ్చి గద్దించాడు.

"అమ్మ ఆశ. ఇది నాది. ముందు నేను చూశాను. నువ్వు ఇంకో దాంటో దిగు." అన్నాడు రాముడు. ★

బాబు సినిమా కెళ్ళడానికి వాళ్ళమ్మ డబ్బులివ్వనంది. 'పోనీ తమ్ముణ్ణో సారియ్యి' అని ఏడాది పిల్లణ్ణి ఎత్తుకెళ్ళాడు బాబు.

వాడిని అరుగుమీద కూర్చోపెట్టాడు.

"మా తమ్ముణ్ణి ముద్దుపెట్టుకుందికి ఓ కాణీ టికెట్టు. అందరూ రండి." అని కేకలు వేశాడు. ★

"ఏరా వాణ్ణెందుకురా కొట్టావుట?" అన్నారు మేష్టారు.

"వాడు నన్ను తిట్టాడండి."

"తిడితే నువ్వు తిట్టాలిగాని కొడతావా?"

"వాడికి చెముడండీ. ఎంత అరిచి తిట్టినా వాడికి వినపడదు"★

పిల్లల కబుర్లు విని అదిరిపడి లేచి వచ్చాడు తండ్రి.

"ఏరా, తమ్ముడికి బూతు మాటలు నేర్పుతున్నావా తీరి కూర్చుని, తప్పు కాదూ!"

"నేర్పటంలేదు నాన్నా, ఈ మాటలు అన్నీ మనం అనకూడదనీ, అంటే నాన్న కోప్పడతాడనీ చెప్తున్నాను."★

ఇద్దరు చిట్టి నేస్తాలు మాట్లాడుకుంటున్నారు.

"ఏంరా పాపం మీ పాపాయి అస్తమానం అలా ఏడుస్తుందేం?"

"ఏమిటో, దానికి పళ్ళులేవు. నడవలేదు, జుట్టులేదు. మాటాడలేదు. నవ్వడం చేతకాదు. అలావుంటే మనవేనా సరే ఏడుస్తాం తెలుసా?"★

అద్దం ముందర కూర్చుని కళ్ళు చికిలిస్తున్నాడు కుర్రాడు.

"అదేవిట్రా పిచ్చితండ్రీ!" అంది తల్లి ముద్దుగా.

"కాదమ్మా.... మరీ నేను నిద్దరోతున్నప్పుడు ముద్దొస్తానుగా. ఎంత ముద్దొస్తానో చూద్దామని కళ్ళుమూసుకుని చూస్తున్నానమ్మా"★



ఏడేళ్ళ బాబి బడికి టెలిఫోను చేశాడు.

"ఏమిటి? బాబికి జెరం వచ్చిందా, సెలవు కావాలా... మాట్లాడుతున్నదెవరు?" అంది మేష్టరమ్మ ఫోనులో.

"నేను మా నాన్ననండి" ★

ఐదేళ్ళబాబు సావిట్లోకి పరుగెత్తుకొచ్చాడు.

"నాన్నా, మినపరొట్టి చల్లారిపోతోంది. సావిట్లో సెనివెధవలూ మరేమో - ఎప్పుడు పోతారోనమ్మ - మీనాన్న చప్పున వస్తే బాగుండునూ అంటుంది అమ్మ" అన్నాడు. ★

ఓ కుర్రాడు కుక్కతోక పట్టుకులాగి ఆడుకుంటున్నాడు.

"వెధవా, తోకపట్టుకు లాగుతావేంరా? కరుస్తుంది" అన్నాడు తండ్రి.

"పో నాన్నా, తోకెక్కడేనా కరుస్తుందేమిటి?" అన్నాడు కుర్రాడు. ★

ఐదారేళ్ళ కుర్రాడొకడు ఏడుస్తూ పోలీసు దగ్గరికి వచ్చాడు. "ఏం బాబూ?" అన్నాడు పోలీసు ముద్దుగా.

"మరండీ పాపం, మా అమ్మ తప్పిపోయిందండి. మరేమో మజ్జానం బజారు కొచ్చింది నాతో. మరేమో తప్పిపోయింది. నేను మజ్జానం నించీ కనబడ్డం లేదు"★

# మహి-ళా-మండలి

యాత్రీకుల బృందానికి నయాగరా జలపాతాన్ని చూపిస్తున్నాడు మార్గదర్శి. "అయ్యా, ఇదేనండి ప్రపంచ ప్రసిద్ధమైన నయాగారా. బ్రహ్మాండమైన జలపాతం. అమ్మా, మీ ఆడంగులు ఒక్క నిముషం కబుర్లు ఆపితే అంతా ఓసారి జలపాతం హోరు వింటారండీ." ★

పిల్లడు అల్లరిపని చేశాడు. తల్లి కొట్టబోయింది. అంతలో తన తల్లి చెప్పినమాట గుర్తుకొచ్చి "ఉండు వెధవా! నీ పని చెప్తా" అంటూ వంటింట్లోకి వెళ్ళి పట్టెడు చద్ది అన్నం పెట్టుకొని గబగబ తినసాగింది.

"పరగడుపున పిల్లల్ని కొట్టకు సుమా" అని వాళ్ళ అమ్మ మరీమరీ చెప్పిందట లోగడ. ★

ఒకావిడ స్నేహితురాలితో:

"అదేమిటమ్మా, మా పక్కింటావిడ అస్తమానం మొగుణ్ణి సాధిస్తూనే ఉంటుంది. పోనీ ఇంట్లో ఏదో ఏడుస్తుందనుకోవచ్చు. ఊళ్ళో వాళ్ళందరి దగ్గరికీ వెళ్ళి మొగుణ్ణి తిట్టి పోస్తుంది. తప్పుకాదూ! నేను చూడు! మా ఆయనంత చవట దద్దమ్మ ఇంకోడు లేదు. అయినా బయటెక్కడన్నా ఆమాట చెప్పుకుంటున్నానా?" ★

కవిభార్య: మా ఆయన రామాయణం మళ్ళీ రాస్తున్నారు.

పక్కింటావిడ: కొనుక్కుంటే పోదుటమ్మా! మళ్ళీ రాయడం దేనికి? ★

ఇద్దరు గృహిణులు మధ్యాహ్నం పూట కబుర్లకి కూచున్నారు. ఒకామె ఆరంభించింది.

"సీతమ్మ మహాదొడ్డ యిల్లాలుస్మండీ. అవిడంటే గిట్టనివాళ్ళు కూడా... చాటున ఆడిపోసుకుందిక్కూడా... ఒక్కటంటే ఒక్క దుర్గుణం లేదు చూశారో లేదోగాని."

"పోన్లెస్తురూ! అలాటివాళ్ళ గొడవ మనకేల? మరో సుబ్బమ్మ గురించి మాట్లాడుకుంటే సరి!"... అంది రెండో ఆవిడ. ★

పదేళ్ళ చిట్టిబాబు గోదాట్లోపడి కొట్టుకుపోతే పోలీసు పున్నయ్య కాపాడి ఇంటికి చేర్చాడు.

తల్లి బిడ్డని దగ్గరకు తీసుకుంది. "నా బాబూ... నా బాబూ... దేవుళ్ళా కాపాడావు." అంటూనే పిల్లవాడి జేబులు తడిమి చూసుకుంది.

"పర్లేదమ్మా బిడ్డ బతికాడు. అంతా దేవుడిదయ." అన్నాడు పోలీసు పొగడ్తకి సిగ్గుపడుతూ.

"పకోడీలు తెమ్మని పావలా వీడి జేబులో పెట్టాను. అదేం జేశావయ్యా..." అంది తల్లి... పోలీసుకేసి అనుమానంగా చూసి. ★

అతిలోకసుందరి ఒకర్తె అద్దంముందు కూర్చుని చాలాసేపు తన ప్రతిబింబ సౌందర్యాన్ని ఆస్వాదించి గాఢంగా నిట్టూర్చి, పక్కనున్న చెలికత్తె వంక చూసి, "నిన్ను చూస్తే నాకు చాలా అసూయగా ఉందే" – అంది.

"అబ్బే...నాకన్న నువ్వే బాగుంటావు." అందామె సిగ్గుపడి.

"అదే అదే... నన్నూ, నా అందాన్నీ నువ్వు ప్రత్యక్షంగా చూసి ఆనందించగలవు. నాకు అద్దంలో నా ప్రతిబింబం చూసుకు ఆనందించడం కన్న గతి లేదు గదా!"... అంది సుందరి. ★

కమల: ఈ మగవాళ్ళు వాళ్ళలో వాళ్ళు ఏం మాట్లాడుకుంటారో?
విమల: ఆడవాళ్ళు మాట్టాడుకునేవే మాట్లాడతారనుకుంటాను
కమల: ఛీఛీ. అసయ్యం ★

# రాజకీయాలవాలం

అమెరికన్ హాస్యనటుడు, చమత్కారి బాబ్ హోప్ రాజకీయవాదులను ఒక్కముక్కలో సమీక్షించాడు. ఒక సభలో ఉపన్యాసం అరంభిస్తూ–

"లేడీస్, జెంటిల్‌మెన్ అండ్ పొలిటీషియన్స్–" అని సంబోధించాడు. ★

ఎలక్షన్ ప్రచారంకోసం పోటీచేస్తున్న ఉభయపక్షాల నాయకులూ ఒకేసారి ఒక వూరు వచ్చారు. ఇద్దరికీ ఒక్కపూటే గడువుంది. ఇద్దరికీ ఒకటే ఉపన్యాస స్థలం, మునిసిపల్ మైదానం.

పురపాలక సంఘం ఎన్నికలు రెండునెలల్లో ఉన్నందువల్ల అధ్యక్షుడు తాత్కాలికంగా తటస్థంగా ఉండదలుచుకున్నాడు–

ముందర ఆయన వేదిక ఎక్కి స్వాగతం చెప్పి పరిచయం ఆరంభించారు. "ఇప్పుడు మాటాడబోతున్న వారు మనందరికి సుపరిచతులే. బాల్యం నుండీ మహాత్యాగాలు చేస్తున్నారు. స్నేహపరులు. చిత్తశుద్ధికి ఆయన నిలయం." అని వెనక్కి తిరిగి ఉభయ నాయకులనూ చూసి "మీ ఇద్దరిలో ఎవరు ముందు మాట్లాడతారు? ఒకరు లేచి రండి...." అన్నాడు ★

రైల్లో కూర్చుని, గార్డుని పిలిచి రైలునీ అవకతవకలనీ దుమ్మెత్తి పోశారొకాయన. తన కసలు యీ పద్ధతులేవీ నచ్చలేదన్నాడు. మారాలన్నాడు.

"సార్, అవన్నీ నాకు చెప్పి ఏం లాభం? మీ ఊరి ఎమ్మెల్యేగారితో చెప్పండి. ఆయనేమన్నా చేస్తాడు" అన్నాడు గార్డు.

"ఏడిసినట్టుంది సలహా! నేనే మా వూరి ఎమ్మెల్యేని" ★

గ్రామపంచాయితీ సభలో అల్లకల్లోలం బయల్దేరి "నీ అంతటి చవట దద్దమ్మ లేదంటే నువ్వంత వెధవ లేడు" అని ఒకర్నొకరు దూషించుకోడం మొదలెట్టారు. అంతలోకి ఛైర్మన్‌గారు లేచి "నేనీ సభకి అధ్యక్షత వహించాను. నన్ను మీరు పూర్తిగా మరిచిపోతున్నట్లుంది" అన్నారు. ★

మ్యూజియం సందర్శిస్తున్న మంత్రిగారికి ప్రాచీన శిల్పాలు చూపిస్తున్నారు.

"అయ్యా - ఇది మూడువేల ఏళ్ళనాటిది"

మంత్రిగారు తన సెక్రటరీవైపు తిరిగి జనాంతికంగా "నోట్ చేసుకోవయ్యా - ఇదేదో మోసంలా ఉంది. ఇది 1981వ సంవత్సరం కదా! మూడువేల ఏళ్ళంటాడు? వీళ్ళకి గ్రాంటు రద్దు చెయ్." ★

ఓ మంత్రిగారు తమ పెద్దబ్బాయికి ఉద్యోగం వెతుకుతున్నారు. రెండుమూడు గంటలైనా కూడా దొరకలేదు. చివరకు ఒక గవర్నమెంటు ఆఫీసరుగారికి ఫోన్‌చేశారు. ఆయన "అమ్మమ్మా అంతకన్నానా? తప్పక ఉద్యోగం వేయిస్తా నా ఆఫీసులోనే... మీ అబ్బాయికి ఏ పని చేతనవును?" అన్నాడు.

"ఏ పనీ చేతగాదు" అన్నారు మంత్రిగారు.

"బెస్టూ. వెంటనే వచ్చి చేరిపొమ్మనండి!" ★

ఫొటో తీస్తున్నప్పుడు ఢిల్లీ ప్రయాణం గురించి ఆలోచిస్తూ నిట్టూర్పు విడుస్తూ తలూపద్దని తనకి అప్పుడే మనవిచేసియున్నాను

ఒక పత్రికా విలేఖరి రాజకీయ నాయకునితో: మీరు ఉపన్యాసాలిస్తుంటే ముందు వరుసలో వాళ్ళు వాచికేసి చూడ్డం మీకు చిరాగ్గా ఉంటుందా?

రాజకీయ నాయకుడు: ఊహు. ఉండదు. నిమిష నిమిషానికీ ఉట్టినే చప్పట్లు కొడితే మాత్రం చిరాకేస్తుంది. ★

హైస్కూలు వార్షికోత్సవానికి రాజకీయ నాయకుడిని అధ్యక్షుడిగా పిలిచారు. ఆయన అధ్యక్షోపన్యాసమిస్తూ యిలా చెప్పాడు.

"బాలబాలికలారా! విద్య అంత మంచి వస్తువు ప్రపంచంలో మరొకటి లేదు. విద్య ప్రతివాడికీ అవసరం. మాట వరుసకి గణితశాస్త్రం తీసుకోండి. ఈ శాస్త్రం వల్లనే మనకి తెలుస్తుంది - రెండురెళ్ళు నాలుగని, నాలుగు నాలుగులు ఎనిమిదని, ఎనిమిదెనుముదులు .... ఊ.... ఊ.... ఊ.... అలాగే భూగోళం చూడండి...." ★

ఆంధ్రరాజధాని కర్నూలా? బెజవాడా? అని చర్చలు ముమ్మరంగా సాగుతూన్నరోజుల్లో ఒక ప్రముఖుడు రైలు ప్రయాణం చేస్తూ ఉండగా ప్రతి స్టేషనులోనూ జనం పోగై ఆయన పెట్టె దగ్గర నిలబడి రాజధాన్ని గురించి ఆయన అభిప్రాయం అడగసాగారు. అవీ ఇవీ మాట్లాడి రాజధాని మాట వచ్చినప్పుడల్లా ఆయన తన అభిప్రాయం చెప్పినపుడు ఇంజను దిక్కులు దద్దరిల్లేలా గర్జించసాగింది. ఇంకో క్షణంలో రైలు కదిలేది. ఆ పెద్దమనిషి ఏ వూరు పేరు చెప్పాడో జనానికి బోధపడలేదు. సరిగ్గా ఆ క్షణానికే ఇంజను ఏందుకు అరుస్తోందీ అని వాకబు చేస్తే - ఇంజనీరు చెప్పిన జవాబు.బోధపడలేదు. సరిగ్గా ఆ క్షణానికే ఇంజను ఎందుకు అరుస్తోందీ అని వాకబు చేస్తే - ఇంజనీరు చెప్పిన జవాబు.

"ఆయన జవాబు జనానికి వినబడితే రభస జరగవచ్చు. రైలు లేటవచ్చు. లూటవచ్చు. అందుకని కూత పెట్టించాను." అన్నాడు. ★

తరిమిలాను ఆ ప్రముఖుడితో ఈ విషయం చెబితే ఆయన నవ్వి, "అలాగా? నాకు తెలీదే! అది తరచు కూస్తోందని గమనించి ఆ కూత మోతలో నా జవాబు నేను చెప్పేస్తూ వచ్చాను."... అన్నాడు. ★

రాజకీయాల్లో శత్రువర్గాలకు సంబంధించిన ఇద్దరు రాజకీయనాయకులకు ఎలాగైనా స్నేహం కలపాలని ఒక పెద్దమనిషి ప్రయత్నించాడు. ఇద్దర్నీ విందుకు ఆహ్వానించి ఒకరితో మరొకరు కలుపుగోలుతనంగా మాట్లాడమని ఆదేశించాడు.

"మీరు నాకు ఏం జరగాలని వాంఛిస్తున్నారో నేనూ మీకు అదే జరగాలని వాంఛిస్తున్నాను." అన్నాడొక నాయకుడు.

"చూశారా... మొదటి మాటలోనే శత్రుత్వాన్ని ఎలా వెళ్ళకక్కుతున్నాడో! ఎంతెంత శాపాలు పెట్టేస్తున్నాడో!" అన్నాడు రెండో వ్యక్తి. ★

1959లో ఒక రష్యన్ పౌరుడు "డౌన్ విత్ కృశ్చేవ్" - అని అరచినందుకుగాను అతనికి అయిదేళ్ళ శిక్ష పడిందట. శిక్ష అనుభవించి విడుదల అయిన తరువాత అతడు కృతజ్ఞతా సూచకంగా - "లాంగ్‌లివ్ కృశ్చేవ్" అని అరచాడట! అతనికి మళ్ళీ శిక్ష పడిందట!!! ★

ఇద్దరు రుమేనియన్ కార్మికులు ఫ్యాక్టరీనుంచి ఇళ్ళకు తిరిగి వెళుతున్నారు. ఇద్దరి మొహాలూ గంభీరంగా ఉన్నాయి. ఇద్దర్లిలో ఎవ్వరూ మాట్లాడ్డం లేదు. ఏదో ఆలోచిస్తున్నారు. చివరికొకడు నిట్టూర్చి తుపుక్కున ఉమ్మేశాడు. రెండోవాడు కూడా వెంటనే ఉమ్మేశాడు!

మొదటివాడు: చాలు చాలు. ఎవరన్నా చూస్తే మనం రాజకీయాలు మాట్లాడుకుంటున్నామని అనుకుంటారు. ★

ఎన్నికల ప్రచారం చెయ్యడాని కొచ్చిన మంత్రిగారు నాలుగు ముక్కలూ చెప్పి చివరికి – “మేము కోరేదల్లా మా కార్యక్రమం, లక్ష్యాలూ నెరవేరడానికి ఇంకా నాలుగేళ్ళ వ్యవధి మాత్రమే!”–అన్నాడు.

“ఏమిటా కార్యక్రమం? ఏమిటి మీ లక్ష్యం?”.... అన్నాడు వెనక వరస ఓటరు.

“అధికారంలో ఉండి ప్రభుత్వం నడపడం.” అన్నారు మంత్రిగారు వివరాలు చెప్పిందికి వీలులేక! ★



“రేపు ఎలక్షనికి నిలబడే అభ్యర్థులిద్దరి గురించి నీ అభిప్రాయం ఏమిటోయ్?”

“ఇద్దర్లో ఎవడో ఒకడే గెలుస్తాడని ఆనందంగా ఉంది.” ★

మంత్రిగారి బాల్యమిత్రుడు ఆయనను చూడబోయి చిన్నబుచ్చుకు తిరిగివచ్చాడు. ఫలితం భార్యకు చెబుతూ – “అబ్బే....వాడు చాలా మారిపోయాడు. చాలా లావెక్కాడు. తల నెరిసింది. పెద్దమీసాలూ... వాడూ.... జెమాజెట్టీలా ఎదిగిపోయాడేమో – పాపం నన్నసలు గుర్తే పట్టలేకపోయాడు.” – అన్నాడు. ★

# పార్లమెంటులు

ఒక జర్నలిస్టు మంత్రిగారితో మాట్లాడుతూ అన్నాడు.

"సార్.... మన పార్లమెంటు పద్ధతులూ, మతలబులూ, రూల్సూ గట్రా అన్నీ బ్రిటీష్ పార్లమెంటుని చూసి అనుకరిస్తున్నాం గదా... అక్కడ పార్లమెంటుకి దైవప్రార్థనలు జరిపే చాప్లెన్ ఉంటాడు. మనకూడా ఓ పూజారి వుద్యోగం కల్పించలేదెంచేతా – అని."

"పార్లమెంటుకి పూజారెందుకయ్యా! మా తరపున మాకోసం పూజ్జేసి దేవుణ్ణి ప్రార్థించడానికా?"

"కాదు! మీ వరస చూసి దేశంకోసం దేవుణ్ణి ప్రార్థించడానికి!" ★



## మాయాఛాయా బజార్

ఒక మాజీనటుడు చెక్కు పట్టుకొని బ్యాంకుకు వెళ్ళాడు. అతను మంచి దశలో వుండగా ఎరిగి ఉన్న బ్యాంకు ఏజెంటు గుర్తుపట్టి పలకరించాడు.

"నేను సినిమాకి వెళ్ళి ఎంతకాలం అయిందో?" అన్నాడు ఏజెంటు మాటల సందర్భంలో.

"నేనూ అంతేనండి. బ్యాంకుకు వచ్చి ఎంతకాలం అయిందో" అన్నాడు నటుడు. ★

ఒక తారామతి, తన తాజా చిత్రం చూస్తోంది. తన మేకప్పు షోకప్పు వాలకం ఆమెకు నచ్చలేదు.

"ఏవండీ డైరెక్టరుగారూ! చూశారా మన ఫోటోగ్రాఫరు నన్ను ఎలా ముసిలిదానిలా తీశాడో. పదేళ్ళ క్రితం ఈయనే నన్ను తీసినపుడు ఎంత అందంగా తాజాగా తీశాడనీ...." అంది తార.

"అవునమ్మా, ఆ ఫోటోగ్రాఫరు కిప్పుడు పదేళ్ళ వయసు మళ్ళిందిగా మరి" అన్నాడు దర్శకుడు. ★

తారలపై మోజు విచిత్రమైనది.

పాతాళభైరవి చిత్రం విడుదలై బ్రహ్మాండంగా నడుస్తున్న రోజులవి. అప్పటికింకా ఎన్.టి. రామారావుకు నాగేశ్వర్రావుకున్నంత పేరు రాలేదు. నాగేశ్వర్రావు జానపద చిత్రాల హీరోగా బాగా పేరు మోశాడు. చిత్రం చూసిన ఇద్దరు ప్రేక్షకులు ఇవతలకి రాగానే "ఆ మొసలితో పోరాటం ఉంది చూశావ్? అబ్బ... ఎంతసేపు పోరాడాడయ్యా ఆ రామారావు?" అన్నాడు ఒకడు.

"అంతేలే. రామారావు కొత్తగదా. అంచేత అరగంట పట్టింది. అదే మన నాగేశ్వర్రావైతేనా - చిటికెలో చంపేసి ఉండును" అన్నాడు మిత్రుడు. ★

ఇద్దరు తారలు స్టూడియోలో కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. షూటింగ్ విరామంలో లెక్కలు నేర్చుకుంటున్న బాలనటుడు వచ్చి "అక్కా అక్కా - మరీ ఇరవైనాలుగు తరువాత అంకెలేమిటి?" అన్నాడు.

అక్కకి ఇంకా ఇరవై రెండేళ్ళు వెళ్ళలేదు. అందువల్ల - "నాకు తెలీదు. ఇదుగో ఈ పిన్ని నడుగు. ఈవిడికి ఇరవై ఆరేళ్ళు కాబోలు" అంది తోటి తారకేసి చూసి.

"వయసుకు సంబంధించిన అంకెలు పెద్దవి నాకూ తెలీదమ్మా, డబ్బుని బట్టి తెలుసనుకో, నేను ముప్పైవేలు తీసుకుంటున్నానుగా.... ఇరవై ఏడు బాబూ" అంది పిన్ని తార.★

"మీ పిక్చరు కామిడీయా, ట్రాజిడీయా?"

"డబ్బొస్తే కామెడీ, రాకపోతే ట్రాజిడీ" ★

"అదేమిటండీ, నేను చచ్చిపోయే సీనులో నా నటన చూసి అందరూ ఏడ్చారు. నా శత్రువులు కూడా" అన్నాడు కారక్టరాక్టరు.

"అదే! ఇది సినిమా అయిపోయిందిగదా అని ఏడ్చి ఉంటారు" ★

తారలు వేరు, నటులువేరు అని ఈనాటి తారలతో సహా అందరికీ తెలుసు. ఒక స్టార్ ఒక క్లబ్బులో చేరడానికి దరఖాస్తు పంపాడు.

"మా క్లబ్బులో సినిమా నటుల్ని చేర్చుకోలేమని" కార్యదర్శి వ్రాశాడు.

"నేను నటుడినని అనగలవాడెవడూ? కాను అని నిరూపించడానికి దాఖలాగా అరవై చిత్రాలున్నాయి." అని జవాబుగా రాశాడు ఆ సినిమాస్టార్. ★

కుశలవుల వేషానికి కుదిర్చిన యిద్దరు కుర్రాళ్ళలో ఒక్కడు ఎక్కువ డబ్బు కావాలన్నాడు.

"వద్దని చెప్పండి. రాముడికి ఒక్క కొడుకుచాలు మన పిక్చర్‌లో. అంతగా కావాలంటే ఒకడిచేత రెండు వేషాలు వేయించి కుశలవులు కవల పిల్లలయినట్లు చూపెడితే సరి" అన్నాడు నిర్మాత. ★

సాహిత్యంలో ప్రవేశం ఉన్న ఒక నిర్మాతకి 'అర్ణవం' - అనే మాటమీద మోజు పట్టుకుంది. తన చిత్రంలో పాటలు రాసే ఆయన్ని పట్టుకుని ఆ మాట ఎలాగైనా ఏదో పాటలో ఇరికించాలని బలవంతపెట్టి రాయించి-

"చూశారా ప్రజలకు సినిమాలు విజ్ఞానం సప్లయి చెయ్యవంటారు. ఈ పాటవల్ల అర్ణవం అంటే రాజవీధి - అని జనానికి తెలుస్తుంది." అన్నాడు. ★

ఒక నిర్మాత కథల కోసం ప్రకటన చేశాడు. ఒక రచయిత కథ యిచ్చాడు.

"అద్భుతంగా ఉంది. కొత్తగా ఉంది. ఉషారుగా ఉంది." అన్నాడు నిర్మాత అది చదివి.

"అయితే మీ పిక్చరుకి దీన్ని తీసుకుంటారా?"

"అబ్బే వొద్దండి. ఇంతవరకూ ఇలాటి కథ ఎక్కడా రాలేదు. ఎవరూ పిక్చరు తియ్యలేదు!" ★

దెబ్బతిన్న నటుడు సుబ్బయ్య ఒక మారుమూల బజారులో ఒక చౌకబారు హోటల్లో భోజనానికి వెళ్ళాడు.

చెడిబతికిన నటుడొకడు వడ్డిస్తున్నాడు. సుబ్బయ్య గుర్తుపట్టాడు.

"ఎవరూ...? మహానటుడు రాజన్నా? కళాతపస్వి రాజన్నా? చివరికీ సన్నాసి హోటల్లో సర్వరుగా చేరేగతి నీకు పడుతుందని నేను కల్లో కూడా అనుకోలేదు" అన్నాడు - హేళన మీద జాలిరంగు పూసి.

మహానటుడు రాజన్న వడ్డన ఆపి నిటారుగా నిలబడి రొమ్ము విరిచి స్టయిలుగా చూశాడు.

"ఇక్కడ పనిచేస్తున్నానేగాని నీలా ఈ చౌకబారు దరిద్రపు హోటల్లో తిండితినే అధోగతి మాత్రం పట్టలేదు" - అన్నాడు. ★

కొందరు గొప్ప తారలు ఆలస్యంగా రావడం గొప్ప అనుకుంటారు. కాబట్టి మిగతా కొందరూ పెందరాళే రావడం గొప్ప అనుకుంటారు. ఉదయం ఏడు నుండి మధ్యాహ్నం రెండు వరకూ షూటింగయితే కొందరు పన్నెండున్నరకు వచ్చి ఒంటి గంటకి ఆకలేస్తోందనీ, పనుందనీ చెప్పి ఓ అరగంట ముందుగా పోతామంటారు. ఈలోగా ఓవల్టిన్ను, కూడా వచ్చిన వాళ్ళకి ఫలహారాలు... వాళ్ళ యోగక్షేమ విచారణ - పత్రికలకు ఇంటర్వ్యూ....

ఆలస్యంగా వచ్చిన తారనుచూసి పెందరాళే వచ్చిన తార మండిపడింది.

"ఇంత ఆలస్యంగా రావడం వల్ల పాపం ఈ కంపెనీకి ఎంత డబ్బు దండగవుతుందో తెలుసా?" - అంది.

"నువ్వు మరీ తెల్లారుగట్టే వచ్చి కూర్చోడంవల్ల ఎంత అవుతుందో నీకు తెలీదు కాబోలు." అంది ఆ తార. ★

# సెన్సారింగ్ సర్కస్

ఒక కోవెల మంటపంలో ఓ పదేళ్ళ కుఱ్ఱాడు ఈలవేస్తూ పోతున్నాడు.

అటే పోతున్న చంకజాకెట్టు సెన్సారు సభ్యురాలు వాడిని పట్టుకుని, లాగి లెంపకాయ కొట్టింది. వాడు గొల్లుమన్నాడు.

పూజారివచ్చి "అదేమిటమ్మా పసిబిడ్డనలా కొట్టారు...." అన్నాడు.

"పసిబిడ్డా? గుళ్ళో ఈలపాట పాడుతున్నాడు." అందామె కోపంగా.

"ఈలపాటేగా! కృష్ణుడు కూడా పాడాడు" అన్నాడు పూజారి.

"ఈ గాడిదకొడుకు పాడేది బూతుపాటండీ!" అంది సెంసారిణి. ★

"సెన్సారాఫీసర్లు చేసే పనేమిటండీ?"

"ఆ ఏముందీ. సినిమాల్లో ప్రతిమాటకీ రెండర్థాలు వెదకడం!" ★

"వాళ్ళమ్మాయికి ఇంకా పెళ్లయినట్టు లేదు."

"ఎలా అవుతుందీ! వాళ్ల నాన్న సెన్సారు మెంబరు. ఎన్ని సంబంధాలొచ్చినా పెళ్లికొడుకు అమ్మాయిని కాస్త పరీక్షగా చూసేసరికి ఈన కట్ అంటూ తరిమేస్తున్నాడు." ★

ముచ్చటైన దంపతులు, కానీ పాపం పిల్లల్లేరు.

ఆవిడ సెన్సారు మెంబరు. లైటార్పేసినా కట్ అంటుందట. ★




పాల్‌మ్యునీ జీవితం సినిమా తీయ నిశ్చయించి ముఖ్యపాత్రకి మిక్కీరూనీని బుక్ చేశాడొక ప్రొడ్యూసరు.

"అదేవిటండీ. పాల్ మ్యునీ బతికే వున్నాడు. పైగా అద్భుతంగా నటిస్తాడు. ఆయనుండగా—"

"అబ్బే అంతా బాగానే ఉంది. కాని పాల్‌మ్యునీ బాగా పొడుగు. ఈ రోలుకి పనికిరాడు." ★

# నిరుద్యోగపర్వం




ఉద్యోగం దొరక్క తిరుగుతున్న ఒక ఆసామి గత్యంతరం లేక ఒక సర్కస్ కంపెనీలో చేరాడు. "పులికవచంలో దూరి, సింహాల బోనులోకి వెళ్ళి నించోవాలి" అన్నాడు మానేజరు. ఆ ఆసామి ఆ ప్రకారమే వేషం కట్టి లోపలికి వెళ్ళాడు. సింహాన్ని చూడగానే కాళ్ళు వణికాయి.

"భయపడకు. నేనూ నీలాంటివాణ్ణే" అంది సింహం. ★

"రోజులు బాగులేవు. వెధవది. ఏ ఆఫీసుకు వెళ్ళినా ఒక్కటే షరతు; దరఖాస్తుదారుడి వయసు పాతికేళ్ళకు మించరాదు. అనుభవం నలభై ఏళ్ళకు తగ్గరాదు.... బహుశా వీళ్ళందరికీ పూర్వజన్మలమీద గురి తగలడిందో ఏవిటో!" అన్నాడు నిరుద్యోగి. ★

"ఏవిటిసార్, మా మనవడు బుద్ధిగా పనిచేస్తున్నాడా, దారిలో పడ్డట్టేనా?" అడిగాడు మేనేజరుగారి మిత్రుడు.

"ఆహా... ఆ మధ్య మీకు పక్షవాతం వచ్చినప్పుడు పనితోచక మనస్సు బావుండటానికి షజిల్సు వేశాడు. ప్రయిజొచ్చిందిట. క్రిందటి వారం మీరు చనిపోయాక పదిరోజులు సెలవుపెట్టి వెళ్ళాడు." ★

ఉడ్ హౌస్ కథలలో ఉద్యోగం గురించిన కథొకటి అద్భుతంగా ఉంటుంది.

ఒక నాటకం హాలు మేనేజరు, తన గుమస్తా రోజూ వసూళ్ళలో ఐదూ, పదీ చెక్కేస్తున్నట్టు పసిగట్టాడు. ఒకనాడు గుమస్తాని పిలిచాడు. "చూడండి. మీ జీతం ఎంత ఇప్పుడు" అన్నాడు.

"వందండి" అన్నాడు గుమాస్తా.

"సరే నూటయాభైకి పెంచుతున్నాను.... అబ్బే నూటయాభై ఏం ఖర్మ, మూడువందలకి పెంచాను. మిమ్మల్ని ఇవాళే డిస్మిసు చేస్తున్నాను." అన్నాడు మానేజరు.

"ఆ కాడికి ఇంక్రిమెంటు ఎందుకిచ్చావయ్యా" అని అడిగాడు మిత్రుడు తరువాత.

"బ్రహ్మాండమైన మూడొందల రూపాయిల ఉద్యోగం పోయింటే అని వాడు ఏడవాలిగదా" అన్నాడు మానేజరు.★




"కొత్త ఉద్యోగం ఎలా ఉందోయ్? వీళ్ళెంతిస్తున్నారు?"

"అక్కడకన్న ఇక్కడ రెట్టింపండి. వాళ్ళు నెలకి వందిచ్చేవారు. వీళ్ళు రెణ్ణెల్లకిస్తున్నారు." ★





హెడ్‌క్లర్కుగారి వేడిచూపుకు తట్టుకోలేక, ఆయన అడక్కుండానే ఆలస్యానికి కారణం చెప్పేశాడు కోనేటిరావు "వెధవది ఇవాళ నిద్రలేచేసరికే బాగా పొద్దెక్కిపోయింది" అని.

"ఊ. నువ్వు ఇంట్లోకూడా నిద్దరోతున్నావన్నమాట?" అంది హెడ్‌క్లర్కు హెడ్ ఆశ్చర్యం నటించి. ★



ప్రొప్రయిటర్ అక్కౌంట్సు గదిలోకొచ్చి గుమాస్తాను నిద్రలేపాడు.

"క్షమించండి.... ముఖ్యమైన వార్త చెప్పాల్సి ఉంది. లేకపోతే నిద్రాభంగం చెయ్యను.... మిమ్మల్ని డిస్మిసు చేశాను. పడుకుని లేచాక యింటికెళ్ళిపొండి." ★

ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్న గ్రాడ్యుయేట్ కుర్రాడు, పర్సనాలిటీ టెస్టుకి హాజరయ్యాడు. ఇంటర్వ్యూ చేసే వారిలో ఒక మనస్తత్వవేత్త కూడా ఉన్నాడు. అతడు ఒక కాగితం మీద పెన్సిల్‌తో త్రిభుజం గీసి "దీన్ని చూస్తే నీకేం జ్ఞాపకం వస్తుంది?" అని అడిగాడు.

"సెక్స్" అన్నాడు అభ్యర్థి

ఒక వృత్తం గీసి "ఇది చూస్తే?" అన్నాడు

"సెక్స్" అన్నాడు అభ్యర్థి

మనస్తత్వవేత్త పెన్సిల్ కిందపెట్టి "మిస్టర్! నీకు ప్రపంచంలో సెక్స్ తప్ప మరేమీ లేనట్టుందే?!" అన్నాడు.

అభ్యర్థికి కోపంవచ్చి "నాకా? సెక్సా? కాగితంనిండా మీరు బూతు బొమ్మలు గీస్తూను!" అని లేచి వెళ్ళిపోయాడు. ★

"హలో బి.సి. కంపెనీ అండి. ఎవరూ పిల్చేది?"

"నేనేనోయ్ మీ మేనేజరు పీనుగని!" ★




**దే**శంలో నిరుద్యోగుల సంఖ్య లెక్కగట్ట దలచుకుంటే గుర్రప్పందాల దగ్గర ఆరంభించాలి అని ఒకాయన అభిప్రాయం. ★

**సు**బ్బయ్య గారికి సుస్తీ చేసింది. మేనేజరుగారు చూడ్డానికి వచ్చారు. "మరేం కంగారు పడకండి పనిగురించి. మీ పని అంతా మీతోటి వాళ్ళు వంతులు వేసుకు ఈ పదిరోజులూ చేసి పెడతామన్నారు కాని మీరు మామూలుగా చేసే పనేమిటో ఎవరికీ తెలిసి చావటంలేదు. అదే చిక్కు." అన్నాడు విచారంగా. ★

"**ఒం**ట్లో బాగా నీరసంగా ఉందండి. ఓ వారం సెలవిప్పిస్తే రెస్టు తీసుకుందామని...."

"నేను మొన్న వారంరోజులు ఊరెళ్ళొచ్చానుగా, ఇంకా రెస్టేమిటి?" ★

**ఆ**లస్యంగా వస్తున్న గుమాస్తాను చూసి మండిపడ్డాడు మేనేజరుగారు.

"మీరిక్కడ తొమ్మిదిన్నరకి ఉండవలసింది." అన్నాడు కోపం నిగ్రహించుకొని.

"ఏం? ఏం సార్? ఏం జరిగింది? తొమ్మిదిన్నరకేమైనా విశేషం జరిగిందా?" అంటూ ఉత్సాహంగా నల్దిశలా చూశాడు గుమాస్తా.

"మీరు ఆఫీసుకు రావలసిన టైమైంది అప్పుడు" ★



కొత్త గుమాస్తా ఆఫీసుకి బెడ్డింగు తెచ్చుకోడం చూసి, పాతగుమాస్తా విస్తుపోయాడు.

"కలికాలం గాపోతే చేరి పదిరోజులు కాలేదు. అప్పుడే బెడ్డింగు తెచ్చేసుకున్నారే! నేను చేరిన కొత్తలో ఐదారేళ్ళవరకూ చాపా దిండూ మాత్రమే వేసుకునేవాణ్ణి. దానికే మేనేజరు ఏడ్చేవాడు." అన్నాడు పందిరి పట్టిమంచం ఎక్కుతూ. ★




శ్రీరామచంద్రుడికి ఒకనాడు నిద్రకు ఉపక్రమించే వేళ ఒక గొప్ప సందేహం కలిగింది. వెంటనే లేచి కాలినడకన వశిష్ఠులవారి విడిదికి వెళ్ళి తలుపు తట్టాడు.

"ఎవరది?" అన్నాడు కులగురువు.

"నేనే!"

"నేనంటే"

"అది తెలుసుకుందికే ఈ వేళప్పుడు వచ్చాను స్వామీ" అన్నాడు పురుషోత్తముడు. ★

"నాతో నేనే మాట్లాడుకోడం మహ అలవాటైపోయింది డాక్టరుగారూ కాస్తమందేమైనా ఇస్తే-"

"దాంతో ఇబ్బందేముందండీ, మందెందుకు?"

"అబ్బే వెధవ సోదండీ. విసుగేస్తోంది వాగలేకా, వినలేకా" ★

కారం కాని కారం ఏమిటన్న ప్రశ్న వచ్చింది.

వెటకారం అన్నారొకరు. అది చేసేవాడికే తీపి కాని మింగేవాడికి కారమే. చమత్కారమూ అంతే. నిజంగా కారం కానిది, కాకపోవడమే కాక మధురాతి మధురంగా ఉండే కారం – మమకారం. ★

అర్ధాంగి కులాసాగా కబుర్లు చెబుతూ భర్తని పరీక్షించడానికి ఒక చిక్కు ప్రశ్న వేసింది.

"ఏమండీ మీరూ, నేనూ, పిల్లలూ పడవలో గోదారిమీద పోతుంటే పడవ మునిగిపోతుందనుకోండి. అప్పుడు మీరు ముందెవర్ని రక్షిస్తారు? పిల్లల్నా? నన్నా?"

"నన్నే" అన్నాడు భర్త గుంభనంగా. ★

ఇద్దరు నిరుద్యోగులు కాలక్షేపానికి కబుర్లు చెప్పుకుంటున్నారు. "ఏరా బ్రదర్. ఒకటే ఉద్యోగానికి మనం, మరో పదిమందీ దరఖాస్తులు వేశామనుకో. నిన్ను వరుసలో దొంతరపెట్టి ఇమ్మంటారు. ముందర నీది పెడతావా నాది పెడతావా?"

"వర్ణక్రమం ప్రకారం 'నా' తరవాతేగదా 'నీ' వంతు" అన్నాడు మిత్రుడు. ★

ముగ్గురు వ్యక్తులు సర్వసంగ పరిత్యాగం చేసి తపస్సు చేశారు. భగవంతుడు ఒక్కసారి లీలగా కనబడి:

"మీలో అహంకార మమకారాలు పూర్తిగా పోయినట్టేగా?" అన్నాడు.

"పోయింది స్వామీ, నీ నామస్మరణతో తాదాత్మ్యం పొందాము. మాలో మా మీ నా నీ అనే భేదాలు ఏవీ లేవు" అన్నారు ముగ్గురు.

"సరే మంచిది. ప్రస్తుతానికి మీ ముగ్గురిలో ఒకరికే మోక్షం ప్రసాదిస్తాను. ముందెవరికి కావాలి?" అన్నాడు దేవుడు.

"నాకు" అన్నాయి మూడు కంఠాలు ఏకగ్రీవంగా. ★

## పరమానందయ్య శిష్యులు

కొడుకు : అమ్మా ఎందుకమ్మా అన్నీ వేణ్ణీళ్ళల్లో ముంచుతున్నావు?

తల్లి : నాన్నగారిది విష జ్వరం నాయనా. అంచేత ఆయనకు వాడిన గ్లాసులు, చెంచాలు బట్టలూ వేణ్ణీళ్ళల్లో ముంచాలి. అప్పుడు విషక్రిములు చచ్చిపోతాయి.

కొడుకు : అయితే నాన్నని కూడా ముంచమ్మా చప్పున జెరం పోతుంది. ★

తండ్రీ, పాతికేళ్ల కులదీపకుడూ కలిసి రైల్లో వెళ్తున్నారు. కొత్తవాళ్ళని ధైర్యంగా పలకరించి చక్కగా మాట్లాడటం ఎలాగో ఇంటిదగ్గర ఉపదేశించాడు తండ్రి. రైలు కదలగానే కొడుకు ఆ ప్రకారం పరిచయం చేసుకోబోయాడు. ప్రక్కనే ఉన్న చిన్న పిల్లడి తల నిమురుతూ "వీడు మీ అబ్బాయాండీ?" అన్నాడు అటుపక్క ఉన్నావిడను చూసి.

"అవునండీ" అంది తల్లి.

"బాగుంది చక్కటి పిల్లాడు. ఊ––మీకు పెళ్ళి అయిందా?"

చెంప ఛెళ్ళుమంది.

తండ్రి ఆవిడకి సర్ది చెప్పాడు. తరువాత కొడుక్కి బుద్ధి చెప్పాడు. "అలా కాదురా నాన్నా ముందర పెళ్ళయిందా అని కనుక్కున్నాకనే పిల్లల గురించి అడగాలి" అని ఉపదేశించాడు. రైలు దిగి యింటికి వెళ్ళాక చుట్టాలమ్మాయిని చూసి "అమ్మా, మీకు వివాహం అయిందా?" అన్నాడు.

"కాలేదండీ" అంది ఆ పిల్ల తెల్లబోయి.

"బాగుంది! అయితే మీకు పిల్లలెందరు?" అన్నాడు. ★

మేష్టరుగారు సరదాగా కబుర్లు చెబుతూ:

"ఒరేయ్ రామూ, నీకు దేవుడు ప్రత్యక్షమైతే ఏం కోరుకుంటావురా" అన్నాడు.

"చాలా డబ్బు యిమ్మంటానండీ?"

"ఛీ. దేవుడు నాక్కనిపిస్తే ఏమడుగుతానో తెలుసా! నాకు విద్యకావాలీ అంటాను" అన్నాడు గురువుగారు.

"తెలుసండీ, ఎవరికి ఏది తక్కువైతే అది కోరుకుంటాం గదా?" అన్నాడు రాము. ★

పురోహితుడు తన శిష్యుడికి ఎప్పుడేమనాలో జాగ్రత్తగా బోధించాడు.

ఒకనాడు ఒక పెద్దమనిషి ఏడుస్తూ వచ్చి-

"అయ్యా నా భార్య మరణించింది. ఉత్తర క్రియలు జరిపించాలి. రండి" అన్నాడు.

"అయ్యో, ఎంత కష్టం" అంటూనే ఏదో గుర్తుకొచ్చి "అన్నట్టు మీ భార్యగారు రెండేళ్ళ క్రితమే పోయిందిగా. అప్పుడోసారి చేశాం ఉత్తరక్రియలు" అన్నాడు శిష్యుడు.

"తరువాత మళ్ళీ పెళ్ళిచేసుకున్నా లెండి"

"అలాగా సంతోషం. శీఘ్రమే సుపుత్ర ప్రాప్తిరస్తు" అన్నాడు శిష్యుడు ఉత్సాహంగా. ★

ముగ్గురు ఇల్లరికపుటల్లుళ్ళు మామగార్లని గురించి ముచ్చటించు కుంటున్నారు.

మా మామగారు ఓర్థి పరమానందయ్య శిష్యుడోయ్. పైగా నన్ను జడ్డి మనిషంటాడు. మొన్న పదిరూపాయలు చేతికిచ్చి 'నేనిక్కడే ఉంటాగానీ ఓ గుర్రబ్బగ్గీ కొని పట్రా' అన్నాడు. స్టుపిడ్ కాకపోతే, మా యింటి సావిట్లో ఎలా పడుతుంది చెప్పు" అన్నాడు ఒక అల్లుడు.

"మీవాడు మెరుగే. మా మామ మరీ చవట. పొద్దున్న నాకో రూపాయిచ్చి బస్సుమీద బజారుకెళ్ళి అక్కడ షాపులో తనున్నాడో లేడో చూచి రమ్మంటాడు. స్టుపిడ్ కాకపోతే పక్కనే ఫోనుంది గదా. ఫోను చేస్తే బేడతో తెమిలిపోదూ?" అన్నాడింకో జామాత.

"ఫోనంటే గుర్తొచ్చింది. మా మామగారు మొన్న మధ్యాహ్నం నన్ను నిద్రలేపి ఇది పగలా రాత్రా అన్నాడు. పగలేనని ఊహించి చెబితే నమ్మలేదు. ఫోను చేసి కనుక్కుని మళ్ళీ చెబితే సరేనన్నాడు." ★

మేకు తలని గోడకి పెట్టి మొనమీద సుత్తితో బాదేస్తున్నాడొక శిష్యుడు. "నీ దుంపతెగ. అందుకే మన్ని పరమానందయ్య శిష్యులన్నారు. యీ గోడక్కాదు. ఎదురు గోడకన్నమాట" అంటూ సీనియర్ శిష్యుడు మేకును అలాగే పట్టుకుని ఎదురు గోడకు తీసుకు వెళ్ళాడు. ★

## మేకోరాలూ-మిరియాలూ

ఒక రజకుడి గాడిద ఉళ్ళోకొచ్చి ఓ గృహస్తు చూస్తూ ఉండగా, గుమ్మం ముందర పడి చచ్చిపోయింది. సాయంత్రందాకా చూసి దాని యజమానికి కబురంపించాడాయన.

"ఏవబ్బాయి పొద్దుటనగా మా గుమ్మంలో చచ్చిపడుంది నీ గాడిద, దాని సంగచ్చూదవూ?" అన్నాడు.

"చూసేదేటుంది సచ్చిన గాడిదని. మీ గుమ్మంలో సచ్చింది కాబట్టి మీరే యీడిపించుకోవాల. నాకెందుకు సెప్పడం మద్దిన?" అన్నాడు వాడు తెలివిగా.

"అది సరేలే, ఉత్తరక్రియలు జరిపే ముందు దగ్గిర బంధువులకు చెప్పడం ధర్మం గదా. అలాగే. నేనే ఈడిపిస్తాలే" అన్నాడు గేస్తు.★

"శ్రీశ్రీగారూ, మీరెప్పుడేనా బట్టతల మీద పద్యం రాశారా?" అన్నాదు రాళ్ళభండి కుటుంబరావు.

"నేనెప్పుడూ కాగితాలమీదే రాస్తాను" అన్నాడు శ్రీశ్రీ.★

రావుపాటి సుబ్బన్నగారు సన్నగా రివటలా వున్న నారయ్యని చూసి నవ్వి "నిన్ను చూస్తే ఈ దేశం కరువు కాటకాల్తో మలమల మాడిపోతుందనుకోర్రా ఎవరైనా!" అన్నాడు.



"చిత్తం తమర్ని చూడగానే, ఆ కరువుక్కారణం కూడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది" అన్నాడు నారయ్య. ★

"నేన్నీలాక్కాదు. నాకు తెలీని విషయం వస్తే నోరెత్తి ఎన్నడూ మాట్లాడను"

"అవును ఊరంతా అదే అంటారు. నువ్వు ఎన్నడూ పన్నెత్తి పలగ్గా ఏవొక్కడూ చూసి ఎరగడట!" ★

ముళ్ళపాటి నరసింహశాస్త్రిగారూ, శ్రీశ్రీ రైలుస్టేషనులో యదాలాపంగా కలుసుకున్నారు.

"ఊరికేనా?" అన్నారు నరసింహశాస్త్రిగారు.

"ఊరికే" అన్నాడు శ్రీశ్రీ ★

"వాళ్ళిద్దరికీ మధ్య ఏవీ్వీలేదంటారేమిటి – మరీ విడ్డూరం గాపోతే. ఆ రాలుగాయి వెధవ సైకిలు నిన్న సాయంత్రం నాలుగు నుంచి రాత్తిరి పద్దాకా ఆ మేస్టరమ్మ గుమ్మంలోనే ఉంది. నే జూస్తేనే?" – అంది సుబ్బమ్మగారు.

మర్నాడు సాయంత్రం రాలుగాయి వెధవ సైకిలు సుబ్బమ్మగారి గుమ్మంలోనే కట్టిపడేసి ఉంది – సాయంత్రం నాలుగు నుంచి రాత్రి బాగా పొద్దుపోయేదాకా. ★

నీలాటి రేవుపక్కగా గేలం వేసిన జాలరి చేపని పట్టాడు.

"శివ శివ, పొద్దున్నే ఎవరి మొహం చూసిందో – నోరులేని ముండ వీడి బారిని పడింది." జనాంతికంగా జాలిపడింది తోటి చేప.

"నోరుండబట్టే పడిందమ్మోవ్. నోరుమూసుకు తందార్నది పొయ్యింటే గాలాన్నెందుకు పడేది?" అంది జాలరివాడి ఇల్లాలు నవ్వి. ★

ఒక యిల్లాలు బంధువులతో కబుర్లు చెబుతూ "మా ఆయన దేవుడంటివారు. నోట్లో నాలిక లేదు," అంది.

"ఉందో లేదో ఎవడు చూడొచ్చాడు, నువ్వసలాయన్ని నోరుతెరవనిస్తేగా?" అంది ఆవిడ చెల్లెలు. ★

శాస్త్రజ్ఞుడిని పక్కన బెట్టుకొని వ్యవసాయోద్యోగి ఎరువులమీద ఉపన్యాసం ఇచ్చాడు.

"ఒక ఎకరానికి సరిపోయే ఎరువు ఇదిగో ఈ జేబులో వేసుకోవచ్చు" అన్నాడు.

"మరే ఆ ఎకరం పంట రెండు జేబులలో ఇమిడిపోతుంది." అన్నాడు రైతు.★

"నల్లుల బాధ విపరీతముగా యున్నది. వాటిజ్ ది గవర్నమెంట్ డూయింగ్. నేనేం చేయాలి చెప్పండి' అని ఒక పత్రికకు వరసగా ఉత్తరాలు రాయసాగాడు ఒకాయన.

"వాటితో స్నేహం కట్టి మంచి చేసుకోండి. వాటిని ప్రేమించడం నేర్చుకోండి. వాటిలోనూ రక్తం ఉంది. అది మనదే" అని సమాధానం వచ్చింది. ★

ఓ పల్లెటూరి ఆసామి సినిమా కంపెనీకొచ్చి డైరెక్టరు గది దగ్గిర తారట్లాడి లోపలికి తొంగిచూశాడు.

"ఏం" అన్నారు డైరెక్టరు.

"ఈడ మదుసుల్ని దీసుకుంటారంటగా?"

"మరి నువ్వొచ్చావేం?" అన్నాడు డైరెక్టరు నవ్వి.

"నిన్ను జూసి నన్ను కూడా దీసుకుంటారని ఆశపడొచ్చాను" అన్నాడు రైతు. ★

"బావగారు తెగ ఆవలిస్తున్నారు. నిద్దరొస్తున్నట్టుంది." అంది మరదలు ఉపన్యాస వాహినిని ఒక్కక్షణం ఆపి తనూ ఆవలిస్తూ.

"ఆవలింత కాదమ్మా. మంచినీళ్ళు కావాలని అడుగుదామని చూస్తున్నాను...." అన్నాడాయన. ★

## మాలోకం
## (ఏలోకం చూసినా సరే)

భర్త పనిమీద ఊరువెళ్తూ మాలోకం భార్యకి చెక్కు ఒకటి ఇచ్చి "ఇంకా డబ్బు కావలసొస్తే దీనిమీద సంతకం పెట్టి బ్యాంకుకి పంపించు" అన్నాడు.

"ఏవని పెట్టాలి?"

"నీ తలకాయ. నాకు ఉత్తరాలు రాసినప్పుడు కింద నీ పేర్రాయవూ అలాగే" అన్నాడు భర్త.

ఒక వారం తరువాత ఆవిడ చెక్కు తీసి దానిమీద "మీ ప్రియమైన పాదదాసి లక్ష్మి" అని సంతకం పెట్టి బ్యాంకుకు పంపించింది. ★

"నిన్నటి అన్నం ఏమైనా మిగిల్తే ఇవాళ ముష్టివాడికి వెయ్యాలి" అని పద్ధతి చెప్పి పెట్టింది అత్తగారు.

ముష్టివాడు రాగానే "నిన్నటి అన్నం తింటావా?" అంది కోడలు.

"వెయ్యండమ్మా!" అన్నాడు వాడు.

"నిన్నంటే నిన్నకాదు. ఇవాళే మిగిలింది. అందికని రేపు రా వేస్తాను" అంది కోడలు. ★




ఒక పిచ్చాడు పోలీసుఠాణాకొచ్చి ఒగురుస్తూ కూలబడ్డాడు. "ఏనుగొచ్చి నా జేబు కొట్టేసింది సార్."

"అలాగా?" – అని నవ్వుకుని "ఆనవాళ్లూ, గుర్తులూ చెప్పు, నిమిషంలో పట్టుకుందాం" అన్నాడు ఎస్.ఐ. గారు.

పిచ్చాడు జాలిగా నవ్వాడు. "ఏడిసినట్టుంది. అది పిచ్చిదేం కాదు. మారు వేషంలో వచ్చి జేబు కొట్టేసింది." ★

ఒక రైతు పట్నం వచ్చి హోటలుకు వెళ్ళాడు.

"బాబూ – భోజనం దొరుకుతుందా?"

"ఆ పొద్దున్న తొమ్మిదినించీ మధ్యాహ్నం రెండుదాకా పెడుతూనే ఉంటాము."

రైతు విస్తుపోయాడు. "మరీ అంతసేపు వడ్డిస్తే ఎలాగయ్యా – పనులాగిపోవూ!" – అన్నాడు రైతు. ★

కమల : నీకు అద్భుతమైన... అందమైన... ధగ ధగ మెరిసే అమ్మాయి కనబడితే ఏం జేస్తావు?

విమల : కొంతసేపు చూస్తాను. ఇంకా కొంతసేపు చూస్తాను. ఇహ విసుగుపుట్టి అద్దం కింద పెట్టేస్తాను. ★

పిచ్చి బాబొకాయన పిల్లిని మింగేశానన్నాడు. అది లోపల కూర్చుని మ్యావు మంటోందన్నాడు. బరికేస్తోందన్నాడు. అతని పోరుపడలేక డాక్టర్లు ఆపరేషన్ చేసి పిల్లిని తీస్తామన్నారు. ఒకరోజు పొద్దుటే లేవగానే... "నీకు రాత్రి ఆపరేషన్ చేశాం. నిజంగానే నువ్వన్నట్టు పిల్లి ఉంది. ఇదిగో...." అని ఓ తెల్లటి పిల్లిని చూపించారు.

"కొయ్! నేను మింగింది నల్లపిల్లిని!!" అన్నాడా పిచ్చిబాబు. ★

మంత్రిగారు పిచ్చాసుపత్రిలో ప్రేమికుల శాఖ చూస్తానన్నారు. వార్డెన్ ఆయన్ని ఓ గది దగ్గరికి తీసుకెళ్ళాడు. "ఈయన పాపం ఒక సుందరిని ప్రేమించాడు. కాని ఆమె డబ్బు కాశించి మరొకడిని పెళ్ళాడింది. ఇతనికి పిచ్చెక్కి ఇక్కడ చేరాడు"

పక్క గదిలో గడ్డపాయన కూర్చుని నవ్వుకుంటున్నాడు.

"ఇందాక చెప్పిన సుందరి పెళ్ళాడింది వీరినే," అన్నాడు వార్డెన్. ★

పిచ్చాసుపత్రిలో ఒక ఆసామి ఒక్కడే ఉలికులికి నవ్వేసుకుంటున్నాడు. చూడబోయిన ఓ పెద్ద మనిషి దగ్గరగా వెళ్ళి సానుభూతితో అతని సంగతి అడిగాడు.

"అబ్బే లేదండి. నేను జోక్సు పుస్తకం తయారు చేస్తున్నాను. వందల కొద్దీ జోక్సు రాశానేమో ఒక్కొక్కటే గుర్తొచ్చి విరగబడి నవ్వకో సాగాను. అది చూసి నాకు పిచ్చెక్కిందని తెచ్చి ఇందులో పడేశారు. పిచ్చి వెధవలు." అని పకపకా నవ్వాడతను. ★

రాష్ట్రమంత్రి పిచ్చాసుపత్రి చూడబోయాడు. ఒకతను దగ్గరకు వచ్చి "ఎవడు నువ్వు" అని గద్దించాడు. చుట్టూ వున్న అధికారులను ఆగమని సైగ చేసి, మంత్రిగారు తన హోదా చెప్పారు.

అతను చుట్టూ చూసి ఇంకా దగ్గరగా వచ్చి చెవిలో చెప్పాడు. "నాకు తెలుసు, నేను నమ్ముతాను. కాని గట్టిగా అనకు. ఇంకెవరికీ చెప్పకు. చెబితే నాకు పట్టిన గతే నీకూ పడుతుంది," ★

**వె**ంగళప్ప కాగితం కలం తెప్పించుకుని బుద్ధిగా కూచుని ఉత్తరం రాయసాగాడు.

ఓ గంట తరవాత వైద్యుడు వచ్చి అడిగాడు, "ఏవిటి వెంగళప్పా, తెగరాస్తున్నావు?" అని

"ఉత్తరం అండీ,"

"ఎవరికి?"

"ఎవరికో రాయడానికి నాకేం పట్టింది, నాకే రాస్తున్నాను,"

"ఏమని రాశావు?" అన్నాడు డాక్టరు నవ్వుకుని.

"నీకేం పిచ్చా వెర్రా, ఉత్తరం ఇంకా రాయలేదు; పోస్టులో వెయ్యలేదు; నాకు అందలేదు. అందులో ఏముందో ఎలా చెప్పనయ్యా!?" అన్నాడు వెంగళప్ప జాలిగా నవ్వి. ★

**పి**చ్చాసుపత్రి చూడబోయిన ఒకాయన ఒక గదిలో ఇద్దరు పిచ్చివాళ్ళు తనకేసి దీక్షగా చూడడం గమనించి తను వారికేసి చూస్తూ గుడ్లప్పగించి నిలబడిపోయాడు.

గదిలో ఇద్దరిలో ఒకడు రెండోవాడి భుజం తట్టాడు. "ఇదికాదు బ్రదర్ పద్ధతి – మనని గదిలో పెట్టి పిచ్చివాళ్ళని తీసుకొచ్చి చూపించడం పిచ్చి పద్ధతి. అంతకన్న పిచ్చివాళ్ళనే గదుల్లోపెట్టి మనం మామూలుగా వచ్చి చూసిపోయే ఏర్పాటు చేస్తే బాగుండదూ?" అన్నాడు. ★

"**పి**చ్చి పూర్తిగా కుదిరిపోయిందనీ, మర్నాడు ఇంటికి పంపిస్తున్నామనీ" చెప్పాడు డాక్టరు.

పిచ్చయ్య మర్నాడు ప్రొద్దుటే లేచి గడ్డం చేసుకుంటున్నాడు – స్నానం గీనం చేసి సిద్ధమవుదామని. అంతలో గదితలుపు ఎవరో తెరచినట్టయి వెనక్కి తిరిగాడు. చెయి తగిలి అద్దం జారి పడిపోయింది.

పిచ్చయ్య ఇటు తిరిగేసరికి అద్దంలో తన మొహం కనబడలేదు.

"డామిట్! చూడండి డాక్టరుగారూ! ఇవాళ విడుదల చేస్తున్నారు గదా, ఇంటికి పోదాం అనుకుంటూ వుంటే పరాకులో పీకె తెగ్గోసుకు తలకాయెక్కడో పారేసుకున్నాను. ఇప్పుడు ఇంటి కే మొహం పెట్టుకెళ్ళమంటారు?" అన్నాడు పిచ్చయ్య. ★

పల్లెటూరి మామగారు బస్తీలో అల్లుడింటికి వచ్చాడు. అల్లుడు పట్నంలో సదుపాయాలన్నీ చూపించాడు.

మర్నాడు సాయంత్రం అల్లుడు ఆఫీసునించి ఆలస్యంగా వచ్చేసరికి మామగారు కంగారు పడిపోతున్నాడు అల్లుడు తప్పిపోయాడు గాబోలని.

"పోనీ అదేదో ఆ టిల్లీఫోనన్నా చెయ్యకపోతివే – ఆలీసం అవుతుందనీ"

"మనింట్లో ఫోను లేదుగా," అన్నాడు అల్లుడు నవ్వి

"ఇంట్లో లేపోతే మాత్రం. మీ యాఫీసులో ఉందన్నావుగా?". ★

దారికొస్తున్న పిచ్చివాళ్ళను పదిమందిని కాల్వగట్టుకు షికారు తీసుకెళ్ళారు డాక్టర్లు. హఠాత్తుగా ఒకతను కాలు జారి కాలవలో పడిపోయాడు. ఇంకో పిచ్చివాడు వెంటనే దూకి అతన్ని కాపాడి పైకి తీసుకొచ్చాడు. డాక్టరు ఇతన్ని అభినందించాడు. "నువ్వు ఒక ప్రాణాన్ని కాపాడావు. విలువలు తెలిశాయన్నమాట. నీవల్ల ఎవరికీ హాని వుండదు. అందువల్ల నిన్ను త్వరలోనే విడుదల చేస్తారు," అని.

మర్నాడు ఉదయం డాక్టరు పరుగెత్తుకు వచ్చి, "పిచ్చయ్యా! నిన్న నువ్వు రక్షించిన వాడు పాపం ఉరేసుకు చచ్చిపోయాడు." అన్నాడు.

పిచ్చయ్య నవ్వాడు, "భలేవారండి! ఉరీకాదు ఏం కాదు. నిన్న నీళ్ళలో తడిశాడు గదా అని ఎండబెట్టడానికి నేనే వాణ్ణి దూలానికి వేళ్ళాడగట్టాను." ★

"ఎంత పన్జేశావ్ నాతల్లీ! కుటుంబ గౌరవం మంటగలిపేశావే నాతల్లీ" అంటూ నోరు నొక్కుకుని ఏడ్చింది తల్లి-కూతురు చేసిన ఓఘాయిత్యం ఆ పిల్ల నోటే విని. ఒక్క క్షణంలో కోపం.... దుఃఖం తమాయించుకుంది.

"సరే. జరిగిందేదో జరిగింది. నాన్నకి చెప్పకు, చంపేస్తారు. అన్నయ్యకి చెప్పకు. వాడసలే రౌడీ వెధవ-ఊరంతా చాటుతాడు గొప్ప అనుకుని. లేకపోతే వెళ్ళి ఈ పాడుపని చేసిన వెధవని పొడిచేస్తాడు. చెల్లాయికి చెప్పకు. ఇంటింటికీ వెళ్ళి వాగుతుంది. అదసలే మాలోకం." అంది తల్లి.

"మరి నువ్వా?... నువ్వెవరికీ....పక్కింటి పిన్నిగారికి కూడా చెప్పవుగా?"-

"నేనా? నేనెలా చెబుతానే నాతల్లీ. ఇది బయటకి పొక్కితే పరువు గంగలో కలుస్తుంది. నీకు పెళ్ళికాదు. నేను వెళ్ళి నూతిలో పడిపోతాను. ఇపుడే భయపడకు." అంది తల్లి. ★

# కాలమానం

సత్యకాలపు బామ్మల లెక్కవేరు.

"బామ్మా, బామ్మా ఇవాళ పదింటికల్లా వంటచేసి అన్నం పెట్టాలి. కోర్టు పనుంది" అన్నాడు ఒక లాయరు మనవడు.

"పదెందుకురా నాన్నా, రొండింటికల్లా పెట్టేస్తాను." అందావిడ. ★



స్త్రీల కాలమానం దేవతల కాలమానానికి దగ్గరగా ఉంటుంది - ముఖ్యంగా అలంకరణ విషయంలో. సినిమాకి వెళ్లే ముందు - ఒక మామూలు క్షణం ఒక పురుషయుగం. అలాటి పురుషయుగాలు రెండు కోట్లు కలిస్తే ఒక స్త్రీ నిముషం, అలాటి నిముషాలు నూటయాభై అయితే ఒక చీర సింగారింపు. నూరు చీర సింగారింపులు ఒక పౌడరు కోటా. నూరు కోటాలకాలం ఒక తిలకధారణ, నూరు తిలకాలు కలిస్తే ఒక దర్పణ ప్రతిబింబ పర్యవేక్షణ. ★

ఒక యిల్లాలు చీరకట్టి నగలుపెట్టి పేరంటానికి బయల్దేరింది - తెలిసిన వాళ్ళ పిల్లకి బారసాల సందర్భంగా.

ఈవిడ వీధిలోకి వచ్చి రథం యెక్క బోయేసరికి కనబడలేదు. కారు ఉంది. పైగా దారేపోయే జనం ఏదో పల్చని సాదా చీరలు కట్టుకున్నారు. నగల్లేవు.

ఈవిడ చీని చీనాంబరాలనీ, కిరీటాన్నీ, పుట్టెడు నగలనీ చూసి వారు, వారిని చూసి ఈవిడ విస్తుపోయారుట. ★

అలంకరణ త్వరగా తెమిలేలా చేయాలని పురుషులంతా కూడబలుక్కుని ఫాషన్‌లు ప్రవేశపెట్టారు. అవి త్వరత్వరగా మార్చసాగారు.

పారిస్‌లో ఒకపిల్ల సరికొత్త ఫాషన్‌లో కొత్తగౌను గబగబా తొడుక్కుని వీధిలోకి పరుగున వచ్చింది. లాభంలేదు, ఫాషను మారిపోయిందన్నారు.

అప్పట్నుంచి ఆమె ఓ పెద్ద కత్తిర పట్టుకునేది. ఫాషను మారగానే తొడుక్కున్న గౌనుని అడుగునుంచి ఓ అంగుళం కత్తిరించేసేది. ★

శకుంతలమార్కు ఫాషను (అసలు రవికలు లేకపోవడం) వచ్చేలోగా జాకెట్ల చేతులు పెరగసాగాయి. దీనికి కత్తెర్లు పనికిరావు గదా.

ఒకాయన దూరం ఆలోచించి మణికట్టుదాకా చేతులూ, మోకాళ్ళ దాకా అంచులూ ఉన్న శాల్తీలు కుట్టించాడు భార్యకి. ఆవిడ వాటిని పైకంటా మడతపెట్టుకునేది. ఫాషను పెరిగినప్పుడల్లా ఒక్కో మడత విప్పేది. ★

ప్రేమికుల కాలమానం నిలకడలేదు. ఒకరికొకరు కనబడకపోతే క్షణమొక యుగం. కౌగలించుకొని ఉంటే యుగమొక క్షణం. వాళ్ళని టైమడగడం మంచిది కాదు. ★

"కాలం అమూల్యమైనది," అన్నాడో వక్త సుదీర్ఘోపన్యాసాన్ని కొనసాగిస్తూ.
"ఔను, విలువ లేదనే కాబోలు అలా ఖాతరు లేకుండా మీరు దాన్ని తగలేస్తున్నారు" అన్నాడో శ్రోత. ★

"టైమెంతైందండి" అని అడిగాడు ఒక ప్రయాణీకుడు.

ఇవతలి పెద్దమనిషి రెండుగడియారాలు తీసిచూసి టైము చెప్పాడు.

"రెండు చూస్తున్నారేమిటి? ఒకటి స్లో ఒకటి ఫాస్టూ కాబోలు...."

"అబ్బే ఓ దాని చిన్నముల్లుపోయిందండి. రెండో దానికి నిమిషాల ముల్లు లేదు. అందుకని రెండూ పట్టుకుంటాను. ఎపుడూ. ★

# పది సత్యాలు

(ఇదికాదు, ఇదికాదు)

"నేనీ వాక్యం పూర్తి చేసిన క్షణంలో నువ్వు పచ్చి అబద్ధం చెప్ప గలిగితే పది రూపాయలిస్తాను."

"అదేమిటయ్యా, ఇరవై ఇస్తానని పదిహేనుకి తగ్గించావు ఇంతలో!" ★

"తిరుగులేని సత్యాలు మూడు ఈ పళంగా చెప్పాలి. ఏ ఒక్కటీ అసత్యమని నాకు తోచినా తలకొట్టి కోటగుమ్మానికి కడతాను," అన్నారు రాజుగారు వినోద కాలక్షేప సభలో.

"అయ్యా, మీ తల్లి గొడ్రాలుకాదు; మీ భార్య కులటకాదు; మీరు అన్నమాట తప్పరు" అన్నాడు విదూషకుడు. ★

ఒక వ్యాపారస్తుడు కోర్టులో వ్యాజ్యెం లాయరుకు ఒప్పగించి పనిమీద పొరుగూరు వెళ్తూ తీర్పురాగానే ఏ సంగతీ టెలిగ్రాం యివ్వమని చెప్పాడు.

మూడోనాడు లాయరు టెలిగ్రాం పంపాడు. "ధర్మమే నెగ్గింది" అని

ఓ గంటలో వ్యాపారస్థుడి దగ్గరనుండి తిరుగు టెలిగ్రాం వచ్చింది, "అయితే అప్పీలు చేయండి." ★

సత్యమే చెబుతాననిపించి ప్రమాణం చేయించారు కోర్టువారు.

"అబ్బే, ఇలా ముందరి కాళ్ళకి బందాలేసి ఒట్లూ, సత్యాలూ పెట్టించేస్తే ఇంక నేను చెప్పేదేముంటుంది. మీకు మటుకు వెవహారాలెలా నడుస్తాయి. మేన్నిజాలు చెప్పేస్తే మీరెందుకూ" అన్నాడు సాక్షి విసుగ్గా. ★

## బహు-మతులు

నెక్లెసు పోయిందనీ, వెతికి ఇచ్చిన వారికి బహుమతి ఇస్తాననీ ప్రకటించాడొకాయన. మర్నాడు అది ఎత్తుకుపోయిన దొంగ దొరికాడు. పోలీసులు అతన్ని ఖైదుకు తీసుకుపోతున్నారు.

"ఉండండి, ఆ బహుమతి ఇస్తారేమో అడిగొస్తాను," అన్నాడు దొంగ. ★

## హెచ్చెరిక




"మా యింట్లో మా ఆవిడదే పై చెయ్యి. అంచేత ఆవిడ మాటే చెల్లుతుంది," అన్నాడు ఒకాయన.

"నేనలా ఊరుకోలేనోయ్. ఏవో చిన్న విషయాలు దానికి వదిలేసి పెద్ద విషయాలన్నీ నేనే చూసుకుంటాను. వాటిపై తుది నిర్ణయం నాదే."

"అంటే? ఏవిటా చిన్నా పెద్దా?"

"అంటే, కూరేం వండాలి! సినిమా కెప్పుడెళ్ళాలి? దేని కెళ్ళాలి? చీరలెన్ని కొనాలి? నగలెక్కడ చేయించాలి? పిల్లాడిని ఏ బళ్ళో వెయ్యాలి? నాకు చొక్కాలెన్నుండాలి? రోజుఖర్చు అణావుండాలా అర్ధణా చాలా? ఇలాటి మైనర్ విషయాలు ఆవిడ హయాము.

"పోతే పంచవర్షప్రణాళిక. కామన్‌వెల్తులో మన సభ్యత్వం, నిరాయుధీకరణ, కాంగో సమస్య, భాషారాష్ట్రాలు వగైరా పెద్దవిషయాలు నావి."★

## మర్యాద రామన్న

రైల్లో ఇద్దరు హోరున (ఆడవాళ్ళే) వాదించుకుంటున్నారు. ఒకావిడ కిటికీ తలుపు మూసెయ్య మంటుంది. "ఈ వెధవ గాలి నాకు పడదు. జలుబుచేసి చస్తాను." అంది. "వల్లకాదు, ఇది కనక మూసేస్తే ఊపిరాడక నేను చస్తాను" అంది రెండో ఆవిడ.

కర్తవ్యం తోచక ప్రయాణీకులు తికమక పడుతున్నారు.

"ముందర కాసేపు తలుపు మూసేద్దాం. ఒకావిడ చస్తుంది. ఆ తరవాత తీసేద్దాం. రెండో ఆవిడ చస్తుంది. తరవాత మనం హాయిగా బతుకుదాం." అన్నాడు మర్యాద రామన్న. ★

## సోమరులు

ఊపిరి సలపనంత పనితో సతమతమవుతున్న ఒక అధికారి చిరాగ్గా గుమస్తాను పిలిచి, "ఏవఁయ్యా, ఆ పెన్సిలు ముక్క ఎక్కడ పడేశానో చూడు చూడు, వెతుకు వెతుకు" అన్నాడు.

"మీ చెవిలోనే ఉందండి."

"ఏ చెవో చూస్చెప్పలేవటయ్యా." ★

మహా సోమరిని ఎన్నికచేసి ఆస్థాన సోమరిపోతును నియమించాలని రాజుగారు సభచేశారు.

"సోమరులంతా చేతు లెత్తండి," అన్నారు.

ఒక్కడు తప్ప అంతా చేతులెత్తారు.

"నువ్వు సోమరివి కావా?" అన్నాడు రాజుగారు.

"ఊఁ" అన్నాడు సోమరి.

"మరి చెయ్యెత్తవేం"

కాసేపుందురూ చూదాం" ★

ఇనస్పెక్టరు పిల్లల్ని పరీక్షిస్తూ, "అబ్బాయ్, భారతం రాసిందెవరూ?" అన్నారు ఓ కుర్రాణ్ణి చూసి.

"నేను కాదండీ" అన్నాడు వాడు ఉలిక్కిపడిలేచి.

"నువ్వు... నువ్వు.... నువ్వు–" అంటూ దడదడా మరి ముగ్గుర్ని అడిగారాయన ధాటిగా.

వాళ్ళంతా భయపడి, నేను కాదంటే నేనుకాదు అన్నారు.

ఇన్‌స్పెక్టరుగారు పంతులుగారి కేసి చూశారు. మాట వస్తుందని భయపడుతున్న మాష్టరుగారు మరింత కంగారుగా "ఆ మొదటి వెధవే రాసుంటాడండి. నేను తర్వాత కనుక్కుంటాలెండి" అన్నాడు. ★




"నేఁడే చూడండి" అని ప్రతి సినిమా ప్రకటనలో వేస్తారుగదా అంత కొంప మునిగిపోయే అర్జెంటేమిటీ?" అన్నాడొకాయన విసుగ్గా.

"రేపుండదని హెచ్చరిక." అన్నాడు నాడేసినిమా చూసివచ్చిన ప్రేక్షకుడు. ★

నేఁటి పనివత్తిడిని తగ్గించే సులభసాధనం.... రేపు. ★




"దెయ్యాలు లేవు" అని ఒక భేతాళుడితో వాదించి, ధైర్యంగా అమావాస్యనాడు అర్ధరాత్రివేళ వల్లకాటికి ఒక్కడూ వెళ్ళాడు ఒక ఆంజనేయులు ఈలవేస్తూ.

తిరిగి వస్తుండగా, భేతాళుడు చెట్టు వెనక నక్కి "హో హో హో హో" అన్నాడు.

ఆంజనేయులు ఈలపాట, గుండెమోత, తరువాత శాల్తీ ఆగిపోయాయి.

"నాకు తెలుసు భేతాళంగారూ. మీరు ఏ చెట్టు వెనకో నక్కి నన్ను ఝడిపించాలని చూస్తున్నారు.... సర్లెండి అలాగే ఝడుసుకుంటాను," అంటూ ఒక్కసారిగా పరుగు లంకించుకున్నాడు ఆంజనేయులు. ★

ఒక ప్రముఖ వ్యాపారస్థుడు - రామయ్య అన్ని విధాలా దెబ్బతిని, మనోవ్యాధితో మంచంపట్టి మరణించాడు. ఇంకో నెల్లాళ్ళకి అగ్నిప్రమాదాలు... వరదలు.... రాబడిపన్ను.... వచ్చి ఉన్న ఆస్తి కూడా తుడుచుకు పోయింది.

"ఇంకా నయం! చచ్చాను కాబట్టి బతికి పోయాను. ఈస్థితిలో బతికుంటే బాధలు పడలేక చచ్చేవాణ్ణి!".... అనుకుంది రావిచెట్టుమీద కూర్చుని అంతా చూసిన రామయ్యగారు. ★

"సుబ్బారావు పోయాట్ట! రెండుసార్లు టైఫాయిడ్ వచ్చిందట పాపం!"

"అలాగా! ఇంతకీ అతను మొదటిసారి టైఫాయిడుకి పోయాడా.... రెండోసారి వచ్చినప్పుడా?" ★

కథా రచయిత రావికొండలరావు చెప్పిన కథలలో ఒకటి అద్భుతంగా ఉంటుంది.

ఒక బీద గుమాస్తా ఈ లోకంలో జీవిస్తూ యమబాధలు పడలేక కొండమీంచి దూకి ఆత్మహత్య చేసుకుంటాడు. తీరా యమలోకంలో బాధలు ఇతననుకున్నట్టు భూలోకం కన్న మెరుగ్గా లేవు. 'ఈ యమయాతన పడలేను బాబోయ్'.... అనుకుని యమలోకపు సింహద్వారం మీంచి దూకి తిరిగి ఆత్మహత్య చేసుకుంటాడు. ★

మద్రాసులో చాలామందికి అస్తమానం తమలపాకులు నమలడం అలవాటు. కిళ్ళీకొట్లో తమలపాకులు, వక్కపొడి కొనుక్కుని రోడ్డుమీద నడుస్తూనే ఆకులకి సున్నం రాసుకుని నముల్తూ ఉంటారు. చేతికంటిన సున్నం కనబడిన ఎలక్ట్రిక్ స్తంభానికల్లా రాస్తూ పోతూ ఉంటారు. మద్రాసులో ఏ స్తంభాన్ని చూసినా సున్నం మరకలే కనిపిస్తాయి.

వీళ్ళకోసం ఒక బాబ్జీ ఒక కొత్తరకం నరకం ఊహించాడు. అక్కడ స్తంభాలు, గోడలు వుండవు. ★

"దెయ్యాలున్నాయంటారా?" అని చర్చ ఆరంభిస్తూ ఉండేవాడొకాయన. ఎవరు ఎప్పుడు ఎక్కడ కనిపించినా ఇదే ప్రశ్నవేసేవాడు. ఏళ్ళతరబడి అడుగుతున్నా ఆయనకి తృప్తి కలిగించే ఋజువులు దొరకలేదు.

విసుగులేకుండా లక్షాపదకొండోసారి మళ్ళీ ఆ ప్రశ్నవేశాడాయన – ఒక

"బావుంది. లేకపోతే మనమెల్లా మాట్లాడుకోగలుగుతున్నాం?" అందా పెద్దమనిషి చప్పుడులేకుండా ఫెళ్ళున నవ్వి. ★

మొగుడూ పెళ్ళాలు ఒక ఒప్పందం చేసుకున్నారు – ఇద్దరిలో ముందుగా ఎవరు చచ్చిపోతే వాళ్ళు దెయ్యమైవచ్చి, రెండోవాళ్ళకి పొరుగులోకం భోగట్టాలు.... సాధక బాధకాలు చెప్పాలని.

"బాబ్బాబూ... మీరు ముందుచస్తే పగటి పూటే వచ్చి కనబడండి. రాత్రిపూట వచ్చారంటే నేను హడలి చస్తాను." అంది భార్య. ★

ఒక మెతక మొగుడూ గయ్యాళి పెళ్ళాం కాస్తటూ యిటూగా దెయ్యాలై ఓ వల్లకాటి దెయ్యాల సభలో తారసపడ్డారు.

"ఎలా వున్నారు? కులాసానా" అంది భార్య ముక్కు చీదుకుంటూ.

"హాయిగా వున్నా, చాలా హాయిగా" అన్నాడు భర్త... చాలా ధైర్యంగా.

"ఆ యొక్క భూలోకంలో నాతో కాపురం చేసినప్పటికన్నానా?"

"ఆహా! అంతకి వెయ్యిరెట్లు. ఈ సుఖం ముందు అదెంతని?"

"ఏం కూశారు... మీ దిక్కుమాలిన స్వర్గం మన యిల్లుకన్న బాగుంటుందా?"

"పిచ్చిమొహమా... ఇంతాజేసి నేనుండేది స్వర్గం కాదు. నరకం!" ★

ఇద్దరు సినిమాహాలు మేనేజర్లు కలిశారు.

"ఏమిటో... అన్నీ చెత్త సినిమాలు గురూ. అన్నీ ఫ్లాపులే. మా హాలు మరీ దెయ్యాల కొంపలా వుందంటే నమ్ము."

"నయమే, మా హాల్లో ఆ దెయ్యాలుకూడా లేవు. మావన్నీ గోల్డుమెడల్ పిక్చర్లు!" ★

తద్దినం పిండాలు తింటున్న అయిదారు కాకులు మాట్లాడుకుంటున్నాయి!

"నీకు పూర్వజన్మమీద నమ్మకం వుందషోయ్?"

"ఉన్నట్టే అనుకో. ఈ పిండాకూడు పెట్టేవాడి బాబే ఈ జన్మలో మనం అయుండాలి గద!"

"మరీ ఇంత మందిమా" .... అందో నాస్తిక్కాకి. ★

హనుమాన్లు: అయ్యా – మీకు దెయ్యాలమీద నమ్మకం ఉందా?

మాంత్రికుడు: లేదు. దొంగపీనుగలు నేను మంత్రం వేశాక పోయినట్టే పోయి మళ్లీ ఇట్టే వచ్చి వాల్తున్నాయి! బొత్తిగా దగాకోరు దెయ్యాలు. ★

ఓ కుటుంబరావు అన్ని విధాలా దెబ్బతిన్నాడు. మనసు పాడై చచ్చిపోదామని గోదావరి బ్రిడ్జీ ఎక్కి దూకబోయాడు. వాడి నాన్న దెయ్యం అడ్డుపడి ఆపింది.

"అబ్బాయ్, నువ్వు చస్తే నాకు పిండాకూడు దొరకదురా..." అంటే "బతికుంటే నాకు దొరకదు గదా" అన్నాడు కొడుకు. "నా మాట విను. డబ్బు గడించే ట్రిక్కులు చెప్తాను. రేపు మెడ్రాసెళ్ళి రేసాడు" అంది తండ్రి దెయ్యం.

కొడుకు మెడ్రాసెళ్ళి రేసుకోర్సులో కౌంటర్ దగ్గర నిలబడ్డాడు.... వాచీ అమ్మిన డబ్బుతో:

"డేర్ డెవిల్ గుర్రం మీద కాయి" అంది దెయ్యపు కంఠం.

కాసి అయిదు వేలు గెలిచాడు.

"హెల్‌ఫైర్ మీద కాయి." అంది దెయ్యపు కంఠం.

కాసి యాభై వేలు గెలిచాడు.

"ఈ సారి 'బాస్టర్డ్ గోస్ట్' మీద కాయి"

కాసి అయిదు లక్షలు గెలిచాడు.

"ఇక చాలు. నీ అదృష్టమింతే. ఇంక రేసులాడకు." అంది దెయ్యం.

"ఏడిశావు! నీ బోడి సలహా....నువ్వూను. "ది ఎండ్".... మీద రూపాయికి వెయ్యి రెట్లు ఇస్తున్నారు." అంటూ అయిదు లక్షలూ కాసి ఓడిపోయాడు.

చీకటి పడినా అక్కడే కూచుని ఒక్కడూ ఏడుస్తున్నాడు.

తండ్రి దెయ్యం వచ్చింది.

"తండ్రీ! ఇప్పుడేం దారి!" అంటూ గోలపెట్టాడు.

"మొన్న నువ్వు బయల్దేరిందే – గోదావరి బ్రిడ్జీ ఎక్కి దూకేయ్." ★

అమావాస్య అర్థరాత్రివేళ మర్రిచెట్టుమీద కూర్చున్న ఒక దయ్యం ఇంకోదాన్ని అడుగుతోంది.

"అసలు మనుషులనే వాళ్ళున్నారంటావా?" ★




దారేపోయే దానయ్యను ఒకతోపు తోసి ఆగింది కారు.

"ఏవయ్యా కళ్ళులేవూ! చూసి నడపలేవూ కారు?" అన్నాడు దానయ్య.

"బుద్ధిలేదూ చూసుకు నడవలేవూ?" అన్నాడు కారుమీది మనిషి.

"నడపడం చేతకాదనరాదూ?"

"చేతకాకనేం నేను ఎనిమిదేళ్ళనించి కారు నడుపుతున్నాను – నీకే నడవడం రాదు."

"నేను నలభై ఏళ్ళనించీ నడుస్తున్నాను" ★




ఒక ధనరాజుగారు కార్ల కంపెనీకి వెళ్ళి నించున్న పళంగా కొత్తకారు కావాలన్నాడు.

సేల్స్‌మన్ ఆశ్చర్యపడి లేచి, "సార్! కొత్తకారుకి పెద్ద క్యూ ఉంది. ఇవాళ అడిగితే ఎనిమిది నెల్లకి మీ కోటా వస్తే గొప్ప." అన్నాడు.

"నాకు అరువులూ, వాయిదాలూ అక్కర్లేదు. డబ్బంతా ఇప్పుడే కట్టేస్తా." అంటూ సంచీ తెరచి పదివేల రూపాయల నోట్లకట్ట చూపించాడు.

"డబ్బంతా ఇప్పుడే కడతాననేవాళ్ళ క్యూలో 1700 మంది వున్నారు." అన్నాడు సేల్స్‌మన్.

"చచ్చాం, పాడు దేశం." అని తిట్టుకుంటూ చేతిలో నోట్ల కట్టని గోడకేసి కొట్టి జోరుగా వెళ్ళిపోయాడు – ధనరాజు.

మర్నాడు ఉదయం ఆయన ఇంటి పోర్టికోలో కొత్తకారు నిలబెట్టాడు సేల్స్‌మన్....

ఒక వారం తరువాత మేనేజరు ఫోన్ చేశాడు – ధనరాజుగారికి.

"సార్! ఘోరం. ఆవేళ మీరు కోపంలో గోడకేసి కొట్టిన పదివేల కట్టలో నోట్లన్నీ దొంగనోట్లండీ" అన్నాడు.

"అవునయ్యా! అందుకే విసిరికొట్టాను – లేకపోతే నీకు లంచం పెట్టమంటావా అలాంటివి?!" ★



జోరుగాపోతున్న కారు నాపాడు ట్రాఫిక్ సార్జెంటు.

"ఏవిటి కథ, గంట కరవైమైళ్ల స్పీడుమీద వెళుతున్నావు?" అన్నాడు.

"బలేవారే సార్. గంట ఎక్కడ – నేనిల్లు వదలి అయిదు నిముషాలేనా కాలేదు." అంది – కారులో నారి. ★




"అప్పడాల కర్రోటి కొనాలమ్మా వదినా,"

"ఇప్పుడెందుకండీ"

"అబ్బే మా కోడలు కోసం"

"మరీ విడ్డూరంగా ఉందండి మీ వరస. చీపురు కట్ట తిరగేస్తే సరి. మా కోడళ్ళందరికీ కొబ్బరిచీపురే వాడాను. ★

## నిత్యదుఃఖితులు నిరాశావాదులు

కొద్దికాలంలోనే లక్షలకు అధిపతి అయిపోయిన ఒక కామయ్య ఇంకా యేదుపు మొహం ఫిరాయించక పోవడం గమనించి ఒక మిత్రుడు అడిగాడు సంగతేమిటని.

"ఏం చెప్పమన్నావు నా కష్టం. తల్చుకొన్న కొద్దీ నా గుండె చెరువైపోతోంది. చెరువులోకి దూకి చావాలనిపిస్తోంది" అన్నాడు కామయ్య.

"ఏం"

"ఈనెల తొలివారంలో మా తాతపోయాడు; లక్షరూపాయలు ఆస్తి కలిసింది నాకు."

"మరింకేం"

"రెండో వారంలో మామయ్య పోయాడు: రెండు లక్షలు కలిసింది."

"హారిమీ, ఇంకా ఏడుపెందుకు?"

"ఎందుకేమిటి? అప్పుడే మూడోవారం వెళ్ళిపో, వస్తోంది. ఇంతవరకూ దమ్మిడీ కలిసొచ్చే సూచనలేదు." ★




"ప్రపంచమే ఒక నాటక రంగం అయితే? మనమంతా కాస్త రిహార్సలు చేసుకు మరీ మాటాడడం మంచి"దన్నాడు ఒక నటుడు. ★

## మాయదారి మనుష్యులు

పెళ్ళి ఫెళ్ళుమంటూ జరుగుతోంది. ఒక పెద్ద మనిషి గబాగబా వచ్చి సదస్యుల్లో ఒక పెద్దమనిషిని పక్కకి పిలిచి "అయ్యా, నా పర్సు పోయింది. అర్జెంటుగా ఒక్కవంద రూపాయలివ్వండి. సాయంత్రం టెలిగ్రాం మనియార్డరు ద్వారా పంపేస్తా." అన్నాడు కంగారుగా.

"ఎవరు మీరు? నా కసలు తెలీదే."

"మాది మెడ్రాసండి."

"ఏం చేస్తున్నారు"

"మాంగనీసు వ్యాపారం..... సుబ్బయ్య అండ్ సన్ అని మా కంపెనీ లెండి"

"అలాగా, ఏ వీధి"

ఆ ఆసామి చెప్పాడు

"ఇంతకీ మీరెవరు సుబ్బయ్యగారా! అండ్ సన్ గారా?"

"చిత్తం నేను కుమారుడినండి.... నాన్నగారు రాలేదు"

"రాకేం వచ్చారు. నేనే సుబ్బయ్యగారిని... ఇంతకీ నీ పేరేమిటో చెప్పావు కాదురా బాబూ!" ★



# ప్రయాణాలూ - వాహనయోగం

బస్సులో సీట్లు నిండిపోయాయి. ఒక సబల ఎక్కి నిలబడింది. ఒకాయన లేవబోయాడు.

“అబ్బే కూర్చోండి, మరేం ఫరవాలేదు నేను నిలబడగలను” అని బలవంతాన కూర్చోపెట్టింది సబల.

తరువాత స్టాపింగులో మరికొందరు జనం ఎక్కారు. ఆయన మళ్ళీ లేవబోయాడు.

“అబ్బే ఫరవాలేదు. మేం అబలలం కాదు” అని ఆయన్ని మళ్ళీ కుదేసింది సబల.

నాలుగైదుసార్లు అలా జరిగింది.

అర్భకంగా ఉన్న ఆ పెద్దమనిషి నీరసంగా కూర్చుని చేయెత్తి నమస్కరించి, “అమ్మా, నేను దిగేచోటుదాటి రెండు మైళ్లు వచ్చేశాం. ఇక్కడేనా దయచేసి నన్ను దిగనిస్తే పెందరాళే యిల్లు చేరుకుంటాను.... ఈ సారి నేను లేస్తే కూర్చోమని ..” అన్నాడు. ★

రాత్రిపూట లారీ జోరుగా వస్తూవుంటే మోటారు సైకిలుమీద పోతున్న ఒక వీరుడు సూటిగా వెళ్ళి లారీ ఢీకొట్టాడు.

“ఆ రెండులైట్లూ చూసి రెండు మోటారు సైకిళ్ళను కొని, రెంటికీ మధ్యగా దూసుకుపోదామని ట్రై చేశాను” అన్నాడతను వాఙ్మూలం ఇస్తూ. ★

ఒక నేలయ్యగారు తొలిసారి విమానం ఎక్కారు ఢిల్లీకి. ఇంజను హోరెత్తగానే కిటికీలోంచి చూచి కెవ్వుమన్నాడు.

“అయ్య బాబోయ్. అప్పుడే ఎంతెత్తు కెగిరిపోయామో చూడండి, చూడండి, కిందని ఆ జనం చీమలబారులా ఎలా కనిపిస్తున్నారో?” అన్నాడు.

“అయ్యా, విమానం ఇంకా పైకి లేవలేదు. మీరు చూసేది జనం కాదు. నిజంగానే చీమలబారు” అన్నాడు పక్కాయన. ★




కుంభకర్ణుడు రైలుకొచ్చాడు. ఫస్టుక్లాసులో ఎక్కి పడకేస్తూ యలమంచిలి రాగానే ఎలాగైనా అతన్ని తన్ని, కొట్టి, మోసి అయినా దింపెయ్యాలనీ, కలతనిద్రలో ఏం చెప్పినా పట్టించుకోవద్దనీ టిక్కెట్టు కలెక్టరునీ, గార్డునీ బతిమాలుకున్నాడు.

ఆయన నిద్రలేచేసరికి విశాఖపట్నం వచ్చింది. గార్డుని పిల్చి తిట్టిపోశాడు యలమంచిలిలో లేపనందుకు.

గార్డు మందహాసం చేశాడు. "మీరెన్ని తిట్టినా తిట్టండి. అలవాటయిపోయింది. ఇందాక యలమంచిలిలో మీ పక్కబర్తుమీదాయన్ని లేపి బలవంతాన దించేసరికి ఆయన నానా తిట్లూ తిట్టిపోశాడు. రైలు కదిలేదాకా ఆయన్ని కూలీల కప్పగించి పట్టుకోమన్నాను. ఆయన తిట్లలో మీ దెన్నోవంతు. కానివ్వండి" అన్నాడు శాంతంగా.

"యలమంచిలివాణ్ణి నేనోయ్ భగవాన్లూ, ఆయన బరంపురం వెళ్ళాలి" అంటూ కూలిపోయాడు కుంభకర్ణుడు. ★

రైలు పట్టాలు రెండూ రెండింటికి గుర్తులని ఒకాయన వ్యాఖ్యానించాడు: ఒకటి రైలు నడవవలసిన వేళ రెండోది రైలునడిచేవేళ. ఈ రెండు ఎన్నడూ కలవ్వు. ★

టిక్కెట్టు కలెక్టరు పెట్టెలోకి ఎక్కుతూనే, ఒక శాల్తీ బల్ల కింద దూరడం చూసి వెంటనే ఇవతలి కీడ్చాడు. వాడు ముసలివాడు. "బాబూ, బీదవాణ్ణి. నయాపైసా కూడా లేదు. నా కూతురు పెళ్ళికని మా వూరెళ్తున్నాను. దయతల్చండి" అన్నాడు దీనంగా. టి.టి.సి. జాలిపడి వదిలేశాడు. పక్కబల్లకింద శయనించిన ఇంకొకడిని ఇవతలకీడ్చాడు. వాడు పడుచుకుర్రాడే. "ఏరా నువ్వెక్కడికి? నువ్వూ నీ కూతురు పెళ్ళికేనా?" అని గదమాయించాడు.

"బాబూ, నేనా ముసలాయనక్కాబోయే అల్లుణ్ణండి. పెళ్ళినాదే" అన్నాడా యువకుడు దండం పెట్టి.' ★

స్టేషను మాస్టరు కంగారుగా గుమాస్తాని పిలిచాడు. "ఏవోయ్! రైలు కరెక్టు టైముకి వచ్చేస్తుందిట గబగబా గడియారం ఓ గంట ముందికి తిప్పు." అన్నాడు. ★

తెల్లటి ఇస్త్రీ సూటు వేసుకున్న వో స్ఫురద్రూపి – రైలెక్కుదామని వచ్చి ఏ పెట్టెలోనూ ఖాళీ లేకపోతే, చివరికి ఓ పెట్టి దగ్గర నుంచుని "ఈ పెట్టెలో వాళ్ళంతా దిగిపోయి వేరే పెట్టెలోకి వెళ్ళిపోండి. ఇది ఇక్కడ దిగడిపోతుంది." అన్నాడు.

ప్రయాణీకులంతా కంగారుపడి దిగిపోయి, వేరే పెట్టెల్లో సర్దుకున్నారు.

అప్పుడు ఆసామి దర్జాగా అందులో యెక్కి, బిచాణా పరిచి హాయిగా పడుకున్నాడు.

ఎంతసేపటికీ రైలు కదలక పోడం చూసి, ఇవతలికొచ్చి స్టేషను మాస్టరు అలా వెళుతూ ఉంటే - "రైలు యింకా ఎంత లేటు?" అని అడిగాడు.

"రైలు లేటు లేదండి. ఇందాక ఎవరో ఆఫీసరుగారు ఈ పెట్టి తణికీ చేసి, ఇది ఇక్కడ దిగడిపోవాలని ఆర్డర్స్ వేసేరు. అందుకని డిస్‌కనెక్ట్ చేయించేశాం. రైలెళ్ళిపోయి చాలాసేపయింది." అన్నాడు స్టేషను మాస్టరు. ★

ఒక జబర్దస్తీశ్వరరావు రైల్లో చాచుక్కూచోడమే కాకుండా బల్లమీద పెద్ద పెట్టి ఉంచాడు.

నించున్న అభాగ్యులలో ఒకాయన ఆయన్ని చూసి, "అయ్యా... ఆ పెట్టి కిందపెడితే ఒకళ్ళు కూచోవచ్చుగదా...." అన్నాడు.

"ఆ పెట్టె తాలూకు ఆసామీ కాఫీతాగడాని కెళ్ళాడు. ఆ పెట్టాయనది. మీరు ముందుకెళ్ళి వెతుక్కోండి." అన్నాడు.

ఒక నిమిషం తర్వాత రైలు కదిలింది. పెట్టెగలాయన రాలేదు.

నిల్చున్న ప్రయాణీకుడు తటాలున పెట్టె తీసి కిటికీలోంచి ప్లాట్‌ఫారం మీదకి విసిరేసి అక్కడ కూర్చున్నాడు.

"అరెరె.... అదేవిటి అలా పారేశావు." అన్నాడు రావుగారు కంగారుగా.

"రైలు వెళ్ళిపోతోంది. పెట్టెగలాయన రాలేదు గదా - పాపం - రైలు తప్పినా పెట్టె దక్కుతుందనీ...." ★

మూడవ తరగతి రైలు పెట్టెలో ప్రయాణిస్తున్న దేవదాసుతో

పార్వతి: "నీ కాళ్ళ దగ్గిర నాక్కాస్త చోటివ్వు దేవదా."

తాగిన దేవదాసు: "నా కాళ్ళ దగ్గిర నీక్కాస్త చోటివ్వు పారూ."★




"డాక్టరుగారూ, నేను నిండు నూరేళ్లూ బతుకుతానంటారా?"

"మీకిపుడెంతేమిటి వయస్సు"

"నలభై"

"ముప్ఫైలా కనిపిస్తున్నారుస్మండీ. మీకు కాఫీ, సిగరెట్లు వగైరా వ్యసనాలు..."

"...ఒక్కటి కూడా లేదండి. కాఫీయేకాదు. సోడాకూడా తాగను. సిగరెట్లెరగను. సినిమాలూ, నాటకాలూ పడవు."

"తెలీకడుగుతా. ఇవేవీ లేకపోతే మీకు నూరేళ్ళు బతకాలని ఆశెందుకండీ? ఏం చేదామనీ?" అన్నాడు డాక్టరుగారు. ★

"తాతగారూ, తమరికెంత వయసో తెలుసుకోవచ్చా" అన్నాడు యువకుడు నమస్కరించి."

"మహారాజులా – తొంభై."

"ఆహా మీ తరం తరహా వేరు, ఆ దారుఢ్యం వేరు. తమరి నూర్తో జన్మదినోత్సవం కూడా కళ్ళారా చూసి ఆనందించాలని వుంది."

"ఏం బాబూ ఎందుకు చూడరాదు? చిన్నవాడివి, వంట్లో ఏమన్నా సుస్తీగా ఉందా? అలా డీలాపడితే ఎలా?... తప్పకుండా చూస్తావు. ధైర్యంగా ఉండు." అన్నాడు తాతగారు. ★

ఒక సినీపత్రికా రచయిత కట్టిన లెక్కల ప్రకారం అఖిలభారత సినీతారల సగటు వయసుముప్పై నాలుగు సంవత్సరాలు; కాని విడిగా ఏ తార వయసూ ఇరవై నాలుగు దాటలేదు. ★

రెండు ఝాముల పొద్దెక్కేసరికి కట్టెల కొండయ్యకి ప్రాణం సాలొచ్చింది. పెద్దమోపెడు కట్టెలు కొట్టాడు.

"ఓ యమధర్మరాజా. ఈ యాతన పడలేనయ్యా! నీ యమదూతల్ని పంపరాదయ్యా" అంటూ మోపు కట్టసాగాడు. కట్టి తలపైకెత్తే సరికి ఎదురుగా భీకరాకారు లిద్దరు నిలబడి వున్నారు.

"మమ్మల్ని పంపమన్నావుటగా ధర్మరాజుగారితో," అన్నారు.

కొండయ్య గుండె గుభేల్ మంది. ఒక్క క్షణం ఆలోచించాడు.

"మరే. ఈ మోపు కాస్త తలకెత్తాలి. సాయం పట్టండి" అన్నాడు గంభీరంగా. ★



తామర్లేను చక్రవర్తి సంగీతం అంటే ప్రాణం పెడతాడు. ఒకనాడు ఒక అంధగాయని గానసభచేసి అతడిని పరవశుణ్ణి చేసింది. తైమూరు ఆమె పేరు అడిగాడు. ఆమె పేరు లక్ష్మి.

"చిత్రంగా ఉందే! లక్ష్మి గుడ్డిదన్నమాట" అన్నాడు చక్రవర్తి వెటకారంగా.

"అవును గుడ్డిది కనకనే కుంటివాడిని వరించింది." అంది లక్ష్మి. (తామర్లేను కుంటివాడు) ★

ఇద్దరు పాతమిత్రులు కలుసుకున్నారు బజారులో.

"కులాసా?" అన్నట్టు కళ్ళెగరేశాడొకాయన.

"ఆ.... కుక్కలాసే, చిచ్చిదిగోయి నననన నత్తి కుక్కుదురుస్తానని డాడాడాక్టర్రావుగారంటే వెవెవెవెళ్తున్నాను."

"ఓ ఆయనా. మమ్మంచివాడు. నాకు కుకుకుదిర్చిందాయనే" అన్నాడు మిత్రుడు. ★

ఒంటి కంటివాడొకడు, జోడుకళ్లవాణ్ణి చూసి "నీ కన్న నేనే ఎక్కువ చూడగలను," అన్నాడు.

"అదేవిటి, నీకు మతికూడా పోతుందా?"

"కాదు. నీకు నా ముఖంలో ఒక కన్నే కనిపిస్తుంది. కాని, నేను నీ ముఖంలో రెండు కళ్ళు చూడగలను గదా" అన్నాడు ఏకాక్షి. ★

ఇద్దరు చెవిటివాళ్ళు ఎదురయ్యారు.

"ఎక్కడికండోయ్ షికారుకా?"

"అబ్బే కాదండి, ఊరికే షికారుకి"

"ఓహో షికారుకనుకున్నా లెండి." ★

నత్తి నరసయ్య్య దుమధుమ లాడుతూ వచ్చాడు రామమందిరం దగ్గరికి.

అక్కడ ఒక్కడే పెద్దమనిషి ఉన్నాడు.

"చ్వేధవలు చు.... చూశారా. దెదేవుడిచ్చిన్దానికేం చేస్తాం. నన్ను చ్వెక్కిరిస్తాడు అడ్డమైన వెధవాను. ఈ మాటు డొడొక్క చ్చింపేస్తాను." అంటూ ఆరంభించి పది నిముషాల సేపు ఆ ఊళ్ళో వెక్కిరింత వెధవలందర్నీ తిట్టిపోశాడు.

ఎదట మనిషి మారుమాటాడకుండా అంతా శ్రద్ధగా విన్నాడు. సానుభూతితో తలాడించాడు. నరసయ్య లేచి వెళ్ళిపోయాక దేవుడికో దండం పెట్టుకున్నాడు మనసులోనే....

"యియ్యింకా నయం, నేనెన్నేను నాగోడు కూడా చెప్పుకున్నాను గాదు. దదదవడ వ్వాచి పోయేది." అనుకున్నాడు మెల్లిగా. ★

మూగ, చెవుడు వాళ్ళ కేంద్రానికి విరాళం అడగవచ్చిన సంఘసేవకుడు "వాళ్ళు అవస్థపడుతున్నారు, మీ సహాయం అవసరం" అన్నాడు.

"విరాళం సరే - వాళ్ళు బాధపడుతున్నారని మీకెలా తెలుసు. మీకేమన్నా చెప్పారా?"

"ఇంకానయం. నేను రోజూ వాళ్ళతో గంటలతరబడి మాట్లాడి, ధైర్యం చెప్పి సలహాలు ఇస్తూ వుంటాను. వాళ్ళ క్షోభ కనిపిస్తూనే ఉంటుంది కళ్ళలో" అన్నాడు సంఘ సేవకుడు.

"మూగబాధ" అన్నాడు కాబోయిన దాత. ★




"ప్లీడరుగారూ, మీరు వీలునామాలు రాసి పెట్టడంలో సిద్ధహస్తులని విన్నాను."

"అవునండీ"

"రోజుకి హీనపక్షం రెండు మూడేనా రాస్తారటగా."

"మరేండి."

"మరేంలేదు, వీలు రాసినప్పుడు పేర్ల కేమన్నా ఇబ్బందొస్తే ఒచ్చినా రాపోయినా సరే - వీలు చూసుకుని ఏదో ఒక దాంటో నా పేరిరికిద్దురూ, మీకు పుణ్యం ఉంటుంది. పిల్లలవాణ్ణి." ★

జమీందారు గారికి మనుషులకన్న కుక్కలమీద మక్కువ ఎక్కువనీ, వాటిలో ఆయన ముద్దుగా "సివంగి" అని పిలుచుకొనే వేటకుక్క అంటే మరీ ప్రేమ అనీ పసిగట్టిన ఒక ఆసామి ఆయననీ ఆయన కుక్కనీ కూడా చాలా ఆపేక్షగా చూసి శాయశక్తులా చాకిరీచేసి స్తుతించేవాడు.

జమీందారుగారు వీలునామా వ్రాయించినపుడు ఆ బీదభక్తుడు గుర్తుకొచ్చాడు. "పాపం అతనికి డబ్బుమీద దృష్టే లేదు. నేనూ సివంగీ అంటే ప్రాణం. నేను పోతున్నాను గాబట్టి సివంగిని ఆయన పేర రాయించెయ్యండి" అన్నాడు. ★



## ఉపన్యాసాలు

చెప్పదలుచుకున్న మూడు లక్షల ముక్కలూ చెప్పి, "మీరంతా ఓపిగ్గా శ్రద్ధగా విన్నందుకు కృతజ్ఞుడిని - ఇక ముగిస్తాను కాలాతీతం అయినట్టుంది." అంటూ "టైమెంతండీ" అని పక్కాయన్ను అడిగాడు ఒక వక్త.

"టైముతో మీకు పనేమిటి. వెనకాల కాలెండరుంది చూసుకోండి" అన్నాడు ఒక శ్రోత. ★



## భౌతికీయులు

"నాన్నా, నాన్నా నేను ఈ ఏడు పరీక్ష పాసయితే పదిరూపాయ లిస్తానన్నావుకదూ?"

"అవును"

"అయితే ఓ శుభవార్త చెప్పనా?"

"పాసయ్యావా?"

"అబ్బే, నీకా ఖర్చు తప్పింది ఈసారి." ★

ప్రోగ్రెస్ రిపోర్టు చూసి తండ్రి మండిపడ్డాడు.

"ఏవిటిది దరిద్రంగా ఉంది"

"నేను చెప్పానున్నా, మా నాన్నకి నచ్చదండీ, పంపద్దూ అని. మేష్టారే బలవంత పెట్టాడు." ★

"మా రావుడు బలే చురుకైన వెధవండి. వాడికి ఎన్ని కొత్తకొత్త ఊహలొస్తాయో, ఎన్ని స్వతంత్ర భావాలో మీరెప్పుడన్నా గమనించారూ?"

"ఆహా. ముఖ్యంగా ఎక్కాల విషయంలో మీవాడికి సొంత అభిప్రాయాలు చాలా ఉన్నాయి. ఆరైదులు నలభై అని అతని అభిప్రాయం." ★

గోప్పింటిబిడ్డ, గారాల కూచి అల్లరి పడలేక, కొట్టే తాహతులేక మాష్టరుగారు వాళ్ళ యింటికి వెళ్ళి తండ్రికి ఫిర్యాదు చేశాడు.

"మీ అబ్బాయి ఏమీ చదవడు సరికదా క్లాసులో విపరీతమైన అల్లరి చేస్తున్నాడండి"

"ఈ మాత్రానికి నాతో చెప్పాలిటండి. ఈసారి వాడు అల్లరి చేస్తున్నప్పుడు, వాడి ప్రక్కనున్న కుర్రాడెవడినైనా చావచితగ్గొట్టెయ్యండి. దాంతో భయపడి మనవాడు దారికొస్తాడు." అన్నాడు తండ్రి. ★

మేష్టరుగారు చైనా పాఠం చెబుతున్నారు.

"చైనా జనసంఖ్య అధికం, అంటే జననాలూ, మరణాలూ కూడా ఎక్కువేనన్నమాట. మనం ఒక్కసారి గాలిపీల్చి వదిలేసరికి చైనాలో ఒకడు చచ్చిపోతూ వుంటాడు...."

ఒక పిల్లాడు హఠాత్తుగా రొప్పుతూ ఉండటం చూసి "ఏమిటిది? ఒంట్లో బావులేదా?" అన్నారు మాష్టరు పాఠం ఆపి.

"కాదండి, చైనా వాళ్ళని చంపేస్తున్నాను." ★

మేష్టారు సైన్సు పాఠం చెబుతూ, "ఇదిగో నాణెం చూశారా, ఇపుడిది ఈ ఆసిడ్‌లో పడేస్తాను. కరుగుతుందో లేదో చెప్పగలరా?" అన్నాడు.

"కరగదండి" అన్నాడు రాము తడుముకోకుండా.

"గుడ్, ఎలా? ఎంచేత?"

"కరిగేట్టయితే మీరసలది అందులో వెయ్యరుగా, అందుకు" ★

ఏడాదికి నూటికి రూపాయి చొప్పున రెండేళ్ళు లక్షరూపాయలమీద వడ్డీ ఎంత అవుతుందో చెప్పమన్నారు మాష్టరుగారు.

రంగయ్య మాట్లాడలేదు గునుస్తున్నాడు పైగా

"ఏరా చెప్పలేవా"

"అదికాదండి. నూటికి రూపాయంటే గిట్టదండి. లెక్కకట్టటం టైము దండుగ" అన్నాడు రంగయ్య నానుస్తూ. ★

"ఒరే రామం, వరసగా అంకెలు చెప్పమ్మా చూద్దాం?"

"ఒకటి రెండు మూడు నాలుగు ఐదు ఆరు ఏడు ఎంది తొమ్మిది పది జాకీ రాణి రాజు..." ★

అన్నదమ్ములిద్దరూ కుక్కమీద కాంపోజిషన్ ఒక్కలాగే రాసుకొచ్చారు.

"ఏరా కృష్ణా, మీ తమ్ముడు రాసింది కాపీకొట్టావా? రెండూ ఒక్కలాగే ఉన్నాయి." అన్నారు మేష్టారు.

"కాదండి. ఇద్దరం ఒక్క కుక్క మీదే రాశాము." ★

"గుర్రము అని వ్రాయమంటే 'గర్రమ' అని రాశావేవిట్రా చవటాయీ?"

"మరి 'గుర్రానికి కొమ్ములుండవు' అని మీరే చెప్పారుగదండీ!" ★

"ఉష్ణం వల్ల వ్యాకోచము సంభవించునా? లేక సంకోచమా?" అన్నాడు మాష్టారు.

"సంకోచము సార్"

"ఛీ తప్పు. వ్యాకోచము – వ్యాకోచం అంటే పెద్దది అవ్వడం...."

"మొన్న నాకు ఉష్ణము తగిలి చాలా చిక్కిపోయానండి. ఆ పైన మీ యిష్టం." ★

స్కూళ్ళ ఇన్స్పెక్టరు తనిఖీ చేస్తున్నాడు.

"భూమి ఎలా ఉంటుందబ్బాయి. నువ్వు చెప్పు?" అన్నాడు ఓ కుర్రాణ్ని చూసి.

వాడు దిక్కులు చూసి అన్నీ అయిపోయాక మాష్టారు కేసి చూశాడు. ఇన్స్పెక్టరు వెనకాల నిలబడిన ఆయన తన పొడుంకాయ చూపించి సైగ చేశాడు.

తక్షణం కుర్రాడికి ఎక్కడ లేని తెలివితేటలూ వచ్చేశాయి. "భూమి మామూలు రోజుల్లో కొంచెము కోలగాను, శని ఆదివారాలలో చదరముగానూ ఉండును అనేశాడు."

మాష్టరుగారు శని ఆదివారాలలో ముక్కుపొడుం డబ్బా వాడతారు. ★

"ఏమండి మాస్టారుగారూ, మా వెధవ లెక్కల్లో ఏమన్నా మెరుగేనాండి?"

"అబ్బే, యెక్కాలు కూడా రావండి. ఏడ్డైదులు ముప్పైమూడు అంటాడింకా"

"ఓస్ అంతే గదా, ఒక్కటి తక్కువ చెప్పాడన్నమాట. ఫరవాలేదు," అన్నాడు తండ్రి. ★

"పెట్టెలా"

"కాదు టిన్నులు"

"శివ శివ... ఎంత డబ్బు, ... ఇదిగో అటు చూడండి, ఆ యేడంతస్తుల మేడ.... అది ఎంత చేస్తుందంటారు?"

"ఏం, ఐదు లక్షలు చెయ్యొచ్చు."

"మీరు గనుక సిగరెట్లు కాల్చి ఉండకపోతే ఈ పాటికి ఆ భవంతి మీదే అయుండేది."

"మీరు సిగరెట్లు కాలుస్తారా?" అన్నాడు త్రాగుబోతు క్రాసు పరీక్ష ఆరంభించి.

"తాగను."

"ఆ మేడ మీదేనా"

"కాదు"

"అయితే వినండి, ఆ మేడ నాదే." ★

# తెల్లోడి బిస

ఒక పల్లెటూరి మోతుబరి పట్నంలో డాక్టరీ చదువుతున్న కొడుకుని చూడడాని కొచ్చాడు, కొడుకు అతనికి ఊరంతా చూపించాడు. తరువాత ఒక పెద్ద పధ్నాలుగు అంతస్తుల భవంతికి తీసుకు వెళ్ళాడు.

లిఫ్టు దగ్గర కొడుకు ఎవరో మిత్రుడితో మాట్లాడుతున్నాడు. తండ్రి ఆ చిన్నగది కేసి వింతగా చూస్తున్నాడు. అంతలో ఒక అరవై ఏళ్ళ ముసలావిడ అందులోకి వెళ్ళింది. తలుపులు మూసుకున్నాయి. ఎర్ర దీపం వెలిగింది. ఏవన్నా అఘాయిత్యం జరగదు గదా అనుకున్నాడు మోతుబరి. అంతలో తిరిగి తలుపులు తెరుచుకున్నాయి. జేగురుపాడు వంకాయలాగా నవనవలాడుతున్న పాతికేళ్ళ పడుచుపిల్ల ఆ గదిలోంచి యివతలికి వచ్చి అతని పక్క నుంచి వెళ్ళిపోయింది.

"దీం తస్సదియ్య, తెల్లోడిబిస ఎంతుందీ, మీ యమ్మని తీసుకొచ్చి ఇదుగిందులో ఓసారి పెట్టి తియ్యాల్సిందిరా అబ్బాయ్. పొరబాటు జేశాను." అన్నాడు మోతుబరి నోరావలించి చూస్తూ. ★

కోనయ్య కోర్టుపని మీద గోదారి దాటి పట్నం వచ్చి వుతేల్లో దిగాడు.

రాత్రి పడుకొని పొద్దున్నే తెల్లవారగానే మేనేజరు దగ్గరకొచ్చి "దీన్సిగదరగా, ఏవి దీపాలయ్యా మీరెట్టినవి. రాతిరంతా నిదరలేదు. ఆ దిక్కుమాలిన దీపం తెల్లవార్లు అలా ఎలుగుతూనే వుంది" అన్నాడు.

"ఆర్పెయ్యక పోయారూ?" అన్నాడు మేనేజరు.

"ఆ మాత్రం బుద్ధి లేదంటావా. ఎంతసేపు ఊదానని. దాన్నిగదరగ దాన్ని సీసాలోబెట్టి మూత బిగిస్తిరి గదయ్యా." ★

## అనుకోకుండా

పెత్తనానికొచ్చిన మూడోవీధి ఆవిడకి చాలా మర్యాద చేసి చాలాసేపు కూచోబెట్టింది ఓ యిల్లాలు! ఆఖరికి ఆవిడ లేవబోతుండగా "వెళ్దురుగాని ఒక్క పాట పాడండి" అంది.

"ఒద్దమ్మా పొద్దుపోయింది. ఇరుగుపొరుగంతా పడుకునుంటారు"

"అయితే మరీ మంచిది. మొన్న మా కుక్కపిల్లకి విషం పెట్టి చంపారు. ఇప్పుడు శాస్తి చేద్దాం. మీరు పాడండి చెబుతా" అంది గృహిణి కసిగా పొరుగింటికి అడ్డున్న గోడ కేసి చూస్తూ. ★

తల్లీ కూతురూ రైల్లో వెళ్తున్నారు. ఆ పిల్ల ఎవర్నో చూసి "అడుగో నాన్న!... నాన్న! నాన్న!" అని పిలవసాగింది.

"తప్పమ్మా పాపా, ఆయన నాన్న కాదు, ఎవరో పెద్దమనిషి" అంది తల్లి. ★

"ఎవరో చవటదద్దమ్మ దమ్ముల్లేక ఆకాశరామన్న ఉత్తరం రాశాడు. చూశారా? నేను చవట దద్దమ్మనిట" అన్నాడు మేనేజరుగారు.

"ఛా! ఎవడో ఆరా తీయాల్సిందే. చూడండి. దస్తూరినిబట్టి పోల్చుకోలేరూ! ఎవడో వెధవ మిమ్మల్ని బాగా యెరుగున్నవాడే అయుండాలి లేకపోతే అలా రాయడు" అన్నాడు హెడ్‌క్లార్క్. ★

"ఒరేయ్ మన గది తాళం వెయ్యడం మర్చిపోయినట్టున్నాను, ఏవైనా పోతే"

"నీ మొహం. మనిద్దరం యిక్కడే వుండగా ఎలా పోతాయిరా?" అన్నాడు రూమ్‌మేట్. ★




"నిన్న పత్రికలో నీ జీవిత చరిత్ర చదివాను. బాగుంది. యెవర్రాసి పెట్టారే?" అంది ఒక తార సాటి తారతో.

"ఎవరైతేనేంగాని, నీకెవరు చదివి పెట్టారు?" అంది మేటితార. ★

"నాన్నా, నాన్నా నాకు మూడు చక్రాల సైకిలు కొనిపెట్టవూ. ఊ ఊ?" అని గారాలు పోయాడు. పన్నెండేళ్ళ బాలాకుమారుడు.

"ఎందుకు యింక రెండేళ్ళు వోపికపట్టు, యేకంగా పెద్దదే కొనిస్తాను సైకిలు రిక్షా" అన్నాడు నాన్న ముచ్చటగా. ★




కుటుంబరావుగారు పదిరోజులు జబ్బుపడి లేచేసరికి డాక్టరు బిల్లూ, మందూ మాకూ కలిసి వంద రూపాయలు పై చిలుకైంది.

"హు, కలికాలం.... వెనకటి రోజులే నయం. నా చిన్నతనంలో వంద రూపాయలు పెడితే హాయిగా ఆర్నెల్లు జబ్బుపడిందికి జరుగుబాటయ్యేది" అన్నారాయన నిట్టూర్చి. ★



# హాస్యం కాదు

"నీకో తమాషా చూపిస్తాను రా" అని చెప్పి నా మిత్రుడు నన్ను శివాలయానికి తీసుకెళ్ళాడు. మండపంలో ఒక వెర్రిబాగుల కుర్రాడు కూర్చుని పాడుకుంటున్నాడు. నా మిత్రుడు వాడి ముందర ఒక కానీ, ఒక పావలా కాసూ పెట్టి నీకేం కావాలో అది తీసుకో అన్నాడు. వాడు గబుక్కున కానీ తీసుకుని చెయి వెనక్కి పెట్టుకున్నాడు. "చూశావా" అన్నాడు నా మిత్రుడు నవ్వి. నేను మర్నాడు అటువెళ్ళినపుడు ఆ కుర్రాడిని చేరబిలిచి మళ్ళీ పరీక్షించాను. అలాగే చేశాడు. జాలి వేసింది నాకు.

"చూడు నాయనా. కానీ కన్నా పావలా ఎక్కువ. చిన్నదయినా దీనికే ఎక్కువ పకోడీలూ, జీళ్ళూ వస్తాయి. అంచేత...."

"తెల్సులేవయ్యా, నాకూ తెల్సు, కాని నే నొక్కరోజు కనుక పావలా కాసు తీసుకుంటినా మళ్ళీ రేపటాల్నించి నేవెర్రెదవననెవడూ అనుకోడు. అప్పుడు పావలా కాదు, కాండబ్బు కూడా రాదు–ఒవురికీ చెప్పోకయ్యోవ్" అన్నాడు వెర్రిబాగుల కుర్రాడు తమాషాగా నవ్వి. ★

ఒక ఫకీరు అక్బరును సహాయం కోరబోయాడు. ఆయన ప్రార్థన మందిరంలో ఉన్నాడని తెలిసి వెళ్ళి గుమ్మంలో నిలిచాడు. అక్బరు ప్రార్థన పూర్తయి వెనుదిరిగే సరికి ఫకీరు గూడా వెనుదిరిగి వెళ్ళిపోసాగాడు. చక్రవర్తి అతన్ని ఆపి, వచ్చిన పని చెప్పకుండా వెళుతున్నావేమని అడిగాడు.

"నేను మిమ్మల్ని యాచించడానికి వచ్చాను. తీరా మీరే అల్లాను ఎన్నో యాచిస్తున్నారు. ఇంక మిమ్మల్ని అడిగేదేమిటని ఆయననే అడగబోతున్నాను." అన్నాడు ఫకీరు. ★

మధ్యాహ్నమైంది ఇద్దరు బిచ్చగాళ్ళు అడుక్కుతెచ్చుకున్నది తిని చెట్టుకింద నీడలో హాయిగా కాళ్ళు బారజాపుకుని పడుకున్నారు. చల్లని గాలి వీస్తోంది. చెట్టుపై కోయిలలు కూస్తున్నాయి.

"ఈ జీవితం బావున్దోయ్, ఇప్పుడు లక్షరూపాయల ఆస్తి కలిసొచ్చినా అక్కర్లేదు పొమ్మంటాను." అన్నాడొకడు.

"పదిలక్షల రూపాయిలొస్తే?"

"ఊహు"

"కోటి రూపాయలొస్తే?"

మొదటివాడు లేచి కూర్చుని, "కోటి రూపాయలైతే కాస్త ఆలోచించాల్సిందే, మరీ అంత చిన్న విషయం కాదు" అన్నాడు. ★




"అపరాధం చెయ్యడం కన్న క్షమాపణ చెప్పుకోడం ఒక్కొక్కసారి ప్రమాదకరం అవుతుంది" అన్నాడు విదూషకుడు యదాలాపంగా.

అందుకు దృష్టాంతరం చూపించకపోతే తలకొట్టేస్తానన్నాడు రాజుగారు.

సాయంత్రం రాజుగారు వనవిహారం చేస్తూ ఒక చిన్న పూలమొక్క దగ్గర ఆగి ముందుకు వంగారు.

విదూషకుడు వెనకనుండి వచ్చి కాలితో ఒక్క తాపు తన్నాడు. రాజుగారు మండిపడి, లేచి గర్జించాడు – "ఏమిటిది?" అని.

"క్షమించాలి – రాణిగారనుకున్నాను" అన్నాడు విదూషకుడు. ★



# చిత్రకారుడూ విచిత్రకారుడూ



"ఇద్దరు కళాభిమానులు చిత్రకళా ప్రదర్శనం చూడబోయారు. సింహద్వారం దగ్గరే ఆగిపోయా డొకాయన.

"ఇదేమిటండీ, ఈ వెధవబొమ్మని ఇక్కడ వేళ్ళాడ దీశారు"

"బొమ్మేసిన వెధవ దొరికి వుండడు" అన్నాడు మిత్రుడు. ★

అధివాస్తవిక చిత్రకారుడు పికాసోని గురించిన ఒక కట్టు కథ. ఆయన మీద కాకపోయినా, ఆ ధోరణి అనుకరించి వచ్చే వేలాది చిత్రాల మీద చక్కని వ్యాఖ్య.

ఆయన ఒక చిత్రం పూర్తి చేసి తదేకంగా చూస్తున్నాడట.

"బొమ్మ బాగా కుదరలేదా?" అన్నాడు ఒక మిత్రుడు.

"మరే, ముక్కు సరిగా రాలేదు" అన్నాడు పికాసో.

"ముక్కు ఎక్కడ వుంది?" అని తెగించి అడిగేశాడు మిత్రుడు.

"అదే నేనూ చూస్తున్నాను." అన్నాడు పికాసో. ★

ఇద్దరు పిల్లలు ఆడుకుని ఇంటికి వెళ్తూవుండగా వర్షం వచ్చింది. ఒక చిత్రకళా ప్రదర్శనశాలలో జొరబడ్డారు. గుమ్మంలోకి వెళ్ళగానే ఒక అవాస్తవిక చిత్రం కనబడింది. పిల్లలిద్దరూ దాన్నిచూశారు.తరువాత మొహామొహాలు చూసుకున్నారు.

"మనం యిక్కడ కనిపిస్తే యిది మనపనే నని పట్టుకు తంతారు పద" అన్నాడొకడు. ఇద్దరూ పారిపోయారు. ★

# పత్రికలు

శ్రీరావుగారు కళాసమితికి నూరు రూపాయలు భూరి విరాళంగా ఇచ్చారు.

"వందరూపాయల్ని పట్టుకుని భూరి విరాళం అని రాశావేమిటయ్యా మతేవన్నా పోయిందా?" అన్నాడు ఎడిటర్.

"చిత్తం నాకొచ్చే జీతానికి వందంటే భారీ మొత్తంగానే కనిపిస్తోందండి." అన్నాడు సహా(న) సంపాదకుడు. ★

"ఇరవై ఏళ్ళ యువకవితో పత్రికా సంపాదకుడు: ఈ పద్యాలు మీరు రాసినవేనా?"

"అవును. అవి పూర్తిగా నేను రాసినవేనండి."

"నమస్కారం రాయప్రోలు సుబ్బారావుగారూ! మీకు ఎనభై ఏళ్ళు దాటాయని ఎవరో అబద్ధం చెప్పారు నాతో." ★

తన విషాదాంత నాటకం తిప్పి పంపినందుకు మండిపడి ఉత్తరం రాశాడు రచయిత.

"ఈనాడు మీరు దీన్ని తిరగ్గొట్టారు, కాని ఇది చిరకాలం జీవించగల నాటకం. షేక్స్పియర్‌నీ, కాళిదాసునీ మరిచిపోయిన తరువాత కూడా లోకం దీనిని మాత్రం చదివి ఆనందిస్తూనే ఉంటుంది." – అని

"వాళ్లని మరచిపోయేవరకూ లోకం మీ జోలికి రాదు." – అని సమాధానం రాశాడు సంపాదకుడు. ★

రచనలు తిప్పిపంపమని వేధిస్తూ వచ్చే ఉత్తరాలకు జవాబుగా సంపాదకుడు పత్రిక మొదటి పుటలో యీ క్రింది సుభాషితాలు అచ్చు వేశాడు.

తిరిగిరానివి–

గోడకు వేసిన సున్నం

వెలయాలికిచ్చిన సొమ్ము

గతించిన రోజులు

ఎరువిచ్చిన పుస్తకాలు

స్టాంపులు పెట్టకుండా మాకు పంపిన రచనలు. ★




మేజిస్ట్రేట్ : తాగాడని దాఖలా ఏమిటి?

పోలీసు : నడిరోడ్డులో మోకాళ్ళ మీద పాకుతున్నాడు సార్.

మేజిస్ట్రేట్ : అయితే మాత్రం!

పోలీసు : రోడ్డు తడిసిపోతోందని దాన్ని చాపగా చుట్టి గోడమూల పెడదాం రమ్మన్నాడండి! ★

ఒక 'మందు' భాగ్యుడు రాత్రి రెండుగంటలకి టప్పటాగి రోడ్డెంటపోతున్నాడు. బీటు పోలీసు ఆపి ఎక్కడికని అడిగాడు. మందుభాయ్‌కి టక్‌మని మందు దిగిపోయింది.

"లెక్చరర్‌కి సార్" అన్నాడు సీరియస్‌గా,

"లెక్చరా – ఈ రాత్రివేళా – ఎవడన్నా నవ్విపోగల్రు – నిజం చెప్పు."

"ఒట్టు సార్."

"చెప్పు. ఎవరా లెక్చరిచ్చేది? ఎక్కడ?"

"మా ఆవిడండి, మా వీధి గడపలోనే!" ★

బీర్ సేవిస్తున్న మందు ప్రియుడు

"గెలీలియోగారు మహానుభావుడయ్యా."

"ఏం?"

"భూమి గుండ్రంగా తిరుగుతోందని మనకన్న ముందు కనిపెట్టింది ఆయనేగా!" ★

పోలీసు: రోజూ తప్పతాగే గాడిదల మీద ఎవడికీ జాలెయ్యదు. బోధపడిందా?

త్రాగుబోతు: రోజు టప్పటాగే గాడిదలకి ఇంకోడి జాలి అక్కర్లేదు. బోధపడిందా? ★



ఒకడు : నాకు నూరేళ్ళ ముప్పై రోజులు బతకాలని వుంది.

ఇంకొకడు : పైన ఆ ముప్పై రోజులెందుకు?

మొదటివాడు : అన్నేళ్ళు బతికి హఠాత్తుగా చచ్చిపోతే బావుండదు చూడు. ★

ఒక విద్యార్థి సహ విద్యార్థినితో: మీతో మాట్లాడడమే నా కో – ఎద్యుకేషన్★

ఇద్దరు అన్నదమ్ములకి ఆస్తి పంపకాల దగ్గర తగూ వచ్చింది. ఊరిపెద్ద వద్దకు వెళ్ళి "మీరెలా చెబితే అలా వింటాం సలహా చెప్పు"మన్నారు.

ఊరిపెద్ద వారి తగువంతా విని చెప్పిన సలహా ఇది:

ఆస్తిని రెండు భాగాలుగాచేసే బాధ్యత అన్నగారిది. ఏ భాగం తనకి కావాలో నిర్ణయించుకునే హక్కు తమ్ముడిది. ★

బజారులో బాగా పొద్దుపోయాక ఒకడు తచ్చాడుతున్నాడు. పోలీసు పిలిచాడు.

"ఏంటిక్కడ తిరుగుతున్నావు?" అన్నాడు.

"ఏం లేదు సార్. ఈ బజార్లో ఏదేనా ఓ నగల కొట్టు తెరుద్దామని....."

పోలీసు ముఖంలో గౌరవం పెరిగింది. "అలాగా సార్! శుభం, గుడ్‌లక్, కొట్లేవన్నా కాళీలుంటే నేనూ కనుక్కుని చెప్తాను." అని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే ఆ ఆసామి అన్న ప్రకారం ఓ నగలకొట్టు 'తెరిచి' లక్ష రూపాయలు నగలు తీసుకుపోయాడు. ★

ఓటు పోలీస్ స్టేషన్‌కి ఫోను చేశాడు.

"బజార్లో ఇద్దరు కొట్టుకున్నారు., ఒకడు చచ్చాడు సార్!"

"పట్టుకున్నావా?"

"ఆ".

"చంపినవాడెవడు"

"చంపినవాడు పారిపోయాడు. చచ్చినవాడు దొరికాడు సార్." ★

ఒక ఆసామి పోలీసు ఠాణాకి వచ్చి ఫిర్యాదు చేశాడు.

"కంచే చేను మేస్తే ఎలా సార్? ఇందాకా మీ పోలీసులు ఒక దొంగని పట్టుకోడం కోసం నా కారు ఎత్తుకుపోయారు. నా కారు నాకిప్పించండి."

"ఇవ్వరు. నీ కారుకి బ్రేకుల్లేవు. హారన్ మ్రోగదు. కేసు రాశాం." ★



"సారా సీసాలతో ఓ కారు పట్టుకున్నానండి. టైరు పంచరయితే అక్కడ వుంచి వచ్చాను."

"ఎక్కడా?"

"వ్యాఘ్రేశ్వరరావు వీధిలో సార్."

"సరే రిపోర్ట్ రాసిచ్చి వెళ్ళి ఆ బండిని లాగించుకురా."

పోలీసు రిపోర్టు రాయబోయి ఆలోచించి బయటకు వెళ్ళబోయాడు.

"రిపోర్టు రాసిపో." అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"ఆ బండిని గుండువారి వీధికి లాగించాక రాస్తానండి." ★

# నవ్వితే...నవ్వండి

## విదేశీ జోకులు

"ఇంగ్లీషువాడికి, ఐరిష్‌వాడికి, స్కాటిష్ వాడికి తేడా ఏమిటో తెలుసా?

"ఏమిటి?"

"రైలు దిగివెళ్ళేప్పుడు ఐరిష్‌వాడు తను ఏమన్నా మరచిపోయాడో లేదో చూసుకోకుండా వెళ్ళిపోతాడు. ఇంగ్లీషువాడు తను ఏమన్నా మరచిపోయానో లేదో చూసుకుని మరీ వెడతాడు. స్కాటిష్‌వాడు ఎవరన్నా ఏమన్నా మరచిపోయారో లేదో చూసుకుని మరీ వెడతాడు." ★

ఒకడు : అదేమిటోయ్, అవేం మేజోళ్ళు – ఒకటి ఎర్రది, ఇంకొకటి పచ్చది తొడుక్కున్నావేం?

ఇంకోడు : అదేనోయ్ చిత్రంగా వుంది. ఇంటి దగ్గిరా సరిగ్గా ఇల్లాంటి జతే యింకోటుంది! ★

ఇంగ్లీషు స్నేహితుడితో స్కాటిష్‌వాడు

"రేపాదివారం సాయంత్రం ఏం చేస్తున్నావోయ్?"

"ఏం లేదు."

"సోమవారం?"

"ఊహు. ఖాళీయే."

"మంగళవారం?"

"ఇంకో స్నేహితుడు భోజనానికి పిలిచాడు."

"అరెరె – మంగళవారం నిన్ను భోజనానికి పిలుద్దామనుకున్నానోయ్." ★

ఒక కుర్రాడు ఒక స్కాట్‌వాణ్ణి ఆపుచేసి "మీ పర్సు పోయిందా?" అని అడిగాడు.

స్కాట్‌వాడు "అవును. పోయింది." అని జేబులు వెతుక్కుని "నీకు దొరికిందా?" అన్నాడు.

"ఉహూ - ఊరికే అడిగాను - ఎంతమంది పర్సులు పోయాయో చూద్దామని. మీతో కలిపి పదహారుగురికి పోయాయి." ★

ఒక స్వీడిష్ పల్లెటూరివాడు పట్నం సంతలో గుర్రాన్ని బేరం చేస్తున్నాడు.

బేరగాడు - "ఈ గుర్రం చాలా మంచిది. పది మైళ్ళు ఏకటాకిన ఆగకుండ పరిగెత్తుతుంది." అన్నాడు.

'వద్దులే బాబూ. మా వూరిక్కడికి ఎనిమిది మైళ్ళు, ఇక్కడికొచ్చినప్పుడల్లా రెండేసి మైళ్ళు వెనక్కి నడుచుకుంటూ రావాలి." ★

ఒక స్కాట్ వాడు షాపులోకి వెళ్ళి చేతి సంచి కొన్నాడు.

షాపువాడు "పేపర్లో పెట్టి ఇవ్వనా?" అని అడిగాడు.

"వద్దు, కాయితం, దారం సంచిలో పడేసివ్వు." ★

అయితే జోకుల్లో వన్‌వే ట్రాఫిక్ లేదు. ఇంగ్లీషు వాళ్ళ మీద కూడా జోకులున్నాయి. ముఖ్యంగా అమెరికన్లు కల్పించినవి.

ఒక అమెరికన్ : ఇంగ్లీషువాణ్ణి ముసలితనంలో కూడా కులాసాగా నవ్వుతూ వుండేట్టు చెయ్యాలంటే ఏమి చెయ్యాలి?

రెండో అమెరికన్: బాగా చిన్నప్పుడే జోకులు చెప్పాలి. ★

"ఒక స్కాట్స్‌మన్ సినిమా కెళ్ళాడు. టికెట్ తీసుకున్నాక కౌంటర్‌లో గుమస్తా యిచ్చిన చిల్లర మళ్ళీ మళ్ళీ తీరిగ్గా లెక్క పెట్టుకుంటున్నాడు. వెనక పెద్ద క్యూ వుంది. గుమాస్తా చిరాగ్గా - "ఏమిటయ్యా, అన్నిసార్లు లెక్కెడతావ్? చిల్లర సరిగ్గా లేదా?" అన్నాడు.

"సరిగ్గానే వున్నట్టుంది అందుకే లెక్కెడుతున్నా-" అన్నాడు స్కాట్స్‌మన్. ★

ఒక ఇంగ్లీషు జర్నలిస్టు దక్షిణ అమెరికాలో పర్యటిస్తూ ఒక చిన్న దేశానికి వెళ్ళాడు. అతను వెళ్ళిన రోజునే అక్కడ తిరుగుబాటు జరిగింది.

జర్నలిస్టు ఒకణ్ణి పిలిచి "మీ దేశంలో చీటికి మాటికి తిరుగుబాట్లు జరుగుతాయెందుకు?" అని అడిగాడు.

"మరేం లేదు. మాలో ప్రెసిడెంటు కావలసినవాళ్ళు ఇంకా చాలా మందున్నారు." అని సమాధానం వచ్చింది. ★

ఒక పోలిష్ వాడి యిల్లు పోలెండ్, రష్యాల మధ్య సరిగ్గా సరిహద్దు మీద వుందిట. అది రష్యాలో ఉందని రష్యావాళ్ళు, పోలెండ్‌లో వుందని పోలెండ్ వాళ్ళు వాదించుకున్నారు. చివరికి ప్రపంచ న్యాయస్థానం వాళ్ళు అది పోలెండ్‌లోనిదేనని తీర్పు యిచ్చారు. గృహ యజమాని చాలా సంతోషపడ్డాడు. ఎందుకంత సంతోషమని ఒకరడగ్గా "రష్యాలో శీతాకాలాలు దుర్భరం. రష్యన్లు తప్ప ఆ చలికి ఇంకెవరూ తట్టుకోలేరు." అని సమాధానమిచ్చాడు. ★

స్కాట్‌వాడు, ఇంగ్లీషువాడు బార్‌లో బీర్ తాగుతున్నార్ట. ఇంతలో ఒక దొంగ వచ్చి రివాల్వరు గురిపెట్టాడు. స్కాట్‌వాడు గబుక్కున జేబులో వున్న దబ్బంతా తీసి ఇంగ్లీషువాడి చేతిలో పెట్టి, "ఇదుగోనోయ్, నీ దగ్గిర మొన్న తీసుకున్న వంద పౌండ్ల బాకీ చెల్లు." అన్నాడు. ★

ఒక స్కాటిష్‌వాడు తెల్లారి లేచి చూసేప్పటికి పెళ్లాం కాస్తా గుండె ఆగిపోయి వుంది. హడావిడిగా వంటమనిషిని పిలిచి "ఒక కోడిగుడ్డు చాలు. రెండోది వేయించకు." అని కేకేశాడు. ★

స్కాట్‌లాండ్ వాళ్ళు బిడ్డయినా, గొడ్డయినా డబ్బు దగ్గిర ఖచ్చితంగా వుంటారు.

ఒకాయన కొడుక్కి 18 ఏళ్ళు నిండి 19 వచ్చాయి. "అబ్బాయి, నీ వయసు నీకొచ్చి నీ అంతవాడివి నువ్వయావు. ఉద్యోగం వచ్చింది. తండ్రి ఋణం తీర్చుకునే ప్రయత్నం మొదలుపెట్టొచ్చుగదా" అన్నాడు కొడుకుతో.

"చెప్పు నాన్నా ఏం చేయాలో ... ఎంత దబ్బివ్వాలో."

"అలాగే. ముందు నువ్వు పుట్టినప్పణ్ణించి గదా – అక్కౌంటు ప్రారంభించాం. పురిటి ఖర్చులతో తొలి విడత వాయిదా కడితే సరి!" ★



వేదాంతుల కాలమానం వేరు. తొంభై ఏళ్ళు వచ్చిన ఒకాయన ఒకరోజు పొద్దుటే లేచి, స్నానం చేసి "టైమయిపోయింది, రైలు దిగిపోతున్నా" అంటూ కళ్ళు మూశాడు. ★

రైళ్ళది సరేసరి. అది రైల్వే మాలోకం.

"నువ్వెక్కదలచుకున్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు" అన్నారు ఆరుద్ర రైల్వే చరిత్రను ఒక్క ముక్కలో సమీక్షిస్తూ. ★

"శాస్త్రిగారూ! గోవంటే ఏమిటండి?" అని ఒకాయన అడిగాడు.

శాస్త్రిగారు, 'గో' శబ్దవిచారణ దగ్గర ఆరంభించి అర్థాలు.... వ్యాఖ్యలూ చెప్పుకు పోతున్నారు. ఆవు అని వెల్లడించేదాకా వచ్చేలోగానే పొద్దెక్కడం చూసి - "అన్నట్టు టైమెంతన్నావు బాబు?" అని అడిగారు.

"ఇంకా అనలేదు. అంటాను వినండి. ఇప్పుడు అమెరికాలో రాత్రి పన్నెండు, లండనులో ఉదయం ఆరున్నర. టోక్యోలో మధ్యాహ్నం రెండు, టాంగన్యీకాలో సాయంకాలం నాలుగు, జకార్తాలో మూడుంబావు, మాస్కోలో ఐదున్నర...."

"కలికాలంగాపోతే ఏవిటీ బుద్ధి! జనానికి పోయేకాలం వచ్చింది." అంటూ లేచిపోయారు శాస్త్రిగారు." ★

ఒక సభలో శాస్త్రజ్ఞుడు ఉపన్యసిస్తూ "ఇంకో 85 కోట్ల ఏళ్ళలో భూగోళం అంతరించి పోతుంది." అన్నాడు.

ముందువరసలో కూర్చుని కునికిపాట్లు పడుతున్న ఒక ముసలాయన ఉలికిపడి లేచి, కంగారుగా నిలబడి "ఎంతన్నారూ?" అన్నాడు.

"85 కోట్ల సంవత్సరాలు."

"ఓ.... సరిసరి.... 85 లక్షలేమోనని భయపడ్డాను లెండి." అంటూ ముసలాయన మళ్ళీ కూలబడి నిద్రపోయాడు.





# పీఠికా రమణీయం



## అమరావతి కథలు అపురూప శిల్పాలు

మీరు, ఈ తొలిపలుకు ఇప్పుడు కాకుండా, ఈ కథా సుధా సాగరంలో హాయిగా తనివితీరా స్నానం చేసిన తర్వాత చదవాలని నా సరదా. నాకు కలిగిన సంభ్రమాశ్చర్యాలను, ఆనందాన్ని అప్పుడు మనం పంచుకోవచ్చు. ఇవి, తెలుగువాళ్ళ గురించి, తెలుగు దేవుడు, తెలుగు నది గురించి తెలుగులో రాసిన కథలే అయినా అన్ని దేశాలకూ, అన్ని జాతులకూ అందంగా అమరిపోతాయి. తారీకుల ప్రకారం, ఈ దశాబ్దానికి ఉత్తమ శ్రేణి ఆధునిక కథావాహినిగా చెప్పదగిన ఈ కథలు నిజానికి ఏ శతాబ్దానికైనా గొప్పవే.

తెలుగులో మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ వంటి మహనీయుల రచనల సరసన పెద్దపీట వేసి గౌరవించతగినవి. వేయిపుటల వేయిపడగల కథలో సత్యనారాయణ గారు చిత్రించిన తెలుగు జీవన విశ్వరూపానికి మూడు పుటలలో-మూడు వాక్యాలలో - మూడు మాటలలో ఈ కథలు అద్దం పట్టి చూపాయి.

ఇవన్నీ కేవలం కథలే కావు; గాథల వలె అతి క్లుప్తమైన పరిధిలో చాలా పెద్ద చరిత్ర చెప్పినవున్నాయి. పదిహేడు శబ్దాలలో అద్భుత చమత్కారాన్ని ప్రవచించిన హైకూల వంటి ఇంద్రజాలాలున్నాయి. వేమన్న పద్యాల ఔన్నత్యం, నిరాడంబరత, సూటిదనం వున్నాయి. వాడితనం, పనివాడితనం కలబోసిన అపురూప శిల్పాలు ఎన్నో వున్నాయి. కొన్ని కథల మీద చెక్కిన శిల్పాలు - కొన్ని చక్కని పాత్రలు.... కొన్ని చిన్నారి ఊహలు... కొన్ని చిన్న చిన్న వ్యాఖ్యానాలు, కొన్ని కార్తీక దీపాలు... కొన్ని మణిదీపాలు - ఇవి చాలామంది బాగాను, కొందరు చాలా బాగాను, చేసి వుండవచ్చు. కాని అమరావతి క్షేత్రపాలకుడు శంకరమంచి సత్యం గారు ఆ నేలతల్లిపై కురిసిన

వాన చినుకు మీద – ఆ చినుకులో తడిసీ తడియని ఇసుక రేణువు మీద సజీవ శిల్పాలు చెక్కారు. కొందరు తిన్నది అరక్క నిట్టూరిస్తే, కొందరు తిండి దొరక్క ఉస్సురుమంటే, ఆ వూపిరులతో అక్షరాలైన చిత్రాలు, శిల్పాలు చెక్కారు. నవ్వే కన్నీళ్ళు – ఏడ్చే కన్నీళ్ళు కలబోసుకుని, ఏమీ చెప్పకుండా నడిచే, పరిగెత్తే, ఉరికే, ఉసూరుమనే, తాత్సారం చేసే కృష్ణానదీ జలాల మీద కథల కెరటాలు మలచారు. వెన్నెలలో నల్లని అక్షరాలతో, చీకటిలో తెల్లని అక్షరాలతో ఎన్నటికీ చెరగని కథలు రాశారు. కొన్ని కథలు వెన్నెల మీద తెల్లటి అక్షరాలతో రాశారు–కనబడేలా రాశారు. నీటిమీద మాటలు సత్యంగారి కలంతో రాస్తే చెరగవు. ఒక్కగానొక్క కూతుర్ని ముస్తాబు చేసే తల్లిలా – కృష్ణమ్మ వేణితో రోజుకో జడ, గంటకో జడ అల్లుకుని మురిసిపోయారు. వేల రకాల పూలమాలలు కట్టి వినోదించారు. త్యాగరాజస్వామి కీర్తనలతో, స్వరాలతో, అక్షరాలతో, స్వరాక్షరాలతో, రాగభావాలతో కీర్తనలు అల్లి రామచంద్రుడిని అలంకరించుకున్నట్లే ఈయన అంత జాగ్రత్తగా, ప్రేమతో అమరేశ్వరుడిని, ఆయనను సేవించుకునే తెలుగువాడిని అర్చించారు. కొన్నిచోట్ల ఒక్కమాటతో, ఒక్క అక్షరంతో ఓ కథకు ప్రాణప్రతిష్ఠ చేశారు.

అమరావతి కథలు ప్రేమతో, భక్తితో, ఆవేశంతో సత్యంగారి హృదయం లోంచి ఉప్పొంగాయి. జలపాతంలా ఉరికాయి. బాలకృష్ణవేణిలా పరుగెత్తాయి. స్వామి కోవెల దగ్గర కృష్ణలా భయభక్తులతో తలవంచుకుని నడిచాయి.

సాధారణంగా కథలు చదివినప్పుడు ఎవరికి వారు ఒక చిత్రాన్ని ఊహిస్తారు. పత్రికలో వాటికి తగ్గ బొమ్మలు వేస్తే – అవి ఒక్కోసారి మన వూహకి కలుస్తాయి. కొన్ని ఎదురొస్తాయి. కొన్ని ఊహని, కథని తలదన్నేలా వుంటాయి.

ఈ కథలకి బాపు వేసిన చిత్రాలు కేవలం బొమ్మలు కావు. రూపానువాదాలు, రేఖా శిల్పాలు. టీకా తాత్పర్యాలు, అద్భుత వ్యాఖ్యానాలు.

కొన్ని చిత్రాలు కథకు అలంకారాలు. కొన్ని చిత్రాలు కథకు, శిల్పానికి నమస్కారాలు. కొన్ని ఆశీర్వచనాలు....

కాదేదీ కవిత కనర్హం అన్న మహా(కవి) వాక్యానికి ఇవి శతకోటి దృష్టాంతాలు.

ఇందులో దొంగలు, దొరలు, భక్తులు, నాస్తికులు, దేవుళ్ళు, దెయ్యాలు, దాతలు, లోభులు, ఆచారాలు, చాదస్తాలు, హిందూ బౌద్ధ ముస్లిం క్రైస్తవ మతాల వంటి పెద్ద విషయాల నుండి, ఓ చిన్న కార్తీక దీపం, వానచినుకులు, దుమ్ములో ఒక్క రేణువు కూడా వస్తువులే. తినడం, పడుకోవడం, గుడికెళ్ళి రావడం తప్ప వేరే గొడవలేని – లేదన్న చింతలేని అనామకుడు కొండంత పత్రిలో పేరులేని గరికపరకలాటి పిచ్చయ్యగారి దాకా అన్నీ కథావస్తువులే. పిడికెడు మట్టిలో భయోత్పాతాన్ని చూపెట్టగలనన్న ఇలియట్ వాక్యానికి అక్షర చిత్రాలు ప్రస్తరించారు. పండగలు పబ్బాలు, వానలు వరదలు, వెన్నెలలు ఎండలు, వ్యవస్థలూ వృత్తులూ ఇందులో చూపించారు.

ప్రేమతో, శ్రద్ధతో, ఆవేశంతో, కసితో, వంకలు వెతకాలన్న తిక్కతో - ఈ పుస్తకం పదిసార్లు చదివాను. నేను రాయాలనుకున్న వాక్యాలన్నీ రాస్తే - ఈ తొలిపలుకు 'అసలు పుస్తకం' కన్న పెద్దది అవుతుంది. పట్టరాని ఆనందం కొద్దీ మనసులో వెయ్యి పేజీలు రాసుకున్నాను. చదివిన ప్రతివాళ్ళూ పదివేల పేజీలు రాసుకోగలరు కూడా.



గ్రంథ విస్తర భీతిని ప్రచురణకర్తల పాలు జేసి - నా సంతోషం నలుగురితో పంచుకోడానికి మరికాసిని వాక్యాలు రాయకుండా ఆగలేను - తొలికథ పేరు వరద... ప్రళయం వచ్చి మన్నూ మిన్నూ ఏకమైనప్పుడు అన్ని కులాలవాళ్ళు ఒకటై ఆపదకాసుకోవడం, బ్రాహ్మడికి మాలవాడు నెయ్యి వడ్డించడం, బ్రాహ్మడు ఆనందంగా తినడం ఇందులో కథ.... ఇది మామూలే... కాని వరదవచ్చి ఆ పూటకి బురద కడిగేసినా అంతా మామూలయ్యాక మళ్ళీ మనిషి మామూలే.

"ఎన్ని వరదలొచ్చినా మనసు మాలిన్యం కడగలేక పోతోంది" అన్న వాక్యమే అమరావతి కథ.



ధనం తక్కువ వాళ్ళమీద గుణం తక్కువ దొరలు చెలాయిస్తున్న దౌర్జన్యంపై వ్యాఖ్యలు - 'బంగారుదొంగ', 'సుడి గుండంలో ముక్కుపుడకో' అనే కథలు. దొరలకు దేవుడే గులామని బాపు బొమ్మ - దానిపై వ్యాఖ్య.

రెండు గంగలు కథ - దివినీ భువినీ కలిపే వానచినుకుల వారధి. సత్యంగారి పదవిన్యాసం



వాక్యలాస్యం పరమాద్భుతం. వానరంగు, వాన వాసన, వాన పాట అన్నీ మనలో మేలుకుంటాయి. ఈ వాన ఈ కథ ఎప్పటికీ ఆగకూడదనిపిస్తుంది. ఇంత గొప్ప రచన సత్యంగారే చెయ్యగలరనిపిస్తుంది.

భోజన చక్రవర్తి అప్పంభొట్లు భోంచేస్తూ వుంటే ఆ భోజన వైభవం చూస్తూవుంటే వానకథలాగే ఇదీ ఎప్పటికీ ఆగకూడదనిపిస్తుంది. బాపు బొమ్మలో భోజన చక్రవర్తి విగ్రహం ముందు పాత్రలు, వడ్డించే ఆమె పరిమాణం చక్కని రేఖానువాదం. 'హరహర మహాదేవ' కథలో అక్షరాలని పూలవానలా వెదజల్లారు-



వాక్యాలు చిచ్చుబుడ్డి ముత్యాల్లా పైకి ఎగజిమ్ముతాయి. ఇక్కడేకాదు.... ఏది రాసినా సత్యంగారి కలంలో సిరా ప్రవహించదు. మామూలు కలాల్లా దిగజారదు - విజృంభిస్తుంది.

'అదుగదుగో బస్సు' కొత్తమోజు గొడవలో వెలసిపోయిన ఒక వృత్తికి కన్నీటి తర్పణం.

బస్సులో ఇమిడిన 30 హార్స్‌పవర్ ముందు బక్కచిక్కిన జట్కాగుర్రం బొమ్మ గుండెను కలచివేస్తుంది.



పువ్వుల్లేని విగ్రహాలు కూడా బాపే వెయ్యగల బొమ్మ. అర్చకుడి కొడుకు అమ్మవారికి ముస్తాబు చేస్తుంటే స్వామి వాడిని వళ్ళో కూర్చోబెట్టుకుని సాయం చెయ్యడం - సత్యంగారి హృదయానికి అద్దం పట్టింది. ఈ బొమ్మలో రేఖా సౌందర్యం తంజావూరు శిల్పాలను స్ఫురింపజేస్తుంది.

కాకితో కబురు చెప్పడం అన్న మాటవరసకి మేఘసందేశం అంత గొప్పస్థాయి కల్పించారు ఓ కథలో - అమరావతి ప్రేమ కథలు వేటికవే సాటి - రేవుదగ్గర ఓ యింట్లో అంట్లుతోమే జువ్వికి, పడవలో వంటచేసే చింతాలు మావకీ మధ్య విరహం. నెల్లాళ్ళు కళ్ళు కాయలు చేసుకుని ఎదురు చూడగా రాకరాక వచ్చిన మావ పడవ - రేవులో ఆగకుండా గట్టు దగ్గరగానైనా రాకుండా వెళ్ళిపోయింది. మావ వంటగిన్నె వూపాడు. జువ్వి అంట్లగిన్నె ఊపింది. అనిర్వచనీయమైన తీయనిబాధ ఈ చిన్నారి వాక్యాల్లో వుంది - వాళ్ళ నిస్సహాయత. ఆ బాధ-అయినా వాళ్ళు నవ్వుతూ ఏడుస్తారు. జువ్వికి కాకులూ, ఉడతలూ నేస్తాలు. వాటితోనే మావకి కబురు పంపిస్తుంది. కాని మౌనంగా నడిచే కృష్ణవేణి అలలు మావకెప్పుడో చెప్పాయి. దీనికి బాపువేసిన రేఖాచిత్రం పంచవర్ణచిత్రంలా కనిపిస్తుంది.... శివరంజని రాగం వినిపిస్తుంది. ఇది పెద్దబొమ్మగా వేయించి ఇంట్లో



గోడకి పెట్టుకోవా లనిపిస్తుంది... ఈ బొమ్మ చూస్తుంటే కథ కదిలివచ్చి మనతో మాట్లాడుతుంది. కితకితలు పెడుతుంది... ముగ్ధ సౌందర్యం గురించి ఒక డాక్టరేటుకి సరిపడా విమర్శన చేస్తుంది.

భోజన చక్రవర్తి తృప్తిగా తినేవాడి కథ అయితే తులసి తాంబూలం తృప్తిగా వస్తుండే దంపతుల కథ. కథకుడి ఊహకే జోహార్లు.... రచన గురించి చెప్పడానికి వాక్యాలు చాలవు-

కాసిన్ని ఆనంద బాష్పాలే... తృప్తిలోకి వాళ్ళు పరి-మార్చుకున్న బాధనంతా బాపు ఈ బొమ్మలోకి వాళ్ళ అలసటని నీరసించిన కళ్ళలోకి - వాళ్ళు కూర్చున్న భంగిమలోకి అద్భుతంగా అనువదించాడు.



నావ నడిపే రంగయ్య ఇద్దరి నుంచి అద్దరికి వెళ్ళేలోపల-ప్రయాణీకుల్ని పలకరిస్తాడు ఒక్కొక్క పలకరింపు ఒక్కొక్క కథ - ఒక జీవితకథ.

మూడుముక్కల్లో, నూరేళ్ళ జీవితం చూపిస్తారు సత్యంగారు.... ఈ శిల్పం పదిపన్నెండు కథల్లో-దేనికదే సాటి అయిన వేర్వేరు పద్ధతుల్లో చూపారు - ప్రపంచం సాహితీ ప్రపంచంలోనే ఈ శిల్పానికి ఒక పుష్పహారం వేసి గౌరవించాలి- ఒక వాక్యం ఒక కావ్యం అన్న శాస్త్రోక్తికి శతాధిక నిదర్శనాలు. ఈ ఒక్క బొమ్మలో కన్నతల్లి లాంటి కృష్ణవేణిలో షావుకారు దురాశ సుడిగుండంగా మార్చి పడవనీ, రంగయ్యనీ ముంచేశాడు బాపు.



నది నడుస్తోంది. పరిగెడుతోంది. అనుక్షణం మారిపోతుంది. ఏది అసలు నది? ఈ క్షణం నీరు ఇంకో క్షణానికి వెళ్ళిపోతోంది. జీవితంలో క్షణాలలాగే నదిలో బిందువులూను సిద్ధార్థలో హెర్మన్ హెస్ ఈ తాత్పర్యంపై అద్భుతంగా చర్చ చేశాడు.



సత్యంగారు సైద్ధాంతికుడు కాదు. మాంత్రికుడు. కథకుడు. శిల్పి.... కృష్ణమ్మ నల్లటి చీరకు పువ్వుల పువ్వుల అంచుల ఒడ్డునిండా ఆడవాళ్ళ వరస అని రాయగల సౌందర్య పిపాసి... ఆ అందమైన ఆడవాళ్ళు మాటల్లో - మాటల్తో కోటి కతలు పలికించి - వాళ్ళ బట్టల్లాగే బతుకుల్నీ ఉతికించి నల్లటి కృష్ణవేణిని ఆ మాలిన్యంతో మరింత నలుపుచేసి వెళ్ళిపోతారు... కాని మనకి వాళ్ళమీద కోపం రాదు. అసహ్యం వెయ్యదు. వాళ్ళు మన తల్లులు. అక్కలు చెల్లెళ్ళు వదినెలు... దీనికి బాపు బొమ్మ పరమాద్భుతం.... నదిలో నలుపూ తెలుపూ - మంచీ మురికీ వేర్పాటు చేశాడు.... ఆడాళ్ళ కబుర్లకి తెల్లని కృష్ణవేణి నల్లబోయిందా? నల్లటి కృష్ణవేణి తెల్లబోయిందా... మీ యిష్టం. బొమ్మ నడగండి.

మొదటి కథ అయిన వరదలో ప్రపంచించిన మహాకావ్యానికి ఇది ఒక కారిక...



"ఎంగిలా?" అన్న కథ, బొమ్మ రెండూ అద్భుతం.... సంగీతం సాహిత్యం కలిసి నట్లున్నాయి. శివ పార్వతులు చెరిసగం. ఆడా మగా అంతే. అజ్ఞానం కొద్దీ సగం సగంగా ఉండాలన్న 'ఛాందసం' పాటించ బోయిన రామశాస్త్రి శ్రీదేవమ్మ వ్రతభంగం చెయ్యడమే ఉద్యాపన, వ్రతఫలం. వాళ్ళ సంగమానికి నల్లటి కృష్ణలో నల్లచేపలా దూసుకుపోయే ఉప్పరిపిల్ల - మన్మథుడి మొదటి బాణం.

శ్రీదేవి సిగలో తెల్లని గన్నేరు - (కామాక్షి అమ్మవారికి పూజచేసి వచ్చినది పైగా!) రెండో బాణం. శాస్త్రి భోంచేస్తూ భార్యకి చేతిముద్ద అందిస్తే "ఎంగిలికాదో?" అని ఆమె కళ్ళు ఆశ్చర్యంగా విప్పార్చి అడగడం మూడోబాణం.... ఛాందసుడికి దేవుడి దగ్గర పూలవాసన లోంచి దేవుడిని పూజించే ఆడవాళ్ళ పూలవాసన వేరై, నదియై, సముద్ర తరంగమై ముంచెత్తి వేసింది.... గాలికి పూలవాసన - వెన్నెలకి పూలవాసన! మహాప్రభో - మరో నమస్కారం - ఇది నాలుగో బాణం-

"తాతా! తెలిసి తెలిసి చేదు తింటామా?"

"చేదు తెలిసిన నోటికే తీపి రుచి తెలుస్తుందిరా!" ఇది అయిదో బాణం...

(బాణోచ్ఛిష్టం జగత్సర్వం-)

బాకీ సంతతి... ప్రపంచ కథా ప్రపంచంలో పట్టాభిషేకం జరగవలసిన కథ.

వయసొచ్చింది... తేనెలొలికే వలపు కథ.

ఇదికూడా అతి చిన్నవాడి జీవితంతో, చాలా చిన్నదనిపించే వస్తువుతో చెప్పిన గొప్పకథ. దర్జీకొట్లో పని కుర్రాడు - తను మనసిచ్చిన పోలికి రవిక కుట్టడం - ఒకే రంగు గుడ్డ ముక్కలుదాచి, అతి రహస్యంగా - కొన్ని నెలల పాటు కష్టపడి రవిక కుట్టి కానుక యిచ్చాడు. ఆర్నెల్లలో పోలి ఛాతీ పెరిగింది. రవిక చాలలేదు. గుండీలు కుదర లేదు. పైట వేసుకుంటే సరిపోద్దని సర్దేసింది పోలి. వాడి కళ్ళలో కోరికల దీపాలు...



కర్రావుకి లంకలో పురుడోయించిన పున్నయ్యగారి ప్రసవవేదన మనోహరంగా వుంది. ఖాళీ కుర్చీకథకి అద్భుతం... మంచి మనసున్న వాడు దేవుడు. వాడికి గుడికట్టాడు బాపు. 'ఎవరా పోయేది'లో సాములారి గొడవ చక్కని కథ. భక్తకన్నప్ప చిత్రంలో పూజారి పాత్రకి వేషభాషలు అమరు స్తున్నప్పుడు ఈ కథ నాకు చాలా ఊహనిచ్చింది. అందుకు సత్యం గారికి నా కృతజ్ఞతలు.



కనకాంగి కథ సరికొత్త తరహాది - భోగం అమ్మాయికీ

చాకలికీ కళ్లు కలిశాయి. ఒళ్లు కలిసే అవకాశం వున్నా అది జరగకుండా ముగించడం సత్యంగారి శిల్పచాతురికి మరో నిదర్శనం. ఆ ముగింపువల్లే ఈ కథ మరపురానిదవుతోంది. వాళ్ళిద్దరి మీద మనకి ఎంతో జాలి కలుగుతుంది.



అతి చిన్న వస్తువుతో, మలుపుతో, మాటతో, చూపుతో ప్రేమకథ రాయడంలో సత్యంగారు సిద్ధహస్తులు. ఆయనకి ఆయనే సాటి. వంశాంకురానికి బాపు బొమ్మ భావయుక్తంగా ఉంది. తల్లి గుండెల పై పిల్లడు; వాళ్ళ నీడ ఆలుమగలది.

బలి హృదయ విదారకమైన కథ - ఇద్దరు మిత్రుల తగాదాలలో అమాయకులు బలైపోయాక ఇద్దరికీ చేవ చచ్చి బుద్ధి వస్తుంది.

ఆస్తికుడికీ నాస్తికుడికీ ఒక్కవాక్యంలో రూపం దిద్దారు. ఇద్దరికీ దేవుడి తీర్థం ఇచ్చారు గుళ్ళో - నాస్తికుడు దాహానికి గొంతు తడుపుకున్నాడు. భక్తుడు గంగోదకాన్ని కళ్ళకద్దుకుని స్వీకరించాడు. భక్తుడి మీద నందీశ్వరుడి ఆనందబాష్పం పడడం చిత్ర కల్పనలో విశిష్టత.



'దొంగలో దొరలో' కథలో గొర్రెల కాపరి రంగడు తన మందలో ప్రతి గొర్రెనీ పేరు పేరునా పిలిచి లాలించుకుంటాడు. తల్లికి బిడ్డల్లాగే అతనికి ఆ గొర్రెలు.. మచ్చలది, మారిది, చిన్న కాళ్ళది, ఏడుపు గొట్టుది, ఎర్రమన్నుదీ, ఇవన్నీ శ్రద్ధతో సేకరిస్తే తప్ప దొరికేవీ తోచేవీ కావు. రంగడికీ గొర్రెలకీ షావుకారు అన్యాయం చేస్తే దొరబుద్ధిగల దొంగ న్యాయం చేశాడు. దొంగాడి పాగాలో రాజుగారి బాకుని అమర్చాడు బాపు.

'కానుక' కావ్యప్రాయమైన కథ.... మల్లాది, శ్రీపాద వంటి మహనీయుల వారసుడనిపించుకున్నారు. వాక్య నిర్మాణంలో ఉపమానాలు ఆముక్తమాల్యద స్థాయిని అందుకున్నాయి. అమరావతిలో పాలరాతిపై బౌద్ధ శిల్పాలకి ఈ కథ అంత చక్కగా నైపుణ్యంతో చెక్కిన అక్షర శిల్పం.

కృష్ణలో నీళ్ళపై పేరుకున్న చలిపొరని చెదరగొట్టడం... చలిలో కృష్ణలో దిగాక.... ఆ లోపల నీరు వెచ్చగా ఉంది.... అమ్మ కడుపులో ఉన్నట్లు హాయిగా ఉంది. కథ కనబడదు – ఓ పిల్లాడు గుళ్ళోంచి ప్రసాదం తెచ్చుకుని, సగం వాటా - ఓ అవ్వకిచ్చి, మిగతాది అమ్మకి తెచ్చిపెట్టాడు. సత్యంగారి శిల్పమే కథ. అమ్మ చేరదీసుకుని వాడి వీపు నిమిరింది. వాడికి కృష్ణమ్మ కడుపులో స్నానమాడినట్లు అనిపించింది.

విరిగిన పల్లకీ – శిథిల మవుతున్న కొన్ని వ్యవస్థలకీ, ఆచారాలకి స్మృత్యంజలి. వేయి పడగల సౌరభం వెల్లివిరిసింది.

ఈ కథా పుష్పాల నన్నిటిని కలిపి నిలిపిన దారం – కథల్లో పట్టం కట్టదగ్గ కథ – శిల్పంలో పరాకాష్ఠను చూపిన రచన – 'నా వెనక ఎవరో' అన్న కథ. రాముడు త్యాగరాజుచేత కీర్తనలు రాయించాడు. పోతన్నచేత భాగవతం రాయించాడు. అలాగే అమరావతి ఈ క్షేత్రపాలకుడిని లాలించి రాయించిన కథ యిది. అమరావతిలో పూచిన పూలు, రాలిన పూలు, వీచిన గాలి, ప్రవహించే నీరు, మట్టి, పిట్టలు, మనుషులూ, రంగులు, రుచులు అన్నీ ఈయనకి అణువణువునా అమరిపోయాయి. రాయబోయే కథ గురించి ఇంత ఆర్ద్రంగా ఇంత మధురంగా రాయడం – ఆయన అన్నట్లు ఓ సన్నజాజి పూచినట్టు కాదు, కోటి జాజులు పూచినట్టు. మనమీద సన్నటి వాన చినుకులు కురిసినట్లు.

దానాలిచ్చి మనశ్శాంతి కొనుక్కోబోయిన రాజుగారికి గుండెలో స్వామి ఓ చిన్నప్రశ్న వెలిగించాడు. రాజు కన్నీరై కరిగిపోయాడు. తెలిసింది, అది నిద్రకాదు. మెలకువ అంతకన్నా కాదు. మనసు చల్లగావుంది.



తురీయావస్థని, ఆనందోబ్రహ్మ అన్న వాక్యాన్ని మూడు మాటల్లో తేటతెల్లం చేశారు.

శివుడి మూడోకంటి మంటలో భక్తుడిని నిలిపి అతని అహాన్ని దహనం చేయించాడు బాపు.

దీనికి విరుద్ధమైనది పదేళ్ళ సాంబడి కథ. వాడిది లేత మనసు. అందులో అహం లేదు.



వినాయకుడి ప్రసాదం తెచ్చుకుని అదే ఆయనకి తిరిగి నైవేద్యం పెట్టిన బంగారు తండ్రి.... అందుకే వినాయకుడు తన తొండం పల్లకీగాచేసి సాంబణ్ణి కూర్చోపెట్టుకున్నాడు.

ఒండ్రి మట్టి అన్నది - మాస్టర్ పీస్. ఈ మాటకు సరి అయిన పదం తోచక అదే రాస్తున్నాను. 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్' అన్న మాటని మట్టితోటే అనువదించి మట్టిలో దుమ్ములో మనుషుల్ని చూపి గుండె చెదరగొట్టే కథలు చెప్పారు. సన్నటి మెత్తటి దుమ్ముని దుమ్ము కన్నీరుగాచూసి చూపగల శిల్పం అద్భుతం.

ఈ కథల్లో ఆయన పలకరించని పాత్రలు ఇంకెక్కడా వుండవు. అందరికీ కడుపు నిండా అన్నం తినిపించి ఆఖర్న పచ్చడి మెతుకులు తృప్తిగా తినే బావగాడు, పూల సుల్తాన్, యాభైయేళ్ళ కన్నె ముత్తయిదువ, హోటల్ శంకరయ్య, తంపులమారి సోమలింగం, తిండిబోతు, తాగుబోతు, తిరుగుబోతు, పిచ్చివాడు, దసరాలకి పులి వేషం వేసేవాడు, పల్లకీ మోసేవాడు, బాకా ఊదే సాయిబు, శంఖం వూదే శంఖులింగం, బడిపంతులు, పోస్టుమాస్టరు, టపా రన్నరు, బోగం పిల్ల, కోతులు ఆడించేవాడు, కాటికాపరి, హరిదాసు, పురాణం శాస్త్రుర్లు - అందరూ మరపురాని మనుషులు. కొన్ని కథలు వృత్తుల పైన తత్వాలపైన వుంటే, కొన్నిటికి చీకటి, గాలి, నిప్పు, నీరు, మట్టి వస్తువులు. కాకుల దగ్గర్నుంచి కార్తీక దీపాలదాకా అన్నీ రాయబారాలు నడుపుతాయి. ఈ వస్తువులతో ఇంత గొప్ప కథలను - ఇంత వాడిగా, అందంగా, క్లుప్తంగా చెప్పడంలో సత్యంగారికి ఎవరూ సాటికాలేరు.

మాటరాని బాలుడు శబ్దం కోసం పడే తపన ఆరాటం ఒక మహాకావ్యం. కుర్రాడిని ఓంకారంలో బిందువుగా చూపాడు బాపు.



ఆఖరి కావ్యం మహారుద్రాభిషేకం. స్వామికి రచయిత హృదయం అంతా నివేదిస్తూ చేసిన పవిత్ర అక్షరాభిషేకం. బాపు చిత్రం కూడా ఈ కథకి అద్భుతంగా జోహారు పలికింది.



అమరావతి కథలు తెలుగు సాహిత్య పీఠంలో కలకాలం నిలబడి గౌరవం, ఆదరణ పొందే ఒక మహోజ్వల సృష్టి. ఎన్నటికీ ఆరని అఖండ జ్యోతి. పాఠకులకూ, కళాకారులకూ ఎన్నిసార్లు ఆస్వాదించినా తనివి తీరని అమృత కలశం. అక్షయమైన అక్షరపాత్ర. శిల్పసౌందర్యానికి పరమావధి. ప్రపంచ సాహితీ వీధిలో తెలుగువారు సగర్వంగా ఎగరేయగల పతాకం....





# శ్రీ ఆండాళ్ తిరుప్పావై

పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు
పలకోడి నూరాయిరమ్
మల్లాండ తిండోళ్ మణివణ్ణా!
ఉన్ సేవడి శెవ్వి తిరుక్కాప్పు!

పలుయేండ్లు పలుయేండ్లు పలువేన వేలేండ్ల
పలుకోటి నూరేండ్లకున్
అరి మల్లురను గెల్చు మణివర్ణా! నీ
అరుణచరణాల సిరికి తిరురక్ష (ఆరుద్ర)

జయజయ దానవ దారణ కారణ
శారఙ్గ రథాంగ గదాసిధరా!
జయజయ చంద్రదినేంద్ర శతాయుత
సాంద్రశరీర మహఃప్రసరా
జయజయ తామరసోదర సోదర
చారు పదోజ్ఝిత గాంగఝరా!
జయజయ కేశవ కేశినిషూదన
శౌరి శరజ్జలజాక్ష హరీ! ('ఆముక్తమాల్యద' - శ్రీకృష్ణదేవరాయలు)

నూరేళ్లు వేయేళ్లు నూరుకోటుల యేళ్లు
వర్ధిల్లు నారాయణా!
కోటి సూర్యప్రభా భాసమానా హరీ!
గరుడవాహన శ్రీధరా మంగళము
శంఖ చక్ర గదాశారఙ్గధారీ హరీ!
కంసాది దైత్య సంహారకా శ్రీహరీ!
నూరేళ్లు వేయేళ్లు నూరుకోటుల యేళ్లు
వర్ధిల్లు వర్ధిల్లు వర్ధిల్లు నారాయణా!

...**అం**టూ దేవుడికి దిష్టి తగులుతుందన్న భయంతో ఆ దేవుడినే దీవించిన మహాభక్తుడు పెరియాళ్వార్. విష్ణువైతాళికులయిన పన్నిద్ద రాళ్వారులలో అగ్రగణ్యుడు పెరియాళ్వార్ (పెద్ద ఆళ్వార్). సర్వదా విష్ణుచింతనమే తప్ప అన్యమెరుగని ఈ భక్తుడి బిరుదనామం విష్ణుచిత్తుడు. నిజనామం భట్టనాథుడు.

తమిళనాడులో శ్రీవిల్లిపుత్తూర్ క్షేత్రంలో జన్మించిన భట్టనాథుడి జీవితకాలం క్రీ.శ. 8వ శతాబ్దం అంటారు. శ్రీమహావిష్ణువు వాహనమైన గరుత్మంతుడి అంశతో భువికి దిగిన ఈ మహాభక్తుడిని గరుడాళ్వార్ అనికూడా ప్రస్తుతి చేస్తారు.

ఆయని కుమార్తెయే శ్రీ గోదాదేవి, ఆండాళ్. శ్రీవిల్లిపుత్తూర్‌లో క్రీ.శ. 716లో అవతరించి 16 వసంతాలపాటు నిత్యవసంతగానం చేసి శ్రీరంగనాథుని వరించి తరించిన భూలక్ష్మి ఆమె.

స్వామికై తండ్రి నిత్యం కల్పించే పూలమాలలను ముందుగా తాను ధరించి, పెరటిబావిలో తొంగిచూసుకుని తన అందానికి తానే మురిసిన తరువాతనే తాను వాడిన ఆ మాలలను తన యౌవనసౌరభంతో - అనురాగదీప్తితో నింపి - వాటిని స్వామికి అర్చనగా, అలంకారంగా తన కన్నెమనసు ప్రేమలేఖగా అందించి తరించిన ముద్దరాలు ఆమె.

"ఇదిగో ఓ స్వామీ! మరి నువ్వు నన్ను పెళ్లి చేసుకుంటే - నీకు నూరు గిన్నెల వెన్న, నూరు గిన్నెల చక్కెరపొంగలి నైవేద్యం పెడతాను... సరేనా" అంటూ కల్యాణగుణాకరుడైన శ్రీకృష్ణ భగవానునితో బేరం పెట్టిన బంగారుతల్లి ఆ పిల్ల.

నీలాదేవి కాంచనస్తనగిరులపై తల చేర్చి నిదురిస్తున్న నీలిమేఘ శ్యామసుందరుని మెడలో తానల్లిన పాటల మాటలమాలికను వేసి బంధించి తనవాడిని చేసుకున్న భూలక్ష్మి అవతారం ఆమె.

దేవుడినే దీవించిన తండ్రి విష్ణుచిత్తుడు అయితే, తాను వేసుకుని తీసిన మాలను దేవుడికే ప్రసాదంగా ఇచ్చి ఆయన మనసును పుచ్చుకున్న మాన్యురాలు ఆమె. మా ఊరి పడుచు - గోదమ్మ - చూడి కొడుత్త నాచ్చియార్ (తాను సిగలో తురుముకుని తీసిన దండను దేవుడి కిచ్చిన అమ్మ) అని తమిళులు ముద్దుమురిపాలతో పిలుచుకుంటారు. ఈ దివ్యప్రణయ గాథనే శ్రీకృష్ణదేవరాయలవారు 'అముక్తమాల్యద' పేరుతో ప్రబంధంగా రచించారు.

ఆంధ్ర సరస్వతీమాత ధరించే పంచకావ్యభూషణాలలో అతిప్రౌఢమైనది 'ఆముక్తమాల్యద'. ఆముక్తమాల్యద అంటే 'తాను తలపై ధరించి విడిచిన మాలను ఇచ్చినది' అని అర్థం.

కవిరాజపోషకుడు కృష్ణరాయలవారు - తామే మహావిద్వత్కవులు. సంస్కృతంలో 'రసమంజరి', 'సత్యవధూప్రీణనమ్', 'జ్ఞానచింతామణి' మొదలైన ఎన్నో గ్రంథాలు రచించారు. 1519లో కళింగ దండయాత్రకు వెళుతూ విజయవాడవద్ద శ్రీకాకుళంలో ఒక రాత్రి విడిది చేశారు. శ్రీకాకుళంలో వెలసి వున్న ఆంధ్రమహావిష్ణువు ఆరాత్రి రాయలవారికి కలలో కనిపించి ఒక వింతకోరిక కోరాడు. అది ఇంకో కోవెల కాదు. ఆభరణాలూ, వాహనాలూ కాదు. తన సిగలో ముడిచి విడిచిన దండను దేవుడి మెడలో వేసి వరించిన ఆండాళ్ మధురప్రణయగాథను తెలుగులో ప్రబంధంగా వ్రాసి సమర్పించమని ఆదేశించారు.

"తెలుగా?" అన్నాడు కన్నడరాయలు.

**తెలుగదేల యన్న దేశంబు తెలుగేను**
**తెలుగు వల్లభుండ**
**తెలుగొ? కండ ఎల్ల నృపులు గొలువ**
**నెరుగవే బాసాడి**
**దేశభాషలందు తెలుగు లెస్స.**

(కండ = కండచెక్కెర) అన్నాడు ఆంధ్రవిష్ణువు.

రాయలవారు భగవదాజ్ఞను శిరసావహించి పాండితీ కవితావైభవాలతో, శిల్పవిన్యాసాలతో సామాన్య జనజీవనంలోని ఆహ్లాదకర చిత్రాలతో ఏడాశ్వాసాలలో అద్భుతమైన 'ఆముక్తమాల్యద' ప్రబంధాన్ని కల్పించారు.

తెలుగులో పంచకావ్యాలుగా మన్ననపొందిన 'మను, వసుచరి'త్రాది ప్రబంధాలలో ఇది అతి ప్రౌఢ ప్రబంధంగా పేరు పొందింది. ప్రౌఢ అన్న బిరుదాన్ని గిట్టనివాళ్లు నారికేళ, పాషాణపాకాలతో పోల్చి చెబుతారు.

నీలమేఘము డాలు డీలు సేయగ జాలు
మెరుగు చామనచాయ మేనితోడ
వంటి సెలయేళ్లతో పాటు
గండ ద్వంద్వ గళత్కరళ మదరేఖల్
ఫుల్ల సప్తచ్ఛదా
ఖండక్షోదసితత్ప్రకీర్ణకములై
కర్ణద్వయిన్ మించగా...." లాంటి నారికేళాలు ఎన్నోవున్నాయి.

దేశభాషలందు తెలుగు లెస్స... కుంపటిలో తామరము – అమృతం అయినా, రోజూ అలవాటుగా తినే చారన్నానికి సాటిలేదు – కప్పురంబు ఇచ్చి యుప్పుగొనుట... లాంటి చక్కని నానుడులు ఎన్నోవున్నాయి. 'అముక్తమాల్యద' ప్రబంధాన్ని కలియుగవైకుంఠం తిరుమలపై కొలువుదీర్చిన శ్రీవేంకటేశ్వరస్వామికి అంకిత మిచ్చారు రాయలవారు.

❀ ❀ ❀

దేవుడికి చెంగల్వ దండలు కట్టడం, అతిథి దేవులకు అన్నపానాదులు సమకూర్చడం.... ఈ రెండే ఈశ్వరార్చనగా జీవిస్తున్న విష్ణుచిత్తుడికి ఒకనాడు తులసివనంలో ఒక పసిపాప కనిపించింది.

వెలుగులు వెదజల్లుతూన్న ఆ శిశువును భూదేవి అవతారంగా భావించి, గోదాదేవి అని పేరుంచి అల్లారుముద్దుగా పెంచుకోసాగాడు. నాగేటిచాలులో సీతమ్మను కనుగొన్న జనక రాజర్షివలె తన భాగ్యానికి మురిసిపోయాడు. ఎన్నయ్ ఆండాళ్ (నన్ను ఉద్ధరించడానికి వేంచేసిన నా తల్లి) అని కీర్తించాడు.

ఆండాళ్ తన ఈడు పిల్లలతో ఆటపాటలకి పోకుండా వాటికి దూరంగా ఉండేది. తన తండ్రి, ఆయన శిష్యులు పండితులూ భగవన్నామ సంకీర్తనము చేస్తూంటే, వైష్ణవ భక్తిప్రపత్తుల గురించి పెరియాళ్వార్ బోధలు చేస్తూంటే అక్కడే బొమ్మలా కూర్చుని ఆలకిస్తూ ఉండేది.

ఆయన స్వామికి చెంగల్వ దండలు కడుతూంటే, బాలకృష్ణుడి లీలాగాథలు చెప్పించుకుని వినేది. కృష్ణదేవుడి పాటలు పాడుకుంటూ తోటలో తిరిగేది.

అనాటి గోకులంలో ఆ బృందావనంలో తాను ఒక గోపిక అయినట్లూ పాలకడవలతో ఆడుకుంటూన్నట్టూ కలలు కనేది. చెంగుపట్టుకు లాగుతున్న చిన్నికృష్ణయ్యను తప్పించుకుని పరుగెడుతూ వయ్యారపు పోకడలు పోయేది.

ఒకనాటి సాయంకాలం విష్ణుచిత్తుడు స్వామి కైంకర్యానికై మాల కూర్చి పూజగదిలో ఉంచి బయటకు వెళ్లాడు. ఆండాళ్ స్నానం చేసి, చక్కగా అలంకరించుకుని అటు వచ్చి ఆ మాలను చూసింది. ఆమెలో ఓ చిలిపికోరిక తళుక్కున మెరిసింది. ఆ మాలను తీసుకుని పెరట్లో ఉన్న బావిదగ్గరకు వెళ్లి దానిని తన కొప్పుకు చుట్టుకుని నీటిలో తన బింబాన్ని చూసుకుని మురిసిపోయింది.

నీలవృషకకుద్రేఖన్ - నల్లని అంబోతు మూపువలె ఉన్న ఆ కొప్పుకు చుట్టిన ఈ చెంగల్వ దండతో ఆమె ముఖారవిందం దేదీప్యమానంగా భాసించింది. రెండు క్షణాలు తన బింబాన్ని చూసుకుని ఆనందించి, ఆ మాలను తిరిగి పూలసెజ్జలో ఉంచింది. తండ్రి ఆ మాలనే స్వామికి సమర్పించాడు. నిత్యం వచ్చే నారపులుగు దండకి కొత్తశోభ, కన్నెసౌరభం చేరాయి. స్వామి ఆ రుచి మరిగాడు.



ఇలా కొన్నాళ్లు జరిగాయి. ఒకనాడు విష్ణుచిత్తుడు పూజగదిలో మాల కనబడక వెతుకుతూ పెరటిలోకి వచ్చి, బావి దగ్గర బంగారుతల్లిని, ఆమె చేస్తున్న అమాయకపు అజ్ఞానపు అపచారాన్ని గమనించాడు. తల్లడిల్లిపోయాడు. "అమ్మా! స్వామికిచ్చే పుష్పహారాన్ని ముందుగా నీవు ధరించి మైలపరిచావు గదమ్మా! ఆయనకు వేసి తీసిన తరువాత ఆ నిర్మాల్యాన్ని ప్రసాదంగా స్వీకరించాలితప్ప ఇలా చేయరాదు" అని కుమార్తెకు హెచ్చెరుక చెప్పాడు. వెంటనే మరొక మాల సమకూర్చి కోవెలలో స్వామికి అర్పించాడు.

ఆ రాత్రి రంగనాథస్వామి విష్ణుచిత్తుడి కలలో కనిపించాడు. "ఈ సాయంకాలం నువ్వు ఇచ్చిన దండకన్న - ప్రతిరోజూ మీ అమ్మాయి ఆండాళ్ నీ ద్వారా పంపినవే ఎంతో పరిమళంతో గుబాళిస్తున్నాయి" అని చమత్కరించాడు. ఆండాళ్ చేసిన అపచారం గురించి చెప్పబోయి విరమించాడు విష్ణుచిత్తుడు.

ఆండాళ్ సిగలో ముడిచివిడిన దండ స్వామికి స్వీకారయోగ్యం అయిందా? అవును. ఇందులో తప్పేమి? ముగ్ధభక్తిని తానే అర్థం చేసుకోలేక పోయాడు.

ఆనాడు శబరి కొరికి రుచి చూసి ఇచ్చిన ఎంగిలి పళ్లను స్వామి ఎంత ఆప్యాయంగా స్వీకరించాడు! ఇదీ అలాంటిదే! చూడికొడుత్త నాచ్చియార్! ఆముక్తమాల్యద! పరమాత్ముడికి తనకన్న దగ్గర అయిన ప్రేమమూర్తి అని అర్థం చేసుకున్నాడు. ఆ మర్నాటినుండి, ఆండాళ్ వాడినా వాడని దండలనే స్వామికి అర్పిస్తూవచ్చాడు.

ఆండాళ్ తన చెలికత్తెలతో స్నేహితురాళ్లతో మాట్లాడుతున్నప్పుడు విష్ణువును దెప్పిపొడిచి హేళన చేసి వాళ్లని రెచ్చగొట్టేది.



"ఆయనగారు దయలేనివాడు - ఆడవాళ్లపొడ గిట్టదు. అందుకే చేప, తాబేలు, వరాహం ఇలాటి అవతారాలు ధరించి ఆదిలక్ష్మిని ఒంటరిగా విడిచి తిప్పలు పెట్టాడు. వామన పరశురామావతారాలు సరేసరి! రాముడుగా వచ్చాక, రాజ్యలక్ష్మిని అడివిలో వదిలేశాడు. కృష్ణావతారంలో సుందరాంగు లందరినీ గందరగోళంలో పెట్టేసి వినోదించాడు" అనేది. చెలికత్తెలు "అయ్యో అపచారం అపచారం" అని లెంపలేసుకుంటూ స్వామిని సమర్థించి పొగుడుతుంటే ఆనందంగా వినేది.

ఎప్పుడూ హరిధ్యానమే. అరమోడ్చిన కన్నులే. అందరూ పుణ్యతీర్థాన్ని ఉద్ధరిణితో అందుకుని నాలుక తడుపుతూంటే తాను ఆ అభిషేకజలాలతో ఒళ్లంతా తడుపుకునేది. అంతా ఏకాదశినాడు జాగరణ చేస్తే - ఈమె ప్రతిరాత్రీ జాగరమే!

ఒకనాడు విష్ణుచిత్తుడు స్వామిదగ్గర మొరపెట్టుకున్నాడు. "ఆండాళ్ ఏదో వింత వ్రతం చేస్తున్నట్లుంది. ఆమె తీరుతెన్నులు నాకు ఆందోళన కలిగిస్తున్నాయి. ఇదేమన్నా పిచ్చితనమా?" అన్నాడు. స్వామి నవ్వుకున్నాడు. ఆండాళ్ స్వామినే ప్రేమిస్తున్నదనీ, ఆయననే పెళ్లాడాలని నిశ్చయించుకున్నదనీ తండ్రికి పూర్తిగా అర్థమయింది. కాని ఇది మానవమాత్రులకి ఎలా సాధ్యమో అతనికి బోధపడలేదు.

"అమ్మా! స్వామి సర్వాంతర్యామి. కానీ - రూపం గుణం కనిపించనివాడు. ఆయనను ఎలా పెళ్లాడగలవు?" అని అడిగాడు.

"మనం నిత్యం పూజించే అర్చమూర్తి కోవెలలో ఉన్నాడుగదా - ఆ మూర్తినే పెళ్లిచేసుకుంటాను" అన్న దామె.

"కోవెలలు కొల్లలుగా వున్నాయి. ఏ కోవెలలో స్వామి నీకు నచ్చాడు?"

"శ్రీరంగం కోవెలలో శ్రీరంగనాథస్వామివారే నా మనోహరులు. ఆయనకీ నా సంగతి తెలుసు. నేను చెప్పాను" అన్నది ఆండాళ్ తల వంచుకుని.

విష్ణుచిత్తుడికి ఒకనాటి సంఘటన గుర్తుకు వచ్చింది. చిన్నవయసులో ఒకసారి కోవెలలో దేవుడి ముందు నించుని దండం పెట్టి తండ్రి వింటూండగానే గట్టిగా చెప్పింది-"ఓ కృష్ణస్వామీ! నువ్వకనుక నన్ను పెళ్లి చేసుకుంటే నీకు నూరు గిన్నెల చక్కెర పొంగలి, నూరుగిన్నెల వెన్నముద్దలూ నైవేద్యం పెడతాను. సరేనా?" అని ఆయనకి ఆశ పెట్టింది.

ఆయనకి వెన్నంటే ఇష్టంకదా మరి...

ఆనాడు విష్ణుచిత్తుడు - ఆ ముగ్ధబాల ముద్దుపలుకులు విని నవ్వుకున్నాడు. తప్పమ్మా దేవుడితో బేరాలు పెట్టకూడదు - అని చెప్పబోయి మానుకున్నాడు. స్వామి సకలభాషాకోవిదుడు. పిల్లభాషలో పెద్ద మనసులనూ, పెద్దలభాషలో 'పిల్ల' మనసులూ ఆరాలు తీసుకోగలడు. బేరాలు చేసేవాళ్లతో బేరాలభాష మాట్లాడగలడు.

"మా నాన్న తొడకన్న ఎత్తయిన చోటు కావాలి" అని ధ్రువుడు కోరితే అంతకన్న ఎంతో ఎత్తయిన ధ్రువపదం ఇచ్చేశాడు.

బలి చక్రవర్తి దగ్గర మూడడుగుల మేరకోసం బేరం పెట్టి, మూడడుగుల నేల అని భ్రమింపజేసి ఇంతేనా అనుకున్నదాన్ని అంతే లేనంత దానంగా అందుకున్నాడు. మనకే కాదు, తనకే దొరకని దొంగ!

ఇవాళ ఈ చిన్నారిబాలికతో ఏ బేరం ఎలా చేసుకుంటాడో మనకేమి ఎరుక?

ఆ చిన్ననాటి ముచ్చట ఇవాళ నిజంగానే పెళ్లిముచ్చట స్థాయికొచ్చింది. ఇప్పుడేమి చెయ్యాలి? ఈ మొక్కులు తీరేనా?

ఈ కల్యాణం జరిగేనా?

లేదా తన కుమార్తె పెళ్లికాని పిల్లలాగే బతుకు వెళ్ళమార్చుకోవాలా?

తన కర్తవ్యం తను చేయాలి. ఆమెను కోవెలకి తీసుకువెళ్లాలి. స్వామి ఎదుట నిలిపి మొక్కించాలి, పెళ్లి చేసుకోమని అడిగించాలి. పిల్లతండ్రిగా తనూ అడగాలి.

శ్రీ ఆండాళ్‌ను మేనాలో కూర్చోబెట్టి సపరివారంగా శ్రీరంగం చేరాడు విష్ణుచిత్తుడు. ప్రాకారంలో ఉత్సవమూర్తి ఊరేగింపు జరుగుతోంది. ఆ పల్లకీ ఎదుట ఈ మేనా నిలిపి దించారు. గర్భగుడిలో అర్చమూర్తి (మూలవిరాట్) ఏకాంతదర్శనం అనుమతికోసం విష్ణుచిత్తుడు ప్రధాన అర్చకస్వాములవద్దకు వెళ్లాడు.

ఈలోగా ఆండాళ్ మేనాదిగి, ఉత్సవమూర్తి వున్న పల్లకీ సమీపించింది. నమస్కరించింది. తన ఇంటికి తాను చేరుకున్న ఇల్లాలివలె తీవిగా స్వామి హృదయంలో ఐక్యమైంది. అక్కడున్న భక్తకోటి చూస్తుండగా అంతర్ధానమైపోయింది.

లోపల అనుమతి తీసుకుని వచ్చిన విష్ణుచిత్తుడు ఇది తెలిసి కలవరపాటుతో గోల చేశాడు.

"అబ్రాహ్మణ్యము! లోన వైచికొనె నన్యాయంబునన్ మత్సుతన్... అయ్యా భక్తులారా, పెద్దలారా! ఇది చాలా ఘోరం. స్వామివారు నా బిడ్డని మాయచేసి ఎత్తుకుపోయాడు. బ్రాహ్మణుడిని... ఆయన భక్తుడిని... అడిగితే నేనివ్వనా? ఇవ్వాలనేకదా తీసుకువచ్చాను. ప్రోచేవాడే ఇవాళ దోచేవాడయిపోయాడు. ఇంకెవరు దిక్కు?" అంటూ రభసచేస్తూ చిందులు తొక్కుతూ తిరిగి గుడిలోకి పరుగెత్తాడు. భక్తులంతా కలవరం చెందారు.

"కన్నెపిల్లలను ఎత్తుకుపోవడం వెన్నతో పెట్టిన విద్యకదా... రాజభటులు కాపలావుండగా రాకుమార్తె రుక్మిణిని ఎత్తుకుపోయినవాడికి ఈ పేదబాపడి బాలిక ఒక లెక్కా? అయినా ఇంత తొందర పనికిరాదు. ఆ సంగతి ఆయనకు చెప్పగల మొనగాడెవరని...?" ఇలా పరిపరివిధాల అనుకోసాగారు.

ఈ భక్తసంక్షోభం చూసి అపవాదు వస్తున్నదని భగవంతుడు భయపడ్డాడు. విష్ణుచిత్తుడిని చేరబిలిచి మెత్తగా చీవాట్లు పెట్టాడు. "పిచ్చివాడిలా వున్నావు. నీ కూతుర్నేమిటి, నేను అపహరించడ మేమిటి? ఇంటికి వెళ్లి చూసుకో - ఆ పిల్ల అక్కడే వుంది" అన్నాడు. విష్ణుచిత్తుడు విష్ణుమాయలో పడి ఇల్లుచేరి పిల్లను చూసుకుని స్తిమితపడ్డాడు.

ఆ తరువాత స్వామివారు పెళ్లిమాటల కోసం శివపార్వతులను, సరస్వతీబ్రహ్మలను విష్ణుచిత్తుడి ఇంటికి పంపారు. ఆయన పక్కన ఆడపెళ్లివారి ప్రతినిధిగా పాండ్యరాజు నిలిచాడు. సుముహూర్తం నిర్ణయించారు. నిజంగానే శ్రీకృష్ణరుక్మిణీ కల్యాణముహూర్తమే అది!



విశ్వకర్మ నిర్మించిన మణిమయ మంటపంలో వైభవంగా వివాహం జరిగింది.

**శర్వాణీ వాణీముఖ**
**గీర్వాణీ కోటి, జానకీ రఘుకుల రా**
**ట్పూర్వా చరిత వివాహో**
**శీర్వసుగీతములు పాడగ విభవమునన్.**

స్వయంగా శివపార్వతులు సీతారామకల్యాణం నాటి పుణ్యగీతాలు సుగుణగానం చేస్తూన్నప్పటికీ, రంగనాథస్వామి మాత్రం కృష్ణావతారం నాటి దొంగచూపులను మానలేదు. ఆండాళ్ రెండు చేతులా ముత్యాల తలంబ్రాలు ఎత్తి స్వామి శిరసున పోస్తూవుండగా, ఆయన పైట బిగలాగినవేళ ఈసామి కనుదోయి ఆ చనుదోయిని చాటుగా చూస్తున్నదట. ఆ దృగ్విన్యాసాలను గమనించిన పెళ్లికూతురు సిగ్గుతో చేతులు పూర్తిగా పైకెత్తడం మాని దోసిళ్లతో ముత్యాలను దోసిలితోనే పైకి ఎగజిమ్మిందట. నల్లని సామి తెల్లబోయాడు.

**ఇంతి దోయిట సేసబ్రాలెత్తు చోట**
**గుబ్బపాలిండ్ల క్రేవ గ్రక్కున మురారి**
**కన్ను వేయుట గని లజ్జ కదుర బాహు**
**లెత్తక కరాగ్రములన్ పైకెగర జల్లె.**

ఈ సంరంభంలో ఆండాళ్ తాను చిన్ననాట స్వామికి ఆశ చూపిన వెన్న పొంగలి గిన్నెల మాట మరచిపోయింది.

కొంతకాలం తరువాత విశిష్టాద్వైతప్రవక్త భగవద్రామానుజులు శ్రీరంగం వేంచేశారు.

"ఆనాడు మా అమ్మ–జగన్మాత–నీ మొక్కు మరచిపోయింది. మీ కుమారుడైన నాకు ఆ భాగ్యం లభిస్తున్నది, ఆమోదించు, ఆరగించు" అంటూ నూరు గంగాళాల చక్కెర పొంగలి, నూరు గంగాళాల వెన్నముద్దలూ నైవేద్యంగా ఆరగింపు చేయించి తరించారు.

❀ ❀ ❀

విష్ణువిరహిణిగా పెరుగుతున్న కాలంలో గోదాదేవి పాడిన ముప్పయి పాటలనే తిరుప్పావై పాశురాలు అంటారు.

తిరు శబ్దాన్ని తమిళులు 'శ్రీ' శబ్దానికి తమిళంగా ఉపయోగిస్తారు. 'పావై' అంటే నోము.

ద్రవిడవేదంగా తమిళులు గౌరవించే 'నాలాయిరప్రబంధం' (నాలుగు వేల స్తోత్రాలు గల ప్రబంధం)లో ఆమె చెప్పిన తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అనే స్తోత్రగ్రంథాలు ప్రముఖమైనవి. పన్నిద్దరు ఆళ్వారులలో ఏకైకమహిళ గోదాఅమ్మవారే!

ఈ పాశురాలను తమిళులు – ముఖ్యంగా శ్రీవైష్ణవులు – ప్రతియేటా ధనుర్మాసంలో – సంక్రాంతి నెల పొడిచే నాటినుండి – రోజుకొకటి చొప్పున బ్రాహ్మముహూర్తవేళ – అనగా తెల్లవారుజామున భక్తితో పాడుకుంటూ స్నానం చేస్తారు. తర్వాత స్వామికి పూజలు చేస్తారు. కన్నెపిల్లలు ఈ నెల రోజుల నోమును శ్రద్ధతో, భక్తితో చేస్తే వారికి అనుకూలుడైన భర్త లభిస్తాడనీ, జీవితం సుఖశాంతులతో నడుస్తుందనీ నమ్మకం.

ద్వాపరయుగంలో - ఆ నాటి వ్రేపల్లెలో - చిలిపి కృష్ణుడి శృంగారలీలలు హర్షించలేని కులపెద్దలు - ఆడపిల్లలు గడపదాటి వెళ్లరాదని ఆంక్షలు పెట్టారట. ఆ యేడాది వర్షాలు పడలేదు.

బీడులెండి గడ్డి దొరక్క - గోమాతలూ - అందువల్ల పాలు లేక గోపాలక కుటుంబాలూ బాధలు పడ్డాయి.

కులపెద్దలు పురోహితులను రావించి బాధలు చెప్పుకున్నారు. ఆంక్షలు పెట్టి నోములు మానిపించినందువల్లనే ఈ అనర్థాలు వచ్చాయనీ, కన్నెపిల్లలంతా ధనుర్మాసంలో కాత్యాయనీదేవికి పూజలు చేయాలనీ చెప్పారు. ఆ నోములకు సంబరాలు సమకూర్చి సక్రమంగా నడపగల సమర్థుడు శ్రీకృష్ణుడే నని కూడా చెప్పారు. పెద్దలంతా శ్రీకృష్ణుడిని వేడుకున్నారు.

"నేను చిన్నవాడిని. ఇంత పెద్దభారం మోయగలనా?" అంటూ బెట్టు చేస్తూనే కృష్ణుడు ఒప్పుకున్నాడు. గోపికలు ఆనందోత్సాహాలతో శ్రీకాత్యాయనీ నోము పట్టారు. దీని ప్రకారంగా వాళ్లంతా తెల్లవారుజామునే నిద్రలేచి కృష్ణయ్యను మేలుకొలపాలి. శంఖాలూ బాకాలూ ఢక్కాలూ అడిగి తెచ్చుకుని సంబరాలు చేస్తూ యమునానదికి వెళ్లి చలిలో స్నానాలు చేయాలి. తరువాత అమ్మవారికి పూజలు చేయాలి. ఆ నెలరోజులూ వాళ్లు ఎన్నో నియమనిష్ఠలు పాటించాలి.

**చానరో నేతిని చవి చూడరాదు**
**భామరో పాలను ప్రాశించరాదు**
**కనుదోయి కాటుక నునుపనే రాదు**
**పూవులు కురులలో ముడువనే రాదు**
**అలుపపుమాటల నాడనేరాదు**
**ఈ నియమమ్ముల నేమరకున్న**
**మన నోము జగతికి మంగళప్రదము.** (శ్రీ లక్ష్మణయతీంద్రులు)

తిరుప్పావై పాశురప్రబంధం నాలుగు భాగాలుగా అమరింది. ఒకటినుండి అయిదవ గీతంవరకు - కన్నెపిల్లలంతా తమకు మంచి భర్త లభించాలనీ అందరూ చల్లగా ఉండాలనీ కోరుకునే పాటలు. 6 నుండి 15 వరకూ ఆండాళ్ ఇంటింటికీ వెళ్లి తన స్నేహితురాళ్లయిన గొల్లభామలను నిద్రలేపి యమునాస్నానాలకు రమ్మని పిలవడం. 16 నుండి 21 వరకూ పాడే పాటలలో - కన్నెలందరూ నందగోపుని భవంతి చేరడం, ద్వారపాలకులను నిద్రలేపి వారి అనుమతిగొని లోపలకి వెళ్లడం. అక్కడ ముందుగా యశోదానందులను మేల్కొలిపి కృష్ణుడి మందిరంవైపు పోబోయి, అది పొరబాటు తెలుసుకుని అన్నగారు బలరామస్వామిని లేపుతారు. ఆ తరువాతనే శ్యామసుందరుడి అంతఃపురవాటికకు వెడతారు.



22 నుంచి 28 వరకూ గల గీతలలో కృష్ణ దేవుని దర్శనం. పడకింటిలో నీలాదేవి సరసన ఆమె స్తనగిరి సానువులలో తలవుంచి నిదురిస్తున్న లీలాకృష్ణుడికి మేలుకొలుపులు పాడతారు. ఇక 29వ పాశురం తిరుప్పావైకి ప్రాణంవంటిది. వాళ్లు నోటితో అడిగిన వరాలు ఎన్ని ఉన్నా మనసార కోరుకున్న వరం ఒక్కటే. ఈ సిరిసంపదలూ సుఖాలూ భోగాలూ కాదు. జనన మరణ పునర్జన్మలనుండి విడుదల కానే కాదు. వారు కోరేది కేవలం కృష్ణసఖ్యం - కృష్ణుడిని చూడాలన్న కోరిక కావాలి. ఆయన కనబడలేదన్న బాధా, ఆ విరహమూ కావాలి. ఆ తరవాత దొరకాలి. దొరికాడన్న ఆనందమూ కావాలి. జన్మజన్మలకూ వారికి ఇదే కావాలి. ఏ మహర్షులూ జ్ఞానులూ వేదాంతులూ కోరని కోరలేని ఈ చిత్రమైన అద్భుతమైన వరం మనసార కోరుకున్న మధురభక్తులే ఈ గొల్లభామలు.

“ఓ స్వామీ! నువ్వు కేవలం మాకోసమే ఈ గోకులంలో పుట్టావు. మేము ఎన్నటికీ నీకు దూరంగా కాకుండా కాపాడు. ఇదే మేము కోరే వరం. ఇదికాకుండా తెలిసీ తెలియక మేము ఇంకే వరాలు కోరినా వాటన్నిటినీ కొట్టిపారెయ్. మేము కోరింది నిన్నే.” ఇది ఆ పాశురం హృదయం. తరువాతది 30వ పాశురం ఫలశ్రుతి. మంగళాశాసనం.

❀ ❀ ❀

దారంతో పూలని కట్టిపెడితే దండ మాత్రమే అవుతుంది. దానికి అనురాగమను రాగసౌరభాన్ని చేర్చి కూర్చినపుడే అది హారం అవుతుంది. హ్రియతే చిత్త మనేన హారః. హృదయాన్ని హరించ గలిగినదే హారము. విష్ణుచిత్తుడు నారతో చెంగల్వలను కట్టి కల్పించిన దండలో తన అనురాగసౌరభాన్ని చేర్చి కూర్చిన ఆండాళ్‌వల్లనే ఆ దండ హారం అయి స్వామికి ప్రీతిపాత్రం అయింది.

లలిత సంగీత లయవిన్యాసాలతో ఆమె కూర్చిన పాశురాలలో కనిపించే వినిపించే శబ్దలయ లాలిత్యాలను మించి మనోనేత్రానికి దర్శనం ఇచ్చే భక్తి ప్రేమల సౌరభమే ఈ పాశురాల హారాన్ని భగవంతుడికి స్వీకారయోగ్యం చేసింది.

మామూలు దండలను ఆయన భరించాడు. ఆండాళ్‌హారాన్ని ధరించాడు.

❀ ❀ ❀

ఆకాశవాణి ముఖతః ప్రవచించి కురిపించిన హాస మందహాస దరహాస అట్టహాసాల పన్నీటి వానజల్లు ఇది. 'రచియించిన' పుస్తకంగా పాఠకులకు ఇప్పుడు దర్శనమిస్తున్న ఈ 'పరి-హాస' మేఘం ఇంతకుముందు బాబూరావు గారు ఆకాశవాణి ద్వారా 'వచియించిన' ప్రసంగాలను వర్షించింది.

రచియించిన వారిని రచయిత అన్నట్టే వచియించిన వారిని వచయిత అనాలని ఈ రచయిత (పుస్తకం వ్రాసిన) వచియించారు. నిజానికిదే సరయిన మాట. మన సంప్రదాయం కూడా అదే. వ్యాసమహర్షి భారతం స్వయంగా వ్రాయలేదు. ఆయన 'చెప్పగా' వినాయకుడు వ్రాశాడు. బమ్మెర పోతరాజొకడు భాగవతాన్ని జగద్ధితంబుగా 'చెప్పాడు'. రామభద్రుడు పలికించగా తాను పలికాడు. అన్నట్టు ఆదికవి వాల్మీకి కూడా రామాయణం వ్రాయలేదు.... పాడాడు. దీన్ని వచనం అనవచ్చునేమో?

మధ్యతరగతి మహారాజుల నిత్యజీవితాల్లో రోజూ తగిలే సరదాలూ, సరసాలూ, సాధక బాధకాలూ అన్నిటినీ చమత్కారదారం మీద పూసలుగా అమర్చి హారాలు కట్టారు. చిన్నా పెద్దా అందరూ అవి మెళ్ళో వేసుకుని ఎవరికివారు అద్దాల్లో చూసుకుని హాయిగా నవ్వుకోవచ్చు. పక్కవాళ్ళని చూసి పకపకా నవ్వచ్చు. కానీ..... దానివల్ల పళ్ళురాలితే మా పూచీలేదు!.

చుర్రుమని తగిలి.... ఆలోచనలు రేకెత్తించే ఊహలూ ఊసులూ బోలెడున్నాయి. ఈనాటి విద్యారంగంలో మార్కులు, కళారంగంలో బహుమతులు, చమత్కారాలు వగైరాల మీద చక్కని విసుర్లున్నాయి.

'ఆవుకి నాలుగు కాళ్ళుండును అని రాసినవారికి నూటికి నూరు మార్కులిస్తే... రెండు కాళ్ళు అని రాసినవాడికి ఆ నిష్పత్తి ప్రకారం 50 మార్కులివ్వడం ధర్మం. ఒక్కటే కాలు అని రాస్తే.... ఈనాడు ధర్మం ఒంటికాలి మీదే నడుస్తోంది కాబట్టి సదరు విద్యార్థి సామాజిక స్పృహను గుర్తించి నూరు మార్కులిచ్చినా తప్పు లేదు....'

తెలుగు సాహిత్యంలో హాస్యం తక్కువ అనుకునే వారికి ఇది అక్షరాలా సూటి జవాబు.

రచయితకూ వచయితకూ - జై!



గోదావరీ, గోరింటాకూ, గోంగూరా, గిరీశం, కచటతపలూ, గసడదవలూ, బారిష్టరు పార్వతీశం, పదహారణాలూ, ఇవి అసలు సిసలు తెలుగు దినుసులు- తెలుగుతనపు జెండాలు.

బారిష్టరు పార్వతీశం మనని పొట్టచెక్కలయ్యేలా నవ్వించడం మొదలుపెట్టి 70 ఏళ్ళు అయింది. ఇంకా నూటాడెబ్భయ్యేళ్ళయినా నవ్విస్తూనే వుంటాడు.

అమాయకత్వం పొంగిపొరలే గడుసుతనం, గడుస్తనం తొంగిచూసే అమాయకత్వం కలబోసి పోతబోసిన బంగారుతండ్రి పార్వతీశం.

మొక్కపాటివారి 'అబ్బాయి'గా మన ముందుకొచ్చిన చిరంజీవి.. పార్వతీశం త్రివిక్రముడిలా పెరిగి పెద్దవాడై - ఈయన మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు - మన బారిష్టరు పార్వతీశం కన్నతండ్రి అని పరిచయం చేసే స్థితి వచ్చింది. ఈ సంగతి ఒకప్పుడు శాస్త్రిగారే సగర్వంగా చెప్పుకున్నారు.

ఈవిధంగా నిజంగా అక్షరాలా కీర్తిశేషులయిన చిరంజీవి మొక్కపాటి వారికి నా జోహార్లు. వాటు కన్న చిరంజీవి పార్వతీశానికి జిందాబాదుళ్ళు. మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే ఈ పుస్తక ..న్ని ఇలాటి పుస్తకాలనూ మళ్ళీ ప్రచురించి నవతరాన్ని నవ్విస్తున్న అభినందన బాజ్జీ గార్కి అభివందనాలు. ఇలాటి గొప్ప పనులు మళ్ళీ మళ్ళీ మళ్ళీ చేస్తూండాలని ఆకాంక్షిస్తున్నాను.

టీవీ ప్రేక్షకులు కూడా ఈ పుస్తకాన్ని నిర్భుంగా కొనేసి చదువుతే - టీవీలో కన్న గొప్ప చిత్రాలు కనిపిస్తాయనీ కరెంటు కరుసుండదనీ గారంటీ ఇస్తున్నాను. మహారాజశ్రీ టీవీ వారు కూడా ఇప్పటి ప్రోగ్రాములనే మళ్ళీ మళ్ళీ వేస్తూ స్థాయి మారకుండా చూస్తూ బుక్కిండస్ట్రీ అభివృద్ధికి సాయపడాలని కోరుతున్నాను. మళ్ళీ మళ్ళీ కోరుతున్నాను. అప్పుడే చప్పట్లు కొట్టకండి.

టీవీ వాళ్ళకి ఇంకో పెద్ద ఎట్రాక్షన్! ఇందులో వందన్నర బొమ్మలున్నాయి - బాపూ బొమ్మలున్నాయి. ఇవి 70 MM 6 Track stereophonic sound లో వున్నాయి. ఇటు జోకులూ అటు బాపు-లూ. మహాప్రభో! ఇహ చెప్పలేను! ఇప్పుడు కొట్టండి చప్పట్లు!

**1995 జనవరి 1వ తేదీన 6వ విజయవాడ పుస్తక మహోత్సవ ప్రారంభోత్సవ సభలో, 'బారిష్టరు పార్వతీశం' పుస్తకం ఆవిష్కరణ చేస్తూ చేసిన ప్రసంగం.**



డా॥ రామారావుగారికి

మీ కథల పుస్తకాన్ని ఒక్క సిట్టింగులో చదివేశాను. కాదుకాదు. అదే నాచేత చదివించింది. అందువల్ల , చెడుగుణాలతో చెలరేగే ఈ పుస్తకాన్ని మెచ్చుకోక తప్పేట్టులేదు.

మొదటిది చకచక చదివించెడు గుణం

రెండోది పకపక నవ్వించెడు గుణం

మూడోది సందేశాల ఉపదేశాల తోముదు నుండి రక్షించెడు గుణం

నాలుగోది 'ఆమె'థడులో మెదడునీ మీ మెదడులో మెథడునీ

రెచ్చగొట్టి చెడుగుడు ఆడించెడు గుణం....

ఇన్ని చెడుగుణాలున్నందువల్ల తెలుగు వాడినయికూడా - ధైర్యంగా - పబ్లిగ్గా ఫస్టాస్ అంటూ మెచ్చేసుకుంటున్నాను.

సారీ

ముళ్ళపూడి వెంకటరమణ

2-1-1997.



# బాలశతకము

రచన: ముళ్లపూడి వెంకటరావు (మదరాసు)
(నాల్గవ ఫారము)

ఛందస్సు గణాలు లేక నె
నేరాసిన పద్యములను - సైరించుచు న
న్ను త్సాహ పరుపగోరెద
నా జేజే లివిగో నీకు - గైకొను బాలా!

ఉదయమున మేల్కొంచుచు
భగవత్ప్రార్థనముతోడ - దిన విధులనువే
నొనరించుచు తగువేళకు
గునగున బడికి పొమ్ము - గుణాల బాలా!

స్నేహితులతో తగవాడక
గురువులపై భక్తియుంచి తగునేర్పుగ నీ
చదువులనెల్ల గ్రహించుచు
తగువేళకు ఇల్లుచేరు సుఖముగ బాలా!

తల్లియు తండ్రియు నీపై
ఎంతెంతో ప్రేమ జూపుచుందురు; వారున్
దైవసమానులు నమ్ముము;
పూజింపుము వారినెపుడు స్థిరముగ బాలా!

ముళ్ళపూడి వెంకటరమణ రాసిన 'బాల' పద్యాలు

# మోహన కందాలు

## ముళ్లపూడి వెంకటరమణ

## ఆశీః

బ్ర॥ మ॥ మ॥ వెం॥ ర॥

బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ సుప్రసిద్ధ ఆశీర్వచనాచార్య ముళ్లపూడి వేంకట రమణాచార్యులు - శ్రీ చి॥ము॥వెం॥ర అను రచయితకు అశీ: పూర్వకముగా అనుగ్రహించు క్లుప్త సరళాభినందన పత్రికా॥

ము॥వెం॥ర గ్రంథితమగు 'శ్రీ మోహన కందాలు' యనబరగు షోడశ బద్య బంధమును స్థాలీపులాక న్యాయముగా బరికించితిని! ఈ బదియు నాఱు కృతులలోనూ రంభాద్యప్సరా శృంగార ప్రస్తావనలు, ఏకాధికముగా సంప్రాప్తమైనవి!! అది యట్లుండ నిండు! ము॥వెం॥ర అనునది ఈ కవి నిజ నామధేయముగా కన్పట్టదు! ఏలనన అది యస్మదీయము! అస్మన్నామధేయమును మా ఇంటి పేరు సహా తస్కరించి - లబ్ధ ప్రతిష్ఠుడగుటకై - తన ప్రచ్ఛన్న నామ సంకేతముగా ఉపయోగించుటలోనే ఈ చిరంజీవి ప్రతిభ ద్యోతకమైనది! నేను నవ్వుకొంటిని! అస్మదీయ బాలకుమారావస్థల యందు నేనునూ నన్నయ దిక్కన బోతన వంటి పూజ్యుల బుణ్య నామములనూ వారి పవిత్ర రచనలను అస్మదీయముగా బ్రయోగించి యుంటిని! ఈతడునూ అట్లే గావించి, నా మదిలో మధుర స్మృతులను గదలించినాడు! ఏది ఎట్లున్ననూ శుభమ్ భూయాత్ అనక తప్పదు గదా!

ఇక నీ బద్య మకుటములను జూడగా కృతి భర్త నిజ నామధేయము విశదముగా లేదు. కొన్ని కందముల యందు మోహనకందా యనియు, మఱికొన్నిట కందామోహన యనియు, మరియు గొన్నిట వట్టి కందా యనియు, కేవలము మోహన యనియు - ఛందో బందోబస్తుల వల్లగాబోలు - ఉంచుటచే - ఈ కృతి భర్త ఇంటి పేరు మోహనవారో, కందావారో నిర్ధారణగా తెలియకున్నది! అయిననూ ఈతడు రచయితకు ప్రియమిత్రుడుగా భావించనగును!

మోహనునకు మైత్రీ రథ

వాహనునకు హాస్యామృత వర్షిణియే గో

దోహనునకు ఖేదాటవి

దాహనునకు మోహన్ కందాగారికి జై!

* (హాస్యామృతాన్ని ధరించిన) గోవు నుండి పాలు పితికేవాడు. శుకమహర్షి గోదోహన కాలంపాటు (12 నిమిషాలు) ఎక్కడా నిలబడే వాడు కాదు.

* దిగులు అనే అడవిని దహించేవాడు.

బాపూ రమణలు పంచెల

చాపూ గీపూ బదులు చాలా 'ఇటు'గా

పెంచిన 'అందా'లను

ఆపేక్షగ నందుకొనుము అనఘా కందా!

ఆయనపై గౌరవాభిమానములతో ఈ గృతి సమర్పణ జేయునట్లు కూడా గ్రహింపనగును! మోహన యను ఇంటిపేరు గలవారున్నట్లు తెలియరాలేదు! కానీ శ్రీ కందా వారిలో కీ॥శే॥ కందా భీమశంకరముగారు అను సుప్రసిద్ధ న్యాయవాది చెన్నప్ప పట్టణంబున శ్రీకపాలీశ్వర-కర్పకాంబ (కల్పకాంబయని బాఠాంతరము - రలయోరభేద - గదా)- అమ్మవార్లు వేంచేసి కొలువుదీరిన కోవెల సన్నిధిలో నివశించేవారు! ఆ విధముగా ఇంటిపేరు కందా వారు అని గ్రహించినచో - పూర్వం చెన్నపట్టణమున విద్య నభ్యసించిన శ్రీ మోహన్‌గారు వారి పుత్రులుగా భావించనగును! పున శ్శుభమ్ భూయాత్!!

మఱచితిని! రెండవ కందములోనే బాపూ రమణలు అని యొక ద్వంద్వ సమాస భూయిష్ఠమగు జంటపేర్లను ప్రతిష్ఠించినారు! ఇది మరి యొక నయవంచన గాదు గద!! అనగా నివి ఒకరు చెప్పగా రెండవవారు వ్రాసిరా? లేదా వారు చెప్పగా వీరు గ్రీసిరా? అనునది సందిగ్ధము! పదంబడి ఆంగ్ల తురుష్కాది భాషా సంపర్క జనితములయిన పదములు బహుళముగా జేరి ఇది శబ్దాశ్రయ హాస్య మనదగినదిగా యున్నది కొన్ని అక్షర స్ఖాలిత్యముల చిత్రలిపినీ జూడగా - అది యటులుంచుదము!

పదనారు బద్దెములలోనూ రంభాద్యప్సరల బ్రస్తావన ఏకాధికముగా సంప్రాప్తమైనది. రంభ యూరువులను మరల మరల బొగడిన పునరుక్తి దోసము బ్రాప్తించగలదని హెచ్చెఱికలు బాడినారు! రంభోరువులను ఒకరేమి- ప్రబంధకవులందరూ - పునః ఏమి- పునః పునః పునః ప్రతిపాదించినారు! ఉద్ఘాటన చేసినారు! మనమేమీ ప్రత్యక్ష దర్శన మాకాంక్షించలేదే! వర్ణనలు మనోదృష్టికే గదా! ఇది గర్హ్యముగా దోచదే!

అందువల్ల ఈ కవిగారి హెచ్చెఱికలు వర్జ్యము లనదగును! మరొకచో -

ఉదయ వైతాళికుడైన యొక కుక్కుటవీరుడు - గోడిబందెములలో పోరి ఘు౦ణించగా వానికి వీర స్వర్గము లభించెననియు - అందు రంభతో పొందు గూడెననియూ - ఏతత్కారణముగా యుద్ధవీరులందరూ పోరాడి జయించుట కన్న పోరున ప్రాణములు విడచి వీర స్వర్గము చేరుటయే శ్రేయస్కరమనియు ప్రబోధించినారు! ఈ విషయము తనది అని అసత్యము చెప్పకపోయినా ఇది కవిసార్వభౌముడు శ్రీ శ్రీనాథులవారి దన్న సత్యాన్ని వెల్లడించనందుకుగాను - ఈ రచయితకు తస్కరాచార్య యను బిరుదునిచ్చి అభిశంసించుచున్నాను.

పైన ఉంచిన శీర్షిక - 'ఆశీః'కి ఆశీస్సు అనిగాక మరొక అర్థము గలదు - పాముకోఱ అని! బుధజనులు గ్రహించగలరు! ఈ చిన్ని బొత్తమును స్థాలీపులాక న్యాయముగానే జూచుటచేతను, గ్రంథవిస్తరణభీతి చేతను గుణదోష విచారణను విరమించుచున్నాను!

ఆ రమా-రమి* వీరిని క్షమించుగాత!

ఇట్లు
బుధజన విధేయ బ్ర॥మహో॥ము॥వెం॥ర॥
(నిజనామధేయుడు - ఈ పద్య రచయిత కానేకాడు)

** రమా-రమి అనగా రమతో రమించువాడు అనగా విష్ణుమూర్తి.

సీతే 'రకుక నవ్వుటు
టీతే సినిమా విటుచు దేనాటికినో
దేూయని అడిగేూ
నేతే ఫిల్మీని చేరునాడే 'గందా!'

ఉప్పేల సముద్రానికి
మెప్పేలా రంభ* తొడకు మేనక* మెటకున్
చెప్పేల? త్యాగిచరె మే
కప్పేలా మిస్సురుకు కందామోాన్!

** ఇంద్రుని ఆస్థాన నర్తకీమణులు మరియు సినిమా తారలు.

# మోహన కందాలు

మందారపూల తోటన
కందాలతో బాపురమణ కల్పించినదీ
'కందార తోట' మైత్రీ
బంధమ్ముగ నందుకొనుము కందామోహన్!

హాయిగ జోకులతో హహ
హా! యని నవ్వించి నవ్వు హాస విపంచీ!
భాయీ! మోహన కందా!
నా యీ కందాలు చదివి నవ్వాలి సుమా!

నేరాయోపేరి పాటవి
పేరందరు చేస్తూనే ఉంటారైతే
నేరాలేరే వలలో
జారటమే నేరమౌను జగతిని కందా!
(జారిపడుట నేరమగును జగతికి కందా!)

బ్రదరా 'ఓపియు' మంటే
అదరః పీపుల్సు 'మనీ'ట! అది విన్నావా! O.P.M.
నదరా రెండిటిలోకి
'అదరే' కిక్కుక్కిచ్చు గదరా కందా!
* అదర్– (ఆంగ్లశబ్దం)

ఓపియమంటే మైకం
ఓపీయమ్ అనగ తెనుగు - ఒరులది పైకం
ఏ 'పీయం' మత్తెక్కువ?
పాపాటే తేల్చగలదు సరిగా మోహన్!

*ఏడొందల రూపాయల
నేటూళ్లకు పంచిపెట్ట నే(ట్) సిరి కమిటీ
ఏడే లక్షల ఖర్చున
మూడేళ్లలో పంచినారు మోహన కందా!

* తమిళనాడు ప్రభుత్వం సింగపూర్‌లో ఒక 7వేల జీతగాడిని నియమించడానికి 7 లక్షల ఖర్చుతో సెలక్షన్ కమిటీని పంపింది.

కోడొక్కటి ఇం'కోడి'ని
ఓడించి తెగేసి చంప - ఓనరు - 'హీరో'
కోడినే తేసి పకోడీ
వేడిగ తానారగించె వినుమా కందా

*పోరున చచ్చిన కోడో?
వీర స్వర్గమ్ము చేరి వీరుల కొల్వులో
ధీరుడివలె నిలబడగా
ఆ రంభే కుక్కుటమును అక్కున జేర్చెన్!

* వీరమరణము చెందిన జీవికి వీరస్వర్గములో రంభా సంభోగ భాగ్యము లభించునని వేదములు ఘోషించుచున్నవి. కోడివీరుడికిదే లభించినది.

పోటున గెలిచి పకోడిగ
నోటని కరిగేటి ఖర్మనొందుటకన్నా
నీటుగ చచ్చారంభల
గూటిలో దూరేది బెటరు గువ్వల కందా!

నీతి: పోటున గెలుచుట కన్నా ఓటమియే లాభసాటి యౌను గదన్నా

రంగేల మంత్రి పదవికి
హంగేలా పార్లమెంటు హౌసు కెదురుగా
బెంగేల సీట్లు నీకై
వంగేలా వుంటగాను వినుమా కందా!

అపకారికి నపకారము
విపరీతముగాదు సేయ వివరింపంగా
ఉపకారికి నపకారము
నెపమెన్నక సేయువాడె 'నీతుడు'* కందా!

* నీచుడు కాదు. నేటి నీతి యిదే అని తాత్పర్యము

ఎప్పుడు నప్పులు జేసెడి
నప్పురుషునె గొల్వవలయు నది ఎట్లన్నన్
'అప్పే' పవరని యే - వెం
కప్పైనా చెప్పగలడు కందా మోహన్!





గాయకుడుగా జీనియస్
మనిషిగా అజాతశత్రువు
మాకు ఆయన పరిచయం కలగడం
భగవంతుడిచ్చిన వరం

-బాపు, రమణ

వదనం మధురం వచనం మధురం నయనం మధురం హసితం మధురం
- హృదయం మధురం చరితం మధురం గానం మధురం మధురం మధురం
బాలు సరస్వతి రఖిలం మధురం

1994 లో శ్రీబాలు సినీజీవిత రజతోత్సవం సందర్భంగా
అమెరికాలో వెలువడిన సన్మాన సంచిక నుంచి




శ్రీ వేటూరి అభినందన సంచిక కీర్తన నుంచి 1995

# అక్షరాభిషేకం



ఆరుద్రా
శక్తి సముద్రా!
చైతన్యానికి వ్రాలుముద్రా!

సాహిత్య ఋషి
నీ కలం పేరు కృషి
నీ బలం పేరు కుషి
జోహార్

వ్యాసానందా
వాక్యాక్షర శబ్ద భావ-వి-న్యాసానందా

ప్రాసానందా
అంత్య ప్రాసాంతకానందా
జోహార్

అమ్మకడుపు చల్లగా
అత్తకడుపు చల్లగా
అనగలిగిన సౌమ్యసౌమ్యవాదీ
లిమ-రి-గ్వేదీ
సాదాసీధీ
సబ్ కా సాథీ

రాయిలాంటి
కొబ్బరికాయలాటి పద్యాన్ని
కొబ్బరి లౌజులాంటి పజ్యేంగా
మజా అయిన మజ్యేంగా
తెన్గించిన దొరా

చదరంగ స్థలవీరా
'పేకాటవిక'శూరా
గళ్ల నుడికట్లహారా
"సాహితీరంగంలో అందరూ చేసినవన్నీ
ఆరుద్ర చేశాడుగానీ
ఆరుద్ర చేసినవన్నీ (ఎవరూ)
అందరూ చేయలేదు"
అనిపించుకున్న హీరో!
పుస్తకాల పూజారో!
జోహార్

నీ అసలు పేరు
వందమంద అకాదెమీ
లకి - మారుపేరు సుమీ
మర్చిపోకు సుమీ

మింటునీ
గవర్నమెంటునీ
కాదని
నీ సొంత అకాదెమీ
ని-వెయ్యేళ్లు నడిపించు సుమీ

పొరుగు శతాబ్దాల్లో కూడా
ఆరుద్ర అనే అక్షరశక్తికి
అక్షరాభిషేకం జరగాలి సుమీ!

- బాపు రమణ
శ్రీ ఆరుద్ర షష్టిపూర్తి సందర్భంగా
1-9-1985



# స్నేహగీతి



నాతో మాట్లాడ్డమే ఓ యెడ్యుకేషన్!
అంటాడు గిరీశం.
నాతో కబుర్లే ఓ యెంటర్‌టెయినేషన్!
అని అనకపోయినా
అనిపించేలా చేస్తాడు గొల్లపూడి మారుతీశం
పకోడీల్లా ఘుమఘుమలాడుతూ
చేగోడీల్లా కరకరలాడుతూ
పటాడీలా డైలాగు సిక్సరు కొడుతూ
వేడివేడి వాడివాడి
వాగ్ఝవ ప్రదర్శన విన్యాసాలతో పోకళ్లతో
తురంగములవలె
కురంగములవలె
విశాఖ సముద్ర తరంగములవలె
చెంగు చెంగుమని
అంగలు వేస్తూ
స్టేజి, సినిమా, జీవన రంగస్థలాలపై
రచయితగా, నటుడిగా,
హుషార్లు గుబాళించే మనిషిగా
మువ్వన్నెల జెండా ఎగురవేసే
గొల్లపూడికి జోహార్లు

*Wishing a Happy New Century* — ముళ్లపూడి 6-5-2001



బడుగుపేదల గాథల బాగ తరించి
బాధలోపలి సారాన్ని పైకి తీసి
పంచినవ్వించి కవ్వించి మించినావు
రమణ వందనమందుకో రావిశాస్త్రి

తెలుగునీడల నడుమన తెలియనట్టి
తేలుచాయల వాక్యాల వెలువరించి
తెలుగుపల్కుకు శోభను తెచ్చినావు
రమణ వందనమందుకో రావిశాస్త్రి

పన్నీటి జల్లుపోలిన
ఎన్నో ఉపమాన శతములున్నాకానీ
కన్నీట ముంచి రాసిన
వన్నె ఒక రావిశాస్త్రి పెన్ నిధియె సుమా!

# రమణరాసిన సినిమా పాటలు

## పక్కలో బల్లెం

గాయకులు: శ్రీమతి సుశీల,
సరోజిని అండ్ పార్టీ

మల్లిక: కదలే నీడలలో కనబడువారెవరో
కన్నూ కన్నూ కలిపీ కవ్వించినాడే
చెలీ అలుగబోయి నవ్వినాను యేలనే

చంప: తెలుసులే లేలేలే తెలిసిన కథలే
వలపులే లేలేలే వలపుల కథలే

సఖులు: వలచినా వాడె కా–వలసినా వాడేలే!

మల్లిక: కలలోనా కలగంటీరేయీ
ఎవరో చెంతచేరి చెంప నిమిరినాడే
కనులు కావన్నాడే – కలువ పూలన్నాడే
అనుచు...కనుల మోవి యానినాడే!

చంప: తెలిసెలే లేలేలే తెలిసెను కథలే
వలపులే లేలేలే వలపుల కథలే

సఖులు: కలసినా వానిపై కలగెనూ వలపులే

మల్లిక: లేడితోడ ఆడుచుండ నేనూ
ఎవరో నన్ను చూసి గేలిచేసినాడే
నడుము లేదన్నాడే – ఏదీ చూపన్నాడే!
అనుచు... చూచీ.... మనసు దోచినాడే!

చంప: దొంగలే లేలేలే దొంగల దొరలే!
దొరికెలే లేలేలే దొంగ దొరికెలే!

సఖులు: వలపులా దొంగలే – వానినీ ఖైదుచెయ్!

మల్లిక: జలకమాడి తలకమిడుగ నేనూ
ఎవరో అద్దములో ముద్దులాడినాడే!
తానే నేనన్నాడే... తప్పు లేదన్నాడే
అనుచు... మరల... మరల... మరల....
హోయ్...హోయ్.... హోయ్....!

చంప: తెలిసెలే లేలేలే తెలిసెను కథలే!
వలపులే లేలేలే.....వలచిన కథలే!

చంప: లా లా లా లా.... లా లా లా లా!

సఖులు: లా లా లా లా.... లా లా లా లా!!

❀

**గాయకులు: పి.సుశీల**

తెలుసో! యేమో! అందానికి అలకే అందం
అవునో! యేమో! అందులకే అలిగిందేమో
అందం నీదే కానీ
ఆనందం నాదే రాణీ
చెంతకు రావే చెలియా
నా కనులను చూడవె నీ ప్రతిబింబం ॥తెలుసో॥
కమ్మని మోమే పసుపూ
కాటుక కనులూ నలుపూ
బుగ్గల సిగ్గులు ఎరుపూ
ఇది వలపని నీ చిరునవ్వే తెలుపు ॥తెలుసో॥
చినదానా వలచిన దానా
అందంగా అలిగిన దానా
చాలించవే నీ కోపం తాపం
లాలించవే ఈ దీనుని పాపం.

# ప్రేమించిచూడు

గాయకులు: పి.బి. శ్రీనివాస్ బృందం

మేడమీద మేడకట్టి కోట్లు కూడబెట్టినట్టి కామందు
హలో హలో కమాన్ కమౌట్ రా ముందు
అందుకుంటే జుట్టుపట్టి, అందకుంటే కాళ్ళుపట్టు కామందు
హలో హలో కమాన్ కమౌట్ రాముందు దిగిరా ముందు
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్

ఆడపిల్ల మాటమీద ఉద్యోగాలూడగొట్టు ఆకతాయి కామందు
మీసకట్టు తీసివేసి కాసిపోసి కోకచుట్టి గాజులేసుకొమ్మందు
డొక్కచీరివేస్తాం, డోలుకట్టి తెస్తాం, డోలుకొట్టి గోలపెట్టి రచ్చకెక్కుతాం!
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్

రాత్రికి నేనొక రాక్షసినై నీ కలలో పీడిస్తా
రేపటివేళకు నీ పని నీదని దారికి రాకుంటే
మాపటివేళకు నీపని నేపడతానోయ్ బుచ్చబ్బాయ్
మిన్నువిరిగి మీదపడ్డ, మన్నుమిన్ను ఏకమైన నిన్ను గెలుచువరకు మేము
ఆడితీరుతాం పోరాడితీరుతాం
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్

మేడమీద మేడకట్టి కోట్లు కూడబెట్టినట్టి కామందు
హలో హలో కమాన్ కమౌట్ రాముందు
అందుకుంటే జుట్టుపట్టి, అందకుంటే కాళ్ళుపట్టు కామందు
హలో హలో కమాన్ కమౌట్ రాముందు
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్
బుచ్చబ్బాయ్ పనికావాలోయ్.



జిన్నూ బ్రాందీ రమ్ముల

కన్నా కిక్కెక్కువిచ్చు కందాలెన్నో

ఫన్నిచ్చిన అబ్బూరికి

ఎన్నాడా! ఇవ్వగలవు ఎంకటరమణా!

విన్నావా! ముళ్లపూడి వెంకటరమణా! అనే మకుటంతో
పద్యాలు రాసిన అబ్బూరి శతజయంతికోసం రాసిన పద్యం. 20.5.95

రాత్రీ పగలూ బూతులు
పత్రే 'సారాం'శమైన శీర్షధాత్రిన్
బూత్రేయ బరుగునందిన
ఆత్రేయుడి పాట నేడు 'ఆక్' పాలాయెన్

13-05-1997

నండూరికి పదసంపద
మెండూరికి విచికిత్స భండారికి మా
ఫ్రెండూరికి సత్కారము
రండీ రారాజ్మహేంద్రి పండుగ చూడన్



డాక్టర్
ఎంవీ ఎల్లెన్ మూర్తి
గడించే
ఎంతో ఘనమగు కీర్తి
రోటరీ క్లిను వలచీ
వరించె
పళ్‌రాలగొట్టరని తెలిసీ
ప్రెసిడెంట్
ఎం వీ ఎల్లెన్ మూర్తి
తెస్తాడు క్లినుకే గొప్పకీర్తి!

- బాపు. రమణ
1 జూలై 99

# కవిత్రయం

కవిత్రయం అంటే--

నన్నయ తిక్కన ఎఱ్ఱన కాదు

కవిత్రయం అంటే--

తిక్కన గురజాడ వేమన

- ఆరుద్ర తీర్పు ఏప్రిల్, '86

కవిత్రయం అంటే--

తిక్కన గురజాడ వేమన కాదు

గురజాడ వేమన శ్రీశ్రీ

- ఆరుద్రే మే '86

కవిత్రయం అంటే--

గురజాడ వేమన శ్రీశ్రీ కాదు

వేమన శ్రీశ్రీ ఆరుద్ర

- మళ్ళీ ఆరుద్రే జూన్ '86

కవిత్రయం అంటే--

వేమన శ్రీశ్రీ ఆరుద్ర కాదు

ఆరుద్ర రుద్ర ద్ర

(.....)

-ముళ్ళపూడి వెంకటరమణ, ఏప్రిల్ '86

## వ్యాస రమణీయం (వ్యక్తులు)

# ఫన్ డాక్టర్ చంద్రశేఖరం



..." అంటూ థాట్ రీడింగ్ (పరేంగిత గ్రహణ విద్య) పై చిన్న సైజు గంభీరోపన్యాసాన్ని ముగించి, ఆ విద్యను ప్రదర్శించడానికి ఉపక్రమించారు (ఫన్) డాక్టర్ చంద్రశేఖరం.

"ప్రేక్షకులలో ఎవరైనా ఒకరు వేదిక మీదకు రాగోరుతున్నాను" అనే సరికి, మూడు నాలుగు వందల ప్రేక్షకులలోనూ ముందు వరసలో కూర్చున్న ఒక యువకుడు ముందుకు వచ్చాడు తక్షణం.

"వీడు మా అబ్బాయేలెండి. ఎవరైతేనేం పరవాలేదు. నాకు పక్షపాతం లేదు. ఇప్పుడు ఈ ప్రేక్షకుడు నా మనసులో ఊహలను పుస్తకం చదివినట్టు చదివేస్తాడు చూడండి... చూచి ఆశ్చర్యపడండి" అన్నాడు డాక్టర్ చంద్రశేఖరం. అని, గంభీరంగా కళ్లజోడు లోంచి ప్రేక్షకుడి కళ్లలోకి చూసి, మాట వరసకి హూంహూఁ అని కాస్త హంగు చేసి, 'నాయనా' అనేసరికి, ఆ యువకుడు మంత్రముగ్ధుడైనట్టు కుర్చీలో కూలబడ్డాడు.

"నేనో సంఖ్య తలుచుకుంటాను. అది ఎంతో చెప్పు చూద్దాం" అన్నాడు పరేంగిత గ్రహణ విద్యా ప్రదర్శకుడు డాక్టర్ చంద్రశేఖరం.

"యాభై రెండు" అన్నాడు కళ్లు మూసుకున్న ప్రేక్షకుడు.

"రైట్! యు ఆర్ రైట్..." అన్నాడు. చంద్రశేఖరం చూశారా నా ప్రజ్ఞ అన్నట్టు ప్రేక్షకుల వంక చూస్తూ.

అంతవరకూ, ఏం జరుగుతుందో అని నిశ్శబ్దంగా కూర్చొని చూస్తున్న ప్రేక్షకులు ఒకసారి గొల్లున నవ్వారు ఈ హాస్య రసజ్ఞుడి సరసాన్ని ఆస్వాదించి....,

కాంగ్రెసు నాయకుడు కీ.శే. సత్యమూర్తి కరతాళధ్వనులు చేసి, "ది మోస్ట్ ఇంటలిజెంట్ నాన్సెన్స్" అని మెచ్చుకున్నారు. అందరూ నవ్వినా ఒకాయనకి మటుకు కోపం వచ్చింది.

చాలా కోప్పడ్డారు. 'ఇదేమి విద్య' అని. థాట్ రీడింగ్‌లో ప్రజ్ఞ ఉందన్న వాడే మనిషి ఊహలు బయటపెట్టాలి తప్ప, ఎదుటివాణ్ని తన భావాలు కనుగొనమని చెప్పి, వాడు చెప్పినవన్నీ రైట్ రైట్ అనడంలో అర్థం లేదనిన్నీ ఇది కేవలం ప్రేక్షకులను శుంఠలుగా జమ కట్టడం అనిన్నీ ఆయన చాలా గంభీరంగా కోప్పడ్డారు.

"మేమందరం ఎవరమనుకున్నారండీ. పసిపిల్లల మనుకున్నారా ఇలా ఆడించడానికి?" అని కూడా అన్నారు.

తన మటుకు తను కాలేజీ లెక్చరర్ అని ప్రకటించారు. అందులోను అలాంటి లాంటి లెక్చరరు కాదు. లెఖ్ఖలూ, కెమెస్ట్రీ చెప్పే ఆసామి.

ఈసారి కూడా చాలా మంది పెద్దలు నవ్వేశారు.

చంద్రశేఖరం ప్రదర్శన కొనసాగింది.

'నాయనా? నా పిడికిట్లో ఏమిటి ఉంది?... కెనేడియన్ రైలింజనా...? బి.ఒ.ఎ.సి. విమానమా?.... కుతుబ్‌మీనార్ గోపురమా?.... ఏమిటి చెప్పు' అన్నాడు.

"రిస్టువాచీ."

"ఓహో... రైట్! సెంట్ పర్సంట్ రైట్!" అన్నాడు డాక్టర్ చంద్రశేఖరం గోలీకాయ చూపించి. నవ్వగలిగిన వాళ్లంతా మళ్లీ విరగబడి నవ్వారు.

ఫన్ డాక్టర్ చంద్రశేఖరం మన తెలుగుదేశం అంతా పర్యటించి, అందర్నీ నవ్వించాడు. ఆపైన భారతదేశంలో నాలుగు మూలలకూ వెళ్లి ఇంగ్లీషులోనూ, హిందీలోనూ నవ్వించాడు. 1958లో చైనా కూడా వెళ్లి వచ్చాడు.

ప్రేక్షకులను బట్టి ఆయన ప్రదర్శన రీతి, చెప్పే కథలో వాడే భాషా ఉంటాయి.

ఒక్కొక్కసారి ఆంగ్లంలో పద్యాలు చదువుతూ అభినయిస్తారు. ఆంగ్లం తెలిసిన వారు రెండిందాలా నవ్వితే, తెలీనివారు ఈయన నటన మాత్రం చూచి అంతకు రెండింతలు నవ్వుతారు.

బహుజనాదరణ పొందిన ఇంగ్లీషు పద్యాలలో కవలల గురించిన దొకటుంది. అది ఆ జంటలో ఒక సోదరుడి గోడు.

"వాడికి జలుబైతే, నాకు మందు! నాకు ఆకలైతే వాడికి విందు! వాడు పోలీసుని కొడితే శిక్ష నాకు! వాడికి దిష్టి తగిలితే నాకే రక్ష రేకు..." ఇలా కథ సాగుతుంది. చివరికి ఈ చెబుతున్న కుర్రాడికి చక్కని చిన్నదాన్నిచ్చి పెళ్లి చేయ నిశ్చయిస్తారు. ఎవరెవరో తెలీక, కంగారులో చివరకా పిల్లని ఇతగాడి సోదరుడికి కట్ట పెట్టేస్తారు!

ఇలా కొన్నాళ్లయేసరికి 'మావాడు పోయాడు; తక్షణం వాడు నేననుకుని నన్ను పాతి పెట్టేశారు. ఏం చెయ్యను? కొంత కాలానికి, నేనే చనిపోయాను; అప్పుడూ ఇంతే! నన్ను అలాగే వదిలేసి, వాణ్ణే పాతి పెట్టారు!' అని వాపోతాడు.

ఈ పద్యాన్ని చంద్రశేఖరం, చక్కగా తిప్పుకుంటూ, స్వరం కట్టిన పాటలా చదువుతూ ఉంటే, చూచి తీరాలి అంటారు చూచిన వాళ్లంతా.

మోలియర్ నాటకంలో ఒక ప్రేమికుడు డాక్టరు వేషం వేసుకుని, ప్రియురాలికి చికిత్స చేయబోయే సన్నివేశంలో మూడు నాలుగు పాత్రలనూ చంద్రశేఖరం అవలీలగా నటించి పొట్టుబ్బేట్టు నవ్వేస్తారు.

నిజజీవితంలో నిరుపమాన ధైర్య సాహసాలతో తిరగడం, ఏదీ ఖాతరుగా లేనట్టు నిత్యం ఉత్సాహంగా ఉండడం అందరికీ అస్తమానం సాధ్యపడదు. ఇలాగే ఊహలో చాలా బాగుండేవెన్నో వాస్తవానికి చాలా దూరంగా ఉంటాయి.

"నా మటుకు నేను, ఈ జీవితంలో సాధించాలనుకున్న వాటిని నటనా జీవితంలో అనుభవిస్తాను" అంటాడు చంద్రశేఖరం.

❀ ❀ ❀ ❀

నటుడుగా చంద్రశేఖరం ధరించని పాత్ర అరుదు. ఐతే ఈ నటన వేరు. నాటక రంగం మీద వేషం అయితే, పాత్రకు తగ్గ విగ్రహం, అలంకరణ ఉండాలి. కండువా భుజాన వేసుకుని స్టేజి మీద నిలబడే చంద్రశేఖరానికి ఈ బెడదలేదు. మంత్రదండంలా ఆ కండువానుపడుతూ, ఇట్టే పిల్లాడిలా, అట్టే ముసలివాడిలా, ఇంకో నిముషాన ఆడపిల్లగా ప్రౌఢగా మారిపోతూ ఉంటాడు.

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు," అనే ఒక్క పద్యాన్నీ మూడో క్లాసు పిల్లలు ముప్పై నలభై మంది ఎలా ఒప్పచెప్తారో అభినయించడం చూచిన వారికి చంద్రశేఖరం నిశిత పరిశీలనా దృష్టి జీవితంలో మనోహరములైన, ఆహ్లాదకరమైన రంగులను చూచి, చూపగల శక్తీ బోధపడతాయి.


జోకర్ హుస్సేన్‌గా

ఈ పద్యం (ఇంగ్లీషులో కబుర్లు చెప్పినపుడు. "అండర్ ది స్ప్రెడింగ్ చెస్ట్‌నట్" చదువుతాడు). చదివి చంద్రశేఖరం పిల్లలను, పెద్దలనూ కూడా ఎన్నిసార్లో నవ్వించాడు.

ఒక పిల్ల పెంకి రకం. "నువ్వేదో అడిగావు గాబట్టి ఉద్ధరిస్తాను" అన్నట్టు చదువుతుంది; ఇంకో పిల్లకి బోల్డు పద్యాలు కంఠతా వచ్చునన్న గర్వం; అందుకని పంజాబ్ మెయిలు వేగంతో ఇదీ, ఇంకో పదీ గడగడా వల్లించేస్తుంది. మరో పిల్లాడికి, ఆడపిల్లల ముందు మాట్లాడడం సిగ్గు, ఒక్క పాదం చెప్పడానికి బోల్డు సిగ్గుపడిపోయి బల్ల కింద దాక్కుంటాడు. ఇంకోడికి పాడడం చేతనవును; అందుకని చాలా సేపు ఆలాపిస్తాడు. ఇలా నలభై మంది పద్ధతుల్ని చంద్రశేఖరం ఒకసారి చైనాలో (1953) ప్రదర్శించినపుడు, అక్కడి వారంతా వారిని ప్రశంసా పరంపరలో ముంచెత్తేశారు.

'సింపుల్ ట్రావెలింగ్ థియేటర్' అనేది చంద్రశేఖరం ఊహించి ఏర్పాటు చేసినది. మారుమూల పల్లెటూరి జనం అంతా, వాళ్ల ఊరి రచ్చబండ దగ్గిర కూర్చుని చూచి ఆనందించడానికి ఏర్పాటు అయింది.

ఫన్ డాక్టర్, ఇంకొకరిద్దరు ముగ్గుర్ని వెంట బెట్టుకుని, రెండెడ్లబండీ ఎక్కి ఊరూరు తిరుగుతారు. పది నిముషాల వ్యవధిలో పదివేషాలు మార్చే కిటుకులు అతనికి తెలుసు. తిన్నె మీద నిల్చుని కబుర్లు, కథలూ చెబుతూ ఆ వూరి చిన్నా పెద్ద కూడా పొట్ట చెక్కలయేలా నవ్వేలా కాలక్షేపం చేసి, బిచాణా ఎత్తేస్తాడు పొరుగూరికి!

ఇలా ఓసారి నాగార్జున సాగరం డాము ప్రాంతంలో పనివారి వినోదం కోసం బయలుదేరి వెళ్లి, హుషారుగా ఆడి, పాడి వాళ్లని నవ్వించాడు.

అదయిపోయాక, అక్కడ చిన్న ఉద్యోగి ఒకరు చంద్రశేఖర్‌ను అభినందిస్తూ "సార్! ఇక్కడికి చాలా పెద్దవాళ్లు, మంత్రులూ, ఇంజనీర్లూ చాలా మంది వస్తూపోతూ ఉంటారు. మేము చాలా హడావుడిగా ఉంటాం. కాని మీ అంత పెద్దవాడెపుడూ రాలేదు; మేమింత సంతోషించిందీ లేదు. అందుకని ఈ రోజును మరచిపోము" అన్నాడు.....

- 1957

# సాటిలేని భమిడిపాటి మాటకచ్చేరి



కొన్నాళ్ళు
శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

**చం**ద్రుడూ వెన్నెలా కనిపించి అనిపించినంత అన్యోన్యంగా బిరుదులూ వాటి తాలూకు 'భర్తలూ' తటస్థపడడం అరుదు. అలా అరుదైన వాటిలో - పుష్ప సౌరభాల లాగా, హాస్యకరుణ రసాల వలె, ఆమ్రేడిత పదద్వయం రీతిన, "ఒహ గొప్పవాడూ" - తెలుగుదనమూ ఏర్పాటులో, కలిసిపోయి నప్పి ఒప్పే రెండు తెలుగు మాటలు, 'హాస్య బ్రహ్మ' 'భమిడిపాటీ'ను.

బిరుదుల్ని సామాన్యులు ధరిస్తారు, మాన్యులు భరిస్తారు. ఈ రెండో కోవలో మొదట నిలబడగల కామేశ్వరరావుగారిని, వెన్నుగలదన్నూ, ఢంకాలు బద్దలు కొట్టి మరీ చెప్పుకోడానికి చిరునామా, లేకుండా చాలాకాలం రికామీగా ఉంటూ వచ్చిన 'హాస్యబ్రహ్మ' బిరుదు వరించి, ధరించింది. అందుకనే, "ఈ దేశములో హాస్యము ఒక్కనిదే సొత్తు... నవ్య సాహిత్య శాఖలలో ఏ పని అయినా ఒకడు చేసింది ఇంకోడు చేశాడు గాని ఈ భమిడిపాటి కామేశ్వరరావు గారు చేసిన హాస్యరచన మరియొకడు చేయలేదు" అని 18 ఏళ్ళనాడు కవిసమ్రాట్ ఈయనకు నవ్యసాహిత్య పరిషత్ సభలో జోహారులర్పించారు...

తన జాతి గురించి కూలంకషంగా తెలుసుకుని ఆ తెలుసుకున్న యావత్తు సుబ్బరంగా, నిబ్బరంగా చెప్పగలిగినవాడిని కలిగిన జాతులలో తెలుగుజాతి ఒకటి; తెలుగు జాతిలో అలా చేయగలిగిన వారు కామేశ్వరరావు గారు ఒక్కరే.

"ఎవరు మీరు" అని అడిగితే - 'ఘనీభవించి, మారువేషం వేసుకు చక్కావచ్చిన వినమ్రభావమా ఏమిటి చెప్మా వీడు!" అని అడిగినవాడు కంగారుపడి లేచేలాగా, "ఒహ గొప్పవాణ్ణి" అని టూకీగా తన ఆర్షేయ పౌరుషేయాలు, జీవిత చరిత్రా ఒక్క ముక్కలో చెప్పుకున్న మితభాషిలగాయతూ, నేనేమైపోయినా సరేగాని వాడు తిరుక్షవరం అవాలని ఆకాంక్షించిన పరహితాభిలాషి దగ్గిర్నించీ, ఇంకోడి రచనని ఎలా దించి, కుదించి, జమాయించి సొంతానికి జమ చేసుకుని దబాయించవచ్చునో చెప్పగల విశ్వామిత్రరావు మొదలుచ్చుకుని, సభని అభాసు

చెయ్యడంలో తన ప్రజ్ఞని ఎలా పేల్చగలడో చెప్పడంలో ధూమాలమ్మ వాగ్ధాటిని దాటిపోయే చారుదత్తరావు ఆదిగా, పోటీకొచ్చిన సాటి ఓటర్థిని వెనకపోటు పొడిచే మార్గాలూ మార్గాంతరాలూ వగైరాల మీద డాక్టరేటు పుచ్చుకోతగ్గ ఎలక్షన్ అభ్యర్థి నుండీ, ఇంగ్లీషులో ఎలాగేనా ఎక్కువ పస ఉందని పసిగట్టి తెలుసుగున్న 'టెలుగు సున్న'లోని ఇంగ్లీషు తమ్ముళ్ళ దాకా రకరకముల 'కచటతపల'ను రకరకముల కచటతపలకు పరిచయం చేసి నవ్వించి కవ్వించిన మనిషి కామేశ్వరరావుగారు. ఈ రూపేణా వాళ్లకోసం ప్రయోజన ప్రదాయకమైన బాధపడిన మనిషి కామేశ్వరరావు గారు. తోటివాళ్ళమీద సాటివాళ్ళమీద వెటకారాలూ మిరియాలూ నూరడం, వాళ్ళ దుర్గుణగణాలు జాబితా వేసి చదివి నవ్వించి హాస్యం చేయడమే ఆయన లక్ష్యమనీ, ఆయన హాస్య రచయిత మాత్రమేననీ అనుకునేవాడు, విశ్వనాథ సత్యనారాయణ గారి మాటలలో "వట్టి తెలివితక్కువవాడు" ప్రేమ, ఆపేక్ష, ఆవేదన, వాత్సల్యం ఉండడంవల్లనే హాస్యంలో మాటమాటకూ కండపుష్టి కలుగుతుంది....

కామేశ్వరరావు గారు ఆంధ్రుడి విశ్వరూపాన్ని దర్శించగలిగారు; అందరికీ - వారి వారి సంస్కారాన్ని బట్టి అది హృదయగతం కాగల అవకాశాన్ని కలిగించారు. జాతి వికాసానికి కూడని లక్షణాలను గర్హించారు. అవి ఉన్నందుకు 'అన్నన్నా' అని బాధపడి లేచి, హన్నా అని కోప్పడి, నాన్నా అని లాలించారు. ఎబ్బెబ్బే అని హేళన చేశారు. ఈ క్షోభ లక్ష్యం ఏమిటో ఆయన రచనలు చదివిన వారందరికీ తెలుసు. తన జాతిపట్ల తనకు గల ఆపేక్షకీ, ప్రేమకీ, గౌరవానికీ, గర్వానికీ, లజ్జకీ, దానికోసం ఆయన పడ్డ బాధకీ ఆయన రచనలన్నీ 'అక్షరా'నువాదాలు.

రచయితగా కామేశ్వరరావు గారికి నాదారాధన పట్ల గల అభిమానాన్ని ఆయన వాక్యసౌందర్యం చాటుతుంది. తెలుగుజాతి చైతన్యం అంతా పోసుకుని, జవనాశ్వం లాగా, బడిపిల్లడి నోట్లో పదో ఎక్కంలాగా పరుగులెత్తే ఆయన వాక్యాలలో ప్రతి మాటలోనూ పంచప్రాణాలూ ప్రతిష్ఠించి ఉంటాయి. మాట విలువ తెలుసుకుని దాని మీద అధికారం కోసం నిత్యం తపస్సు చేసిన వ్యక్తి ఆయన.

ఆ వాక్యాలలో ఓమాట ఇంకో మాట మాటున నిలబడి ఆకుచాటు పిందెలా ఎంత అందగిస్తుందో, ఓ మాట ఇంకో మాటు వస్తే ఎలా ఒళ్ళు ఝల్లుమనిపింప చేస్తుందో, ఓ మాట ఇంకో మాటని ఢీకొంటే అందులోంచి ఎలాంటి కొత్త భావం పుట్టుకొస్తుందో, ఓ మాటని ఇంకో మాటకి మాటు పెడితే ఎలా తయారవుతుందో, ఒక మాటమీద ఎక్కి ఎలా ఇంకో భావం మీదికి షికారు వెళ్ళి రావచ్చునో (...చారుదత్తరావు గుణగుణాలను టాకీ తీయడానికి వెంటనే ఒక కంపెనీ లేవాలి; లేవగానే మొహం కడుక్కోడం మంచిది.) ఆయన వ్యాస విన్యాసాలలో మనం దర్శించ వచ్చు. తెలుగు నుడికారం మీద ఆయన మాట ఆఖరు మాట అంటే అది ప్రస్తుత సందర్భం కొద్దీ దూకుడుగా అనేస్తున్న అభివందనం కాదు; తెలుగు పలుకుబడి సొగసు మీద ఆయనకు గల పలుకుబడి అంతటిది. "తెలుగువాళ్ళ ఇంగ్లీషు నుడికారం" తమాషాలు కూడా, కామేశ్వరరావు గారి 'బడి'లోనే తెలుసుకోవాలి.

కామేశ్వరరావుగారు మనందర్నీ ఎంత నవ్విస్తారో అంత నవ్వని మనిషి; అంత గుంభనపు మనిషి. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో ఆయన ప్రసంగాలు విన్నవాళ్ళకి పై విషయం, ఆయనను స్వయంగా ఎరిగున్న వాళ్ళకి రెండోవిషయం చాలా బాగా తెలుసు. ఆ వ్యక్తి ధైర్యస్థైర్యాల గురించి, యావదాంధ్రులకూ తెలుసు. ఇవన్నీ తెలిసిన వాళ్ళకి "1958, ఆగష్టు 28 అర్ధరాత్రి వేళ సుప్రసిద్ధ హాస్య రచయిత, హాస్యబ్రహ్మ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు గారు అస్తమించారని తెలుపుటకు చింతిస్తున్నాము" అన్న పత్రికా వార్త చటుక్కున బోధపడదు. నమ్మడానికి మనసొప్పదు. మృత్యుదేవత తన ఛాయలకి వస్తే "ఇదేవిటిలా చక్కా వచ్చావు, ఎడ్రసు తప్పుగామోసు" అని నవ్వుతూ ఠీవిగా దులపరించే వారనిపిస్తుంది.... ఆయన, 'అద్దెకొంప'ని ఖాళీ చేసి వెళ్ళినా, ఆ మనిషిలో ఈ అరవై ఏళ్ళూ బస చేసిన మనీషి- మనందరికీ అర్థమైన, మనని అలరించిన, మన కోసం బాధపడిన వ్యక్తి - భమిడిపాటి కామేశ్వరరావునిగాని, 'కాలం పోయినా, నిలిచే ఆయన మాట'ని గాని తెలుగునాట ఏసాటికీ ఏదీ ఏమీ చెయ్యలేదు....

*(1958, ఆంధ్రపత్రిక వీక్లీ)*

తెలుగు - వెలుగు

# మా అయ్యవారు



చనువున్న వాళ్ళలోకూడా భయ గౌరవాలు కలిగించే గాంభీర్యం, భయమున్న వారు కూడా చనువుగా నవ్వుతూ మాట్లాడేటట్లు చేసే చక్కని చల్లని చిరునవ్వు కలబోసి పోతపోసిన స్ఫురద్రూపం అయ్యవారిది. బిళ్ళగోచీ ఖాదీపంచె, తెల్లటి లాల్చీ; భుజాన పట్టుకండువా, కండువాలా అందంగా నుదిటిమీద జాలువారే వెండి జుట్టు - ఆరడుగులకు కొంచెం తక్కువైనా ఆరున్నరడుగుల భారీ మనిషిలా కనపడే పదహారణాల ఆంధ్రుడు అయ్యవారు.

నాగేశ్వరరావు పంతులుగారిని అందరూ ప్రేమతో పంతులుగారు అనేవారు. శంభుప్రసాద్‌గారిని మాతరం వారంతా ఆప్యాయంగా అయ్యవారు అని పిల్చుకుంటాం.

ఆంధ్రపత్రికా వ్యాసంగరంగంలో పత్రికాధిపతిగా, సంపాదకుడుగా, రచయితగా అయ్యవారు సాధించిన బృహత్కార్యాలు, నెలకొల్పిన సత్సంప్రదాయాలు, చిరస్మరణీయాలుగా వ్రాసిన సంపాదకీయాలూ, వ్యాసాలు వాటిని గురించి పెద్దలు ఎందరో రాశారు.

పిన్నలకు కూడా తమ గౌరవాభిమానాలను వెల్లడించుకునే స్వతంత్రం వుంది. కాబట్టి నావంటి చిన్నవాడికి కూడా ఆయన ఎంత దగ్గరగా ఉండేవారో చెప్పుకుంటున్నాను.

నేను ఆంధ్రపత్రికలో (దినపత్రిక) చేరిన రోజుల్లో నాకు ఆయన్ని చూస్తే చాలా భయంగా ఉండేది. దూరదూరంగా తిరిగేవాడిని. ఆయన ముందు సిగరెట్టు తాగేవాడిని కాదు. ఆ కొత్తలో - అప్పటికే ఆయనికి ఈ గాస్ట్రిక్ ట్రబుల్ ఉండేది. అప్పుడు (1954లో) ఒకసారి ఆయన డాక్టర్ గాలి బాలసుందరరావుగారి నర్సింగ్ హోమ్‌లో చేరారు. ఒకనాడు సంపాదకశాఖలో కొందరు ఆయన్ని చూడడానికి వెళ్తూ నన్నుకూడా తీసుకువెళ్లారు. వారంతా లోపలికి వెళ్ళి దగ్గరగా కూర్చుని మాట్లాడారు. నేను భయంకొద్దీ గడప దగ్గరే చాటుగా నిలబడి చూస్తున్నాను. అంత బాధలోనూ, ఆయన తన జబ్బుమీద, ఆస్పత్రుల మీద, డాక్టర్ల మీద జోక్సు వేసి అందర్నీ

నవ్విస్తున్నారు. చీకటిచాటున నేనూ నవ్వుకున్నాను. అరగంట తరవాత అందరూ బయల్దేరారు. నేనూ వెళ్లిపోతున్నాను. 'రమణా!' అని ఆయన పిల్చారు. నాకు గుండె ఆగినంత పనైంది. మెల్లిగా వెనక్కి తిరిగి గదిలోకి నడిచాను. మంచం పక్కన నిల్చున్నాను. దగ్గరగా రమ్మన్నారు. నా చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా గాఢంగా అదిమారు - అంతలోనే అంతవరకూ నవ్వుతూ నవ్విస్తున్న ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది. కంట నీరు తిరిగింది.

'నేను మళ్ళీ ఆఫీసుకొస్తాను కదూ రమణా!' అన్నారు.

నాకు ఏడుపు ఆగలేదు. గుండె జల్లుమంది. కష్టంమీద కంఠం సరిచేసుకుని రెండు చేతులతోనూ, ఆయన చెయ్యి పట్టుకుని 'వచ్చేస్తారు అయ్యవారూ .... తప్పకుండా వచ్చేస్తారు' అన్నాను. ఆయన బాధగా చిరునవ్వు నవ్వారు. నా చేతులపై తట్టారు. 'అవును' అన్నారు. ఒక్కక్షణం అయ్యాక, 'అంతా వెళ్తున్నట్టున్నారు. మీరూ వెళ్ళండి' అన్నారు.

నేను బయటకు వచ్చి మెట్ల మలుపు దగ్గర ఆగి కళ్ళు తుడుచుకుని మేడ దిగాను.

అంతమంది పెద్దలు ఆత్మీయులు మాట్లాడి వెళ్లాక ఆయన నాతో మాట్లాడటం - ఆ ప్రశ్న - చిత్రం అనిపించింది. ఎందుకో నేనూ ఆయన ఆప్తకోటిలో ఒకడిని అనిపించింది.

1956లో నన్ను వారపత్రికకి మార్చారు. కొన్నాళ్ళ తర్వాత సినిమా సెక్షన్ కూడా వ్రాయమన్నారు. నాకు ముందు ఆ సెక్షన్‌లో వ్యాసాలూ విమర్శలూ వ్రాసినవారు కొడవటిగంటి కుటుంబరావుగారు, నండూరి రామమోహనరావుగార్లు. నేను చాలా భయపడుతూనే ఆ బాధ్యత తీసుకున్నాను. సినిమా రివ్యూలు చాలా కష్టం అని చెప్పారు. విమర్శ చెయ్యకపోతే పాఠకులంతా తీసి పారేస్తారు. కొద్దిగా విమర్శించినా సినిమా నిర్మాతలూ, పెట్టుబడిదార్లూ పత్రికాధిపతికి ఫోన్‌చేసి ఫిర్యాదు చేస్తారు.

మరోపత్రికలో సినిమా ఎడిటర్‌కి యిలాగే జరిగిందట. ఒక పెద్ద చిత్రం మీద రాస్తూ అంతా బాగుందని రాసి కత్తియుద్ధాలు కొంచెం పేలవంగా ఉన్నాయి అన్నాడు. దాంతో ఫిర్యాదు రావడం, అధికార్లు ఆయనను శపించి మరో సెక్షన్‌లో పడెయ్యడం - మరొకరిచేత తిరిగి రివ్యూ రాయించి కత్తియుద్ధాలే అద్భుతం అని హైలైట్ అనీ మెచ్చుకోమన్నారు.

ఇది విని నేను చాలా భయపడ్డాను. అంతలోనే ఆంధ్రపత్రికలోనే అలాంటి సందర్భం ఏర్పడింది. దినపత్రికలో ఒక చిత్రం పై ఒక సహసంపాదకుడు విమర్శ వ్రాసారు. మర్నాటి ఉదయం పెద్ద పెద్దవాళ్ళు ముగ్గురు ఆఫీసుకివచ్చి అయ్యవారితో ఇంగిలీషులో మాట్లాడారు. ఆయన కూడా ఆ చిత్రం చూసివున్నారు. వాళ్లు చెప్పింది విన్నారు.

'సర్లెండి. నేనూ చూశానుగా - మావాళ్లు వ్రాసింది కరక్టే. అదంతే' అనేశారు. చాలా పెళుసుగా.

వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ చిత్రం అడ్వర్‌టైజ్‌మెంట్ పత్రికకు కట్ చేశారు. అయ్యవారు నవ్వుకున్నారు.

ఇలాగ తన సిబ్బందిమీద బయటవారు మాట అనే పరిస్థితి వస్తే ఆయన మమ్మల్ని మా గౌరవాన్ని ఎప్పుడూ కాపాడేవారు. ఆ విధంగా మా అందరికీ ఎంతో గర్వంగా చెప్పుకునే ఆత్మీయులైనారు.

'మిమ్మల్ని చూస్తే మాకు నిజంగా అసూయగా వుంది'. అనేవారు మా యితర మిత్రులు కొందరు.

సినిమా ఎడిటర్‌గా ఆయన నన్ను దేనికీ ఎన్నడూ ప్రశ్నించలేదు.

ఒకసారి ఆయనకు చాలా ఆప్తమిత్రులయిన వారి చిత్రం చూశాను. నాకు బొత్తిగా నచ్చలేదు. అప్పుడు ఒక్కసారి మాత్రం నా అంతట నేనే వెళ్ళి ఆయనతో చెప్పాను.

'చిన్న, పెద్ద చిత్రం అనే తారతమ్యం లేకుండా మనం మనకి తోచినవే రాస్తున్నాం. ఈ చిత్రం పద్ధతి యిలా వుంది. నేను అనుకున్నది రాస్తే మీ స్నేహాన్నిబట్టి మీరు ఏమన్నా అనుకుంటారా, అని అడిగాను.

ఆయన విశాలంగా నవ్వేసి 'మీరు విమర్శించేది మా స్నేహాన్ని కాదు గదా' అన్నారు. ఆ చిత్రం విమర్శ అచ్చు అయ్యాకనే అది ఆయన చదివారు. "సినిమా చూశ్చేదు గాని రివ్యూ చదవటానికి బావుందండీ" అన్నారు నవ్వుతూ.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రెండు మూడేళ్ళకొక సంచలనాత్మకమైన శీర్షిక ఉండేది విధిగా. అత్యంత ఉత్సాహకరంగా సాగిన వాటిలో ప్రముఖమైనది తెలుగు వెలుగులు శీర్షిక.

ఒకనాడు మాతో కూర్చుని ఈ శీర్షిక గురించి తమ అభిప్రాయం చెప్పారు. మాకు బోధపడింది గాని ఆయన మనసులోవున్న సమగ్రరూపం పట్టు దొరకలేదు. మర్నాడు ఆయన ఒకటి రాసుకొచ్చారు. శ్రీ విశ్వనాథ గురించి, ఆ మర్నాడే శ్రీ సంజీవరెడ్డి, శ్రీ రంగాగార్ల గురించి. మూడు చదివాక మా అందరికీ హుషారు కలిగింది. అప్పుడు 'చాలా బాగుంటుంద'ని అన్నాము ఉత్సాహంగా.

ఆయన మళ్ళీ ఆ మూడు వ్యాసాలను వారం రోజులు చిత్రిక పట్టారు. అప్పుడు అచ్చుకు యిచ్చారు. పాతిక ముప్ఫై వాక్యాలలో ఒక మహాపురుషుడి జీవితాన్ని జీవన వ్యాసంగాన్ని పరిశీలించి గుండెకు హత్తుకునేలా 'ఇది కరెక్టు' అని నిముషాలమీద పాఠకుడు ఒప్పుకునేలా వ్రాయటం సులభసాధ్యం కాదు. ఆ వ్యక్తి గురించి క్షుణ్ణంగా తెలియాలి. అతడు ప్రతిభ గడించిన ప్రత్యేక విద్య గురించి క్షుణ్ణంగా తెలియాలి. నిష్పాక్షికంగా దానికి విలువకట్టి మాటల్లో చెప్పాలి. మనిషినీ, మనిషిలో మనిషినీ బంగారం అంత శ్రద్ధగా తూచి చూచి చెప్పడం అయ్యవారికే చెల్లిందనిపించేది.

మూడు నాలుగు వ్యాసాలు అయ్యాక ఆయన మా అందర్నీ కూడా ఎవరికి ఏవ్యక్తి గురించి బాగా తెలుసనుకుంటే వారి వారి గురించి వ్రాయమన్నారు. వ్రాసి వాటిని తిరిగి అందరం కూర్చుని చిత్రికపట్టే వాళ్ళం. అంతా ఆ ఒక్క పేజీలోనే అయిపోవాలి.

తెలుగువెలుగులు శీర్షికకి ఎంత పేరు వచ్చిందంటే చాలామంది పైవాం ఎవరా అని ఊహాగానం చెయ్యడం, ఫలనా వారిని గురించి రాయకపోతే జనం క్షమించరని రాయబారాలు పంపడం - వత్తిళ్లు తేవడానికి ప్రయత్నించడం దాకా వచ్చింది. ఫలానా వారిది పైవారం వస్తుంది కాబోలు అనేవారు కొందరు ఆయన దగ్గర.

'కాబోలు' అని అంటూ ఆయన మావంక చూసేవారు. రాసే అయిదారుగురం ఏమీ తెలియనట్టే తలవంచుకునే వాళ్ళం. అసలు అయిదారుగురు రాశారని చాలా మందికి తెలియదు. ఒకే చేతిమీదుగా వస్తున్నాయనే అనుకునేవారు. మొదటి మూడు వారాలలో అయ్యవారు పెట్టిన వరవడి అంతటి బలవత్తరమైనది.

రాయబారాలు రాయిభారాలుగా మారే ధోరణి రావడంతో ఆయనకు విసుగేసింది. అప్పటికి మేము అనుకున్న పెద్దల లిస్టు కూడా పూర్తి కావచ్చింది.

60వ వారం (ఆఖరుది) తెలుగు వెలుగు అతి విలక్షణంగా వచ్చింది. ఆవారం తెలుగు వెలుగు అనామధేయుడు, మంచీ చెడ్డా, తెలుపు నలుపు అన్నీ కలబోసిన ఆంధ్రమూర్తి. కారం, చమత్కారం, వాడి, వేడి అదనెరిగిన పదను కలబోసి, అరవై వారాల వ్యాసమాలకు మేలిపూస అనిపించేలా, అద్భుతమైన ముక్తాయింపులా, సమీక్షలా మంగళవాక్యంలా మనోహరకావ్యంలా వ్రాసి ముగించబడింది ఆ శీర్షిక.

ఆ తుది మెరుగు కూడా అయ్యవారిదే.

ఈ శీర్షిక తరవాత నాకు ఆయన దగ్గర భయం తగ్గింది. చనువు కుదిరింది. ఎంతో ప్రేమగా రమణా అని పిలిచేవారు. అంతకు పూర్వం ఆయన పిలుస్తారేమోనని భయపడేవాడిని - ఆయన ఆఫీసు గదిలోకి వెళ్లాక పిలుస్తారా అని ఎదురుచూసేవాడిని.

సాయంకాలాలవేళ దినపత్రిక డిశ్పాచ్ అయిపోయాక కొందరు సబ్స్‌తో చదరంగం ఆడేవారాయన. నా బల్లపక్కకి యథాలాపంగా వచ్చి నా చార్మినార్ సిగరెట్టు తీసుకునేవారు. నాకు చాలా సంతోషంగా వుండేది.

1960లో నా ఆరోగ్యం పాడయి - నేను హఠాత్తుగా రాజీనామా పెట్టాను. ఆయన ఆశ్చర్యపోయారు. అప్పుడే నాకు ప్రమోషన్ యివ్వాలనుకుంటున్నారట.

'ఆర్నెల్లుగా నేను సరిగ్గా పనిచెయ్యటంలేదు. చెయ్యలేకపోతున్నాను. మీ జీతం డబ్బులు దండగ అవుతున్నాయి' అన్నాను.

'ఆ మాట అనాల్సింది నేను గదా' అన్నారాయన.

'అంతవరకూ ఆగను కదండీ' అన్నాను భయంగానే.

'ఆరోగ్యం బాగాలేకపోతే ఆర్నెల్లు రెస్టు తీసుకోండి' అన్నారు.

నేను ఒప్పుకోలేదు మళ్ళీ.

మర్నాడు మళ్ళీ పిలిచారు. ఆయన బల్లమీద ఒక సినిమా పత్రిక వుంది. నేను ఒక సినిమా నటుడి దగ్గర చాలా లంచాలు తీసుకుంటున్నట్లు పెద్ద అక్షరాలతో రాసి వుంది.

'ఇది చూశారా?' అన్నారాయన.

'అంతకుముందే అది నాక్కూడా పోస్టులో వచ్చింది.'

'ఒకవేళ ఇదిచూసి నేను నమ్మానని భయపడ్డారా' అనడిగారు.

'అటువంటి భయం నాకెప్పుడూ లేదు. ఇలాంటివి చదివి మీరు మీ ఆఫీసుని నడుపుతున్నారని నేను అనుకుంటే మీ మీద నాకు గౌరవం లేనట్టే' అన్నాను.

ఆయన నవ్వుకున్నారు.

'మీరు యింకేదన్నా పత్రికలో చేరాలనుకుంటున్నారా' అన్నారు కొంచెం ఆగి.

'పిలిచారు గాని నేను వెళ్లటం లేదు. రేపటినుంచి ఈ ఆఫీసుకే వచ్చి కథలు, వ్యాసాలు యిచ్చి డబ్బు సంపాదించుకోవాలనుకుంటున్నాను! ఇంకో ఆర్నెల్లకయినా నా మాట నిజం అని ఋజువవుతుంది' అన్నాను.

రాజీనామా పెట్టిన ఆరు వారాల తర్వాత కొత్తగా వచ్చిన వారికి ఫైల్సు వప్పగించి నేను విడుదల అయ్యాను.

తరవాత రెండు సంవత్సరాల వరకూ ఆంధ్రపత్రికే పోషించింది.

అప్పుడప్పుడు యింటికి వెళ్లి కలుసుకునే వాడిని.

అయ్యవారికి సంగీతం అంటే చాలా యిష్టం. బంగళాకు కొంచెం పక్కగా ఒక కాటేజ్ వేయించుకున్నారు. అక్కడ రికార్డులు, టేప్‌లు పెట్టుకుని వింటూ ఉండేవారు.

ఆయన దగ్గర స్ట్రాడి వేరస్ అనే వయొలిన్ వుంది. అది ప్రపంచంలోకెల్లా గొప్పదని అంటారు. దానిమీద సాధన చేస్తూ వుండేవారు. వెస్టర్న్ వయొలిన్ మీద ఈస్టర్న్ బౌయింగ్ కష్టం. నేనుగాని బాపుగాని వెళ్తే నవ్వేవారు. 'అబ్బే నాకేం రాదండీ. ఈ వయొలిన్ మీద సరదా అంతే' అనేవారు.

ఆయన ఎదట ఆయన్ని ఏ కాస్తయినా మెచ్చుకోబోతే కసిరినంత పని చేసేవారు. పత్రికల్లో కూడా సంపాదకుడుగా ఆయన పేరు చివరిపుటలో ఇంప్రింట్‌గా వచ్చేది. ముఖపత్రంపై ఎన్నడూ వేసుకోలేదు.

సంగీతం రీత్యా ఆయనతో మాకు మరి కొంచెం సాన్నిహిత్యం ఏర్పడింది. హిందుస్థానీ క్లాసికల్ కొత్త రికార్డు వస్తే ఆయన కొని మాకు తెచ్చి వినిపించేవారు. మేము అంత డబ్బు పెట్టి కొనలేక అది టేప్ మీదకు ఎక్కించుకునేవాళ్ళం. బాపు దగ్గర వున్న ఖాన్ సాహెబ్ కచేరీలు వినడానికి ఒక్కొక్కసారి పొద్దున్నే వచ్చేవారు. మేము తెల్లారగట్ల మూడుగంటలకు లేచి కచేరీలు పెట్టుకుని వింటూ పని చేసుకునే వాళ్లం. మా రాతకోతలు ఏడు గంటలకు ముగిసిపోయేవి. తరువాత రోజంతా

బలాదూరుగా తిరగడమే. ఆరుగంటల్నుంచి ఆ గంటసేపు మాతోపాటు మా తివాసీ మీద కూర్చుని సంగీతం విని వెళ్ళేవారాయన..

❀

జూన్ 9 ఉదయం.... చిన్నా పెద్దా అందరూ అయ్యవారికి కన్నీటితో కడసారి వీడ్కోలు చెబుతున్నారు.

దూరంగా ఒక మూల గోడకి చేరబడి చూస్తున్నాను. అయ్యవారి ఆప్యాయత, ఆయన నిండుదనం, గొప్పతనం, మంచితనం, పెళుసుతనం, స్నేహం, వాత్సల్యం, గర్వంలా కనబడే గాంభీర్యం, ఆయన మాటలు, ఛలోక్తులు మనసులో మెదులుతున్నాయి. ఆయన రాసిన తెలుగు వెలుగుల లాగే నాకు తెలిసిన అయ్యవారి రూపం కొద్ది క్షణాలలో సమగ్రంగా స్ఫురించింది. చేతులు జోడించకుండానే నమస్కరించాను.

'అయ్యవారూ - తెలుగు వెలుగులు శీర్షికలో మీ గురించి...'

ఆయన పకాలున నవ్వేశారు. 'బలేవారే! మనదే వుందండి. మనకేం తెలుసు...' అంటున్నారు.

అవును. నిజమైన గొప్పవాళ్ళు - నిండుమనుషులు - అలాగే అంటారు - అనుకుంటారు. ఆయన గురించి రాసినా, రాయకపోయినా రచయితగా, కళాప్రియుడుగా, మనిషిగా, యజమానిగా, సంపాదకుడుగా, పిల్లవాళ్లతో కూడా జతగట్టగల పెద్దవాడుగా, స్నేహితుడుగా ఆయన నిజంగా తెలుగు వెలుగే.

*స్వర్గీయ శివలెంక శంభుప్రసాద్ అయ్యవారికి నివాళి*
*ఆంధ్రపత్రిక వీక్లీ (11-8-1972)*

"„ ప్పవాడు.....

బాపు గొప్పవాడు....

బాపు గొ...."

"ఏమిటా గ్రాంఫోను రికార్డు?"

"నీకు సిక్స్‌టీ యియర్స్"

"లేదు రెండే చెవులు"

"కాదు ఏళ్లు. అరవై నిండి-"

"నాన్సెన్స్ నా వయసు పదహారు.... దట్సాల్ ఎండ్ దటీజ్ ఫైనల్" అంటాడు - రోజుకి 18 గంటలు పనిచేసే బాపు. ఎవరైనా ఎదురై దండం పెడితే తన వెనకెవరో పెద్దాళ్లున్నారని వెనక్కి చూసే బాపు.... విగరుమోతు, పొగరుమోతు....

చూడగలిగే సంగీతంలో పాడగలిగేది సగమే. మనసు పాడుకునే సంగీతాన్ని నోటి పాటలోకి దించితే దాని సొగసు సగానికి సగం అయిపోతుంది. "అన్ హెర్డ్ మెలొడీస్ ఆర్ స్వీటర్ స్టిల్" - అన్నాడు ఆ ఆనందాన్ని ఎరుకపరచుకున్న మహాకవి.

అలాగే మనసుకు కనిపించే మనోహర సౌందర్యాన్ని మాటల్లో వర్ణించబోతే చిక్కి సగమైపోతుంది. మంచి రచన చదువుతున్నపుడు మన మనసులో రూపాలనూ దృశ్యాలనూ చిత్రకారుడు రేఖాచిత్రాలలోకి అనువదించితే అవి.... సగమైపోతాయి.

అలా సగమైపోకుండా - వాటి అందాన్ని రెట్టింపుచేసే శిల్పం పేరే బాపు. బాపు బొమ్మలు రచనలకు రేఖానువాదాలు కావు. అపురూపసుందర వ్యాఖ్యానాలు. ఒక నవ్వు, ఒక చూపు, ఒక సిగ్గు, ఒక అలక... బొమ్మలు మాట్లాడతాయి. నటిస్తాయి. వెక్కిరిస్తాయి. పలకరిస్తాయి. రెచ్చకొడతాయి.... హాయినిస్తాయి.

చేతికిచ్చిన రచనల "లోవెలుగుల్ని" బోధపరుచుకుని ఎరుకపరుచుకుని - దానికి పైసంగతి వేస్తూ చిత్రాన్ని రూపొందించే శిల్పం పేరే బాపు. అందుకే "తన

రచనకి బాపు చేత బొమ్మవేయించాలన్న సరదా ఎంతుంటుందో అంత భయమూ వేస్తుంది. "బాపు బొమ్మ కథని నమిలి మింగేసి కొత్త సంగతేసి రాసిన వాడికేం మిగలకుండా చేస్తుంది" అని రావి శాస్త్రిగారు ఒకసారి నవ్వుతూ బాధపడ్డారు.

పండితులూ, రచయితలూ, గాయకులూ, నటులూ, నాయకులూ, మాన్యులూ, సామాన్యులూ ఎందరివో - దాదాపు తెలుగువెలుగులందరి చిత్రాలూ వేశాడు బాపు.

ఫోటోలోకన్నా పోలిక లెక్కువొచ్చాయి. ఫోటోలకే పైసంగతి వేశాడు బాపు అన్నారు అంతా.

భగవద్గీత మీద కీ.శే. త్రిపురనేని రామస్వామి చౌదరిగారు విమర్శనాత్మక గ్రంథం రాశారు. దానికి బాపు వేసిన ముఖచిత్రం - చౌదరిగారు కృష్ణుడి స్థానంలో కూర్చుని ఉపదేశ ముద్ర పట్టి గీతను బోధిస్తుంటే, శ్రీకృష్ణుడు అర్జునుడి స్థానంలో మోకరిల్లి కూర్చుని నమస్కరిస్తూ వింటున్నట్లు-




కథలకి చక్కని బొమ్మలు ఎన్నో వస్తాయి, చూస్తాం. బాగుందని పేజీ తిప్పేస్తాం. కాని బాపు వేసిన బొమ్మాయిల కోసం పేజీ మళ్ళీ మళ్ళీ వెనక్కి తిప్పుతాం. అందం, తెలుగుతనం, సొగసు, లావణ్యం, అన్నీ కలబోసుకుని "బొమ్మ" అవతరించింది. అందమైన అమ్మాయంటే బాపుబొమ్మ అనే అర్థం రూఢి అయిపోయింది.

సాహిత్య ప్రపంచంలో గిరీశం. మధురవాణి, గణపతి, బారిస్టరు పార్వతీశం వంటి పాత్రలలాగే రేఖా చిత్రలోకంలో బొమ్మ, రెండుజెళ్ల సీత, రాధాగోపాళం, బుడుగు, సీగాన పెసూనాంబ, కార్టూన్‌లలో లావుపెళ్ళాం చిన్నమొగుడు రూపాలు తెలుగు మనసులలో చెరగని ముద్రవేశాయి. ఇది చిత్రలేఖనంలో చాలాఅరుదు-

**కొంటె బొమ్మల బాపు**
**కొన్ని తరముల సేపు**
**గుండె ఊయల లూపు**
**ఓ కూనలమ్మ**

ఇవాళ బాపు బొమ్మల అభిమానులు మూడోతరం - ఇంకెన్ని తరాలుంటాయో చెప్పడం ఎవరితరం అన్నారు ఆరుద్రగారు. బాపుగారు ఇప్పటికెన్నివేల బొమ్మలు వేసుంటారండి? చింతచెట్టుకెన్నాకులుంటాయి? అతను ఎన్నిసార్లు ఊపిరి పీల్చి వదులుతాడు?.... సరదాగా, సాధనగా, ఏం తోచకా, కావాలని, అవసరముండీ లేకా, కన్నూ, ముక్కూ, చెవీ, కాలూ, వేలూ, తేలూ, పామూ.... అసలు బాపూ అంటే బొమ్మలు వేయడం అని అర్థం. బొమ్మలు చూడడం, వెయ్యడం, నవ్వడం, నవ్వించడం, పుస్తకాలు చదవడం, పాటలు వినడం, సినిమాలు చూడ్డం ఇదే అతని నిత్యభోజనం. ఆ భోజనంలో బతకడానిక్కావలసిన మామూలు తిండీ, నిద్ర అనేవి నంచుకునే అప్పడాల లాటివి.

❀

మూడు నాలుగేళ్ళప్పుడే విపరీతమైన అల్లరి చేసేవాడు.... వాళ్ళమ్మ, నాన్న - (తను) చెప్పినమాట వినకబోతే డాబా గోడ మీదెక్కి దూకుతా, దూకుతా అని బెదిరించేవాడు. ఆవిడ భయపడి కిందకి తీసుకొచ్చి నడవాలో స్తంభానికి కట్టిపడేసేది. మరీ ఆవుదూడలా కురచతాడు కడితే అరుస్తాడని పదిహేనడుగుల తాడు కట్టేది. ఆ కాస్తలోనే అటూ యిటూ పరుగెత్తి బోర్లాపడి గడ్డం చితగ్గొట్టుకునేవాడు.... ఆ నల్ల పిల్లాడి కెల్లప్పుడూ గడ్డం చివర నెత్తురు బొట్టు సిందూర తిలకంలా వెలిగేది... ఆనక దెబ్బలు బోరుకొట్టి ఆ పక్కన దొరికిన బొగ్గులతో బొమ్మలు గీసేవాడు - వరుసగా గళ్ళుగీసి ఓ చివర వాళ్ల నాన్నగారు కాల్చే చుట్ట, దానిపొగ గీసి రైలు రైలు అని గెంతి, పరుగెత్తి తాడు ఠకీమని లాగ్గానే ఢభీమని బోర్లాపడి.... మళ్లీ సిందూర తిలకం - గడ్డం చివర.

అంతకుముందు పత్రికల్లోగాని, సినిమాల్లోగాని, శీర్షికల్లో అక్షరాలు గుండ్రంగా కోలగా నలుపలకలుగా ఉండేవి. బాపు "ఫ్రీ స్టయిల్" లిపిని తీసుకువచ్చాడు - వీడికి గుండ్రంగా రాయడం రాక, ఓపిక లేక ఈ వంకర టింకర ఓ ఫాషన్‌గా చెలాయిస్తున్నాడు అన్నారు కాకులు.

ఈ అక్షరాల్లో ప్రాణం ఉంది, శక్తిచైతన్యాలు తాండవిస్తున్నాయి, ఆ మాటల్లో భావాన్ని వేనోళ్ళ ప్రకటిస్తున్నాయి-అవి అక్షరాలు కావు వజ్రవైఢూర్యాలు అన్నారు లోకులు - అది అక్షర శిల్పం... అది వర్ధిల్లింది.

తెలుగు, తమిళ భాషల రాతలో 'అక్షర' విప్లవం వచ్చింది. పత్రికలలో, ప్రకటనలలో, సినిమాలలో, శుభలేఖలలో అవే అక్షరాలు వరవడి పెట్టి కొత్తమార్గాలు చూపించాయి. ఇవాళ వంకరటింకరలలో వయ్యారం, సొగసూ తేవడం రానివాడే గుండ్రంగా, కోలగా రాస్తాడు అని జోకు-

ఇటీవల - అనూ గ్రాఫిక్స్ మురళీకృష్ణ గారు బాపు సహకారంతో తెలుగులో 56 అక్షరాలను 256 ముక్కలుగా భాగించి తలకట్టు, గుడీ, గుడిదీర్ఘం, కొమ్మూ,

కొమ్ముదీర్ఘం, వత్తులు బాపుటైపు రాతను కంప్యూటర్‌లో ప్రవేశపెట్టి విజయం సాధించారు. ఇప్పుడు పత్రికలలో, పుస్తకాలలో, సినిమా టైటిల్స్‌లో, శుభలేఖలలో బాపు అక్షరాలు అందాల చిందులు వేస్తున్నాయి.

❀

1950-60 మధ్యలో రోజుకి మూడు సినిమాలు చూసేవాళ్లం. అప్పుడు రోజుకి నాలుగాటలు లేవు. విదేశవాలీవి అయిపోతే దేశవాళీ లాగించేసి, నైట్‌షో అయ్యాక కబుర్లు చెప్పుకుంటూ నాలుగైదు మైళ్లు నడుచుకుంటూ ఇల్లు చేరేవాళ్లం. సినిమాలు తీస్తున్న గొప్పవాళ్లు ఎక్కడెక్కడ తప్పులో కాలేశారో, మనమే తీస్తే ఎలా అదరగొట్టేవాళ్లమో - ఈ లోకం మనని గుర్తుపట్టలేక కాకి బంగారంతో ఎలా మురిసిపోతోందో చెప్పుకుని లోకంమీద జాలిపడుతూ, మధ్య మధ్యలో టీలు తాగుతూ రాత్రిపూట పగటికలలు కంటూ, అవే తింటూ ఉండేవాళ్లం... బంగారం సింగారం లాంటి బొమ్మల కథలకి స్క్రీన్‌ప్లే రాసుకుని సినిమా సరదా తీర్చుకునేవాళ్లం. ఆరోజుల్లో (1957) నేను 'హైనూన్' సినిమా చూసిన ఉత్సాహంతో ఆంధ్రపత్రికలో సాక్షి అనే కథ రాశాను. చావు ఖాయమని తెలిసిన కిష్టయ్య రావిచెట్టుకింద తిన్నెమీద వెల్లకిలా పడుకుని ఎడమ మోకాలు మీద కుడికాలు మడమ ఆన్చి లీవిగా ఏడుస్తుంటాడు. వాడిని చంపడానికొచ్చే పకీరు ఆ కాళ్లమధ్య త్రికోణంలో చుక్కలా కనిపించి యముడిలా మీదకి వస్తాడు. అపుడు బాపు వేసిన రేఖా చిత్రం అది - 1967లో ఆ కథని సినిమాగా మేమే తీశాం - అందులో క్లయిమాక్సులో ఇదే దృశ్యం వచ్చినపుడు అదే కాంపోజిషన్ పెట్టి షాట్ తీశాడు బాపు....

అదే నిర్మాతలుగా మాకూ, దర్శకుడిగా అతనికీ తొలి చిత్రం-

సాక్షి నామ సంవత్సరం అని 1967కి మేమే పేరు పెట్టేసి దండోరా కొట్టేశాం- పొగరుగా - కొందరు సరే అన్నారు. కొందరు సరేలే అన్నారు.

ఆనాడు సినిమా తీయడానికి కారణం - డబ్బాశ కాదు.

సినిమాలు ఇంకోలా అందంగా, నిజాయితీగా, సహజం అనిపించేలా తీయవచ్చు - అలా తీసినా జనం చూస్తారు అనే నమ్మకం, అది రుజువు చెయ్యాలన్న ఆశా - ఇవే సాక్షి సినిమా తీయడానికి కారణం. అప్పట్లో సినిమాలని ఎక్కువ భాగం స్టూడియో సెట్లలో తీసేవారు. ఒక మనిషి నించుంటే రెండు మూడు నీడలు పడుతూ - సుద్దలా రంగు మెత్తేసిన మేకప్పుతో సినీమార్కుల మాటలతో స్వప్నలోకంలా ఉండేవి-ఏడేళ్ల పిల్లాడు కూడా నాకు విగ్గెలాంటిది, మేకప్పు ఎవరు అనే రోజులు.

సహజ వాతావరణంలో కథ జరిగే స్థలాలలో, కథలో మనుషులు, రోజూ వేసుకునే బట్టలు, వాడే మాటలలో కృత్రిమత్వం లేకుండా సినిమా తియ్యాలి. అనవసరంగా మేకప్పు, విగ్గూ వాడకూడదు - పూర్తిగా అవుట్‌డోర్‌లో తియ్యాలి -

స్టార్ వాల్యూకన్న కథమీద ఎక్కువ నమ్మకం ఉంచాలి. అతితక్కువ బడ్జెట్‌లో
- ఇవీ మా సరదాలు.

నవయుగ శ్రీనివాసరావుగారిని కలుసుకుని ఈ సంగతులు చెప్పాను. మేము 50 వేలు తేగలం, మీరు రెండు లక్షలిస్తే సాక్షి అనే సినిమా తీస్తాం. బాపు దర్శకులు. అతనికి షూటింగు అనుభవం లేదు. ఎక్కడా నేర్చుకోలేదు. అయినా చెయ్యగలనని అతనికి ధైర్యం; అతని మీద నాకు నమ్మకం అన్నాను.

ఆయన వెంటనే ఆమోదించారు.

“మీరు ఎవరి సిఫార్సు లేకుండా, సూటిగా వచ్చి అడిగినందువల్లే నాకు నమ్మకం కలిగింది.... సినిమా తియ్యడానికి కావలసింది కామన్‌సెన్స్ అండ్ గుడ్ టేస్ట్. మీరు చెయ్యండి” అన్నారాయన.

రెండున్నర అనుకున్నా రెండు లక్షల ఇరవై వేలలో తీశాం. నాలుగు వారాల్లో దబ్బొచ్చేసింది. సినిమాకి మంచి పేరొచ్చింది. మొట్టమొదటి ఫుల్‌లెంగ్త్ అవుట్‌డోర్ చిత్రంగా గుర్తింపు వచ్చింది. దరిమలాను పరిశ్రమలో చాలామంది స్టూడియో సెట్‌ల ఖరీదులు నచ్చకా-బైటైతే బాగుంటాయని - లొకేషన్ షూటింగుకే మొగ్గు చూపారు.

సాక్షిలో బాపు తీసిన మొదటి షూటింగ్ - కృష్ణ, విజయనిర్మల పాత్రలు పెళ్లిచేసుకునే ఘట్టంలో “అమ్మ కడుపు చల్లగా...” అనే ఆరు నిమిషాల పాట. మధ్యాహ్నం రెండు గంటలకి మొదలుపెట్టి సాయంత్రం అయిదు గంటలకి పూర్తి చేశాడు - ఆ పాట, చిత్రణ అందర్నీ మెప్పించాయి. తెలుగు సినిమాలో గొప్ప పాటల వరసలో చోటుచేసుకున్నాయి.

‘సాక్షి’ని ప్రభుత్వం తాష్కెంట్ ఫిలిం ఫెస్టివల్‌కి (1968) పంపింది. సోవియట్ రష్యా, మంగోలియాలో చాలాచోట్ల వేశారు. 18 నెలల తర్వాత ప్రింటు తిరిగి వచ్చింది.

బొమ్మల్లోలాగే సినిమాల్లో కూడా “బాపు ఫ్రేం” ఫేమస్ అయింది. బాపు దర్శకుడు కావడానికి నవయుగ వాసుగారు ప్రోత్సాహమిస్తే, కమర్షియల్ సినిమాలో నిలదొక్కుకుని ముందుకు సాగడానికి ఆనాడు ఆదరించి ‘బుద్ధిమంతుడు’ చిత్రం తీయించినవారు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారు. ఆనాడు పండిత పామర జనరంజకం అనిపించుకున్న బుద్ధిమంతుడు ఈనాడూ ఎప్పుడు ఎక్కడ వేసినా హౌస్‌ఫుల్ కలెక్షన్స్‌లో నడుస్తోంది. ఇరవైనాలుగేళ్ళ తరువాత అదే చిత్రం బాపు దర్శకత్వంలో ఇప్పుడు హిందీలో నిర్మించబడుతోంది. మిథున్‌చక్రవర్తి, జుహీచావ్లా, అమ్రీష్‌పురి నటించారు. సంగీతం బప్పీలహరి - ‘94 జనవరి విడుదల చేస్తున్నారు.

బాపుకి బొమ్మలూ సినిమాలు, నాకు రచనలూ సినిమాలు ఒకెత్తు అయితే మేము పిల్లల కోసం తీసిన వీడియో పాఠాలు అంతకు వెయ్యింతల ఆనందాన్నీ, తృప్తినీ యిచ్చాయి. నాటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావుగారు మాపట్ల నమ్మకంతో, గురితో ఈ ప్రాథమిక విద్యాబోధన మాకు ఒప్పచెప్పారు. ఒకటి, రెండు, మూడు తరగతులకు అ ఆల నుండి వాక్యాల వరకూ అంకెల నుండి లెక్కల వరకూ

తూకాలు, కొల్తలూ, భూమి, ఆకాశం, నీరూ నిప్పూ మొదలైన అన్ని విషయాలనూ ప్రభుత్వం ఇచ్చిన సిలబస్ ప్రకారం 30 గంటలు వీడియో పాఠాలు తీశాం. పల్లెటూర్లలో పిల్లలను అవి ఎంతో ఆకట్టుకున్నాయి. బడికి వచ్చే వారి సంఖ్య పెరిగింది. మధ్యలో వదిలి పారిపోయేవారి సంఖ్య తగ్గింది. ఈ టేపు ఢిల్లీలోని కేంద్ర విద్యాసంస్థ ఎన్.సి.ఇ.ఆర్.టి. సభ్యులు చూసి దేశం మొత్తం మీద ప్రాథమిక విద్యా బోధనలో ఆంధ్రప్రదేశ్ అగ్రశ్రేణిలో నిలబడిందన్నారు. అప్పుడు కేంద్ర విద్యా మంత్రిగా వున్న శ్రీ పి.వి. నరసింహారావుగారు ఈ పాఠాలూ ఈ పథకం చూసి చాలా బాగుందన్నారు. ఈ పద్ధతిలో బోధనలు ప్రారంభించాలని అన్ని రాష్ట్రాలకూ లేఖలు వ్రాస్తామని చెప్పారు.... వీడియో పాఠాలు తీశాక జన్మ ధన్యమయిందనుకున్నాం.

బాపు దగ్గర సినిమా గురించి చాలా పెద్దలైబ్రరీ ఉంది. మూకీ సినిమాల గురించి, ఇప్పటిదాకా సినిమాల చరిత్ర, దర్శకుల, నటుల, నిర్మాతల జీవిత చరిత్రలు, ఫోటోగ్రఫీ, సంగీతం, స్పెషల్ ఎఫెక్ట్స్ మీద పుస్తకాలు, ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ, హాలీవుడ్ చిత్రాల కథలు, విమర్శలూ.... పక్షికూతల నించి బాంబు పేలడం, భూకంపాలదాకా, బిబిసి వారు రికార్డు చేసిన సౌండ్స్ లైబ్రరీ, తను స్వయంగా ఇరవయ్యేళ్లపాటు రికార్డు చేసుకున్న ధ్వని ప్రపంచం టేపులూ, ఇపుడు వీడియోలు వచ్చాక లారెల్ అండ్ హార్డీ, చాప్లిన్‌ల నుండి నేటి దాకా ఎన్నో గొప్ప చిత్రాల వీడియో టేపులు, వెస్టర్న్, హిందూస్థానీ, కర్ణాటక సంగీతాలూ, తెలుగు, తమిళ, హిందీ చిత్రాల పాటలూ కొన్ని వేల గంటల టేపులున్నాయి. వీటన్నిటికీ అకారాదిగా, పేర్ల వారిగా, పల్లవుల వారీగా పుస్తకాలలో క్రాస్ చెక్ ఇండెక్సుతోసహా స్వయంగా రాసిపెట్టుకున్నాడు. ఇంత సమగ్రమైన గ్రంథాలయం చాలా అరుదుగా కనిపిస్తుంది. బాపు సినిమా తీస్తే స్క్రిప్టు, సంగీతం, ఎడిటింగ్, రీరికార్డింగ్, మిక్సింగు దాకా స్వయంగా చూసుకుంటాడు. నన్ను కూడా ఏ పనిదగ్గరా నమ్మడు. స్క్రిప్టు ఖరారు అవగానే దానికి షాట్ డివిజన్ చేసి బొమ్మలతో డైలాగులూ కలిపి స్వయంగా రాసుకుంటాడు. అతని స్క్రిప్టు చేతికిస్తే కుర్రవాళ్లు కూడా సినిమా తీయచ్చుననిపిస్తుంది....

విగ్గులలాంటి అనవసరపు మేకప్ ఆర్భాటాలూ, నటులు కెమేరాకేసి చూసి డైలాగులు చెప్పే సంప్రదాయం అలవాటు – వాటన్నిటికీ ఎదురీతకొట్టి తనవరకూ తనకి కావలసిన విధంగా చేయించుకుని దరిమిలాను ఆర్టిస్టులు కూడా అభిమానించి, గౌరవించే పద్ధతులు అమలుచేశాడు.

బాపు వందలకొద్దీ సినిమాలు తీయకపోయినా – రంగంలోని పెద్ద చిన్నా నటీనటులందరితో పనిచేశాడు. కృష్ణ, విజయనిర్మల, నాగయ్య, అక్కినేని, శోభన్‌బాబు, చంద్రమోహన్, ఎన్.టి.ఆర్., ఎస్వీ రంగారావు, జగ్గయ్య, జానకి, చిరంజీవి, రాజబాబు, సత్యనారాయణ, సూర్యకాంతం, భానుచందర్, రాజేంద్రప్రసాద్, కృష్ణంరాజు, శ్రీధర్, నరేష్, సురేష్, శ్రీరంజని జూనియర్, శ్రీదేవి,

రాధిక, జయప్రద, విజయశాంతి, అంజలి, జయసుధ, సుహాసిని, శారద, వాణిశ్రీ, సంగీత, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, నూతన్‌ప్రసాద్, జె.వి. సోమయాజులు, రాళ్లపల్లి, కాకరాల, సాక్షి రంగారావు, ఎ.వి.ఎస్. (తుత్తి).

ఉత్తరాదిన సంజీవ్‌కుమార్, నజీరుద్దీన్‌షా, అనిల్‌కపూర్, మిధున్‌చక్రవర్తి, జాకీష్రాఫ్, రీనారాయ్, మాధురీదీక్షిత్, పద్మినీ కొల్హాపురి, అమృతాసింగ్, జుహీచావ్లా, అమ్రిష్‌పురి, శశికపూర్, అంజాద్‌ఖాన్, తమిళంలో రజనీకాంత్, మేజర్ సౌందర్

బాపుతో పనిచెయ్యాలని అమితాబ్ కూడా ఆ రోజుల్లో సరదాపడ్డాడు. సంగీత దర్శకులలో మా సొంత సినిమాలకి పాతికేళ్ళపాటు కె.వి. మహాదేవన్ - పుహళేంది గారలయినా, మిగతా చిత్రాలలో ఇళయరాజా, ఎం. ఎస్. విశ్వనాథన్, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, సత్యం, ఎ.ఆర్. రెహమాన్ (దిలీప్), లక్ష్మీకాంత్ ప్యారేలాల్, బప్పీలహరి, కీరవాణి.

కెమేరాలో విజయా చిత్రాల మార్కస్ బార్ట్‌లే, సెల్వరాజ్, ఇషాన్ ఆర్యా, కె. ఎస్. ప్రసాద్, బాలు మహేంద్ర, బాబా ఆజ్మీ, లోక్‌సింగ్, శరత్, పీటర్ పెరీరా, రవికాంత్ నగాయిచ్, కన్నప్ప, ఆర్కే రాజు, థామస్ ఏవియర్, మోహనకృష్ణ నందమూరి.

డాన్సుమాస్టర్స్ పసుమర్తి, వెంపటి చినసత్యం, హీరాలాల్, తంగప్ప, శివ-సుబ్రహ్మణ్యం, రాజు-శేషు, సలీం, రఘు, శీను (తార-సుందరం) నార్త్‌లో సరోజ్‌ఖాన్, కమాల్.

ఫిలిం ఎడిటర్లు సంజీవి, రామచంద్రయ్య, ఎన్. చంద్ర (నేడు ప్రముఖ హిందీ దర్శకుడు) గౌతంరాజు, అనిల్‌మల్నాడ్, సుభాష్-సూర్యం, కె. యస్. రాజు,

స్టంట్ జూడో రత్నం, రాఘవులు, వీరూ దేవగన్ (బొంబాయి).

కళాదర్శకులు నాటి బి.ఎన్.రెడ్డి గారి సహచరుడు ఎ.కె. శేఖర్, ఎస్. కృష్ణారావు, తోట తరణి, కుదరవల్లి, భాస్కరరాజు, బిజున్‌దాస్ గుప్తా.

పాటల రచయితలు శ్రీశ్రీ, ఆత్రేయ, ఆరుద్ర, సినారె, కొసరాజు, దాశరథి, జాలాది, వేటూరి, సిరివెన్నెల, దేవులపల్లి కృష్ణశాస్త్రి, హిందీలో ఆనంద్‌బక్షీ, గుల్జార్, ఇందీవర్.

ఇలాగ ప్రతిశాఖలోను అగ్రశేణిలో ఉండే నటులతో, టెక్నీషియన్లతో పనిచేసి అందరి గౌరవాభిమానాలు సంపాదించుకున్నారు.

ఒక్క డైలాగులు కుట్టే దర్జీ పనిలో మాత్రం ఈ వ్యాసరచయిత బారినుండి తప్పించుకోలేకపోతున్నాడు.

ఈ సంకెళ్ళకి జిందాబాద్!

బాపూ జిందాబాద్!

రేపూ జిందాబాద్!

బాపు షష్టిపూర్తికి రమణ రాసినది
(డిసెంబరు, 1993)

# వీణాప్రవీణ

వీణావాణిలో లాలిత్యానికీ, ఠీవికీ, శాస్త్రీయతకు, నవ్యతకు ఈమని శంకరశాస్త్రిగారి పాణి పెట్టింది పేరు. విద్యపై ప్రభుత్వం, దానిని సవ్యంగా నడపగల విచక్షణ, నిగ్రహం, చక్కగా ఉపయోగించుకోగల భావుకత, అందుకు తగిన ప్రయోగశీలత, దానికి కావలసిన సాహసం, ఆత్మవిశ్వాసం కూడబలుక్కున్నట్టు గుమిగూడే అరుదైన సందర్భాలలో ఆయన వీణమీటు మేటిదని పండితులంతా మెచ్చుకొంటారు.



శంకరశాస్త్రిగారు వైణికుల వంశంలో పుట్టి పెరిగారు. తండ్రి అచ్యుతరామశాస్త్రిగారి వద్ద శాస్త్రం మాత్రం పరిగ్రహించి, కొద్దికాలంలోనే తన కొక శిల్పాన్ని తానే సృష్టించుకున్నారు. తన కొత్తతరానికి తానే 'స్వరవడి' మీటి ఒక సంప్రదాయానికి నాంది వ్రాసుకున్నారు.

కళ అలంబనంగా పుట్టిన శాస్త్రానికి, కళను శాసించి దిగ్బంధంచేసే దురలవాటు ఉంది; ఇది తగవైన మార్గమని మాత్రం చెప్పతగు సంప్రదాయం అటూ ఇటూ ఆకాశ కుడ్యాలు కట్టి, 'ఇదేదారి' అనిపింపచేసే వంచనాశిల్పాన్ని అవలంబిస్తుంది. చూడ్డానికి మెత్తనివాడైనా, నిజానికి 'గట్టి' వాడైన శాస్త్రిగారు ఈ రెంటినీ కాదన్న రోజులలో, ఈ దారి నాదన్న రోజులలో, తోటివారికి మేటివారికి కూడా ఉట్టి పోకిరీగా, కట్టుతప్పుతున్న నాయకుడుగా కనబడ్డారు. అయినా మొండికెత్తి, జనరంజకం కానిది సంగీతం కానేరదన్న దొకటి గీటురాయిగా, కళ నిత్యవర్ధిష్ణువన్న మహావాక్యం జీవితంలో కూడా మన్నించతగ్గ సూత్రంగా ఆయన ప్రయోగసాధన, నాదారాధన సాగించారు; తలపాగా చుట్టుకుని, ఊపిరి సలపకుండా కండువాలు వేసుకొని హఠం పెట్టి కూర్చుని రాగరాగిణులతో సరాగాలాడారు. గిలిగింతలు పెట్టి చిరునవ్వు లొలికించారు. కొత్త దారుల వెంట తీసుకువెళ్ళి కొత్త దృశ్యాలు చూపించారు. వాది ప్రతివాది స్వరాలకు అపూర్వమైన భేటీలు ఏర్పరచి కొత్తస్నేహాల పట్ల ఉత్సుకత కలిగించారు. నవవర స్వరసరాలతో అలంకరించి అందాలకు అద్దాలు పట్టారు. "నూరేళ్లనాడు శుద్ధస్వరాలనే శాస్త్రీయమైన వనేవారు. ఇప్పుడు ఎన్నో కొత్తవి వచ్చాయి. ఇంకెన్నో రావాలి" అని వాదించారు. సంగీతానికి జన్యం, గమ్యం ఓంకారమే. అవి తప్పనంతవరకూ మధ్యలో ఎన్నోవిధాల విహరించి ఓంకారం విశ్వరూపాన్ని బహుముఖాల దర్శించవచ్చునని నిరూపించారు. ఇవన్నీ ఇన్ని వాక్యాలలో చెప్పే చొరవే ఉంటే శాస్త్రిగారు ఇంకా చాలా గొప్పవాడనిపించుకునే వారేకాని, ఆయన వాదమంతా వీణాతంత్రీ నాదమే.

ఔత్తరాహ, దాక్షిణాత్య సంగీతరీతుల సమ్మేళనం సాధించే శ్రవణానందాన్ని ఆయన వీణ మీద మీటి చాటారు. ఉత్తరాదిన ప్రసిద్ధ సితార్ విద్వాంసుడు అబ్దుల్ హలీం జఫర్‌ఖాన్‌తో ఆయన చేసిన సంయుక్తగానసభ సర్వుల ప్రశంసలనూ అందుకొని, ఆ సమ్మేళన వాదానికి మరింత బలం చేకూర్చింది.

(ఎవరెస్టు విజయం సందర్భంగా) ఆదర్శ శిఖరారోహణం, మధురస్మృతి, స్వరతరంగిణి, వేణుప్రణయం, (వేణువులతో సింఫనీ), ఉదయవసంతం (ఆమనికి ఈమని స్వాగతం) వంటి సమ్మేళనాలను కూర్చిన మొదటి రచయిత ఆయనే. పాశ్చాత్య శిల్పమైనా, దానికి భారతీయత ఉందనిపించే రీతిగా చేసిన ఈ కృతులలో అద్భుతమైన ప్రయోగాలున్నాయి. స్థాయి వారీగా ఎన్ని ఏర్పరచిన గాత్రాలలో స్వరసమ్మేళనం విశిష్టమైనది.

ధనంజయుని ధనుష్టంకారంలాగే ఈమని వారి వీణాఝుంకారానికి ఒక విశిష్టత ఉంది; ఆయన రాగప్రస్తారానికీ, స్వరకల్పన శిల్పానికీ, ఆ వీణపోయే

మూర్ఛనలకూ ఒక ప్రత్యేకత ఉంది. వేదమంత్రాలను, ఆయన వీణ ఉచ్చరించినపుడు అది ఓంకార 'ఘోషవతి' అయి హృదయంలో మార్మోగుతుంది. బాధ, భక్తి, ప్రేమలపై ఆయన వ్యాఖ్యానించినపుడు, ఆయన మూర్ఛనలు ఉదాత్తమైన ఉపన్యాసాలై హత్తుకొంటాయి. రాగలతాంతాలూ, త్యాగరాజు స్వామితో ఆడిన సరాగాలలా, వారిద్దరికి పరస్పరం ఉన్న అనురాగాలలా కోమలంగా పరిమళ భరితంగా భాసిస్తాయి.



పగటికలలలో తేలిక రకం ఉన్నాయి. అవి కలగాని కలలు. ఇవి టెక్నికలర్‌లా తీర్చిదిద్ది ఉండవు. ఇట్టే చెరిగిపోవు, అవి జీవితాంతం ఆడించి తిప్పలు పెట్లే కలలు.




జీతపు రాళ్ళతో అప్పులన్నీ తీర్చిపారేసి అరువులేకుండా ఇల్లు నడపడం... అసలది కాదు. జీతంలో ఇకనించి నెలకి పదిరూపాయలు మిగిలేటట్టు చేసుకోవాలనుకోవడం.

క్షౌరశిల్పి ఈసడింపుతో చూసి మొక్కల్ని కత్తిరించే పియర్స్‌తోటి క్షౌరం చేస్తా ననే టంతలా జుట్టు పెరక్కుండా పెంద్రాళే వెళ్ళడం. ఈసారి సెలవొస్తే సుబ్బరంగా రెస్టు తీసుకోవాలని దురాశపడడం – ఇలాటివే నూటికి 90 మందిని తిప్పలు పెట్టే వాటిలో సెలవునాటి విశ్రాంతి ఒకటి. నే నెరిగిన కుటుంబరావుగారు ఒకరున్నారు – ప్రసిద్ధ కథకుడు కాదు ఆయన అసలు కలలు కనరు. కన్నా, హెల్తుబద్ధంగా కని వాటిని తక్షణం సాధ్యములుగా పరిమార్చి వేస్తాడు – నే చెప్పేది పెద్దకుటుంబంవున్న రావుగారి గురించి.

వాట్‌సార్ ఏమిటండీ ఈ లైఫు, ఏమిటంట, పొద్దున్న లేచింది లగాయతూ ఎవడో తరుముతున్నట్టు మొహం కడుక్కోడం, కాఫీతాగడం, పేపరు చూడ్డం, తినడం, జీను వేసుకుని పరిగెత్తడం, పరిగెడుతూ పనులు చెయ్యడం, ఇల్లు చేరడం, తరుముతున్నట్టే తినడం, వగైరా. ఛఛ.... రన్నింగురేసులా వుంది. బొత్తిగా

రెస్టుండటం లేదు. ఈ కాలపు మానవుడికి. అంటాడాయన ఎవరో తరుముతున్నట్టు, అని వెళ్ళిపోతాడు. ఒక్కక్షణం ఆగాడా.... ఒక అరనిముషంసేపు ఆయన ముఖం ప్రసన్నంగా ఉంటుంది. కళ్లు అరమోడ్చి తనలోతను చిరునవ్వు నవ్వుకుంటాడు.

ప్చ్.... ఈసారి.... రేపు సెలవునాడు ఏమైనాసరే పూర్తిగా తీసుకుతీరతాను, అంటాడు – మనం ఒద్దన్నట్టు. ఆ అరనిముషం ఆయన ఎ తరుముతున్నట్టే ఒక పగటికల కంటాడన్నమాట.

"సెలవునాడు రెస్టంటే ఎలాగని మీ ఉద్దేశ్యం" అని అడిగాను. చెప్పమంటారా? అంటాడాయన హుషారుగా. చెప్పడంలోనే అనుభవించినంత ఆనందం కనిపిస్తుందాయన ధోరణిలో.



ఆ పవిత్రదినాన ఆయన రోజూలాగా ఆరింటికి లేపడు. ఎనిమిదిన్నరకి బద్దకంగా కళ్ళు తెరుస్తాడు. తెరిచాక మళ్ళీ మూస్తూ, తెరుస్తూ ఆలోచిస్తూ బద్ధకంగా ఓ అరగంటసేపు అలాగే పడుకుంటాడు. తొమ్మిదింటికి మానేజరుగారి పెద్దబ్బాయిలా బెడ్‌కాఫీ తాగుతాడు. తరవాత పళ్ళుతోమి, టిఫిను తిని, సంచి పట్టుకుని కూరలమార్కెట్టుకు వెళ్తాడు. దారిలో వాళ్ళతో – వీళ్ళతో పిచ్చాపాటి చెప్పి కూరలు తీసుకుని ఇంటికి వస్తాడు. పదిన్నరనించి వంటింట్లో కూర్చుని పెళ్ళాంతో కబుర్లాడుతూ కూరలు స్వయంగా తరుగుతాడు. వీలైతే కొన్నిటిని తనే పోపేస్తాడు. ఈలోగా శ్రీనించి మంగళం వరకూ పేపరు సావకాశంగా చదువుకుంటాడు. పన్నెండింటికి భోంచేసి, హాయిగా పడకేస్తే నా సామిరంగా ఇంకా చాలా వున్నాయి అలాటి కలలు. సాయంత్రం టిఫిను, క్లబ్బు, లేదా గుడీ, బైస్కోపు....

మొన్నటి వారంనాడు ఆ విధంగా చెయ్యాలని శనివారం సాయంత్రం సుస్నాతుడై సంకల్పించాడు. పగటికలలు పండినవాడిని గాబట్టి ఈయనదేమాత్రం పండుతుందో చూదామని, ఆరింటికే వెళ్ళి వాళ్ళింటి సావిట్లో కూర్చున్నా...

ఆనాడు ఆయనకి రివాజయిన ప్రకారం ఆరున్నరకే తెలివొచ్చింది. లేచి సావిట్లో కొచ్చి కటుక్కున నాలిక్కరుచుకున్నాడు. ఎనిమిదిన్నరదాకా లేవకూడదనుకున్నాడు గాని వెధవది అలారంపీసులా అలవాటైపోయింది. పైగా - పెరట్లో దాసీది. గుమ్మంలో పాలవాడు, సావిట్లో పిల్లలు ఎలక్షన్‌లో ఉపన్యాసకుడి కంఠీల్లా గొంతెత్తి మాట్లాడుకుంటున్నారు.

అమ్మని కాఫీ తెమ్మనరా.... అన్నాడు కుర్రాడితో.

మొహం కడుక్కోవా నాన్నా అన్నాడు వాడు.

కాఫీ తెమ్మంటే.... అన్నాడాయన.

ఆవిడవచ్చింది. విడ్డూరంగాకపోతే పాచిమొహంతో కాఫీయా.... లెండిలెండి అంది.

అమ్మా కాఫీగిన్నె వేస్తారా, అల్ల వారింటికెళ్ళిరానా?! అంటుంది పెరట్లో పనిమనిషి.

లేవండీ అది వెళ్ళిపోతుందటా, పోతే మళ్ళీ నే తోముకు చావాలి. అంది ఇల్లాలు. కుటుంబరావుగారు పెరట్లోకి పరిగెత్తారు.

అరగంట తరవాత మార్కెట్టులో కూరలు కొనబోయారాయన. బోలెడు కూరలు కొని, హాయిగా తీరిగ్గా అన్నీ తరగాలని లెక్కలువేస్తూ వచ్చిన పెద్దమనిషికి వంకాయ రూపాయండి, దొండకాయ రూపాయపావలా అంటూ ధరల దండకం చదివేసరికి ఉషారు చల్లారిపోయింది. రెండ్రూపాయల కూరలు కొంటేగాని అరగంట తరిగిన సరదా తీరేట్లా కనబడదే.



ఏవిటీ ధర లిలా మండిపోతున్నాయి అని మండిపడుతూ కాసిని కూరలు కొని ఇంటికి బయల్దేరాడు.

వీళ్ళందరికి పొగరణచాలంటే ఇలా కాదూ.... అసలూ.... నెమ్మదిగా ఆయన పగటికలల స్వర్గసీమలోకి జారిపోయాడు. అందులో ఆయన ప్రధానమంత్రి, ధరలు పెంచితే డొక్క చీరేస్తానని రూల్సు వేయించి, ప్రజలని కాపాడాలన్న పట్టుదలతో అదే ఎలక్షను ప్లాటుఫారంగా ఎన్నికై, మెంబరై మంత్రయ్యాడు....

కుటుంబరావుగారి పగటికలల వయినాలు నీకేం తెలుసునని మీరడక్కండి. ఆయన ముఖం చూస్తే ఆయన కల ఎప్పుడు ఆరంభమైందో మీక్కూడా తెలిసిపోతుంది. చూస్తూ వుండగానే ఆయన చూపులో ఒకరకం శూన్యత కనిపిస్తుంది. కోపం మీద కలగంటున్నపుడు ముక్కుపుటాలు పూరిస్తాడు. గడ్డం కొనదేరుతుంది. పిడికిళ్ళు వాటంతటవే కాస్త బిగుసుకుంటాయి. ఇంకో పదిక్షణాలకల్లా ముఖంలో ఎరుపు దిగుతుంది. బిగించుకున్న నరాలు సడలుతాయి. ముఖంలో ప్రసన్నత వెన్నెలలా కాస్తుంది. ఉండుండి చిరునవ్వులు పూస్తాయి. అంటే అర్థం – కోపంకొద్దీ మినిస్టరయిన కుటుంబరావుగారు – మంత్రికాగానే మండుతున్న ధరలమాట మరిచిపోయి, వరండా అంత కారులో వెనుకసీటులో కూర్చొని వెళ్తున్నాడన్నమాట. సన్మానసభలో దండ వేయించుకుంటున్నాడన్న మాట. బాదంహల్వా చలిమిడిముద్ద అంత పుచ్చుకోడమేకాక పిల్లలికి పొట్లాలు కట్టించి పంపిస్తున్నాడన్నమాట. పూలదండలన్నీ తుంచి ఆవిడగారిమీద పూలవాన కురిపిస్తున్నాడన్నమాట. ఇవన్నీ ఆయన ముఖకవళికలో మనం సునాయాసంగా చదువుకోవచ్చు.

ధరల మంటలు చల్లార్చే కలలో నడుస్తున్న కుటుంబరావుగారి కాలికి ఇలలో ఆంధ్రారోడ్డుమీద కంకర్రాయి ఒకటి ఠక్కున తగిలింది. తక్షణం ఆయన మంత్రి పదవి త్యాగంచేసి అమ్మబాబోయ్ అన్నాడు. ధరలకన్న ఎక్కువగా ఒళ్ళుమండిందాయనకీ. తక్షణం, కాలికి మందేనా వేసుకోకుండా పి.డబ్ల్యు.డి. శాఖలో మంత్రి అయి, రహదార్లశాఖ పని పట్టించడం మొదలుపెట్టాడు. ఆయన ముఖంలో కర్కశత్వం, ఆ పళ్ళు గిట్టకరుచుకోవడం చూస్తే – ఆయన సెక్రటరీలచేత, రోడ్డు కంట్రాక్టర్లచేత రోడ్లమీద రాళ్ళేరించి చదును చేయిస్తున్నాడనిపించింది.

రెండు తీవ్రమైన కలలు కని ఇంటి కొచ్చేసరికి ఆయనకి ప్రాణం చాలొచ్చింది. కూరలు నువ్వే ఏడూ అని భార్యకు సూచించి, మంచినీళ్ళు తాగి అరుగుమీద కూర్చొని అప్పుడే వచ్చిన ఆదివారం పత్రిక విప్పాడాయన.

కాస్త అందులో కథలూ వ్యాసాల సెక్షనిలా పారెయ్యండి అంటూ ఒక చెయ్యి వచ్చి పేపరు లాక్కుని కావలసింది తీసుకుని మిగతా కాయితాలు ఆయన ముందు పడేసింది. కుటుంబరావుగారు ఆపాదమస్తకం కోపంతో, ఉక్రోషంతో వణికిపోయాడు. తరవాత అరగంటవరకూ చూపు పేపరు మీద ఉన్నా, మనసు పక్క పెద్దమనిషి జబర్దస్తీమీద ఉంది.

రెస్టు తీసుకుంటున్నారా? అన్నాను వెళ్లి–

నాబొంద... అన్నాడు ముక్తసరిగా.



బహుశా ఆయన కల్చరల్ మినిస్టరయి, ప్రజలకి పేపరుకొనే అలవాట్లు, పక్కవాడిది లాక్కోకుండా ఉండే నిగ్రహం మప్పుతున్నాడనుకున్నాను.

హడావుడిలో టిఫిను ప్రోగ్రాం మరిచిపోయినందువల్ల కోపంతోటే ఆకలి చుర్రుమంది. ఆదివారంకదా అని దేవుడిపాటలు పాడుతూ సావకాశంగా మడికట్టుకున్న ఇల్లాలుమీదకు తిరిగిందదంతా. ఆదివారం నాడయినా స్తిమితంగా తిని పడుకునే యోగంలేదు అంటూ లేచాడాయన. ఆవిడ నీళ్ళకడవ దింపింది.

తొంగిచూసి నవ్వుకుంటున్న పిల్లలికి రెండువేసి, వెళ్ళగొట్టి ఇల్లాలును బ్రతిమాలాడాయన. ఇపుడు నేనేమన్నానే - అంటూ.

ఆవిడ కోపం తగ్గినందువల్లనో, అన్నం మాడువాసన వచ్చినందువల్లనో మొత్తానికి ఆవిడ గుమ్మంమీంచి లేచింది.

భోజనం అయి అమ్మయ్య అనేసరికి ఆఫీసరుగారి జవాను కబురుతెచ్చాడు. ఆయాసపడుతూ. అదెంత పనో అని వెళ్ళినవాడికి ఆయన నడ్డివిరిగే పని చెప్పాడు. పిల్లలకి మ్యాపులు వేసిపెట్టాలయ్యా గొడవ పెడుతున్నారు అంటూ అటు తిరిగి పడుకున్నా డాఫీసరుగారు.

ప్రపంచంలో విద్యావిధానాన్ని రద్దుచేస్తూ, సంతాన నియంత్రణం కఠినంచేస్తూ ఓ పగటి కల కని, పని పూర్తిచేసి నాలుగింటి కింటికి చేరిన కుటుంబరావుగారు వాలుకుర్చీలో రామచంద్రా అంటూ వాలిపోయారు.

ఈసారి సెలవునాడు పూర్తి రెస్టు తీసుకోవాలండీ అన్నారు ఎదురుగా లేని నాతో, పదిహేనేళ్ళుగా నడుస్తోందాయన కల. ఇంకా ఫలించలేదు. నా కొకటే మార్గం తోచింది. ఈసారి సెలవునాడు పదినిమిషాలు తీరిక చేసుకుని ఒక సెలవునాడు పూర్తిగా రెస్టు తీసుకున్నట్టు ఒక టెక్నికలర్ పగటికల కనిపారెయ్యడం మంచిది అని.



# అమెరికన్ జాజ్ సంగీతం

జాజ్ సంగీతం అంటే అమెరికాలో చెవికోసుకుంటారు. ఒకనాడు చౌకబారు సంగీతమంటూ ఎంతోమంది ఏవగించుకొన్న ఈ జాజ్ సంగీతం ఇంతగా ప్రజానురంజకమైందంటే దానిలో విశిష్టమైన గుణాలు ఉండి ఉండాలి.




జాజ్ సంగీతం అంటే, ఏమిటో వివరించేముందు ఏది 'జాజ్' కాదో చెబితే కొంత సులభంగా అర్థం అవుతుంది. అమెరికాలో సంగీతం వినటానికి చాలరకాల అవకాశాలున్నవి. ఒక నాణాన్ని ఒక రంధ్రంలో వేస్తే ఒక రికార్డుతో పాటలు వినిపించే యంత్రాలు వున్నాయి. ఆ యంత్రాలలో ఉండే రికార్డులలో జాజ్ సంగీతం వినిపించదు. మామూలు నృత్యబృందాల వారు ఉపయోగించే దానిలోను ఈ సంగీతం వినిపించదు. చాలామంది సుగమ సంగీతాన్ని, వ్యాపార సంగీతాన్ని 'బృంద సంగీతాన్ని' ఈ జాజ్ సంగీతాన్ని కలిపి ఒకేగాట కడుతుంటారు. కాని అది వాస్తవం కాదు.

'జాజ్' అనే పదం అసలు ఎప్పుడు ఎట్లా పుట్టిందో తెలియదు. అయితే దీనిని గురించి కొన్ని కథలున్నవి. 'జాసర్' అనే ఫ్రెంచి పదం నుంచి పుట్టి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. "జాసర్" అంటే బాతాఖానీ అని అర్థం. మరికొందరి ఉద్దేశం 'జాజ్' అనే పదం అమెరికాలోనే పుట్టి ఉండవచ్చునని, దక్షిణాదిన ఎవరో కార్మికుడు ఎప్పుడో ఒకనాడు ఈ సంగీతం (అప్పటికి ఈ పేరు లేదు) విని ఉత్సాహాతిశయంతో ఈ సంగీతం వల్ల జనించే ధ్వనికి అనువుగా 'జాజ్' అని అరిచాడని' అప్పటి నుంచి, ఈ సంగీతానికి ఆ పేరు స్థిరపడి పోయిందని వీరి ఊహ. ఏమైనప్పటికీ మొదటి ప్రపంచ యుద్ధాంతరం నాటికి ఈ 'జాజ్' అనే మాట అమెరికాలో వినిపించింది. అయితే దానిలో వర్ణక్రమం మాత్రం ఇప్పటికీ చాలారకాలుగా మారింది. మొదట "జే - ఏ - ఎస్"గా, ప్రారంభమై "జే,ఏ,ఎస్,ఎస్", "జే - ఎ - టి - జడ్" ఇట్లా చాలా అవతారాలు మార్చి చివరకు ఇప్పుడు "జే - ఏ - జడ్ - జడ్" అక్షరాల క్రమంతో "జాజ్"గా చలామణీ అవుతున్నది.

జాజ్ సంగీతంలో జనరంజకమైన లక్షణాలు చాలా ఉన్నవి. ఇది సజీవంగా ఉంటుంది. హాయిగా ఉంటుంది. మొండితేరినట్టుగాను ఉంటుంది. ఒకప్పుడు సనాతనులు దీనిపైన ధ్వజమెత్తారు. వారిధాటికి తట్టుకుని నిలిచింది. ఈ సంగీతం పద్ధతులు గానీ, ప్రయోజనం గానీ ఏమీ అర్థం చేసుకోలేని వారి దూషణ, తిరస్కారాలను భరించింది. జయించింది. చింకిరిచింకిరి గుడ్డల్లో పుట్టిన ముత్యాలవంటి బిడ్డలను పోలినది జాజ్. ప్రారంభంలో - కాదు - మొదట తనమీద అంతగా ధ్వజమెత్తి చీదరించుకొన్న వారిని క్రమక్రమేణా తన వైపుకు మరల్చుకోగలిగింది. 50 సంవత్సరాల నాడు జలక్రీడా మందిరాల వద్ద ఆ సరోవరాల అలల మధ్య మాత్రమే వినిపిస్తూ ఉండే ఈ జాజ్ ఈనాడు మెట్టని చోటు లేదు. ప్రాచీన సంగీత సమ్మేళనాలు జరిగిన ప్రఖ్యాత మందిరాలన్నిటిలోనూ నేడు జాజ్ కచేరీలు జరుగుతున్నవి.

జాజ్‌ను గురించి ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈ సంగీతం చాలా పరిణామానికి లోనయింది. ఈ సంగీతం ఫలానా రోజున ఫలానా ఊళ్ళో పుట్టిందని చెప్పటం కష్టమే గాని ఒక్క సంగతి మాత్రం చెప్పవచ్చు. అసలు ఈ సంగీతానికి మూలాలు నీగ్రో సంప్రదాయాల లోనూ వారిలో అప్పుడప్పుడు ఉదయిస్తూవచ్చిన చైతన్య రేఖలలోనూ చూడవచ్చును. సజీవమైన, సుగమమైన, లౌకికమైన, వాస్తవికమైన జానపద సంగీతం జాజ్ ప్రారంభమైందనవచ్చును. నీగ్రోజాతి ప్రజలు తమ వెతలను వెళ్ళబోసుకోటానికి, ఆధ్యాత్మికమార్గాన్ని అనుసరించారు. వాళ్ళలో ఉండి ఉండి ఎప్పుడో, ఎందుకో ఆనందం వెల్లివిరిసినప్పుడు ఆ సంతోషాతిశయం పొందిన రూపాంతరమే నాటి జాజ్ సంగీతం, మరి ఈనాడు ఇది అందరి సంగీతం అయింది. అనేక మెలికలు తిరిగింది. ఎంతో పురోగమించింది. కొత్త కొత్తరీతులు సంతరించుకొన్నది. ఇంకా సంతరించుకొంటున్నది. ఇంకా అభివృద్ధి చెందుతున్నది. అందువల్లనే తొలినాటి నిరాడంబరత్వం దానిలో నేడంతగా కనపడదు. దానికి

నిబంధనల సంబంధమైన బంధమేదీ లేకపోయినా కొన్ని కట్టుబాట్లు జాజ్ సంగీతంలో కుదురుకొన్నవి.

జాజ్ సంగీత లయరీతులు ఆఫ్రికన్ సంప్రదాయానికి చెందినవి. కాగా ఈ సంగీతంలో ఉండే మాధుర్యం, అందలి పొందిక వంటి లక్షణాలు విశ్వజనీనమైనట్టివి. పూర్వం - అంటే గ్రంథ విద్యాగంధం ఇంకా వెలవక పూర్వం ఆనాటి గాయకులు తమ పూర్వపు డప్పుల వాద్యంలో తమ స్తోత్ర గీతాలాపనలను త్రిపుట తాళయుక్తంగా ఉండే వరుసలను, బొహీమియన్ పోల్కా నృత్యాలను 19 శతాబ్దినాటికి క్వాడ్రిల్ అడుగునూ మేళవించి ఒక నవీన సంగీతాన్ని సృష్టించుకున్నారు. ఆ సంగీతమే నేటి జాజ్ సంగీతానికి పునాది అనవచ్చును.

జాజ్ సంగీతానికి ముందున్నది "బ్లూస్" సంగీతం. ఇది స్వచ్ఛమైన నీగ్రో సంగీతం. పాడటానికి చాలా తేలికగా ఉంటుంది. ఈ సంగీతం భావోద్రేక ప్రకటనమే లక్ష్యంగా కలిగినదయినందున మనోభావాలతోపాటు, సంగీత రీతి కూడా మారిపోతుంటుంది.

జాజ్ సంగీతం నిత్యనూతనంగా ఉంటుంది. కాలక్రమేణా కొన్ని కట్టుబాట్లు దీనిలో కుదుర్చుకొన్నప్పటికి ఈ లక్షణం మాత్రం అట్లానే ఉంటూ వచ్చింది. ఇది దీనికి ముఖ్య లక్షణం కూడాను. జాజ్ గాయకుణ్ణి అని చెప్పుకొనే వాడెవడూ కూడా మరొకణ్ణి అనుకరించడు. ఎవరికి వారు ఎప్పటికప్పుడు కొత్తబాణీలను అన్వేషిస్తూ ప్రవేశ పెడుతూనే ఉంటారు.



**జాజ్ గాయని బిల్లీ హాలిడే**

జాజ్ సంగీతంలో ఇటువంటి విశృంఖలత్వం వల్ల అప్పుడప్పుడూ కొంత చెడు జరిగిన మాట నిజమే. స్వేచ్ఛపేరిట కొంత చౌకబారు సరుకు ఇందులో ప్రవేశించిన మాటకూడా నిజమే. ఇది చాలా సకృత్తుగానే జరిగింది. ఎక్కువ సందర్భాలలో జాజ్ సంగీతంకు తమకుగల స్వాతంత్ర్యాన్ని సద్వినియోగమే చేసుకున్నారు. దానికి అర్హులమనిపించుకున్నారు. వారి సామర్థ్యం, వారి ఉపజ్ఞ 'జాజ్'ను సుసంపన్నమైన సంగీతంగా, మరింత ప్రజారంజకమైన కళగా చేయటానికి తోడ్పడినవి.

జాజ్ సంప్రదాయంలో నిబంధనల బంధాలు లేకపోవటం వల్లనే భారతీయుల లోనూ దీని కెంతోమంది భక్తులు, ప్రియులు లభించారు. భారతీయ సంప్రదాయంలో కూడా కళాకారుడికి వుండవలసిన స్వేచ్ఛకే ప్రాముఖ్యం ఉన్నది.

"జాజ్" అనేది విశాలమైనది. ఇందులో న్యూఆర్లియన్సు, డిక్సీలాండ్, రాగ్టయిమ్, బాప్, కూతజాజ్, ప్రోగ్రసివ్ జాజ్ అని అట్లా అనేక రకాలున్నవి. తరచు ఈ సంగీతపు స్వింగ్, "పాపులర్" గీతాల చేరువకు కూడా విస్తరిస్తుంటుంది. ఈ విభిన్న రీతులు జాజ్‌ను మరింత సుసంపన్నం చేయటానికి తోడ్పడినవి. వీటిలో కొన్ని కొంతవరకే తోడ్పడి ఉండవచ్చు. మరికొన్ని ఎక్కువగా ఉపయోగపడి ఉండవచ్చు. మొత్తం మీద ఇవన్నీ కలిసి జాజ్ సంగీతాన్ని ఇప్పుడది ఉన్న బృహత్ రూపానికి తెచ్చినవి. ఒకనాడు జాజ్‌ను చీదరించుకోటంలో కొంత సబబుగా కూడా ఉండక పోలేదు. మరి ఈనాడు ఆ పరిస్థితి కనపడదు. కనపడటానికి అవకాశం లేదు. జాజ్ ఎంతో అభివృద్ధి చెందింది. రసికులైన వారికి నవ్యరసాస్వాదనావకాశం లభింపచేస్తున్నది. స్ట్రావిన్స్కి, హిండ్‌మిత్ వంటివారిని సైతం తన వశం చేసుకోగలిగింది. పురాతన అమెరికన్ ప్రజలు ఏనాడూ ఎరుగని, పొందిక, మన్నికగల సంగీతం జాజ్‌పరంగా లభించింది.

ఒకనాటి జాజ్‌గాయకుడు నిరక్షరకుక్షి. ఈనాటి "జాజీయుల" సంగతి అట్లాకాదు. ఎక్కడో ఒకరు తప్ప వీరిలో హెచ్చుమంది గ్రంథస్థ సంగీత సిద్ధాంతాలలో ఆరితేరినవారు. స్వర రచనలో ప్రసిద్ధులు. అటువంటి వారు ఏవైనా మామూలు సూత్రాలను ఉల్లంఘించడం జరిగిందంటే అది అజ్ఞానం వల్ల మాత్రం కాదు. కావాలనే కాదు అట్లా ఉల్లంఘించి ఉండాలి. కొత్త పుంతలు త్రొక్కటానికే అట్లా ఉల్లంఘించి ఉంటారు.

ఆధునిక "అభ్యుదయ" జాజ్ సంప్రదాయం 1940లో ఏర్పాటయింది. అప్పటివరకు మోటుపద్ధతికి అంటి పెట్టుకుని ఉండేవారు. అనంతరం చారీ పార్కర్, డిజ్జీగిలెస్పీ వంటి వారి చేతిలో ఇది కొత్తదారులు తొక్కింది. వుడీ హెర్మన్, స్టాన్‌కెంటన్‌లు ఇంకా దీనిని ముందుకు తీసుకుపోయారు.

దేవ్ బ్రూబెక్ ఇట్లా ప్రయోగాలు చేసిన వాళ్లందరి భావాలు తీసుకొని వాటి అన్నిటిని సమన్వయపరిచి జాజ్‌కు ఒక కొత్త రూపం ఇచ్చాడు. దీనితో జాజ్ సంగీతం మరింత ప్రజానురంజకంగా తయారైంది. ఇప్పుడు జాజ్ భక్తులే గాక తదన్యులకు సైతం దాని రసానుభూతి సులభసాధ్యం అయింది. ఈ 'అభ్యుదయ'

జాజ్ సంగీతం పట్ల కూడా ప్రజలలో పలు విధాలైన భావాలు కలిగినవి. డిక్సీలాండ్ రకం సంగీత ప్రియులు, ఇంకా కొందరు సనాతన జాజీయులు ఇదేమీ బాగాలేదన్నారు. కాగా పూర్వం జాజ్ అంటే వట్టి చెత్త అని ఛీదరించుకునే వారు ఈ అభ్యుదయ జాజ్ రీతి విన్న తరువాత ఫరవాలేదు జాజ్‌లో కూడా వినదగింది ఉన్నదనుకొనే దాకా వచ్చారు.

జాజ్‌లాగా నిత్యనూతనంగా మారిపోతూ ఉంటే జాజ్ వంటి కళ భవిష్యత్తులో ఎట్లా ఉండబోతుందో చెప్పటం అసాధ్యమైన సంగతి. అయితే ఒకటి మాత్రం నిశ్చయం. జాజ్ సంగీతం బాగా కుదురుకొన్నది. ఇక మనుగడకై కాళ్లు త్రొక్కుకోవలసిన అవస్థ ఉండదు. ఆ దశ ఎప్పుడో దాటిపోయింది. జాజీయులు బిడియపడవలసిన స్థితి దాటిపోయింది. ఈనాడు అన్నిరకాల సంగీతాల లాగానే ఇదీ ఒక సంగీత కళ. దీనికి కొన్ని విశిష్ట లక్షణాలంటూ ఏర్పడినవి. దానికి ఒక కళాధిష్ఠాన దశ ఉన్నది. జాజ్ ఏనాడూ నిలవ నీరులాగా ఒకేచోట నిలిచి ఉండలేదు. అన్నిటికంటే కూడా మానవునిలో సహజంగా ఉండే సంగీత రసానుభూతికి కావలసిన మూల లక్షణాలు జాజ్‌లో ఉన్నవి. మిగతా ఎన్ని మార్పులు జరిగినా ఈ ముఖ్య లక్షణాలు మాత్రం మారలేదు. అందువల్లనే ఈనాడు జాజ్ సంగీతం నిత్యాధికమైన ఆసక్తిని సంగీత ప్రియులలో రేకెత్తిస్తున్నది.



# స్త్రీ రమణీయం

# 'నై' తత్పురుష

ద్వితీయా తత్పురుష అలాగే తృతీయా, చతుర్ధి, పంచమీ తత్పురుషలూ అవీ చాలా ఉన్నాయి వ్యాకరణంలో. తెలుగు పరీక్షలో సమాసాల విగ్రహాల గొడవ వచ్చినప్పుడు ఇదీ, ఇంకా విభక్తి ప్రత్యయాలూ కంఠతా వస్తే కాని మార్కులు పడవు.

అయితే మన నిత్యజీవితంలో ఇవన్నీ ఎలా ఉన్నా 'నై' తత్పురుష గురించిన మంచి చెడ్డలు, దాన్ని ఉపయోగించే పద్ధతులు కొంత బాగా తెలిస్తే కొన్ని మంచి మార్కులు వస్తాయని నా అభిప్రాయం.

జీవితంలో మంచి మార్కులు వస్తే అందరూ మనతో మంచిగా ఉంటారు. అందరమూ సంతోషముగా ఉంటాము. ఎవరితోనూ ఎవరికీ తగాయిదాలు ఉండవు.

ఈ నైతత్పురుష అంటే ఏమిటి?

వ్యాకరణంలో నఞ్ తత్పురుషకీ జీవితములో నైతత్పురుషకి దగ్గిర సంబంధం ఉంది. నఞ్ తత్పురుష అంటే ముందర నెగేషన్ ఉన్నమాట అన్నమాట. అధర్మము (ధర్మము కానిది), అసత్యము (సత్యము కానిది) ఇలాంటివి. కాదు లేదు అని అర్థం ఇచ్చే అక్షరాలు వీటికి ముందర ఉంటాయి.

ఈరోజులలో చాలామంది (నామటుకు నేను, మీ మటుకు మీరు, మన తరవాత మనకి కావలసిన వాళ్లు మినహాయించి) ఈ నఞ్ తత్పురుషని (అధర్మం, అసత్యం) శ్రద్ధాభక్తులతో గురితప్పకుండా అవలంబిస్తున్నారు. శిరసావహిస్తున్నారు. కాని మనం ఎవరితోనన్నా, నువ్వు అబద్ధం ఆడుతున్నావు అంటే వెంటనే 'నై' తత్పురుషని ఉపయోగిస్తూ జవాబు ఇస్తారు. అంటే "ఛీ లేదుపో, అది అబద్ధం కాదుపో" అని అనడం అన్నమాట.

ఎదుటివాళ్లు మన మనస్సు నొచ్చుకుంటుందేమో అని ఆలోచించకుండా, నిజము గట్టిగా తెలుసుకొనకుండా "నువ్వు అబద్ధం ఆడుతున్నావు" అని కాస్త మొరటుగా మన మీద నఞ్ తత్పురుష విసురుతారు అనుకోండి. అప్పుడు మనకి సహజముగానే కోపము వచ్చివేస్తుంది. "లేదుఫో" అని మనంకూడా మొరటుగానే ఇంకో 'నై' తత్పురుషతో జవాబు విసురుతాముగదా.

చివరికి జరిగేది ఏమిటంటే, నువ్వంటే నువ్వు అని ఏకవచన సంబోధనముతో కూడిన మాట్లాట.

అలాగ కాకుండా ఇద్దరిలో ఏ ఒక్కరో నైతత్పురుషని జాగర్తగా ఉపయోగించిన పక్షంలో పోట్లాటలూ మాట్లాటలూ జరగవు అని నా అభిప్రాయం.

అసలు నా ఇంకో అభిప్రాయం ఏమిటీ అంటే, ఈ నఞ్ తత్పురుషను - అధర్మం, అన్యాయం, అబద్ధం లాంటి మాటలను, సాధ్యము అయినంతవరకూ ఎవళ్ళమీదా విసరకూడదు అని చెప్తాను.

ఉదాహరణ చూడండి:

"మీరు చేస్తున్న పని పూర్తిగా అన్యాయం".

అందులో నఞ్ తత్పురుషని అలా ముడిసరుకుగా వాడకుండానే మన అభిప్రాయం చెప్పవచ్చును.

"మీరు కూడా కొంచెం న్యాయం ఆలోచించండి. మీకు తెలీందేముంది?" అనవచ్చు.

ఇంకొకటి "నువ్వు చెప్పేది పచ్చి అబద్ధం."

ఇందులో ఈ 'నఞ్' తత్పురుష తీసేసి 'నై' తత్పురుషని వాడితే కొంత మెరుగు.

"నువ్వు నాతో మనసు విప్పి అసలు సంగతి చెప్పు. నాకు తోచిన మాట నిజంగా చెప్పాలంటే, నువు నాదగ్గిర నిజం దాస్తున్నావు అనిపిస్తోంది."

లేదా "నువ్వు నిజం చెప్పటం లేదుకదూ?" అనొచ్చు.

ఇంక మనం మరీ తరచుగా వాడే "నై" తత్పురుష. అంటే "లేదు" అనేమాట.

అసలు ఈ మాటని వాడడమే మంచిదికాదు అని నా అభిప్రాయం.

నేనే అనికాదు. అది మన పెద్దవారి పద్ధతి. రాయని భాస్కరుని గురించిన పద్యములలో "లా" కేత్వమివ్వనేరదు, దాకును కొమ్మివ్వ"దని ఉంది. అంటే 'లే-దు' అనే రెండు అక్షరాలు కలిపి ఆయన ఎప్పుడూ మాటాడలేదు అన్నమాట.

అలాగే మన పెద్దలు చెప్పే మరొక మంచిమాట నోటితో లేదనే బదులు చేత్తో లేదను అనేది మన అందరమూ ఎరిగినదేకాని, దానిని అవసరం వచ్చినప్పుడు (పత్రికలకి వ్యాసాలు రాసినప్పుడు, మీటింగ్స్‌లో లెక్చరులు ఇచ్చినప్పుడూ మినహాయించి) మనలో చాలామంది శిరసావహించటము లేదు అని నా అభిప్రాయము.

చేతిలో లేదనడం అంటే ఎవరైనా భిక్షమే కాదు, ఏ చిన్న ఉపకారమునైనా కోరిన సమయంలో, వాళ్ళమాట పూర్తికాకుండానే కొంపములిగినంత తొందరగా 'లేదు' అని పుసుక్కున అనెయ్యకూడదూ అని.

మనకు చేతనైనంత సహాయం చేస్తే ఎదుటివాళ్ళు సంతోషిస్తారు గదా. అప్పుడు - 'నేను చేయగలిగిన సాయం ఇది' అని అనవచ్చును. అప్పుడు కూడా 'నేనింతకన్న ఏం చెయ్యలేను' అనడం మంచిదికాదు.

అందుచేత ఎప్పుడు మనము - ముఖ్యంగా ఆడపిల్లలము-(మొగవాళ్ళకి మనం చెప్పినా వినరుగా. వాళ్ళు గొప్పవాళ్ళు(ట) ఈ 'నై' తత్పురుష శబ్దాలు "లేదు,

కాదు, యివ్వను, చెయ్యను" అనేలాటి మాటల్ని సాధ్యమైనంతవరకు వాడుకోకుండా వుండాలి. తప్పనిసరి అయినపుడు వాడినా జాగ్రత్తగా, సుతిమెత్తగా, ఎదుటివాళ్ళని నొప్పించకుండా ఉపయోగించాలి అని నా అభిప్రాయం.

నేనిలా మినిస్టర్లలాగా మాట్లాడుతూ ఉండడం చూచి "అజ్ఞానం" అనే నఞ్ తత్పురుష మాటని, తొందరపాటుగా, పెంకెగా అందరిమీదా విసురుతున్నాను - అని అనుకోవద్దు. మనం ఈ విషయాలనే మళ్లీ ఒకసారి జ్ఞాపకము చేసుకొని ఇంకొంచెం శ్రద్ధగా ఆలోచించడం మంచిది అనే అభిప్రాయం తోటే.

సి.వి. విజయలక్ష్మి పేరుతో వ్రాసిన స్త్రీల వ్యాకరణం<br>ఆంధ్రపత్రిక వీక్లీ (23-1-57)




ఏదో వినయంకొద్దీ శ్రావణమాసం తన గురించి అలా చెప్పుకుంటుంది తప్ప అదీ శనగల మాసమే కాదు నగలమాసం కూడా. పెళ్లీడు పిల్లలకూ ముఖ్యంగా కొత్త పెళ్ళికూతుళ్ళకూ శ్రావణంలో తొలి శనగల వాయనం ఇచ్చి పుచ్చుకునే వేళకు నగల వాయనం ముట్టి ఉండడం రివాజు. వరలక్ష్మీవ్రతం వేళకు శ్రావణపట్టీ అందకపోతే పూజ, పిల్లదాని మొహం కూడా వెలాతెలాపోతాయి. ఇల్లాళ్ళకైనా అంతే. తాకట్లలోపడి విలవిల తన్నుకుంటూ, తన్ను కొన్న తల్లి కోసం తహతహలాడిపోతున్న నగకట్లకు మొగాడు ఏదో ఉపాయానా - తలతాకట్టు పెట్టయినా ఆ కట్లు విప్పి తెచ్చి నట్టింట ఉంచి తీరుతాడు. ఒకవేళ అదే ఖరీదైనదైతే, కొత్తదే చేయించి పారేస్తాడు. ఏడాది పొడుగునా గునుపుల చాటునా, గొణుగుళ్ళ మాటునా, చీవోఁ దోవోఁ కుట్టగా కంట తిరిగే కన్నీళ్ళ పక్కనా నక్కి నక్కి ఉంటూ అడపా తడపా చివాట్లు ఎదురయేవరకూ వెనక్కితగ్గుతూ, మళ్ళీ ముందుకు మొగ్గుతూ పడగ్గదిలోంచి పక్క గడిలోకి, పుట్టినింటి నుంచి మెట్టినింటికీ పప్పన్నాలమీదుగా నడుచుకుంటూవచ్చిన సూచనలూ, కోరికలూ పంతాలూ ఆషాఢం వచ్చేసరికి శరచ్చంద్రికలో నీడలలా స్పష్టం అయిపోతాయి. అరోక్తులు పూర్ణోక్తులవుతాయి. తాఖీదులూ శ్రీముఖాలు అవుతాయి.

తీరా ఆ నగానట్రా వచ్చి ఆమె దరిచేరే వరకూ, ఆనందంతో అందగించిన ఆమె వదనం ముందు నగకట్టు కాంతి మందగించి సూర్యుడి ముందు దివిటీలా తీసికట్టే అవుతుంది. తాబట్టిన పంతం తలచుకునే వరకు ఒళ్ళు ఝుల్లుమని, చెంపలలో వెలిగించుకున్న కెంపుల వెలుగులో, జిగినీ నానులోని దానిమ్మగింజల్లాంటి కెంపులు తెల్లబోయి చిన్న బుచ్చుకుంటాయి. మమ్మల్నెందుకు పిలవటం అని. చెవుల నాశ్రయించిన బావళీ బొగడల కవలు కూడా ఇటువేపు రాకుండా అటు నల్లని కురుల వేపే తమ ప్రతాపాన్ని వెలిగిస్తూ ఉంటాయి. మెడలో మంచి ముత్యాలపట్టెడ,

తనను మించి ముత్యాలవంటి పలు వరుసమీద తెలినవ్వు కాంతులు చూసి, తను దానికి ఉపమానమో ఉపమేయమో తెలీక మరింత తెల్లబోతుంది. చక్కని నాసిక దాని అందచందాలను, ఎడా పెడా నిలబడి తెరిపి లేకుండా పొగిడేస్తున్న 'కలువల జంట వాగ్ధాటితో పోటీచెయ్యలేక బేసరముక్కెఖా 'అపండితులకు మౌనమేభూషణమన్న ముక్కను గుర్తుచేసుకు తగ్గిపోతాయి. ఆమెను సేవించి అందాన్ని ఇనుమడించి వచ్చిన ఇతర అభరణాలన్నీ కూడా, స్వార్ధభక్తి ఎంత ఉన్నా, అవకాశం లేక మంచి ముహూర్తానికి ఎదురుచూస్తూ ఊరుకుంటాయి. వెయ్యి వరహాలు పోసి తెచ్చి ఈ పసిడిమిసిమి ఇల్లాలిమిసిమికి ఇలా ఈ చోపమానంలానీ కనబడడంతో కొన్నవారికి అనుమానం కలుగుతుంది. మజూరీ బేరం ఆడినందుకు సాలెవాడు కల్తీ బంగారం అంటగట్టలేదు గదా అని. అయితే కొంతసేపటికి ఆనందాతిశయం స్థిమితమైన తరువాత వీటన్నిటికీ యథాశక్తి తమ ప్రతాపాలు చూపే అవకాశం ప్రోత్సాహం లభిస్తూనే ఉంటాయని వాటిని తాత్కాలికంగా భరించి, తరువాత ధరించబోయే అమ్మడికి తెలుసు. అమ్మాయి పట్టుబట్టకపోతే, అతగాడు అనర్గళంగా కవిత్వం చెప్పి ఆమెకు నగలు తొడగడం, కొంచెం దగ్గిరకువెళ్ళి 'ఏనుగంత ఉన్నావు గిరిరాజా, అని చెప్పినట్టవుతుందని అంటాడు.

పచ్చని దోసపండువంటి ఆమె ముఖం కాంతిని ఉద్ఘోషించడానికి, చుట్టూరాఉన్న వేణి వాణిని మించింది లేదంటాడు. కర్ణయుగళి శ్రీకారాకారాన్ని కీర్తించడం కూడా ఆ నల్లనిజుట్టుకు మహాకావ్యంలో ఉపాఖ్యానం చెప్పడమేనని వివరిస్తాడు. ముత్యాలసరం ఆమె అరుణాధరాన్ని ఆనుకుని ఉందని హెచ్చరిక చెబుతాడు. పుష్యరాగాలూ గోమేధికాలూ ఆమె చెంపలలోనే ఉన్నాయని అనురాగ మనురాగోదయాన్ని సదారామంగా శాశ్వతంగా చిత్రిస్తున్నానంటాడు.

ఇంద్రనీలాలు ఆమెకళ్ళలో లేవని అనుమానం కలిగితే తన కళ్ళలో ప్రతిబింబం చూసుకోమని సూచిస్తాడు. ఆమె మంగళ గళసీమగురించి మాట్లాడేందుకు నల్లటినల్ల పూసలకుత్తికంటికి, నక్షత్రాలవంటి నఖాలకూ తప్ప మరిదేనికీ అధికారం లేదంటాడు. ముప్పేటగొలుసులు, కాసులపేర్లూ మొదలైన అభరణాలను ఆమె భర్మప్రభ ముందుంచి అవమానించవద్దని హితవు చెబుతాడు. ఆమె నడుము కేవలం భ్రాంతి మాత్రమే కాబట్టి వడ్డాణాలు తనుమధ్యాభరణాలుకావనీ కేవలం మిథ్యాభరణాలనీ విశదంచేస్తాడు. ఇలా వింటూ ఉంటే, లజ్జే అభరణమనీ శీలమేభూషణమని ఇంకా అలా చెప్పుకుపోతునే ఉంటాడు కాబట్టే, నమ్మరాదే చెలీ అన్నారు.



అకాశానికి నక్షత్రాలందం. ఆడదానికి నగలందం. ఎంత బంగారప్పళ్ళానికైనా గోడచేర్పు తప్పదన్నారు. ఎంత సౌందర్యరాశికైనా ఉపమానాలకు అభరణాలు తప్పవు. అందగత్తెలు కానివారికి అవే ఉపమేయాలై యథాశక్తిని ఆదుకుంటాయి.

పగటికలలలో తేలిక రకం ఉన్నాయి. అవి కలగాని కలలు. ఇవి టెక్నికలర్‌లా తీర్చిదిద్ది ఉండవు. ఇట్టే చెరిగిపోవు, అవి జీవితాంతం ఆడించి తిప్పలు పెట్టే కలలు.




జీతపు రాళ్ళతో అప్పులన్నీ తీర్చిపారేసి అరువులేకుండా ఇల్లు నడపడం... అసలది కాదు. జీతంలో ఇకనించి నెలకి పదిరూపాయలు మిగిలేటట్టు చేసుకోవాలనుకోవడం.

క్షౌరశిల్పి ఈసడింపుతో చూసి మొక్కల్ని కత్తిరించే పియర్స్‌తోటి క్షౌరం చేస్తానసే టంతలా జుట్టు పెరక్కుండా పెండ్రాళే వెళ్ళడం. ఈసారి సెలవొస్తే సుబ్బరంగా రెస్టు తీసుకోవాలని దురాశపడడం - ఇలాటివే నూటికి 90 మందిని తిప్పలు పెట్టే వాటిలో సెలవునాటి విశ్రాంతి ఒకటి. నే నెరిగిన కుటుంబరావుగారు ఒకరున్నారు - ప్రసిద్ధ కథకుడు కాదు ఆయన అసలు కలలు కనరు. కన్నా, హెల్తుబద్ధంగా కని వాటిని తక్షణం సాధ్యములుగా పరిమార్చి వేస్తాడు - నే చెప్పేది పెద్దకుటుంబంవున్న రావుగారి గురించి.

వాట్‌సార్ ఏమిటండీ ఈ లైఫు, ఏమిటంట, పొద్దున్న లేచింది లగాయతూ ఎవడో తరుముతున్నట్టు మొహం కడుక్కోడం, కాఫీతాగడం, పేపరు చూడ్డం, తినడం, జీను వేసుకుని పరిగెత్తడం, పరిగెడుతూ పనులు చెయ్యడం, ఇల్లు చేరడం, తరుముతున్నట్టే తినడం, వగ్రీసు. ఛఛ.... రన్నింగురేసులా వుంది. బొత్తిగా

రెస్టుండటం లేదు. ఈ కాలపు మానవుడికి. అంటాడాయన ఎవరో తరుముతున్నట్టు. అని వెళ్ళిపోతాడు. ఒక్కక్షణం ఆగాడా.... ఒక అరనిముషంసేపు ఆయన ముఖం ప్రసన్నంగా ఉంటుంది. కళ్లు అరమోడ్చి తనలోతను చిరునవ్వు నవ్వుకుంటాడు.

ప్చ్.... ఈసారి.... రేపు సెలవునాడు ఏమైనాసరే పూర్తిగా తీసుకుతీరతాను, అంటాడు - మనం ఒద్దన్నట్టు. ఆ అరనిముషం ఆయన ఎః తరుముతున్నట్టే ఒక పగటికల కంటాడన్నమాట.

"సెలవునాడు రెస్టంటే ఎలాగని మీ ఉద్దేశ్యం" అని అడిగాను. చెప్పమంటారా? అంటాడాయన హుషారుగా. చెప్పడంలోనే అనుభవించినంత ఆనందం కనిపిస్తుందాయన ధోరణిలో.



ఆ పవిత్రదినాన ఆయన రోజూలాగా ఆరింటికి లేపడు. ఎనిమిదిన్నరకి బద్దకంగా కళ్ళు తెరుస్తాడు. తెరిచాక మళ్ళీ మూస్తూ, తెరుస్తూ ఆలోచిస్తూ బద్ధకంగా ఓ అరగంటసేపు అలాగే పడుకుంటాడు. తొమ్మిదింటికి మానేజరుగారి పెద్దబ్బాయిలా బెడ్‌కాఫీ తాగుతాడు. తరవాత పళ్ళుతోమి, టిఫిను తిని, సంచి పట్టుకుని కూరలమార్కెట్టుకు వెళ్తాడు. దారిలో వాళ్ళతో - వీళ్ళతో పిచ్చాపాటి చెప్పి కూరలు తీసుకుని ఇంటికి వస్తాడు. పదిన్నరనించి వంటింట్లో కూర్చుని పెళ్ళాంతో కబుర్లాడుతూ కూరలు స్వయంగా తరుగుతాడు. వీలైతే కొన్నిటిని తనే పోపేస్తాడు. ఈలోగా శ్రీనించి మంగళం వరకూ పేపరు సావకాశంగా చదువుకుంటాడు. పన్నెండింటికి భోంచేసి, హాయిగా పడకేస్తే నా సామిరంగా ఇంకా చాలా వున్నాయి అలాటి కలలు. సాయంత్రం టిఫిను, క్లబ్బు, లేదా గుడీ, బైస్కోపు....

మొన్నటి వారంనాడు ఆ విధంగా చెయ్యాలని శనివారం సాయంత్రం సుస్నాతుడై సంకల్పించాడు. పగటికలలు పండినవాడిని గాబట్టి ఈయనదేమాత్రం పండుతుందో చూదామని, ఆరింటికే వెళ్ళి వాళ్ళింటి సావిట్లో కూర్చున్నా...

ఆనాడు ఆయనకి రివాజయిన ప్రకారం ఆరున్నరకే తెలివొచ్చింది. లేచి సావిట్లో కొచ్చి కటుక్కున నాలిక్కరుచుకున్నాడు. ఎనిమిదిన్నరదాకా లేవకూడదనుకున్నాడు గాని వెధవది అలారంపీసులా అలవాటైపోయింది. పైగా - పెరట్లో దాసీది. గుమ్మంలో పాలవాడు, సావిట్లో పిల్లలు ఎలక్షన్‌లో ఉపన్యాసకుడి కంఠీల్లా గొంతెత్తి మాట్లాడుకుంటున్నారు.

అమ్మని కాఫీ తెమ్మనరా.... అన్నాడు కుర్రాడితో.

మొహం కడుక్కోవా నాన్నా అన్నాడు వాడు.

కాఫీ తెమ్మంటే.... అన్నాడాయన.

ఆవిడవచ్చింది. విడ్డూరంగాకపోతే పాచిమొహంతో కాఫీయా.... లెండిలెండి అంది.

అమ్మా కాఫీగిన్నె వేస్తారా, అల్ల వారింటికెళ్ళిరానా?! అంటుంది పెరట్లో పనిమనిషి.

లేవండీ అది వెళ్ళిపోతుందటా, పోతే మళ్ళీ నే తోముకు చావాలి. అంది ఇల్లాలు. కుటుంబరావుగారు పెరట్లోకి పరిగెత్తారు.

అరగంట తరవాత మార్కెట్టులో కూరలు కొనబోయారాయన. బోలెడు కూరలు కొని, హాయిగా తీరిగ్గా అన్నీ తరగాలని లెక్కలువేస్తూ వచ్చిన పెద్దమనిషికి వంకాయ రూపాయండి, దొండకాయ రూపాయపావలా అంటూ ధరల దండకం చదివేసరికి ఉషారు చల్లారిపోయింది. రెండ్రూపాయల కూరలు కొంటేగాని అరగంట తరిగిన సరదా తీరేట్లా కనబడదే.



ఏవిటీ ధర లిలా మండిపోతున్నాయి అని మండిపడుతూ కాసిని కూరలు కొని ఇంటికి బయల్దేరాడు.

వీళ్ళందరికి పొగరణచాలంటే ఇలా కాదూ.... అసలూ.... నెమ్మదిగా ఆయన పగటికలల స్వర్గసీమలోకి జారిపోయాడు. అందులో ఆయన ప్రధానమంత్రి, ధరలు పెంచితే డొక్క చీరేస్తానని రూల్సు వేయించి, ప్రజలని కాపాడాలన్న పట్టుదలతో అదే ఎలక్షను ప్లాటుఫారంగా ఎన్నికై, మెంబరై మంత్రయ్యాడు....

కుటుంబరావుగారి పగటికల వయినాలు నీకేం తెలుసునని మీరడక్కండి ఆయన ముఖం చూస్తే ఆయన కల ఎప్పుడు ఆరంభమైందో మీక్కూడా తెలిసిపోతుంది. చూస్తూ వుండగానే ఆయన చూపులో ఒకరకం శూన్యత కనిపిస్తుంది. కోపం మీద కలగంటున్నపుడు ముక్కుపుటాలు పూరిస్తాడు. గడ్డం కొనదేరుతుంది. పిడికిళ్ళు వాటంతటవే కాస్త బిగుసుకుంటాయి. ఇంకో పదిక్షణాలకల్లా ముఖంలో ఎరుపు దిగుతుంది. బిగించుకున్న నరాలు సడలుతాయి. ముఖంలో ప్రసన్నత వెన్నెలలా కాస్తుంది. ఉండుండి చిరునవ్వులు పూస్తాయి. అంటే అర్థం - కోపంకొద్దీ మినిస్టరయిన కుటుంబరావుగారు - మంత్రికాగానే మండుతున్న ధరలమాట మరిచిపోయి, వరండా అంత కారులో వెనుకసీటులో కూర్చొని వెళ్తున్నా దన్నమాట. సన్మానసభలో దండ వేయించుకుంటున్నాడన్న మాట. బాదంహల్వా చలిమిడిముద్ద అంత పుచ్చుకోడమేకాక పిల్లలికి పొట్లాలు కట్టించి పంపిస్తున్నా దన్నమాట. పూలదండలన్నీ తుంచి ఆవిడగారిమీద పూలవాన కురిపిస్తున్నా దన్నమాట. ఇవన్నీ ఆయన ముఖకవళికలో మనం సునాయాసంగా చదువుకోవచ్చు.

ధరల మంటలు చల్లార్చే కలలో నడుస్తున్న కుటుంబరావుగారి కాలికి ఇలలో ఆంధ్రారోడ్డుమీద కంకర్రాయి ఒకటి ఠక్కున తగిలింది. తక్షణం ఆయన మంత్రి పదవి త్యాగంచేసి అమ్మబాబోయ్ అన్నాడు. ధరలకన్న ఎక్కువగా ఒళ్ళుమండిం దాయనకీ. తక్షణం, కాలికి మందేనా వేసుకోకుండా పి.డబ్ల్యు.డి. శాఖలో మంత్రి అయి, రహదార్లశాఖ పని పట్టించడం మొదలుపెట్టాడు. ఆయన ముఖంలో కర్కశత్వం, ఆ పళ్ళు గిట్టకరుచుకోవడం చూస్తే - ఆయన సెక్రటరీలచేత, రోడ్డు కంట్రాక్టర్లచేత రోడ్లమీద రాళ్ళేరించి చదును చేయిస్తున్నాడనిపించింది.

రెండు తీవ్రమైన కలలు కని ఇంటి కొచ్చేసరికి ఆయనకి ప్రాణం చాలొచ్చింది. కూరలు నువ్వే ఏడూ అని భార్యకు సూచించి, మంచినీళ్ళు తాగి అరుగుమీద కూర్చొని అప్పుడే వచ్చిన ఆదివారం పత్రిక విప్పాడాయన.

కాస్త అందులో కథలూ వ్యాసాల సెక్షనిలా పారెయ్యండి అంటూ ఒక చెయ్యి వచ్చి పేపరు లాక్కుని కావలసింది తీసుకుని మిగతా కాయితాలు ఆయన ముందు పడేసింది. కుటుంబరావుగారు ఆపాదమస్తకం కోపంతో, ఉక్రోషంతో వణికిపోయాడు. తరవాత అరగంటవరకూ చూపు పేపరు మీద ఉన్నా, మనసు పక్క పెద్దమనిషి జబర్దస్తీమీద ఉంది.

రెస్టు తీసుకుంటున్నారా? అన్నాను వెళ్లి-

నాబొంద... అన్నాడు ముక్తసరిగా.



బహుశా ఆయన కల్చరల్ మినిస్టరయి, ప్రజలకి పేపరుకొనే అలవాట్లు, పక్కవాడిది లాక్కోకుండా ఉండే నిగ్రహం మప్పుతున్నాడనుకున్నాను.

హడావుడిలో టిఫిను ప్రోగ్రాం మరిచిపోయినందువల్ల కోపంతోటే ఆకలి చుర్రుమంది. ఆదివారంకదా అని దేవుడిపాటలు పాడుతూ సావకాశంగా మడికట్టుకున్న ఇల్లాలుమీదకు తిరిగిందదంతా. ఆదివారం నాడయినా స్తిమితంగా తిని పడుకునే యోగంలేదు అంటూ లేచాడాయన. ఆవిడ నీళ్ళకడవ దింపింది.

తొంగిచూసి నవ్వుకుంటున్న పిల్లలికి రెండువేసి, వెళ్ళగొట్టి ఇల్లాలును బ్రతిమాలాడాయన. ఇపుడు నేనేమన్నానే - అంటూ.

ఆవిడ కోపం తగ్గినందువల్లనో, అన్నం మాడువాసన వచ్చినందువల్లనో మొత్తానికి ఆవిడ గుమ్మంమీంచి లేచింది.

భోజనం అయి అమ్మయ్య అనేసరికి ఆఫీసరుగారి జవాను కబురుతెచ్చాడు. ఆయాసపడుతూ. అదెంత పనో అని వెళ్ళినవాడికి ఆయన నడ్డివిరిగే పని చెప్పాడు. పిల్లలకి మ్యాపులు వేసిపెట్టాలయ్యా గొడవ పెడుతున్నారు అంటూ అటు తిరిగి పడుకున్నా డాఫీసరుగారు.

ప్రపంచంలో విద్యావిధానాన్ని రద్దుచేస్తూ, సంతాన నియంత్రణం కఠినంచేస్తూ ఓ పగటి కల కని, పని పూర్తిచేసి నాలుగింటి కింటికి చేరిన కుటుంబరావుగారు వాలుకుర్చీలో రామచంద్రా అంటూ వాలిపోయారు.

ఈసారి సెలవునాడు పూర్తి రెస్టు తీసుకోవాలండీ అన్నారు ఎదురుగా లేని నాతో, పదిహేనేళ్ళుగా నడుస్తోందాయన కల. ఇంకా ఫలించలేదు. నా కొకటే మార్గం తోచింది. ఈసారి సెలవునాడు పదినిమిషాలు తీరిక చేసుకుని ఒక సెలవునాడు పూర్తిగా రెస్టు తీసుకున్నట్టు ఒక టెక్నికలర్ పగటికల కనిపారెయ్యడం మంచిది అని.



# అమెరికన్ జాజ్ సంగీతం

జాజ్ సంగీతం అంటే అమెరికాలో చెవికోసుకుంటారు. ఒకనాడు చౌకబారు సంగీతమంటూ ఎంతోమంది ఏవగించుకొన్న ఈ జాజ్ సంగీతం ఇంతగా ప్రజానురంజకమైందంటే దానిలో విశిష్టమైన గుణాలు ఉండి ఉండాలి.




జాజ్ సంగీతం అంటే, ఏమిటో వివరించేముందు ఏది 'జాజ్' కాదో చెబితే కొంత సులభంగా అర్థం అవుతుంది. అమెరికాలో సంగీతం వినటానికి చాలరకాల అవకాశాలున్నవి. ఒక నాణాన్ని ఒక రంధ్రంలో వేస్తే ఒక రికార్డుతో పాటలు వినిపించే యంత్రాలు వున్నాయి. ఆ యంత్రాలలో ఉండే రికార్డులలో జాజ్ సంగీతం వినిపించదు. మామూలు నృత్యబృందాల వారు ఉపయోగించే దానిలోను ఈ సంగీతం వినిపించదు. చాలామంది సుగమ సంగీతాన్ని, వ్యాపార సంగీతాన్ని 'బృంద సంగీతాన్ని' ఈ జాజ్ సంగీతాన్ని కలిపి ఒకేగాట కడుతుంటారు. కాని అది వాస్తవం కాదు.

'జాజ్' అనే పదం అసలు ఎప్పుడు ఎట్లా పుట్టిందో తెలియదు. అయితే దీనిని గురించి కొన్ని కథలున్నవి. 'జాసర్' అనే ఫ్రెంచి పదం నుంచి పుట్టి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. "జాసర్" అంటే బాతాఖానీ అని అర్థం. మరికొందరి ఉద్దేశం 'జాజ్' అనే పదం అమెరికాలోనే పుట్టి ఉండవచ్చునని, దక్షిణాదిన ఎవరో కార్మికుడు ఎప్పుడో ఒకనాడు ఈ సంగీతం (అప్పటికి ఈ పేరు లేదు) విని ఉత్సాహాతిశయంతో ఈ సంగీతం వల్ల జనించే ధ్వనికి అనువుగా 'జాజ్' అని అరిచాడని' అప్పటి నుంచి, ఈ సంగీతానికి ఆ పేరు స్థిరపడి పోయిందని వీరి ఊహ. ఏమైనప్పటికీ మొదటి ప్రపంచ యుద్ధాంతరం నాటికి ఈ 'జాజ్' అనే మాట అమెరికాలో వినిపించింది. అయితే దానిలో వర్ణక్రమం మాత్రం ఇప్పటికీ చాలారకాలుగా మారింది. మొదట "జే - ఏ - ఎస్"గా, ప్రారంభమై "జే,ఏ,ఎస్,ఎస్", "జే - ఎ - టి - జడ్" ఇట్లా చాలా అవతారాలు మార్చి చివరకు ఇప్పుడు "జే - ఏ - జడ్ - జడ్" అక్షరాల క్రమంతో "జాజ్"గా చలామణీ అవుతున్నది.

జాజ్ సంగీతంలో జనరంజకమైన లక్షణాలు చాలా ఉన్నవి. ఇది సజీవంగా ఉంటుంది. హాయిగా ఉంటుంది. మొండితేరినట్టుగాను ఉంటుంది. ఒకప్పుడు సనాతనులు దీనిపైన ధ్వజమెత్తారు. వారిధాటికి తట్టుకుని నిలిచింది. ఈ సంగీతం పద్ధతులు గానీ, ప్రయోజనం గానీ ఏమీ అర్థం చేసుకోలేని వారి దూషణ, తిరస్కారాలను భరించింది. జయించింది. చింకిరిచింకిరి గుడ్డల్లో పుట్టిన ముత్యాలవంటి బిడ్డలను పోలినది జాజ్. ప్రారంభంలో - కాదు - మొదట తనమీద అంతగా ధ్వజమెత్తి చీదరించుకొన్న వారిని క్రమక్రమేణా తన వైపుకు మరల్చుకోగలిగింది. 50 సంవత్సరాల నాడు జలక్రీడా మందిరాల వద్ద ఆ సరోవరాల అలల మధ్య మాత్రమే వినిపిస్తూ ఉండే ఈ జాజ్ ఈనాడు మెట్టని చోటు లేదు. ప్రాచీన సంగీత సమ్మేళనాలు జరిగిన ప్రఖ్యాత మందిరాలన్నిటిలోనూ నేడు జాజ్ కచేరీలు జరుగుతున్నవి.

జాజ్‌ను గురించి ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈ సంగీతం చాలా పరిణామానికి లోనయింది. ఈ సంగీతం ఫలానా రోజున ఫలానా ఊళ్ళో పుట్టిందని చెప్పటం కష్టమే గాని ఒక్క సంగతి మాత్రం చెప్పవచ్చు. అసలు ఈ సంగీతానికి మూలాలు నీగ్రో సంప్రదాయాల లోనూ వారిలో అప్పుడప్పుడు ఉదయిస్తూవచ్చిన చైతన్య రేఖలలోనూ చూడవచ్చును. సజీవమైన, సుగమమైన, లౌకికమైన, వాస్తవికమైన జానపద సంగీతం జాజ్ ప్రారంభమైందనవచ్చును. నీగ్రోజాతి ప్రజలు తమ వెతలను వెళ్ళబోసుకోటానికి, ఆధ్యాత్మికమార్గాన్ని అనుసరించారు. వాళ్ళలో ఉండి ఉండి ఎప్పుడో, ఎందుకో ఆనందం వెల్లివిరిసినప్పుడు ఆ సంతోషాతిశయం పొందిన రూపాంతరమే నాటి జాజ్ సంగీతం, మరి ఈనాడు ఇది అందరి సంగీతం అయింది. అనేక మెలికలు తిరిగింది. ఎంతో పురోగమించింది. కొత్త కొత్తరీతులు సంతరించుకొన్నది. ఇంకా సంతరించుకొంటున్నది. ఇంకా అభివృద్ధి చెందుతున్నది. అందువల్లనే తొలినాటి నిరాడంబరత్వం దానిలో నేడంతగా కనపడదు. దానికి

నిబంధనల సంబంధమైన బంధమేదీ లేకపోయినా కొన్ని కట్టుబాట్లు జాజ్ సంగీతంలో కుదురుకొన్నవి.

జాజ్ సంగీత లయరీతులు ఆఫ్రికన్ సంప్రదాయానికి చెందినవి. కాగా ఈ సంగీతంలో ఉండే మాధుర్యం, అందలి పొందిక వంటి లక్షణాలు విశ్వజనీనమైనట్టివి. పూర్వం - అంటే గ్రంథ విద్యాగంధం ఇంకా వెలవక పూర్వం ఆనాటి గాయకులు తమ పూర్వపు డప్పుల వాద్యంలో తమ స్తోత్ర గీతాలాపనలను త్రిపుట తాళయుక్తంగా ఉండే వరుసలను, బొహీమియన్ పోల్కా నృత్యాలను 19 శతాబ్దినాటికి క్వాడ్రిల్ అడుగునూ మేళవించి ఒక నవీన సంగీతాన్ని సృష్టించుకున్నారు. ఆ సంగీతమే నేటి జాజ్ సంగీతానికి పునాది అనవచ్చును.

జాజ్ సంగీతానికి ముందున్నది "బ్లూస్" సంగీతం. ఇది స్వచ్ఛమైన నీగ్రో సంగీతం. పాడటానికి చాలా తేలికగా ఉంటుంది. ఈ సంగీతం భావోద్రేక ప్రకటనమే లక్ష్యంగా కలిగినదయినందున మనోభావాలతోపాటు, సంగీత రీతి కూడా మారిపోతుంటుంది.

జాజ్ సంగీతం నిత్యనూతనంగా ఉంటుంది. కాలక్రమేణా కొన్ని కట్టుబాట్లు దీనిలో కుదుర్చుకొన్నప్పటికి ఈ లక్షణం మాత్రం అట్లానే ఉంటూ వచ్చింది. ఇది దీనికి ముఖ్య లక్షణం కూడాను. జాజ్ గాయకుణ్ణి అని చెప్పుకొనే వాడెవడూ కూడా మరొకణ్ణి అనుకరించడు. ఎవరికి వారు ఎప్పటికప్పుడు కొత్తబాణీలను అన్వేషిస్తూ ప్రవేశ పెడుతూనే ఉంటారు.



జాజ్ గాయని బిల్లీ హాలిడే

జాజ్ సంగీతంలో ఇటువంటి విశృంఖలత్వం వల్ల అప్పుడప్పుడూ కొంత చెడు జరిగిన మాట నిజమే. స్వేచ్ఛపేరిట కొంత చౌకబారు సరుకు ఇందులో ప్రవేశించిన మాటకూడా నిజమే. ఇది చాలా సకృత్తుగానే జరిగింది. ఎక్కువ సందర్భాలలో జాజ్ సంగీతంకు తమకుగల స్వాతంత్ర్యాన్ని సద్వినియోగమే చేసుకున్నారు. దానికి అర్హులమనిపించుకున్నారు. వారి సామర్థ్యం, వారి ఉపజ్ఞ 'జాజ్'ను సుసంపన్నమైన సంగీతంగా, మరింత ప్రజారంజకమైన కళగా చేయటానికి తోడ్పడినవి.

జాజ్ సంప్రదాయంలో నిబంధనల బంధాలు లేకపోవటం వల్లనే భారతీయుల లోనూ దీని కెంతోమంది భక్తులు, ప్రియులు లభించారు. భారతీయ సంప్రదాయంలో కూడా కళాకారుడికి వుండవలసిన స్వేచ్ఛకే ప్రాముఖ్యం ఉన్నది.

"జాజ్" అనేది విశాలమైనది. ఇందులో న్యూఆర్లియన్సు, డిక్సీలాండ్, రాగ్టయిమ్, బాప్, కూతజాజ్, ప్రోగ్రసివ్ జాజ్ అని అట్లా అనేక రకాలున్నవి. తరచు ఈ సంగీతపు స్వింగ్, "పాపులర్" గీతాల చేరువకు కూడా విస్తరిస్తుంటుంది. ఈ విభిన్న రీతులు జాజ్‌ను మరింత సుసంపన్నం చేయటానికి తోడ్పడినవి. వీటిలో కొన్ని కొంతవరకే తోడ్పడి ఉండవచ్చు. మరికొన్ని ఎక్కువగా ఉపయోగపడి ఉండవచ్చు. మొత్తం మీద ఇవన్నీ కలిసి జాజ్ సంగీతాన్ని ఇప్పుడది ఉన్న బృహత్ రూపానికి తెచ్చినవి. ఒకనాడు జాజ్‌ను చీదరించుకోటంలో కొంత సబబుగా కూడా ఉండక పోలేదు. మరి ఈనాడు ఆ పరిస్థితి కనపడదు. కనపడటానికి అవకాశం లేదు. జాజ్ ఎంతో అభివృద్ధి చెందింది. రసికులైన వారికి నవ్యరసాస్వాదనావకాశం లభింపచేస్తున్నది. స్ట్రావిన్స్కి, హిండ్‌మిత్ వంటివారిని సైతం తన వశం చేసుకోగలిగింది. పురాతన అమెరికన్ ప్రజలు ఏనాడూ ఎరుగని, పొందిక, మన్నికగల సంగీతం జాజ్‌పరంగా లభించింది.

ఒకనాటి జాజ్‌గాయకుడు నిరక్షరకుక్షి. ఈనాటి "జాజీయుల" సంగతి అట్లాకాదు. ఎక్కడో ఒకరు తప్ప వీరిలో హెచ్చుమంది గ్రంథస్థ సంగీత సిద్ధాంతాలలో ఆరితేరినవారు. స్వర రచనలో ప్రసిద్ధులు. అటువంటి వారు ఏవైనా మామూలు సూత్రాలను ఉల్లంఘించడం జరిగిందంటే అది అజ్ఞానం వల్ల మాత్రం కాదు. కావాలనే కాదు అట్లా ఉల్లంఘించి ఉండాలి. కొత్త పుంతలు త్రొక్కటానికే అట్లా ఉల్లంఘించి ఉంటారు.

ఆధునిక "అభ్యుదయ" జాజ్ సంప్రదాయం 1940లో ఏర్పాటయింది. అప్పటివరకు మోటుపద్ధతికి అంటి పెట్టుకుని ఉండేవారు. అనంతరం చార్లీ పార్కర్, డిజ్జీగిలెస్పీ వంటి వారి చేతిలో ఇది కొత్తదారులు తొక్కింది. వుడీ హెర్మన్, స్టాన్‌కెంటన్‌లు ఇంకా దీనిని ముందుకు తీసుకుపోయారు.

దేవ్ బ్రూబెక్ ఇట్లా ప్రయోగాలు చేసిన వాళ్ళందరి భావాలు తీసుకొని వాటి అన్నిటిని సమన్వయపరిచి జాజ్‌కు ఒక కొత్త రూపం ఇచ్చాడు. దీనితో జాజ్ సంగీతం మరింత ప్రజానురంజకంగా తయారైంది. ఇప్పుడు జాజ్ భక్తులే గాక తదన్యులకు సైతం దాని రసానుభూతి సులభసాధ్యం అయింది. ఈ 'అభ్యుదయ'

జాజ్ సంగీతం పట్ల కూడా ప్రజలలో పలు విధాలైన భావాలు కలిగినవి. డిక్సీలాండ్ రకం సంగీత ప్రియులు, ఇంకా కొందరు సనాతన జాజీయులు ఇదేమీ బాగాలేదన్నారు. కాగా పూర్వం జాజ్ అంటే వట్టి చెత్త అని ఛీదరించుకునే వారు ఈ అభ్యుదయ జాజ్ రీతి విన్న తరువాత ఫరవాలేదు జాజ్‌లో కూడా వినదగింది ఉన్నదనుకొనే దాకా వచ్చారు.

జాజ్‌లాగా నిత్యనూతనంగా మారిపోతూ ఉంటే జాజ్ వంటి కళ భవిష్యత్తులో ఎట్లా ఉండబోతుందో చెప్పటం అసాధ్యమైన సంగతి. అయితే ఒకటి మాత్రం నిశ్చయం. జాజ్ సంగీతం బాగా కుదురుకొన్నది. ఇక మనుగడకై కాళ్లు త్రొక్కుకోవలసిన అవస్థ ఉండదు. ఆ దశ ఎప్పుడో దాటిపోయింది. జాజీయులు బిడియపడవలసిన స్థితి దాటిపోయింది. ఈనాడు అన్నిరకాల సంగీతాల లాగానే ఇదీ ఒక సంగీత కళ. దీనికి కొన్ని విశిష్ట లక్షణాలంటూ ఏర్పడినవి. దానికి ఒక కళాధిష్ఠాన దశ ఉన్నది. జాజ్ ఏనాడూ నిలవ నీరులాగా ఒకేచోట నిలిచి ఉండలేదు. అన్నిటికంటే కూడా మానవునిలో సహజంగా ఉండే సంగీత రసానుభూతికి కావలసిన మూల లక్షణాలు జాజ్‌లో ఉన్నవి. మిగతా ఎన్ని మార్పులు జరిగినా ఈ ముఖ్య లక్షణాలు మాత్రం మారలేదు. అందువల్లనే ఈనాడు జాజ్ సంగీతం నిత్యాధికమైన ఆసక్తిని సంగీత ప్రియులలో రేకెత్తిస్తున్నది.



స్త్రీ రమణీయం

# 'నై' తత్పురుష

ద్వితీయా తత్పురుష అలాగే తృతీయా, చతుర్థి, పంచమీ తత్పురుషలూ అవీ చాలా ఉన్నాయి వ్యాకరణంలో. తెలుగు పరీక్షలో సమాసాల విగ్రహాల గొడవ వచ్చినప్పుడు ఇదీ, ఇంకా విభక్తి ప్రత్యయాలూ కంఠతా వస్తే కాని మార్కులు పడవు.

అయితే మన నిత్యజీవితంలో ఇవన్నీ ఎలా ఉన్నా 'నై' తత్పురుష గురించిన మంచి చెడ్డలు, దాన్ని ఉపయోగించే పద్ధతులు కొంత బాగా తెలిస్తే కొన్ని మంచి మార్కులు వస్తాయని నా అభిప్రాయం.

జీవితంలో మంచి మార్కులు వస్తే అందరూ మనతో మంచిగా ఉంటారు. అందరమూ సంతోషముగా ఉంటాము. ఎవరితోనూ ఎవరికీ తగాయిదాలు ఉండవు.

ఈ నైతత్పురుష అంటే ఏమిటి?

వ్యాకరణంలో నఞ్ తత్పురుషకీ జీవితములో నైతత్పురుషకి దగ్గిర సంబంధం ఉంది. నఞ్ తత్పురుష అంటే ముందర నెగేషన్ ఉన్నమాట అన్నమాట. అధర్మము (ధర్మము కానిది), అసత్యము (సత్యము కానిది) ఇలాంటివి. కాదు లేదు అని అర్థం ఇచ్చే అక్షరాలు వీటికి ముందర ఉంటాయి.

ఈరోజులలో చాలామంది (నామటుకు నేను, మీ మటుకు మీరు, మన తరవాత మనకి కావలసిన వాళ్లు మినహాయించి) ఈ నఞ్ తత్పురుషని (అధర్మం, అసత్యం) శ్రద్ధాభక్తులతో గురితప్పకుండా అవలంబిస్తున్నారు. శిరసావహిస్తున్నారు. కాని మనం ఎవరితోనన్నా, నువ్వు అబద్ధం ఆడుతున్నావు అంటే వెంటనే 'నై' తత్పురుషని ఉపయోగిస్తూ జవాబు ఇస్తారు. అంటే "ఛీ లేదుపో, అది అబద్ధం కాదుపో" అని అనడం అన్నమాట.

ఎదుటివాళ్లు మన మనస్సు నొచ్చుకుంటుందేమో అని ఆలోచించకుండా, నిజము గట్టిగా తెలుసుకొనకుండా "నువ్వు అబద్ధం ఆడుతున్నావు" అని కాస్త మొరటుగా మన మీద నఞ్ తత్పురుష విసురుతారు అనుకోండి. అప్పుడు మనకి సహజముగానే కోపము వచ్చివేస్తుంది. "లేదుఫో" అని మనంకూడా మొరటుగానే ఇంకో 'నై' తత్పురుషతో జవాబు విసురుతాముగదా.

చివరికి జరిగేది ఏమిటంటే, నువ్వంటే నువ్వు అని ఏకవచన సంబోధనముతో కూడిన మాట్లాట.

అలాగ కాకుండా ఇద్దరిలో ఏ ఒక్కరో నైతత్పురుషని జాగర్తగా ఉపయోగించిన పక్షంలో పోట్లాటలూ మాట్లాటలూ జరగవు అని నా అభిప్రాయం.

అసలు నా ఇంకో అభిప్రాయం ఏమిటీ అంటే, ఈ నఞ్ తత్పురుషను - అధర్మం, అన్యాయం, అబద్ధం లాంటి మాటలను, సాధ్యము అయినంతవరకూ ఎవళ్లమీదా విసరకూడదు అని చెప్తాను.

ఉదాహరణ చూడండి:

"మీరు చేస్తున్న పని పూర్తిగా అన్యాయం".

అందులో నఞ్ తత్పురుషని అలా ముడిసరుకుగా వాడకుండానే మన అభిప్రాయం చెప్పవచ్చును.

"మీరు కూడా కొంచెం న్యాయం ఆలోచించండి. మీకు తెలీందేముంది?" అనవచ్చు.

ఇంకొకటి "నువ్వు చెప్పేది పచ్చి అబద్ధం."

ఇందులో ఈ 'నఞ్' తత్పురుష తీసేసి 'నై' తత్పురుషని వాడితే కొంత మెరుగు.

"నువ్వు నాతో మనసు విప్పి అసలు సంగతి చెప్పు. నాకు తోచిన మాట నిజంగా చెప్పాలంటే, నువు నాదగ్గిర నిజం దాస్తున్నావు అనిపిస్తోంది."

లేదా "నువ్వు నిజం చెప్పటం లేదుకదూ?" అనొచ్చు.

ఇంక మనం మరీ తరచుగా వాడే "నై" తత్పురుష. అంటే "లేదు" అనేమాట.

అసలు ఈ మాటని వాడడమే మంచిదికాదు అని నా అభిప్రాయం.

నేనే అనికాదు. అది మన పెద్దవారి పద్ధతి. రాయని భాస్కరుని గురించిన పద్యములలో "లా" కేత్వమివ్వనేరడు, దాకును కొమ్మివ్వ"దని ఉంది. అంటే 'లే-దు' అనే రెండు అక్షరాలు కలిపి ఆయన ఎప్పుడూ మాటాడలేదు అన్నమాట.

అలాగే మన పెద్దలు చెప్పే మరొక మంచిమాట నోటితో లేదనే బదులు చేత్తో లేదను అనేది మన అందరమూ ఎరిగినదేకాని, దానిని అవసరం వచ్చినప్పుడు (పత్రికలకి వ్యాసాలు రాసినప్పుడు, మీటింగ్స్‌లో లెక్చరులు ఇచ్చినప్పుడూ మినహాయించి) మనలో చాలామంది శిరసావహించటము లేదు అని నా అభిప్రాయము.

చేతిలో లేదనడం అంటే ఎవరైనా భిక్షమే కాదు, ఏ చిన్న ఉపకారమునైనా కోరిన సమయంలో, వాళ్లమాట పూర్తికాకుండానే కొంపమునిగినంత తొందరగా 'లేదు' అని పుసుక్కున అనెయ్యకూడదూ అని.

మనకు చేతనైనంత సహాయం చేస్తే ఎదుటివాళ్లు సంతోషిస్తారు గదా. అప్పుడు - 'నేను చేయగలిగిన సాయం ఇది' అని అనవచ్చును. అప్పుడు కూడా 'నేనింతకన్న ఏం చెయ్యలేను' అనడం మంచిదికాదు.

అందుచేత ఎప్పుడు మనము - ముఖ్యంగా ఆడపిల్లలము-(మొగవాళ్ళకి మనం చెప్పినా వినరుగా. వాళ్లు గొప్పవాళ్లు(ట) ఈ 'నై' తత్పురుష శబ్దాలు "లేదు,

కాదు, యివ్వను, చెయ్యను" అనేలాటి మాటల్ని సాధ్యమైనంతవరకు వాడుకోకుండా వుండాలి. తప్పనిసరి అయినపుడు వాడినా జాగ్రత్తగా, సుతిమెత్తగా, ఎదుటివాళ్ళని నొప్పించకుండా ఉపయోగించాలి అని నా అభిప్రాయం.

నేనిలా మినిస్టర్లలాగా మాట్లాడుతూ ఉండడం చూచి "అజ్ఞానం" అనే నఞ్ తత్పురుష మాటని, తొందరపాటుగా, పెంకెగా అందరిమీదా విసురుతున్నాను - అని అనుకోవద్దు. మనం ఈ విషయాలనే మళ్లీ ఒకసారి జ్ఞాపకము చేసుకొని ఇంకొంచెం శ్రద్ధగా ఆలోచించడం మంచిది అనే అభిప్రాయం తోటే.

సి.వి. విజయలక్ష్మి పేరుతో వ్రాసిన స్త్రీల వ్యాకరణం
ఆంధ్రపత్రిక వీక్లీ (23-1-57)




ఏదో వినయంకొద్దీ శ్రావణమాసం తన గురించి అలా చెప్పుకుంటుంది తప్ప అదీ శనగల మాసమే కాదు నగలమాసం కూడా. పెళ్లీడు పిల్లలకూ ముఖ్యంగా కొత్త పెళ్ళికూతుళ్ళకూ శ్రావణంలో తొలి శనగల వాయనం ఇచ్చి పుచ్చుకునే వేళకు నగల వాయనం ముట్టి ఉండడం రివాజు. వరలక్ష్మీవ్రతం వేళకు శ్రావణపట్టీ అందకపోతే పూజ, పిల్లదాని మొహం కూడా వెలాతెలాపోతాయి. ఇల్లాళ్ళకైనా అంతే. తాకట్లలోపడి విలవిల తన్నుకుంటూ, తన్ను కొన్న తల్లి కోసం తహతహలాడిపోతున్న నగకట్లకు మొగాడు ఏదో ఉపాయానా – తలతాకట్టు పెట్టయినా ఆ కట్లు విప్పి తెచ్చి నట్టింట ఉంచి తీరుతాడు. ఒకవేళ అదే ఖరీదైనదైతే, కొత్తదే చేయించి పారేస్తాడు. ఏడాది పొడుగునా గునుపుల చాటునా, గొణుగుళ్ళ మాటునా, చీహోఁ దోహోఁ కుట్టగా కంట తిరిగే కన్నీళ్ళ పక్కనా నక్కి నక్కి ఉంటూ అడపా తడపా చివాట్లు ఎదురయేవరకూ వెనక్కితగ్గుతూ, మళ్ళీ ముందుకు మొగ్గుతూ పడగ్గదిలోంచి పక్క గడిలోకి, పుట్టినింటి నుంచి మెట్టినింటికీ పప్పన్నాలమీదుగా నడుచుకుంటూవచ్చిన సూచనలూ, కోరికలూ పంతాలూ ఆషాఢం వచ్చేసరికి శరచ్చంద్రికలో నీడలలా స్పష్టం ఆయిపోతాయి. ఆరోక్తులు పూర్ణోక్తులవుతాయి. తాఖీదులూ శ్రీముఖాలు అవుతాయి.

తీరా ఆ నగానట్రా వచ్చి ఆమె దరిచేరే వరకూ, ఆనందంతో అందగించిన ఆమె వదనం ముందు నగకట్టు కాంతి మందగించి సూర్యుడి ముందు దివిటీలా తీసికట్టే అవుతుంది. తాబట్టిన పంతం తలచుకునే వరకు ఒళ్ళు ఝల్లుమని, చెంపలలో వెలిగించుకున్న కెంపుల వెలుగులో, జిగినీ నానులోని దానిమ్మగింజల్లాటి కెంపులు తెల్లబోయి చిన్న బుచ్చుకుంటాయి. మమ్మల్నెందుకు పిలవటం అని. చెవుల నాశ్రయించిన బావళీ బొగడల కవలు కూడా ఇటువేపు రాకుండా అటు నల్లని కురుల వేపే తమ ప్రతాపాన్ని వెలిగిస్తూ ఉంటాయి. మెడలో మంచి ముత్యాలపట్టెడ,

తనను మించి ముత్యాలవంటి పలు వరుసమీద తెలినవ్వు కాంతులు చూసి, తను దానికి ఉపమానమో ఉపమేయమో తెలీక మరింత తెల్లబోతుంది. చక్కని నాసిక దాని అందచందాలను, ఎడా పెడా నిలబడి తెరిపి లేకుండా పొగిడేస్తున్న 'కలువల జంట వాగ్ధాటితో పోటీచెయ్యలేక బేసరముక్కెఱా 'అపండితులకు మౌనమేభూషణమన్న ముక్కను గుర్తుచేసుకు తగ్గిపోతాయి. ఆమెను సేవించి అందాన్ని ఇనుమడించి వచ్చిన ఇతర ఆభరణాలన్నీ కూడా, స్వార్థభక్తి ఎంత ఉన్నా, అవకాశం లేక మంచి ముహూర్తానికి ఎదురుచూస్తూ ఊరుకుంటాయి. వెయ్యి వరహాలు పోసి తెచ్చి ఈ పసిడిమిసిమి ఇల్లాలిమిసిమికి ఇలా ఈ చోపమానంలానీ కనబడదంతో కొన్నవారికి అనుమానం కలుగుతుంది. మజూరీ బేరం ఆడినందుకు సాలెవాడు కల్తీ బంగారం అంటగట్టలేదు గదా అని. అయితే కొంతసేపటికి ఆనందాతిశయం స్థిమితమైన తరువాత వీటన్నిటికీ యథాశక్తి తమ ప్రతాపాలు చూపే అవకాశం ప్రోత్సాహం లభిస్తూనే ఉంటాయని వాటిని తాత్కాలికంగా భరించి, తరువాత ధరించబోయే అమ్మడికి తెలుసు. అమ్మాయి పట్టుబట్టకపోతే, అతగాడు అనర్గళంగా కవిత్వం చెప్పి ఆమెకు నగలు తొడగడం, కొంచెం దగ్గిరకువెళ్ళి 'ఏనుగంత ఉన్నావు గిరిరాజా, అని చెప్పినట్టవుతుందని అంటాడు.

పచ్చని దోసపండువంటి ఆమె ముఖం కాంతిని ఉద్ఘోషించడానికి, చుట్టూరాఉన్న వేణి వాణిని మించింది లేదంటాడు. కర్ణయుగళి శ్రీకారాకారాన్ని కీర్తించడం కూడా ఆ నల్లనిజుట్టుకు మహాకావ్యంలో ఉపాఖ్యానం చెప్పడమేనని వివరిస్తాడు. ముత్యాలసరం ఆమె అరుణాధరాన్ని అనుకుని ఉందని హెచ్చరిక చెబుతాడు. పుష్యరాగాలూ గోమేధికాలూ ఆమె చెంపలలోనే ఉన్నాయని అనురాగ మనురాగోదయాన్ని సదారామంగా శాశ్వతంగా చిత్రిస్తున్నానంటాడు.

ఇంద్రనీలాలు ఆమెకళ్ళలో లేవని అనుమానం కలిగితే తన కళ్ళలో ప్రతిబింబం చూసుకోమని సూచిస్తాడు. ఆమె మంగళ గళసీమగురించి మాట్లాడేందుకు నల్లటినల్ల పూసలకుత్తికంటికి, నక్షత్రాలవంటి నఖాలకూ తప్ప మరిదేనికీ అధికారం లేదంటాడు. ముప్పేటగొలుసులు, కాసులపేర్లూ మొదలైన ఆభరణాలను ఆమె భర్మప్రభ ముందుంచి అవమానించవద్దని హితవు చెబుతాడు. ఆమె నడుము కేవలం భ్రాంతి మాత్రమే కాబట్టి వడ్డాణాలు తనుమధ్యాభరణాలుకావనీ కేవలం మిథ్యాభరణాలనీ విశదంచేస్తాడు. ఇలా వింటూ ఉంటే, లజ్జే ఆభరణమనీ శీలమేభూషణమని ఇంకా అలా చెప్పుకుపోతునే ఉంటాడు కాబట్టే, నమ్మరాదే చెలీ అన్నారు.

ఆకాశానికి నక్షత్రాలందం. ఆడదానికి నగలందం. ఎంత బంగారపుప్పళ్ళానికైనా గోడచేర్పు తప్పదన్నారు. ఎంత సౌందర్యరాశికైనా ఉపమానాలకు అభరణాలు తప్పవు. అందగత్తెలు కానివారికి అవే ఉపమేయాలై యథాశక్తిని ఆదుకుంటాయి.

నగలులేని మెడ నవ్వులేని ముఖంలాగ పువ్వుల్లేని కొమ్మలాగ, పిల్లలులేని ఇల్లులా, పూజలేని దేవుడులా, ఉపమానంలేని కావ్యంలా, రసహీనమైన వాక్యంలా, ఈవిలేని సంపదలా, జనంలేని సభలా, అట్టలేని పుస్తకంలా....

అందం సంగతి ఎలా ఉన్నా ఆనందం ఉంది. ఆనందమే మహాభాగ్యం అయినా, ఒక్కొక్కసారి మహాభాగ్యమే ఆనందం అనిపిస్తుంది. ఉండంవల్ల ఏనాటికైనా ఏనాటనైనా, ఏనాతికైనా ఆభరణాలమీద ఎడతెగని మోజు రివాజు. నాగరికత అనేది ఏర్పాటుకావడానికి ముందర్నుంచి నగలున్నాయి. కాలచక్రంలో ఆకు ఆకునా అన్నిటితోపాటు సర్దుకున్న నగల రూపురేఖలు చరిత్రలాగే పునఃపునరావృతం అవుతూనే ఉంటాయి. ఒకనాటి మోటునగలే ఈనాడు కాస్త నాజూకై నాగరీకం నేర్చుకొంటున్నాయి.

ఇతర దేశాల జాతులమాట ఎలా ఉన్నా, మన కథలో కథారంభంనుండీ నగలు ఉన్నాయి. మహావిష్ణువు తాను ధరించే శంఖచక్ర గదాదులు ఆయుధాలుగా కన్న ఆభరణాలుగానే వాడుకుంటున్నట్టు కనిపిస్తాడు. బ్రహ్మకు, వేదాలు భూషణాలు అని తెలిసినా, నగానట్రా అంటే బొత్తిగా గిట్టదనేందుకు దాఖలాలు లేవు. పరమశివుడు ఫణిభూషణుడు. ఫణి, మణిభూషణుడు. బూడిద పూసుకున్నా ఆయన ఉండేది వెండికొండ. ఈ విధంగా నగరాజసుతా, నగలూ కూడబలుక్కుని 'మూడో కంటివాడి'కి తెలీకుండా ఈ ఏర్పాటుచేసి ఉండాలి. అయినా ఆడదానిమాట కూడదనడం కూడదని, ఇదంతా తెలిసినా తెలియనట్టు తిరుగుతాడాయన. చిల్లరదేవుళ్ళ సంగతి చెప్పనక్కరలేదు. ఏడువారాల నగకట్టు లేనివాళ్లు అరుదు. పంచభూతాలలోను భూదేవి నగకట్టు సంగతి, ఏ సౌందర్యపిపాసి అయినా చెప్పగలడు. కవులు, చిత్రకారులూ యుగయుగాలుగా చెప్పుకుపోతున్నా తరగని గని అది. సముద్రుడు గంభీరుడు. ఉన్నవన్నీ కడుపులోదాచుకుని ఊహ ఉప్పొంగిపోతూ ఉంటాడు. కంటికి కనపడనిగాలి, చల్లదనాన్ని పరిమళాన్ని ధరిస్తుంది. ఆకాశం సూర్యచంద్రుల్నీ నక్షత్రాలనూ అలంకరించుకుంటుంది. నిజానికి ఆభరణం పెట్టుకోనివాడేలేడు. ఉన్నవాళ్లు ఉన్నవి పెట్టుకుంటే, లేనివాడు లేమినే చిరునగవుతో కలిపి నగగా ధరిస్తాడు. బీదవాడికి స్వేదబిందువులంతటి నగలు ఎక్కడ దొరుకుతాయి?

భూమ్మీద మనిషి పద్దప్పటినుంచి, తెలిసో తెలియకో ఏదో ఒక నగపెట్టుకుంటూనే ఉన్నాడు. కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ, పువ్వులూ, కొమ్ములూ, దంతాలూ వగైరాలన్నీ అంగాంగాలకీ అలంకరించుకోవడం నేర్చుకున్నాడు. తీరిక వేళలు ఎక్కువ కావడంతో మొగాడు వేటకెళ్ళినపుడల్లా ఆడది ఆభరణాలమీద శ్రద్ధ ఎక్కువచేసి వాటిమీద మోజు రోజు రోజుకూ పెంచుకుంది.

కొన్నాళ్లకి కనకం కనబడి విలువ పెరిగే వరకూ, కాంతకి కూడా విలువ పెరిగింది. ఆ యిద్దరూ కలిసి ఆడిన రామాయణ భారత భాగవతాలూ కట్టిన చరిత్రా ఇంతా అంతా కాదు. అది కరగని కథ. సీతామ్మవారు వనవాసానికి నారచీర

కట్టుకువెళ్లినా అందెలూ, చూడామణివంటి కనీసాభరణాలు పెట్టుకు వెళ్లడంవల్లనే, ఆమె ఉనికి, మనకీ రాముడికీ సుళువుగా తెలిశాయి.

కాంతా కనకాలతో నాగరికుల కథ ముందుకు సాగినా, నాగరికతతో కలిసి సాగకుండా వనసీమలలోనే ఉండే వనితలకు ఆభరణాలు మటుకు అట్టే మారలేదు. వారీనాటికీ, చేతినిండా కడియాలూ, మెడనిండాదండలూ, దండలనిండా దండలూ, చెవులనిండా, ముక్కు మొయ్యా తలమునుగా ఆభరణాలూ భరిస్తునే వున్నారు.



ఆ నగల నగాలమీద, ఆరోగ్యవంతాలయిన వారి చిరునవ్వు మొగాలు తారలమధ్య చంద్రబింబంలా ప్రకాశిస్తూనే ఉన్నాయి. అన్ని నగలను నిభాయించుకు మరీ ప్రకాశించే సత్తా వారి అందంలో ఉంది. ఆరోగ్యం తక్కువై, మనుషులే ఒంటిపేట గొలుసులా నాజూగ్గా తయారయే రోజులు రావడంతో నగల పరిమాణాలూ, సంఖ్యా కూడా చిక్కిసగాలై శల్యాలై పోయాయి. అయితే మన పల్లెపట్టులు మటుకు నేటికీ ఆనాటి మోటు నగలకు ఆటపట్టులనే కొందరికి అనిపిసాయి.

## పట్టెడలు

కలవారి ఆడపడుచు ధరించగల నగల వైనాలు ఈనాడు చిత్రంగా తోచవచ్చు.

కంఠసీమను ఆశ్రయించుకు వెలిగే నగలూ బంగారం బిళ్ళలు అమర్చి పట్టుదారం పోసి, కంఠాన్ని ప్రియుడు హస్తాలలో ఆలింగనం చేసుకునే కంఠం పువ్వుపట్టెడని నువ్వా నేనా అన్నట్లు మెరుస్తూ ఉంటుంది. మంచి ముత్యాల పట్టెడకూడా ఈ కోవలోదే. ఈ మధ్యనే ఇది బెంటెక్ ముత్యాల నెక్లెస్‌గా మారువేషం వేసుకుని మళ్ళీ వచ్చి ఫాషనైంది. కంఠపువ్వు పట్టెడకే ఐదేసి మువ్వలవరుస కడితే గజ్జెలపట్టెడ అవుతుంది సహజంగా. అన్ని గజ్జెలమోత భరించలేనివాళ్లు ఒంటిమువ్వ పట్టెడ కట్టించుకునేవారు. (అప్పుడూ ఉన్నారు సుకుమారులు). అయిదారు కాసులనుంచి పదికాసులదాకా ఉండే ఈ పట్టెడకిందనే నవారుపట్టెలాటి ఇంకో పట్టెడవేసి దాని మధ్య ఒక మొహరు అమర్చి 'నాను'. అనే పేరు వంకతో ఇంకా చేయించుకునేవారు కొందరు గోరువంకలు.

## పేరపేర్లు

ఏడువారాల నగలూ ఉన్నవారు పట్టెడ ఓనాడు వేసుకుంటే, మర్నాడు మిరియాల పేరు వేసుకుంటారు. దగ్గర దగ్గరగా పట్టుదారంతో పటకాలా అమర్చిపోసే అయిదు పేటల మిరియాల పేరు వేసుకున్న కంఠాన్ని చూశాకనే, దాని శంఖం అనే ఉపమానం చెప్పా రెవరో. ఇలా ఉపమానం గుర్తురాని వారికోసం అని ఒక్కోసారి శంఖాలతావళం మర్నాడు పగడాల తావళం వేసుకోవడం కద్దు. మిరియాల పేరులాగే, గుల్ల లేని గుళ్ళ పేరులూ ఉండేవి. వీటిని వైశ్యులు విశేషంగా వేసుకొనేవారు.

కాసులపేరు సరేసరి. తాహతులేని వారు 80 కాసులతో సర్దుకునేవారు. ఇనప్పెట్లో చాలా తాహతు మిగిలి ఉన్నవాళ్లు చిక్కగా వొత్తుగా కాసులు పేర్చి పట్టుదారంగట్టి చాలదని బంగారుతాడుకు వాటిని పోయించి కట్టించేవారు. దీన్ని కట్లకాసులపేరు అని మన్నించుకున్నారు.

పట్టెడకింద ఒకరోజు నాను వేస్తే జిగినీనాను మర్నాడు రాణిస్తుంది. పుదుచ్చేరి వీటికి పేరుమోసింది. మనదేశంలో కూడా ఒక చిన్నవాడు. ఇలాగే తనపెళ్లాం ఈనాను వేసుకోగా చూసి, ఎవరో అనుకొని 'అరే ఈ పిల్లని పెళ్లాడి ఉండాల్సిందని అని నాలిక్కరచుకోగా హౌరా ఏం ఈకాలప్పిల్లలూ ఆవటాని ఆ కాలపు నానమ్మ ముక్కున వేలువేసుకు విస్తుబోయిందిష. జిగినీ నాను చిక్కటి గొలుసు అల్లిక మధ్యన చారెడు పతకం ఉండి, అందు ఎర్రపొళ్ళు, పండుదానిమ్మగింజల్లా జిగేల్ జిగేల్ మని మెరుస్తు ఉంటాయి.

కంఠాభరణాల కోవలోనే ఆర్భాటం లేకుండా వచ్చి నిలబడింది కంటె. కొందరికంటి కింపయితే కొందరికి కంటగింపు అయేది. గోపాలకులు దీన్నే తమ అలంకారాలలోకి అనువాదం చేసుకుని అడ్డిగ అని పిలుచుకున్నారు.

కంఠ హారాలు, గొలుసులు పేరుపేరునా వుండి, చంద్రహారాలూ వరహాల పేర్లూ, కాసులపేరూ బిళ్లలు బిళ్లలుగా ఉండేవి. వరహాలమీద కృష్ణుడిబొమ్మలు

వేసేవారు. అలాగే పలక సరులు, గోవర్ధన గొలుసులూ, అటుకుల పేర్లు (అటుకులంతా అలాగే ఉంటాయి) ధాన్యమాలాను, తూర్పున, ఓడ్రదేశం నుంచి వచ్చిన సారిసెమాల (ఆవాలు) ఉంటాయి. దశావతారాల దండ ఒకటి గొప్ప విశేషం.

ఈ హారాలన్నింటిమధ్య నల్లగా మిలమిల మెరుస్తూ కుత్తికంటి ఉండేది. ఇది మంగళ చిహ్నం. రెండు పేటల నల్లపూసలు (ఒకే పరిమాణానివి) పోసి మధ్యన బంగారు పాలకాయ, దానికి ఎడాపెడా రెండు పలకసరుకులు అమర్చేవారు. మాంగల్యం ఇంటి ఆనవాయితీని బట్టి కులాచారాలను బట్టి ఉండేది. కమ్మవారింటి పడుచుకు రెండేసి కాసులు పుస్తెలు చేయిస్తారు. సొట్టలు పోకుండా లక్క దన్ను పెట్టి వెండిరేకు కడతారు. బ్రాహ్మల ఇళ్లయితే ఆనవాయితీని బట్టి నూటొక్క వీసంతో పోయిస్తారు. కొన్నిళ్లలో కాసు బంగారం. పుస్తెల రూపం ఫలానా విధంగా ఉండడంలో తాత్పర్యం, వాటి పవిత్రత అందరికీ తెలుసు. కాంచన కుంభార్ధాల్లా ఉండే వాటి మధ్యన ఎర్రటిపొడి అమర్చి అలంకరిస్తారు. నాయుళ్ళ యిళ్ళ, పుస్తెలు మంగళకరమైన మావిడాకుల మోస్తరుగా చేయిస్తారు.

## కర్ణాభరణాలు

మహాభారతీయులలో కవచకుండలాలతోనే పుట్టిన మహాపురుషుడు కర్ణుడు. అవి ఆయన వంటినంటిపెట్టుకున్నంత కాలమూ కీడు మూడరాదని సూర్యుడి వరం. (ఆభరణాలు అందాన్ని కాక, ఆరోగ్యాన్నిస్తాయనీ, దుష్టగ్రహాలను దుష్టశక్తులను దూరంగా ఉంచుతాయనీ మనలో సర్వత్రా ఒక నమ్మకం.) చివరకి ఇంద్రుడు వచ్చి దానం అడిగిన రోజున, కర్ణుడు యావజ్జీవితం మాత్రమే ఉండే ఆ ఆభరణాలను వలిచి ఇచ్చి, మహాదాత అనే మహదాభరణాన్ని - శాశ్వతమైనదాన్ని తీసుకుని అలంకరించుకున్నాడు. ఇంతకీ కర్ణునికీ కర్ణాభరణాలకీ శబ్దంవల్ల తప్ప మరోవిధంగా బంధం లేదు.

చెవులకు పూర్వం నగలకోసం అని విస్తరంట్లు కుట్టినట్టు కుట్టేసేవారు. చెవి పైభాగాన ఆరంభమై అంచువెంటనే కిందకి దిగేవి ఈ నగలు. పైన బొగడలు మెత్తగా మెరిసేవి. ఒక బంగారుతీగకి ముత్యంగుచ్చితే బొగడ. దానిపక్కనే ఉట్లబావిళీలు పచ్చగా ధగధగలాడేవి. ఆ క్రింద పచ్చబావిళీలు మిలమిలలాడేవి. వాటికి దిగువన కర్ణబావిళీలూ, తాలూకాలూను. 'తాలూకా'లో మూడేసి ముత్యాలు నిలుస్తాయి. ఈ వరసకి ఎదురువేపు గూబపక్క ఒక చిన్న చర్మఖండం ఉంది గదా. దానికీ ఓ ముత్యం పెట్టేవారు.

తాలూకాల బదులు ఒకోసారి జూకాలు వాడేవారు. లేదా ఐదురాళ్ళ దుద్దులు. పిల్లలయితే లోలాకులు (ఇవి ఇటీవల వచ్చాయి). దుద్దులలోనే రకరకాల విలువైన రాళ్ళు పొదిగేవారు - రవ్వలు, పుష్యరాగాలూ, కెంపులూ మొదలైనవి. 'ధనికులా'నికి

చెందనివాళ్లు రేకులు అయినా సరే తమ్మలు చేయించేసుకునేవారు చెవి బోసిపోకుండా. బంగారు రేకుమీద పువ్వు నగిషీ చెక్కడమే కాబట్టి ఇవి టూకీగా తేలిపోయేవి.

బావులీల వరసమీద దాదాపు ఐమూలగా చెంపసరాలు వెలిగేవి. ఈ సరాలమీద విలువైనపొళ్ళు, అలాకాపోతే ముత్యాలూ అమర్చేవారు. తమ్మెట దగ్గర్నించి చెవి మీదుగాపోయి, చెంపలమీద కురులలోని ఒకపాయలో కలిసిపోతాయి ఇవి.

జుట్టుమీద బోలెడంత నగకట్టు. పాపిడ మీదుగా ఫాలభాగానికివచ్చి ధగధగలాడే పతకాన్ని; తిలకానికిపైన అలకల మధ్య పట్టుకు నిలబడుతాయి పాపిట బింద్రీలు. దీనికి ఈ చివరనుంచి మళ్ళీ నుదురుమీద జుట్టు అంచువెంబడే ఏడాపెడా రెండు పాయలుపోయి చెవులవెనక సిగపాయలోకి అదృశ్యమవుతాయి.

తాళువ దగ్గిర పాపిడకు అటూఇటూ వందిమాగధులలా నిలిచి కైవారాలు చెప్పేవే సూర్యచంద్రులు. చంద్రుదు చంద్రరేఖలా ఉంటాదు. తాహతు కొద్దీ వజ్రవైదూర్యాలుంటాయి వీటిలో. పాపిటచివర జుట్టు నీలజలపాతంలా వెనుకకుదిగే మళుపుదగ్గిర రాగిడీ ధగధగమెరుస్తూ కళ్లు మిరుమిట్లు గొలుపుతూ ఉంటుంది. చారెడు బంగారం బిళ్లా దానిమీద చక్కని మోస్తరులో తాపడంచేసిన కెంపులూ (లేక రవ్వలు) ఇదీ నల్లటి జుట్టుమీద నిలబడి నీలాకాశంలో నిండు చంద్రుడిలా ప్రకాశిస్తుంది. రాగిడీకి దిగువన, జడ కుదురునుంచి నాలుగుపాయలు అల్లుకుపోయాక అక్కడ చామంతిపువ్వు పెడతారు. ఇది ముద్దబంగారమూ కావచ్చు, రాళ్లు పొదిగినదీ కావచ్చు. మరలా ఉండి జుట్టులోకి తిప్పితిప్పి పట్టించే ఏర్పాటు ఉందని లోకువచేసి, కొందరు దీన్ని తిరుగుడు పువ్వన్నారు.

ఈ హంగులు లేకుండా మామూలుగా ఉండదలచుకున్నపుడు సుబ్బరంగా బిగూతుగా జడేసుకుని, జడగంటలు పెట్టుకుని జడకుదురులోను (ఇష్టాన్ని బట్టి) మధ్యనా నాగరం పెట్టేసుకుంటే ఆడపిల్ల నట్టింటి మాలక్ష్మిలా ఉంటుంది. నాగరాలుకొన్ని గుండ్రంగా దవ్వబిళ్లల్లా ఉంటాయి. చివర నగిషీ పెట్టి మధ్యరాళ్లు తాపడం చేస్తారు. కొన్ని అవి పెట్టుకునే అమ్మాయిలాగే కేవలం ముద్దబంగారం అందుమీద చిన్ని కృష్ణమ్మ బొమ్మ అచ్చువేస్తారు. సిగ చుట్టుకున్నప్పుడు సిగ మధ్య ఈ నాగారం పెట్టుకుంటే, చెవుల దగ్గిరనించి కొప్పు మీదుగా షికారుపోయే కొప్పుగొలుసులు వేసుకుంటే చూట్టానికి రెండు కళ్లు చాలవు. కునికిపాట్లుపడే ఏ నాయనమ్మ చత్వారపు కళ్లనేనా ఎరువడగాలనిపిస్తుంది. నాగరం బదులు, అక్కడ పొళ్ల తిరుగుడు పువ్వు పెట్టుకున్నా ఇంత పనీ జరుగుతుంది.

ఉత్తమాంగంలో ఉత్తమాంగం ఇంకోటి ఉండిపోయింది. అదే కళ్లకి, పెదిమకీ, చెంపకీ సరిహద్దులు చెప్పి అందమిచ్చి, అందగించే నాసిక. దీనికి నువ్వు పువ్వులా కనపడి ఎదటివాళ్లని వెర్రెత్తించే గుణం ఉంది. భృకుటినుంచి దిగుతూ

దిగుతూ అదంగి చేరేవరకూ హఠాత్తుగా గర్వం కలిగి పొగరుగా చిట్టచివార కొనదిరిగే సామర్థ్యం ఉంది. ఈ ముక్కుకే దాని ఆకారాహంకారాలనుబట్టి, ముక్కు ముక్కుకి వినయం నేర్పడానికీ, కాస్త మేదకురాలిలో చురుకుపాలు పెంచడానికీ నగలుచేశారు. ఒంటిపొడి ముక్కుపుడకల జంట ఇలాటిదే. ఈ పెద ఎర్రపొడి పుడకా, ఆ పెద తెల్లపొడి పుడకాను, ముగ్ధకు ముత్యం బాగా నప్పుతుందని, అడ్డబాస పుట్టింది. ముక్కుగోడ మధ్య తీగరింగు, ఆ తీగకి ముత్యం తొడిగే ముందు ఒక ఎర్రపొడి, ఆనక చక్కని మెత్తని మంచిముత్యం అది జారకుండా పచ్చని బంగారు పూసాను, బేసరి, చంద్రవంకలా ఒక పక్కన అమరుతుంది. కనిపించె వంకమీద తెల్లరాళ్ళు నాలుగు నుంచి ఎనిమిది దాకా మెరుస్తూ ఉంటాయి. నత్తు (ముక్కెర) కూడా ఈ కోవదే. నాలుగు బిళ్లలు పేర్చి అందంగా తీర్చిదిద్దిన ఈ నగ ముక్కు కుడి పక్కనపెట్టి, ఎడమపక్కన ముక్కు పుడక పెట్టి మధ్య అడ్డబాస పెట్టుకుంటే, వినడానికి ఖంగారుగా ఉండొచ్చు కాని చూట్టానికి బాగా ఉండేది.

అసలు నగలన్నిటినీమించిన నగ ఆడదానికి జుట్టే. నగలగురించి ఎవరెప్పుడు మాట్లాడుకున్నా...."తల్లిదండ్రు లెట్టని సొమ్ము పెన్నేరుల్" అనకుండా ఉందరు. కురులు ముడుచుకున్నా, ముడుచుకోక పోయినా, జడేసుకున్నా, ఊరికే ముడేసుకున్నా అందంగానే ఉంటుంది. సౌందర్యారాధన 'తెలుగుమీరిన' ఒకానొక దుర్ముహూర్తాన సీమ దొరసానుల మల్లె ఒత్తుజుత్తును కత్తిరించి మెడదాకా ఉంచుకోవాలనే దురభిప్రాయం కొందరికి కలిగింది. అది కొన్నాళ్లు వ్యాపించింది. అయితే సీమ దొరసానులలో కూడా అలా జుట్టు అందరూ కత్తిరించేసుకోరన్న నిజం చాలామంది గమనించారు.

మనవారిలో పూర్వం 'వేణీ సంహారం ఎంతో విశేషం. ఈ విద్యలో ప్రజ్ఞ గల వాళ్లు కొందరు ఉండేవారు. వాళ్లు ఇంటింటా ఆడపడుచులకు కమ్మగా కబుర్లు చెప్పి జడవేసేవారు. శోభనం రోజున జడవేస్తూనే వేసే పెదరాశి పెద్దమ్మ పిల్లదానికి ఎన్నో విషయాలు బోధపరచి ధైర్యంచెప్పేది. మొగుడు దగ్గిర ఎలా నడుచుకోవాలో తెలియజెప్పేది.

జడలు ఎన్నో రకాలు. బంగారుజడ, మొగలిజడ మొదలైనవి. రెండూ విశేషాలకే వేస్తారు. సీమంతానికి పూలుముడిచి వేస్తారు. ఎన్ని పాయలతో జడలల్లాలీ అనే విషయంలో కూడా కొన్ని చోట్ల కులాలనుబట్టీ ఆచార సంప్రదాయాలను బట్టీ పట్టింపులుండేవి.

## కడియాలు

పూర్వం రవికలు, ఇపుడు చోళీలకు మల్లె పొట్టిగా ఉండేవి. చివర జరీఅంచు. ఆ అంచుకి సమాన 'స్థాయి'లో దండల మీదికి ధగధగ మెరిసేందుకు

దండతావేదులు కట్టుకునేవారు. పట్టెడ బిళ్లల్లాటివే పట్టుదారానికి పోసి, సరిగ్గా రవిక చేతి అంచు అయిపోయేచోట కట్టేవారు. దీని పై మెట్టు దండ కడియం. వీటిమీద చక్కని చెక్కడపుని ఉండేది. మధ్యగా చక్కని పొళ్లవరుస, చిన్నదాని పళ్లవరుసలాగే మిలమిల లాడేది. కొన్నిటికి పొళ్ల బదులు, కడియాల అడుగున రెండు పేటల ముత్యాల దండ కడియం పెట్టేవారు. తెలుపులో బంగారపు వెలుగు ప్రతిఫలించడానికి.

వంకీ ఇంకో చిత్రమైన ఆభరణం. ఎడమ పైటవేస్తే కుడిదండకీ, దక్షిణాది పైట అయితే ఎడమడండకీ పెట్టుకుంటారు – పైటచాటున మాటుపడకుండా. కొన్ని వంకీలకు కిరీటాలకు మీద పచ్చలాగే ముందర ఒక బిళ్ల, అందులో పొళ్లూ ఉంటాయి. ఎక్కడెక్కడి కళ్ళనైనా ఇది అట్టె ఆకట్టి నిలబెడుతుంది. దీనికి కుచ్చుపోసి మువ్వలు కూడా వ్రేలాడదీస్తారు. దండలకే అలంకరించుకునే మరో నగ బాజబందులు. రవ్వలమర్చిన ఒక బిళ్లని పట్టుతాడు పోసి వెనకవేపు కుచ్చుల ముడి వేస్తారు.

కొంచెం కిందికిదిగితే ముంజేయి, చేతినిండా గాజు లేసుకుంటే సరే. లేదా మురుగులూ, మురిడీలూ తోడాలూ మొదలైనవి ఉన్నాయి. ఇవి కొందరు గట్టివి, కొందరు గుల్లవీ, కొందరు వెండిమీద బంగారురేకు వేసినవీ తొడుక్కుంటారు. మురుగు రేకువేసినవీ తొడుక్కుంటారు. మురుడీలు, ఇప్పటి రిస్ట్‌వాచీ స్ట్రాప్‌లలో ఒక రకం వాటిలా సన్నగా చక్కగా ఎలాపడితే అలా వంగేవిగా వదులుగా చక్కటి బంగారు తీగతో అల్లినవి. మురుగులలో పలకల మురుగులు చాలా అందంగా ఉంటాయి. పిల్లలూ మొగాళ్ళు కూడా ఇవి వేసుకుంటారు. బంగారుగాజు లెన్ని రకాలో లెక్క వేస్తే ప్రాణం ఖంగారుపడిపోతుంది. మిరియం గాజులు, గోధుమ గాజులు, నగిషీ గాజులూ ఇలా ఎన్నో ఉన్నాయి.

చేతిమీదుగా, వేళ్ళ బటువుల మీదకి మళ్ళీ వజ్రాలు పొదిగిన గొలుసులు దింపుతారు కొందరు. బటువులు సరేసరి. కొన్ని ఉంగరాలలో ఒక్కొక్క రాయి వేలకివేలు చేస్తుంది. కొన్నిటిలో తొమ్మిదేసిరాళ్ళు కూడా పొదిగి వుంచుతారు. కొందరు మొగాళ్లు నగల విషయంలో కోరికలన్నిటినీ ఉంగరాల దగ్గిరే సాధించుకుంటారు, వేలివేలికీ వేలువేలుచేసే ఉంగరాలు రెండేసీ మూడేసీ పెట్టేసుకుని.

అందమైన ఆడదానికి నడుము ఉందా లేదా అన్న విషయమై ప్రబంధకవుల మీమాంస లెలా ఉన్నా, ఆడవాళ్లుమటుకు వాటిని పట్టించుకోకుండా సుబ్బరంగా నగలు చేయించుకున్నారు. నగపెట్టడానికి వీలైన చోటు ఉన్నప్పుడు దాని మీద తర్కమేమిటీ అని – కంటిరెప్పలూ, పెదిమలూవంటి కొన్ని అవయవాలు వినా. వనిత తనులతలో నగలానని చోటే లేదు.

నడుము ధరించే నగ వడ్డాణంలో నాలుగైదు రకాలున్నాయి. ముందు

కొక్కాలు ఉండే దా వడ్డాణం, నగిషి చెక్కిన పట్టిక వడ్డాణం, మువ్వల వడ్డాణం, కమల పట్టా వగైరాలు.

కాళ్లకి నగలన్నీ వెండివే, రాజులకాలంలో బంగారు అందెలూ గజ్జెలూ ఉండేవి.

పూర్వం ఏ యింటి మాలక్ష్మేనాసరే నట్టింట తిరుగుతూ ఉంటే ఈ అందెలూ, కడియాలూ తోడాలూ గొళ్ళెం గొలుసులూ పాంజీపట్టాలూ, పావడా గొలుసులూ, కాటిక్కాయ గొలుసులూ, మట్టెలూ కలిసి ఘల్లు ఘల్లున మోగుతూ ఇంటో వినిపించేవి. పురుగూ పుట్రా దారికడ్డంపడి ఊదబోయినా ఈ చప్పుడికి చప్పున తప్పుకునేనని మా అమ్మమ్మ అంటుంది. ఇవన్నీ ఒక్కొక్కటి నూరేసి తులాలుండేవి. ఇలా కాలికి నాలుగ్గై దొందల తులాల నగనుమోస్తూ ఇల్లాలు అడుగెత్తి అడుగేసేవరకూ, విగ్రహంలో ఎంతో రాచఠీవీ దర్పం ఉట్టిపడేవి.

మట్టెలుకూడా మంగళ చిహ్నాలే. ఇల్లాలీ కాలిబలాన్ని బట్టి ఒకొక్కటి 7 నుండి 12 తులాలు తూగేవి. కొందరు అన్ని వేళ్లకీ పెట్టుకుంటారు. కొందరు రెండోవేలికీ, చిటికెనవేలుకీ (పిల్లేళ్లు) పెట్టుకుంటారు. నిభాయించుకోలేనివారు, నాజూకైన పట్టాలు వేసుకుని, కాలికి లత్తుక పూసుకుని తిరిగేవారు.

మన సౌందర్యాభిరుచుల స్థాయిని ప్రతిబింబించేవి నగలు. మిగతా దేశాల మతాలమాట ఎలా ఉన్నా మనకి నగలూ అలంకరణా భగవదారాధనలో కూడా కలిసి పోయాయి. ఏ దేవుణ్ణైనా పట్టుమని పది మాటలలో పొగిడేవరకూ ఆయన నగ మాట రాకమానదు.... చేతిలో వెన్నముద్ద చెంగల్వపూదండ బంగారు మొలతాడు, పట్టుదట్టి, సందిట తావేదు సరిమువ్వ గజ్జలు చిన్ని కృష్ణా నిన్ను చేరికొలతు అని - --- కస్తూరీతిలకం లలాట ఫలకే వక్షఃస్థలే కౌస్తుభం నాసాగ్రే నవమౌక్తికం... అని ఇంకో శ్లోకం. సౌందర్యంలో దైవాన్ని చూస్తున్నాం మనం.

మెప్పులకేకాదు; ఆడిపోసుకోడాని నగలే కావచ్చాయి. బంధిఖానాలో రామదాసుగారు ప్రాణం విసుగెత్తి - సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా, ఆ పతకం జేసెను పదివేల వరహాలు రామచంద్ర అన్నాడు. భరతుడి పచ్చలపతకం, లక్ష్మణుడికి రత్నాలపతకం ఎంతెంత అయ్యాయో వర్ణించాడు. చివరకి రాముడికే చేయించిన కలికితురాయిమాట ఎత్తి 'అది ఎవరబ్బ సొమ్మని కులుకుచు తిరిగేవు' అన్నాడు. బాధ ఉపశమించాక అబ్బ తిట్టితినని ఆయాస పడకయ్యా అని మన్నన చెప్పాడనుకోండి.

బంగారమంటి పిల్లాడు.... మాణిక్యంలా ఉంటుంది పిల్ల, నీయిల్లు బంగారం గాను... రత్నంలా మెరిసిపోతున్నాడు.... మొదలైనవి దైనందినీయంలో వినబడే మాటలు.

ఈనాటి నగలు తేలికగా, నాజూకుగా ఉంటాయి. నాగరికత పెరిగినకొద్దీ ఆభరణాల నిర్మాణంలో ప్రయోగంలో మార్పులు వచ్చాయి. కాని, వచ్చివచ్చి మళ్ళీ

పూర్వకాలపు నగల దగ్గిరకే వెళ్తూ ఉంటాం. మళ్ళీ పూర్వకాలపు పద్ధతులకే వెళ్తూ ఉంటాం. మహాఅయితే చిన్న మెత్తుతేడా ఉండవచ్చు.

మన నాయనమ్మలు వేసుకున్న కంఠపువ్వు పట్టెడలూ, మువ్వలపట్టెడలూ ఇప్పుడు లండన్‌లో 'ఫాషనబుల్' నగలు. అక్కడ ధనికులు నల్లటి గౌను వేసుకున్నపుడు, దంతంలా తెల్లగా, శంఖంలా నాజూగ్గా ఉండే మెడకు పల్చగా మెరిసిపోయే ఈ పట్టెడ పెట్టుకుంటారు. మనదేశంలో అతి నాగరీకులు కూడా (బొంబాయి, ఢిల్లీలలో) ఈ నగలు ధరిస్తున్నారు.

పాతకాలంలా ఈనాడు చారెడేసి తమ్మెలు - చెవిని కప్పేసేవి పెట్టుకుంటున్నారు. కొన్నాళ్ళకి ముక్కుకి నత్తు అడ్డపాపా పెట్టుకుంటే మనం ఆశ్చర్యంతో వెనక్కి పడిపోనక్కరలేదు.

చేతినిండా గాజులేసుకుంటే "లంబాడీ దానిలా అని వెక్కిరించినవాళ్ళ పిల్లలు, కేవలం లంబాడీలే వేసుకునే రెండంగుళాల వెడల్పు గాజులు వేసుకుంటున్నారు. చేతికి రెండు గాజులు చాలని, ఆ తరవాత ఒకటే ఎక్కువనీ, ఆ ధరిమేనా అదికూడా అనవసరమనీ ఒక చేతిమీదే పక్షపాతం చూపించి రెండోదాన్ని బోసిగాను, లేదా రిస్టువాచీ పెట్టీ ఉంచుకున్న వారు మళ్ళీ రెండుచేతులా పుష్కలంగా గాజులు తొడుక్కుంటున్నారు. బంగారు కడియాలు చేయించి అందులో మణిలాటి చిన్న గడియారాన్ని పొదిగిస్తున్నారు.

మన కనుముక్కు తీరునుబట్టి, సౌలభ్యాన్ని బట్టి నిరాడంబరంగా నగలు ధరించి అలంకరించుకోవడం మన అభిరుచిని, సంస్కారాన్ని తెలియచేస్తుంది. పూర్వకాలం వాళ్ళకి సంస్కారం లేదనికాదు. ఆనాడవి వారికి నప్పాయి. అసలు నగలు ఎలాటివి ఎన్నేసి పెట్టుకున్నామన్నది ప్రశ్నే కాదు. పెట్టుకున్నవి మనకి నప్పుతున్నాయా, మనవల్ల వాటికీ వాటివల్ల మనకీ అందంవస్తోందా అన్నదే ముఖ్యం.

*(1959)*

# ఉల్లిమేలు తల్లిచేయదు

కన్నతల్లికన్న మిన్న ఉల్లే ననేది మా బామ్మ తరవాణీ అన్నంలో నంచుకోవడానికి ఉల్లిపాయ వలిచివేస్తూ.

"ఛీ, ఇపుడిది తింటే ఐళ్లో అందరూ ఏడిపిస్తారు. ఎవడూ దగ్గరికి రానియ్యడు" అని తోసి పారేసేవాడు మా అన్నయ్య.

❀ ❀ ❀ ❀

"ఆనియన్ ఈజ్ ది మోస్ట్ పొటెంట్ జెర్మ్ డెస్ట్రాయర్" అన్నాడు ఆ చిన్నన్నేమొన్న. అలాంటి వ్యాధులకు కారణమైన సూక్ష్మజీవుల్ని నిర్మూలించే ఓషధులన్నిటిలో ఉల్లిపాయ చాలా గొప్పది అని తాత్పర్యం. మా అన్నయ్యా, ఇంకా సవాలక్ష మంది ఆధునికులూ. చాలాకాలం వరకూ ఉల్లిపాయ గొప్పతనాన్ని గుర్తించారు కాదు. మన దేశంలోనే కాదు అన్ని దేశాలలోనూ అంతే. కాగా, ఇక్కడ సనాతనులు ఉల్లిపాయలను భోజ్యపదార్థాల జాబితాలోంచి కొట్టేశారు. ఆధునికులు, సంఘంలో నలుగురు దగ్గిరగా నుంచుని మాటాడరన్న భావంతో దాన్ని వెలేశారు.

ఇరవై ఎనిమిది రకాల వ్యాధుల జాబితా వేశాడట వెనకటికో ప్రముఖ రోమన్ శాస్త్రజ్ఞుడు. వేసి, "వీటన్నిటికీ ఉల్లిపాయ మంచి మందు" అని చెప్పాడు. చెప్పినది శాస్త్రజ్ఞుడే అయినా గురికుదరక చాలామంది నవ్వారు. చాలాకాలం నవ్వుతూ వచ్చారు.

అయితే కాలక్రమాన పరిశోధనలు జరుగగా, ఇటీవల ఈ ఉల్లిపాయ మహాత్మ్యాన్ని ఆధునిక శాస్త్రజ్ఞులు గూడా ధ్రువపరిచారు.

రష్యాలో జరిగిన పరిశోధనల ఫలితంగా సూక్ష్మజీవుల సంహారానికి పనికొచ్చే నూరు నూటయాభై గొప్ప ఓషధులలో ఉల్లిపాయ మొట్టమొదటి స్థానం ఆక్రమిస్తుందని తేలింది. వెల్లుల్లి, ముల్లంగి, ఆవ, మిరియం, ఇవన్నీ ఇంగ్లీషు రాని మన పూర్వీకులంతా చీటికీ మాటికి వేసే చిటకాలలో వాడేవే. ఈ మామూలు ఉల్లిపాయకు వీటిని మించిన శక్తి వున్నట్లు ఇప్పుడు సోవియట్ శాస్త్రజ్ఞుడు డా॥ బి. టోకిన్ నిర్ధారణ చేశాడు. టైఫస్, బాక్టీరియా, ఇంకా అనేక ఇతర రకాల క్రిములూ కూడా ఈ ఉల్లిపాయ ప్రభావానికి నాశనం అయిపోయాయి.

అయితే దీనికిటుకు ఏమిటి? నిష్కారణంగా కలకంఠి కంట కన్నీరొలికించే ఘాటే. ఉల్లిపాయను తరిగినా ఒలిచినా అందులోంచి ఒక విధమైన వాయువు పుట్టుకొస్తుంది. ఘాటైన ఆ వాసనకే సూక్ష్మక్రిములు చనిపోతాయట. పంట పూర్తి కాకుండా లేతగా ఉన్న మొక్కని తీసి ఆ చిన్నపాయని పరిశోధిస్తే దాని శక్తి మరింత

ఎక్కువని అమెరికన్ శాస్త్రజ్ఞులు తేల్చారు. ఉల్లితోటకి చీడ పట్టకుండా ఎక్కువ జాగ్రత్త పడేది ఎవరట? రైతుకాదు; ఖామందు కాదు; ఉల్లిమొక్కే... ఆ మొక్కలోంచి సహజంగా వెలువడే వాయువే, సూక్ష్మక్రిముల్ని సంహరించి చీడ బెడద లేకుండా చేస్తుందిట. ఎడ్వర్ కామన్ అనే అమెరికన్ శాస్త్రజ్ఞుడు ఈ సంగతి కనిపెట్టాడు.

ఇంత శక్తిగల ఓషధి మనుషుల గొంతులో (జలుబు మొదలైన వాటివల్ల) నొప్పిపుడితే దానికి కారణమైన సూక్ష్మజీవుల్ని ఎందుకు సంహరించలేదు.

అందువల్ల ఒక పచ్చి ఉల్లిపాయ తీసుకుని పరపర నమిలేస్తే జలుబు గిలుబు ఆమడదూరానికి పోతాయి. అలాంటపుడు ఫ్రెండ్స్ కూడా, మన మీద కాస్త చిరాకుపడి దూరంగా వెళ్లవచ్చుగాని, జలుబు పూర్తిగా పోయాక మళ్ళీవస్తారు. లేపోతే మనమే వెళ్ళచ్చు. జలుబు లేకుండా, మళ్లీ రాకుండా ఉంటేచాలు. సోవియట్ రష్యాలో డాక్టర్ ఫిలటోవా, డాక్టర్ టోడాప్యీవ్ అనే శాస్త్రజ్ఞులిద్దరు ఘాటుఘాటుగా ఉన్న ఈ ఉల్లిపాయ శక్తిని మరింతగా మానవసేవకు వినియోగించడం కోసం పరిశోధనలు జరిపారు. రాచకురుపువంటి వ్రణాల చికిత్సలో ఇది అద్భుతంగా పనిచేసింది. రెండు పెద్ద ఉల్లిపాయల్ని మొత్తగా చితగ్గొటి ఓ చిన్నప్లేటులో వేసి దాన్ని ఆ కురుపు దగ్గరగా పదినిముషాలసేపు ఉంచారట. ఆ ముద్ద ఘాటుకి సూక్ష్మక్రిములు నిర్మూలం అయిపోయాయి. దాంతో క్రమంగా నెప్పితగ్గటం, కురుపు రంగుమారి తగ్గుముఖం పట్టడం జరిగింది. ఇలా చాలా మందికి గుణం కనిపించిందట. ఈ పరిశోధనలు జరగడానికి చాలాముందే జలుబుకి ఇది చాలా మంచి మందని తేలింది.

ఇన్నాళ్లకి ఉల్లిపాయల మహాత్మ్యం ఇంత తెలిసిందిగాని దీనికి కారణమైన గుణం ఏమిటో? ఈ ఉల్లిపాయ స్వభావం ఇలాటిది కావటానికి ఇందులో ఉన్న ఏఏ మూలపదార్థాలు కారణాలలో ఇంకా పూర్తిగా తెలియలేదు. శాస్త్రజ్ఞులు పరిశోధనలు సాగిస్తూనే ఉన్నారు. దాని గుట్టూ మట్టూ ఏమిటో పూర్తిగా తెలిస్తే దాని మహాత్మ్యం మరింత తెలుస్తుంది. అపుడు వ్యాధుల నివారణకు ఇది మరింత ఉపయోగపడుతుంది.

అవన్నీ ఎలా ఉన్నా ఈలోగా ఎవరేనా ఉల్లిపాయ మందేమిటి లెస్తూ అని కొట్టి పారేసినా నమ్మకండి; ఉల్లిపాయ చాలా గొప్పది. ఒంటికి బలం, ముఖానికి సౌందర్యం, కోర్టులో జయం కలిగిస్తుంది అని దాని భక్తులు స్తుతించినా నమ్మకండి.

జలుబు చేస్తేమటుకు స్నేహితులు ఏమనుకున్నా, అన్నా, మంచి ఉల్లిపాయ ఒకటి తీసుకొని పరపర నమిలెయ్యండి.

*(మే 1957)*

# చోళీ, దాని పరిణామాలు

కంటికి నదురుగా ఉండే మంచి మంచి డిజైన్లన్నీ ఇపుడు చేనేత ఖద్దరు గుడ్డల మీద చాలా వస్తున్నాయి. చేనేత చోళీ పీసెస్ మరీ బాగుంటున్నాయి. ముఖ్యంగా చేనేత వస్త్రాలంటే అమెరికాలో చాలామంది ముచ్చటపడుతున్నారట. మెడ్రాస్ హాండ్ కర్చీఫ్ అనే రకాన్ని అక్కడ చాలా మంది స్కర్ట్లు కుట్టించుకుంటున్నారు.

ఇలా ఇంకో దేశంలో వాళ్ళకి యిది ఫాషన్ అయినందువల్లా, పనిలోపని కొంచెం దేశభక్తి కలిసి వస్తుందన్న కారణంవల్లా, ముఖ్యంగా సూక్ష్మంలో మోక్షం అన్నట్టు చౌకలో ఫాషన్ కుదరడంవల్లా, మన దేశములో కూడా చాలా మంది కొనడం మొదలుపెట్టారు. అన్నిటికన్న ముఖ్యకారణం అవి బాగా ఉండటం. నామటుకు నేను ముఖ్యంగా ఈ చివర కారణంవల్ల కొంటున్నానని నా అభిప్రాయం. మా అన్నయ్య 'కొయ్ కొయ్' అని హేళన చేస్తాడు. నిజంగా బాగుంటే ఒక్కటో రెండో కొని ఊరుకోవడమేం? ఒక డజను కొనలేకపోయావా అంటాడు, బలే ఇంటిలిజెంట్గా.

## నా ఊహలు

కాని అది తప్పు అని నా అభిప్రాయం. ఈ ప్రపంచంలో ఏదేనాసరే, ఎంత బాగున్నాసరే వేలం వెర్రిగా కొనెయ్యకూడదు. అలా కొనటం ఆబ అన్నమాట. యావ అన్న మాట కూడా.

ముఖ్యంగా దబ్బుదబ్బున మారిపోయే ఫాషన్ల విషయంలో ఎవరికీ తీసిపోకుండా ఉండాలంటే ఈ విషయంలో జాగ్రత్త అవసరం. ఒక రకం చోళీగుడ్డగాని, ఒక రకం చీర పమిటంచుగాని బాగుందని అదే రకంలో రంగురంగులవి చాలా ఏరికొని అట్టే పెట్టుకోడం మంచిదికాదు. నిన్న ఆర్గండీ జాకెట్ ఫాషన్ అయితే ఇవాళ జాస్మిన్ సిల్కు, చేనేత చోళీ కొత్తగా కనబడతాయి. చేనేతలోనే రేపు కొత్త డిజైన్లు, కొత్త రకాలు బోలెడువస్తాయి. ఫాషన్లు మారినప్పుడల్లా మనం ఉన్న బట్టలన్నీ వీధిలో పారేస్తున్నామని కాదు. అలా చెయ్యమని ఎవరూ అనరు. నామటుకు నేను అలా పారెయ్యను కూడా.

## నాన్నగారి భావాలు

ముఖ్యంగా మా నాన్నగారు ఒప్పుకోరు. ఒకవేళ నాకలాటి ఐడియా వచ్చినా, జీతం కొంచెం పెరగనీ తల్లీ అలాగే చేద్దుగాని అంటారు నాన్నగారు. ఆ మధ్య

యుద్ధం పూర్తి అయిన తరువాతి రోజుల్లో 'పారాషూట్' గుడ్డలు బజార్లోకి వచ్చాయి. రంగురంగులవి. ఆ పళంగా ఆడపిల్లలూ, మొగపిల్లలూ, కొందరు పెద్దవాళ్ళు కూడా గజం రెండో మూడోపెట్టి, వాటిని విరగబడి కొనేశారు. డజన్ల కొద్దీ చొక్కాలూ, చోళీలూ కుట్టించేసుకున్నారు. అవి పల్చగా లేకపోయినా, ఉల్లిపొర కాగితంలా ట్రాన్‌స్పెరెంట్ కాబట్టి దాని కోసం, అప్పటికి పాతఫాషన్ అయిన వల బనీన్లను కొందరు సంస్కరించారు. రెండుమూడు నెలలు తిరిగేసరికి ఊరందరికీ మొహం మొత్తిపోయింది. ఎవరి ఒంటిన చూచినా ఇవే. అంతలోనే ఓ పుకారు బయలేరింది. ఆ పారాషూట్ చొక్కాలు మంచివి కావనీ వాటిలోంచి సూర్యకిరణాలు మన శరీరాల మీద పడితేమంచిది కాదని. ఇదంతా సైన్సు ప్రకారం ఎంత నిజమో తెలీదుగాని, ఇంకోరెణ్ణెల్లు తిరిగేసరికి అవి ఔట్ ఆఫ్ డేట్ అయిపోయాయి. మా అన్నయ్యా ఆరు లాల్చీలు కుట్టించుకున్నాడు. అవన్నీ పనికిరాకుండా పోయాయి. అందువల్ల కొంచెం దూరదృష్టి కావాలని నా అభిప్రాయం.

## నా చిన్నప్పుడు

అసలీ దూరదృష్టి చాలా మంచిది కూడా. ఒక సంగతి చెప్తాను. నా చిన్నప్పుడు మాలపిల్ల చీరలు తరవాత తరవాత వరవిక్రయం చీరలూ అంటూ అమ్మొచ్చేవి. చీరలవాళ్ళు సినిమాలో భానుమతీ వాళ్ళు కట్టుకున్న చీరెల మోస్తరువి చేశారన్నమాట. అప్పుడు ఆ తరవాత కొన్నాళ్ళు అవి ఫాషన్. ఇంకోటేమిటంటే ఆ చీరలు ఎనిమిది గజాలవి. ఒక్కొక్క చీరకొంటే, ఏడు గజాలు చీరకి కేటాయించి మిగతా గజంతోనూ జాకెట్‌లు కుట్టించేవారు. ఏ చీరకి ఆ రకం జాకెట్టు. అలా ఒకసారి డజను కుట్టించుకున్నా ఇబ్బంది ఉండేదికాదు.

ఏ హెల్త్ ఇన్‌స్పెక్టరుగారి భార్యో, కూతురో ఒక రకం చీరకి ఇంకో రకం జాకెట్ వేసుకోవడం మొదలు పెట్టిందనుకోండి అప్పుడు అనుసరించదలచిన వాళ్ళంతా ఉన్న జతలనే కాస్త మార్చి కొత్త ఫాషన్‌తో రెడీ అయేవాళ్లు. ఇది సిల్లీ అయిడియా అంటే ఫాషన్ తెలీనివాళ్ళు ముఖ్యంగా మొగాళ్లు అంటారేమో! ఎందుకంటే ఇప్పుడు కూడా ఫాషన్‌లో అప్‌టుడేట్‌గా ఉండటానికి ఏ దేశం వాళ్లయినా సరే డబ్బుకన్నా ముఖ్యమైన కిటుకు నేర్పు అని నా అభిప్రాయం. జరీ అంచు చీర ఒకటి చిరిగిపోతే జరీ అమ్మేసేవాళ్లని చాలామందిని చూశాను. కానీ జాగ్రత్తగా ఉంచి ఇంకో చీరకో చోళీకో వాడటం నేర్చుకోవాలి. జరీ అంచుని అలా చోళి పైకి వాడినపుడు మిషను మీద కుట్టకూడదు. టాకా వేసుకుపోతే బాగుంటుంది. అంచుల ఫాషన్ పోయి సింపుల్ చోళీ కావాలనుకుంటే టాకా జాగ్రత్తగా తియ్యొచ్చు. ఇలా ఇటు కొత్త ఫాషనూ ఉంటుంది. అటు సరుకు సద్వినియోగమూ అవుతోంది. ఉపాయం బాగా నప్పితే మీరు చేసే నోము అందరూ పడతారు.

మొన్న నేను చేనేత చోళీగుడ్డ ఒకటి కొని తెచ్చుకుని, దాని మీద డిజైన్‌ను కట్ చేసి ఆర్గండీ చోళీ మీద ఎంబ్రాయిడరీ చేస్తున్నాను. అవతల హాలులో మా

అన్నయ్యా, మరికొందరు పురుష పుంగవులూ ఫాషనుల మీద ముఖ్యంగా ఆడపిల్లల ఫాషన్‌ల మీద హోరాహోరీగా చర్చలు వేసేస్తున్నారు.

"ఇవల్యూషన్ ఆఫ్ ది చోళీ" అనే విషయం (చోళీ ఫాషన్‌లలో పరిణామాలు) మీద వాదం జరుగుతూంది. మా అన్నయ్య అడపాదడపా లోపలికి పరుగెట్టుకు వచ్చి, బుట్ట జాకెట్‌ల తరువాత లైను జాకెట్లు వచ్చాయా, వీటికి ముందు అవా అని సందేహాలడిగి తీర్చుకుని వెళ్ళి అవతల తన అభిప్రాయాలు చెప్పేస్తున్నాడు.

## ఒక్క ముక్కలో...

అంతలో ఒక కొత్త కంఠం వినబడింది. ఆ అబ్బాయి నాకు తెలుసు. అతని పేరు దావు. చిన్నప్పుడు క్లాస్ మేట్. ఏమిటి చోళీల గురించి తీరికగా మాట్లాడుతున్నారు పోతు పేరంటాలూ అన్నాడు హేళనగా. అబ్బే బఠాణీల గురించి, నీ తలకాయ గురించీని అంటున్నాడు అన్నయ్య హేళనగా. దావు అంతకన్నా హేళనగా నవ్వాడు. తరువాత ఏడిశారు అన్నాడు. ఇంకో క్షణం మాటలు వినబడలేదు. చోళీల గురించి ఇంత డిస్కషన్ ఎందుకోయ్ ఒక్క ముక్కలో చెప్పనా అన్నాడు దావు. చెప్పమని ఎవరి గళమూ వినిపించలేదు. ఒద్దని కూడా ఎవరూ అన్నట్లు లేదు. అందుకని దావు చెప్పేశాడు.

అతన్ని అడిగితే బుట్ట జాకెట్లయినా గొట్టపు చేతుల రవికలయినా, కాలర్ చోళీలయినా ఏమయినా ఎన్ని ఫాషన్‌లు మారినా ముప్పాతిక గజం గుడ్డతోనే గదా. ఇదివరకు చేతుల పొడుగు క్రమంగా తగ్గి జంపర్ జాకెట్ల పై మెట్ల (శ్రీమతి విజయలక్ష్మి ఈనాటికీ ధరించేలాంటివి - విజయలక్ష్మి అంటే ఈ.సి.వి. విజయలక్ష్మి కాదు. హైకమీషనర్ అని నా అభిప్రాయం) వరకూ వెళ్ళాయి. అప్పుడు జాకెట్ శాల్తీ పొడుగ్గా వదులుగా ఉండేది. మొగపిల్లలు చొక్కా టక్ చేసుకున్నట్లే ఈ జాకెట్లను చీరకట్టులో టక్ చేసేవారు. మళ్ళీ కొన్నాళ్ళకి జాకెట్ చేతులు క్రమంగా క్రిందికి దిగడం మొదలుపెట్టాయి. సైమల్టేనియస్‌గా, అంటే, ఇవి ఇలా దిగుతూ పొడుగు అవుతూ ఉంటే, జాకెట్ శాల్తీ పొట్టి అవుతూ వచ్చింది. అంటే ఇదివరకు ఫాషన్‌బుల్ గాళ్స్ అప్పలమ్మలు అంటూ హేళన చేసిన రవిక మళ్ళా వోగ్‌లోకి వచ్చిందన్న మాట. ఎటొచ్చీ రవిక అన్న పాతపేరు పోయి చోళీ అన్న కొత్తపేరు వచ్చింది. ఇప్పుడు పొడుగు చేతులు స్టయిలు. అసలు శాల్తీయిది. దీనికి కావలసింది ముప్పావు గజం. ఇందులో ఇంక కిటికీలు, తలుపులూ ఎన్నయినా ఏర్పాటు చేసుకోవచ్చు. జరీలు, చెమ్కీలు వెయ్యొచ్చు. తాళ్ళు తక్కెళ్లు తగిలించవచ్చు.

ఈ గంభీరోపన్యాసంలో, ఆ పిల్లాడి తెలివితేటలు, చమత్కారాలు, హేళనా మినహాయించినా, కొంతవరకూ పాయింటు ఉందని ఒప్పుకోక తప్పదు. అయినప్పటికీ మా అన్నయ్య నా అభిప్రాయం కోసం లోపలికి రాగానే, శుద్ధదండుగ మాల సిద్ధాంతం ఎందుకొచ్చిన గోల మీకు అని చివాట్లేశాను.

ఇలా అనవసరంగా అతి తెలివిగా మాట్లాడేవాళ్ళని చూస్తే నాకు ఒళ్ళు మంట. మనం ఎప్పుడూ మితి తెలిసి మాట్లాడాలని నా అభిప్రాయం. ఒకసారి నేను ఇలాగే ఫూల్ అయ్యాను. నేను స్కూలు ఫైనలు చదువుకుంటున్నపుడు వార్షికోత్సవానికి నాటకాలూ అవీ వేశారు. అప్పుడు మా క్లాస్‌మేట్లలో ఓ పిల్లాడు, ఆ ఏర్పాట్లనీ తను చేస్తానని సిద్ధపడ్డాడు. అలా అన్నవాడు మర్నాడే మా యింటికొచ్చేశాడు. ఆ పళంగా వచ్చేసి, ఏమండీ స్టేజికి కర్టెన్లూ అవీ అన్నీవున్నాయి కానీ సైడ్ కర్టెన్‌లకి ఏమీ దొరకలేదండీ అన్నాడు తలవంచుకుని. అతను మంచివాడే అనుకోండి. నాకు ఎందుకనో ఏడిపించ బుద్ధేసింది. ఆడపిల్లలతో మాట్లాడడం అంత తేలికకాదని చెప్పాలనిపించింది.

"ఏమిటండీ?" అన్నాను కొంటెగా.

"సైడ్ కర్టెన్లండి. సైడ్ కర్టెన్‌లు వెయ్యటానికి ఏమీ దొరక లేదండి స్టేజికి" అన్నాడు ఓపికగా.

"అయితే నన్నేం చెయ్యమంటారు? వచ్చి నిల్చోమంటారా?" అన్నాను.

ఆ అబ్బాయి తెల్లబోయాడు కాని, కొంచెం, తెలివైనవాడే అవటంవల్ల, మీరేవచ్చి సైడ్ కర్టెన్‌లా నిల్చుంటే, ఇంక నాటకం ఎవరూ చూడరండి అన్నాడు వినయంగా నవ్వుతూ. ఇలా చిత్తుగా ఓడిపోవడం నేను ఎప్పుడూ ఎరగను. భలే సిగ్గేసింది. కోపం కూడా వచ్చింది. కాని, నాదే తప్పు అనుకుని మళ్ళా ఏం కావాలని అడిగాను. అతను అడిగిన ప్రకారం, మా నాన్నగారికి తెలీకుండా, అమ్మకి చెప్పకుండా, పెట్లో చీరలు ఆరు అతనికిచ్చి పంపించాను. వీటినే ఆ రోజున అతడు స్టేజికి సైడ్ కర్టెన్ లాగా వాడాడన్నమాట.

తరవాత మా యింట్లో తెలిసింది. నన్ను చివాట్లు పెట్టారు కూడా. అయితే తప్పు నాదే కనక ఆ ఒక్కసారీ జవాబు ఇవ్వకుండా అన్నీ అచ్చుకున్నానన్న మాట.

*(అక్టోబరు 1956)*

# కట్టూ-బొట్టూ

కాలేజీలో చదువుకునే ఆడపిల్లల కోసరం అని అమెరికాలో ఫాషన్ పత్రికలు ఏడాది కోసారి ప్రత్యేకంగా, సప్లిమెంట్‌లు వేస్తాయి. అవి ఇచ్చేవి సలహాలు కావు. ఆజ్ఞలు అన్నమాట. ముఖ్యంగా వోగ్‌లాంటి పత్రికలు మరీను. నువ్వు ఫలానా ఫలానా నెలలలో ఫలానా ఫలానా రకాల బట్టలు వేసుకోవలెను. ఫలానా పద్ధతిలో టోపీ పెట్టుకోవలెను. ఇదిగో ఇలా జుట్టు కత్తిరించుకోవలెను. ఈ రకంగా ఉంటాయి సలహాలు.

మెట్రోపాలిటన్ నగరాలలోని మహిళలు, యువతులు, బాలలూ వాటిని శిరసావహిస్తారు. మనదేశంలో చాలామంది మొగ స్టూడెంట్లలాగే, సీమదేశాలలో ఆడపిల్లలకి గూడా, నిశ్చితాభిప్రాయాలు ఉన్నట్లు కనబడదు.

ముఖ్యంగా కాలేజీ పిల్లల కోసరం, ఆగస్టు ఆగస్టుకీ వచ్చే సప్లిమెంట్‌లు తలోదారిగా సలహాలిచ్చినపుడు ఏది ఫాషన్ ఏదికాదు అన్న విషయం మీద లేచేగోల ఇంతా అంతా కాదట. ఒక పత్రిక "ఓ అమ్మాయీ! నీకు కన్ను చెదరకొట్టే రంగులలో గుడ్డలు చాలా బాగుంటాయి" అని ప్రకటించి ఆపైన కొన్ని కలర్ కాంబినేషన్‌లు సూచిస్తుంది.

"ఛఛఛ. లౌడ్ కలర్సు (కనుచెదిరే రంగులు) అస్సలు పనికిరావు" అంటుంది ఇంకో పత్రిక. "నీ చదువుకీ, సంస్కారానికీ నిరాడంబరంగా కనబడే దుస్తులు ఒప్పుతాయి. కాబట్టి ఓ సుందరాంగీ, లేత రంగునే వాడుము" అంటుంది ఇంకో పత్రిక.

కన్ను చెదరగొట్టే రంగులు కూడదు కాక, కంటికి నదురుగా మాత్రం ఉండాలి అంటుంది ఇంకొక పత్రిక.

"అసలు ఫాషన్ గురించి గట్టిగా తెలిసిన వారి అభిప్రాయమేమిటంటే...." అంటుంది ఇంకోటి. పత్రిక అభిప్రాయం మధ్యరకం అన్నమాట. సగం ఇటూ సగం అటూ ఉండడం విశేషం అంటుంది.

చివరికి ఈ గోలలో నలిగిపోయేవాళ్ళు, ఏ దారీ తోచక విస్తుపోయేవాళ్ళు, చదువుకున్న ఆడపిల్లలు తికమకపడతారు. వాదించుకుంటారు. ఒక రకం గుడ్డలు కొంటారు. మర్నాడవి ఒద్దు పొమ్మంటారు.

అందువల్ల ఈ కలర్ కాంబినేషన్‌లకి ఈ ఫాషన్ ధర్మసూత్రాలకి గీటురాయి ఏమిటి? అసలు పద్ధతి, బేసిస్, ఏమిటి అన్న విషయం తెలుసుకో బుద్ధేస్తుంది. నాకు ముఖ్యంగా ఇలాంటివంటే వళ్లుమంట. సంగతేమిటో తెలుసుకుంటేగానీ నిద్రపట్టదు.

మెద్రాసులో చాలా మందిని అడిగాను. అలాగే ఒకసారి బొంబాయి వెళ్లినప్పుడు అక్కడ పరిచయం అయిన కొద్ది మందిని అడిగిచూశాను.

ముందరవాళ్లు కొంచెం షాక్ తిన్నట్టయ్యారనుకోండి. ఫాషన్ గురించిన సలహాల విషయంలో ఎందుకు, ఎలాగ అని అడగకూడదు. అవి ఒకరు అడగరాదు ఇంకోళ్లు చెప్పరాదట. అలా అడిగితే మేనర్స్ లేదన్నమాట.

మేనర్స్ లేకపోతే అదేపోయె అని నేను ఎందరినో అడిగాను. కొందరే సరిగ్గా జవాబు చెప్పారు. సరిగ్గా అంటే నాకు అర్థం అయేలా. నాకు నచ్చేలా.

నేను తెలుసుకున్న దాన్నిబట్టి ఫాషన్ రెండు విధాలని తేలింది. ఒకటి బుకాయించి, బాగుందని ఒప్పించే పద్ధతి, రెండోది మనిషి విగ్రహానికి, మొహంలో కళాకళాలకి సరిగ్గా తగినట్టుగా ఉండేది, ఉన్న అందాన్ని, దర్జానీ మరింత ఎక్కువ చేసేదీను.

సన్నటి పిల్లలు - కొన్నాంగదా అని ఎనిమిది గజాల బనారసు చీరెని చుట్టబెట్టుకుంటే ఘోరంగా ఉంటుంది. బుట్టబొమ్మల్లా ఉంటారు.

ఉన్న వయస్సుని కాస్త తగ్గించి ఇంకాస్త చిన్నవాళ్ళలా, చలాకీగా కనబడదాం అని కొంచెం భారీ శరీరం వాళ్లు ఆరుగజాల చీరెలో అర్ధగజం కత్తిరించి ఐదున్నర గజాలు సర్దుకుంటే ఆ సౌదర్యం చెప్పనక్కరలేదు.

రంగుల విషయము కూడా అంతే. మామూలుగా రోజూ కాలేజీకి వెళ్లడానికి సన్నటి మెత్తటి చీరెలు, మేలిరంగులవి కట్టుకుని, మరీ ముదర మరీ లేత కాకుండా, ఒక ఛాయ నదరుగా కనబడే చోళీ వేసుకుంటే బాగుంటుంది.

ఎర్రటి ఎరుపురంగు చీరెకి, చీకటిలాటి కాటుకలాటి చోళీ కొందరు వేసుకోగా చూశాను.

ఏం వేసుకుంటే ఫస్టుగా ఉందన్నారు వాళ్లు. నామటుకు నాకు, నాలాటి వాళ్లకి సెకండు క్లాసుగా కూడా కనబడలేదు.

ఈ మధ్య 'సీమ' అనే హిందీ చిత్రం వచ్చింది. అందులో నూతన్ సమర్థ్ తెల్లటి చీరె చోళీ కట్టుకుంది. ఆ డ్రెస్ ఆ విగ్రహానికి అద్భుతంగా నప్పింది. ఒంటిని అంటి పెట్టుకున్నట్టుంటుంది.

అలాగే 1955లో అమెరికన్ సినిమాలో బెస్ట్‌డ్రెస్ డిజైన్ బహుమతి "లవ్ ఈజ్ ఎ యెనీ స్ప్లెండర్ థింగ్"లో జెనిఫర్ జోన్స్ వేసుకున్న క్యాస్ట్యూమ్‌కు లభించింది. గౌను ఫాషన్‌ల మీద నాకు ఇంటరెస్ట్ లేకపోయినా ఆ సినిమాలో ఆ డ్రెస్ చూస్తూ వుంటే చాలా బాగుందనిపించింది.

*(అక్టోబరు 1956)*



## వైవిధ్య రమణీయం

# అమ్మమాట వినకపోతే

**నే**నూ, మా అన్నే ఉండేవాళ్లం మా యింటికల్లా పిల్లలం. మా యింటికెవరేనా పిల్లలొస్తే మాకెంతో సంతోషంగా వుండేది. ఎవరూ లేనప్పుడూ, మేం చదవనప్పుడూ మేమిద్దరం ఆడుకునే వాళ్ళం.

ఇలా ఉంటూంటే – మా యింటికి చుట్టాలొచ్చారు. వాళ్ళతో వాళ్ళ పిల్లలు ముగ్గురు వచ్చారు – సూర్యం, భాస్కరం, నారాయణ. మాకు లేక లేక నేస్తాలు దొరకడం మూలాన్నీ మా నాన్నగారు ఇంట్లోలేని మూలాన్నీ ఆ వేళ మధ్యాహ్నం అంతా ఆటలాడేశాం. ఆవేళ పౌర్ణమి రాత్రి వెన్నెట్లో దొంగాటాడుదాం అని పెంద్రాళే అందరం అన్నాలు తినేశాం. మా అన్నావాళ్లు అప్పుడే మా యింటిముందర సిద్ధంగా కూర్చున్నారు. నేనుకూడా వెళ్లిపోతూంటే, మా అమ్మ అంది. 'నాయనా! పొద్దున్నుంచి పుస్తకం ముట్టుకోలేదు కదా! యిప్పుడేనా చదవరాదూ! రాత్రిళ్లు ఆటలేమిటి? పురుగూ పుట్రానూ" అంది. నేనన్నానూ, అమ్మా! పొద్దున్నేకదే పుస్తకాల పెట్టి సర్దేనూ! పుస్తకం ముట్టుకోలేదంటావేం? అని అమ్మ ఒద్దంటున్నా కూడా పెరట్లోకి పారిపోయాను.

సరే, దొంగాటకి పంటలేసుకున్నాం. సూర్యం దొంగయ్యాడు. ఉన్నవాళ్ళలోకి నేనే కొంచెం చిన్నవాణ్ణి. అందుచేత నన్నే సూర్యం తరిమాడు. పరిగెడుతూ కంగారులో ఓ కప్పని తొక్కాను. బెదిరిపోయి నాలాగే గెంతుతున్న ఆ కప్ప నా కాళ్లకింద పడింది. ఆ కంగారుతో వరండాలోకి పరిగెత్తాను. పొద్దున్న తినిపారేసిన అరిటిపండు తొక్కమీద కాలుపడింది. అది బోరిగిల్లా వుందేమో పడీపడ్డంతోటే కాలుజారి కిందపడ్డాను. తలకి, మోచేతికి దెబ్బలు తగిలాయి. అప్పుడే ఆఫీసునించి వస్తున్న మా నాన్నారు నన్నప్పుడు తీసుకెళ్లి పక్కమీద పడుకోపెట్టి సేదతీర్చిన తరువాత తాపీగా నేచెప్పిందంతా విని ఫక్కున నవ్వి, అన్నారు:– "చూశావా! అమ్మకి పెంకి సమాధానం చెప్పి, అమ్మ వద్దంటున్నా ఆటకి వెళ్ళినందుకు ప్రతిఫలం చూశావా! అమ్మమాటే వినుంటే నీకీ తిప్పలే లేకపోనుగదా" అని బుద్ధిచెప్పారు. తక్కిన పిల్లలంతా బొమ్మల్లా నిలబడిపోయారు.

అప్పట్నుంచి నేను అమ్మ చెప్పినట్లు విని బుద్ధిగా వుంటున్నాను.

*(1945 'బాల' పత్రికలో ముళ్లపూడి వెంకటరమణ తొలిరచన)*




కృతయుగం:

"దేవీ! కూర బాగుంది."

"నాథా! లేతకాయలు దొరికాయి. నిప్పూ, నీరూ ఉప్పూకారం ఆ దైవ కృపవల్ల సమంగా కుదిరాయి."

"అవును దేవీ అంతా హరి కృప."

ఆ ధరిమేనా:

"దేవీ! కూర బాగుంది."

"హుఁ. పచ్చడి బాగులేదని సూటిగా చెప్పవచ్చు గదా. ఈ 'కూర బాగుందంటూ' డొంక తిరుగుడు దెప్పుళ్లెందుకుటా-!"

"దేవీ అపార్థం చేసుకుంటున్నావు."

"అవును. అర్థం చేసుకునే బుర్ర నాకెక్కడిదీ! అసలు నేనే ఒక పెద్ద అపార్థాన్ని. మీరు అసలున్నర అపార్థసారథి. అపార్థం చేసుకునేలా మాటలు విసిరి - నా చేత వాగించి - దూకుడెక్కువనీ నోరు చెడ్డదనీ నిందలు ప్రచారం చేసీ-"

"హే! కలహ భోజనా! నా భోజనమే నీకు దొరికిందా?"

కష్టాలు వచ్చినపుడు అందరూ దేవుళ్లకోసం తపస్సు చేస్తారు.

నేను ఈ కలహం కల్పించిన శ్రీ నారదుల వారినే ధ్యానించాను.

జుట్టు జడలు కట్టి గడ్డాలు బారెడేసి పెరిగి చుట్టూరా పుట్టలు లేచి పురుగూ పుట్రా కుట్టే దాకా రాకుండానే ఆయన దర్శనం ఇచ్చారు.

"దేవర్షీ! కూర బాగుందీ అన్నాను. అంతే. ఆవిడగారు–"

"వత్సా అపార్థ పీడితా! తాడితా! అంతా బోధ పడింది. బాధపడకు. ఇది అతి సహజం. వాగర్థాల వలె, పాలూ నీరూ, పూవూ తావీ, ఎండా నీడా, నీతీ అవినీతీ, దేశ్సేవా దోపిడీ, కౌగిలింతా వెన్నుపోటూ వగైరాల వలె అర్థం – అపార్థం కూడా విడదీయరానివి. అపార్థాన్ని అపార్థం చేసుకోబోకు. సాదా సీదాగా సాగుతూ విసుగనిపించే జీవితాన్ని సరదాగిరదాగా నడిపే వరమే అపార్థం.

సృష్టి జరిగిన కొత్తల్లో కృతయుగారంభంలో నరమానవుల కిదిలేదు. మిగతా అన్నిటిలాగే ఇది కూడా ఆ లీలావినోది వివరించిన చమత్కారం. జీవకోటిలో మానవులకే బుద్ధి జ్ఞానం ఇచ్చిన ఆ పరమాత్ముడు – అవి రెండు వికసించాలంటే అంబారవాలూ, ఝుంకారాలూ సైగలూ చాలవని భావించి భాష ఉండాలని నిశ్చయించి మనిషికి 'మాట'ను ప్రసాదించాడు. మాట రాగానే శ్రీమన్నారాయణుడి నాభిలోంచి బ్రహ్మ పుట్టినట్టే భాష బొడ్డులోంచి సత్యం – అసత్యం అని రెండు దినుసులు మొలిచాయి.

ఆ రెండోది – అదే – అ – సత్యం మంచిది కాదనీ – అధర్మమనీ, అది వాడకూడదని దేవుడు హెచ్చరించాడు.

అ–సత్యం, అ–ధర్మం తప్పయితే అ–హింస కూడా అ–ధర్మమే కదా అన్నాడు మనిషి. నల్లటి పెద్దాయన తెల్లబోయాడు. అయినా తన బిడ్డల మాటకారితనాన్ని పొగరుగా అపార్థం చేసుకోకుండా ముద్దు ముచ్చటగా మురిసిపోయాడు. అసలీ అపార్థం ఆయనతోటే ఆరంభమైంది. ఆ కథా ప్రకారాన్ని ఆవిష్కరిస్తాను. అవధరించు. అయితే ఇది దేవ రహస్యం అని గుర్తుంచుకో నాకూ, నీకూ, నరులకూ తప్ప మరెవరికీ తెలియరాదు. విను."

"మహర్షీ! అజ్ఞానిని. అమాయకుడను. ఇంతకీ అపార్థం అంటే సరియైన అర్థం ఏమిటి. చెప్పలేదు" అన్నాను.

"మనం ఒక భావంతో ఒక మాట అన్నపుడు – అది విన్నవారు ఇంకో భావంగా అర్థం చేసుకోవడం అన్నమాట. మనం తిట్టకపోయినా తిట్టినట్టు అర్థం చేసుకుని – ఆ కోపంతో మనని తిట్టి కొట్టబోవడం అనే పరిస్థితిని కల్పించే...." అంటూ నారదుల వారు మాట మధ్యలో ఆగారు. ఉరిమి చూశారు.

"ఓరీ ధూర్తమానవా! అర్థం తెలిసి కూడా తెలియనట్టు నటించి నాచేత వాగిస్తున్నావా!" అంటూ వీణ పైకెత్తారు.

"స్వామీ! శాంతి. నన్నపార్థం చేసుకుంటున్నారు. అర్థం తెలిసినా దాని తాత్పర్యం తమ ద్వారా 'ఎరుక'పరచుకోవాలన్న కోరికే తప్ప..."

"వత్సా! దాని తాత్పర్యం ఇదే. బోధపడిందా!" అన్నారు.

గుండె స్థిమితపడింది. తలూపాను.

"ఆహా ఎంత హాయిగా ఉంది" అన్నారు వారు నవ్వుతూ.

"అవును. చాలా హాయిగా ఉంది" అన్నారు వారు నవ్వి.

"చూశావా నరుడా! కోపం, భయం, బాధ ఇలాటివి పీడించి వెళ్లిపోయిన వెంటనే వచ్చే నవ్వుందే - అది సాధారణంగా నవ్వే నవ్వుకన్నా వేయి రెట్లు హాయి నిస్తుంది. అది అమృతం కన్నా రుచిగా ఉంటుంది."

ఔనని తలూపితే - 'అమృతం రుచి తెలుసురా నీకు' అంటాడన్న భయంతో నిజం చెప్పేశాను - "నేను అమృతం రుచి చూడలేదు స్వామీ!"

"అంటే నేను చూశానంటావా?" అని గద్దించాడాయన.

"నేనేమీ అనలేదు స్వామీ!"

"నేనూ రుచి చూడలేదు. మాటవరసగా అన్నాను... సరే ఆ రుచి మీ నరజాతికి తెలిసేలా చెబుతాను. నడిచి నడిచి ఎడారి దాటాక దొరికే దోసెడు నీరు- అడగ్గానే దొరికే గంగాజలం కన్నా రుచి ఎక్కువ. ఏకాదశి ఉపవాసం చేసి ద్వాదశినాడు తినే చారన్నం - నిత్యం తినే షడ్రసోపేతాహారం కన్న రుచి ఎక్కువ. అలాగే దుఃఖంలో వచ్చే కన్నీటి కన్నా - ఆ దుఃఖం గడిచిపోయిన సంతోషంలో వచ్చే ఆ నవ్వు కన్నీళ్ల రుచి ఎక్కువ. వాటిలో ఉప్పుండదు. 'అతి మధురం' ఉంటుంది.... కదా?... అందుకే ఆ శ్రీహరి - అన్ని పువ్వుల కన్న నవ్వుల పువ్వుల పూజే తన కిష్టమన్నాడు."

"అదెప్పుడన్నాడు?"

"ఎప్పుడా? ఆది మధ్యాంతాలు లేని వాడికి 'ఎప్పుడూ' ఉండేవాడికి ఇప్పుడు అప్పుడు అని కొలతలు చెప్పమంటావా? వ్యాధి వచ్చినపుడే దేవుడినీ, ఏడుపు వచ్చినపుడే దేవుడినీ తలచుకునే నరజాతికి ఆయన ఎప్పుడో ఇచ్చిన సందేశం ఇదే. ఏడుపొచ్చినపుడే కాకుండా నవ్వుతున్నపుడు కూడా నన్ను తలచుకుంటే - ఆ నవ్వులే నాకు పూజ అన్నాడు. నవ విధ భక్తి మార్గాలను ప్రకటిస్తూ - తను హృద్ భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్, వందనార్చనమున్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ నవ్వులున్ అను నీ తొమ్మిది భక్తి మార్గముల"-

"మహర్షీ! అది మా పోతనగారి పద్యం. అందులో చివర తొమ్మిదవ మార్గం 'నవ్వులున్' కాదు - చింతనం - బును - కదా?" అన్నాను.

'అధిక ప్రసంగీ! నాకే పద్యాలు నేర్పుతావా?' అన్నారు. వణికిపోయాను.

ముందు పుట్టింది తనా? పోతనా? తేల్చమన్నారు.

"పుట్టడం సంగతి ఎలా ఉన్నా... ముందుగ ఈ తెలుగు పద్యం చెప్పింది పోతనామాత్యుల వారే" అన్నాను ధైర్యంగా.

నారదుల వారు స్థిమితపడి హాయిగా నవ్వారు.

"చూశావా మళ్లీ అపార్థం. నీకేమిటి నాకేమిటి అందరికీ అంతే. అర్థం చేసుకోవడం కన్నా అపార్థం చేసుకోవడంలోనే దూకుడెక్కువ చూపిస్తారు. ఇంతకీ కథ విను."



### కృతయుగం (మళ్ళీ):

సృష్టిలో మానవులు స్తబ్దుగా భోంచేసిన మొసళ్లలా పడి ఉండేవాళ్లు. తిండి దండుకోడం, వండుకోడం, తిని పండుకోడం, లేచి వండుకోడం.... ఇదే వరస. 'తిండెక్కువ; జనం తక్కువ కాబట్టీ, అవిద్య అజ్ఞానాల వల్లనో వట్టి మంచితనమే తప్ప చెడ్డతనం ఉండేది కాదు. బుద్ధి పొరబాటున దేవుడు వాళ్లకి బుద్ధిని ఇచ్చినందువల్ల ప్రాణం విసుగెత్తింది. అదే. టెలుగూస్ భాషలో 'బోరు' కొట్టేస్తోంది.



### వైకుంఠం:

శ్రీ మహావిష్ణువు శేష శయనుడై ఇదే ఆలోచిస్తూన్నాడు. లక్ష్మీదేవి పాదాలు వత్తుతోంది.

"దేవదేవా పాహిమాం పాహిమాం" అంటూ కింది నుంచి ఆర్తనాదాలు వినిపించాయి.

"ప్రభూ! ఏదో సంక్షోభం" అంది లక్ష్మి.

"దేవీ! భూలోకంలో మానవుల ఘోష అది."

"దేనికి? వాళ్లకి అవసరమైనవన్నీ ఇచ్చారు గదా?"

"అవసరం లేనివి ఇవ్వలేదు. అది చెప్పలేక మూగ బాధ... దేవీ! ఇదింకా

కృత యుగమే కద.... వీళ్లు... అందరూ మంచి వాళ్లే. కోపతాపాలు తెలీవు. అసూయా ద్వేషాలకు ఆస్కారం లేదు. మంచి జీవితం మైదానంలో నదిలా నిదానంగా నడుస్తూంటే వాళ్లకి విసుగెత్తిపోతోంది. కాలక్షేపం కోసం ఏదైనా చెయ్యమంటున్నారు."

"బాగుంది. మనం వెళ్లి కథలు చెప్పాలా?"

"అవసరమైతే అదీ చెయ్యాలి. నీకేమైనా కథలు తెలుసునా?" అన్నాడు శ్రీహరి ఓరకంట చూసి. లక్ష్మి కథ చెప్పింది.

"అనగనగా ఒక మంచివాడు. అతని భార్య మంచిది. అత్తా మామలూ ఆడబిడ్డలూ చాలా మంచివాళ్లు."

"ఆ తరువాత?"

'వాళ్లకి గంపెడు పిల్లలు. వాళ్లసలు అల్లరే చెయ్యరు. మంచి మంచి ఆటలు ఆడుచుండిరి.'

"ఆటలలో గెలుపు మొగ పిల్లలదే అయి ఉండాలి అవునా?"

"ఆడ మగ తేడా కూడా లేదు నాథా! అందరూ గెలుచుచుండిరి. అసలు ఓడిన వారే లేరు. ఆటల పిమ్మట చక్కగా స్నానాలు చేసి...."

హరి ఆవులించి చిటికె వేశాడు.

"ఓ దేవీ!"

"ప్రభూ!"

"ఆ భూదేవి చెప్పే కథలు – 'అలాగా! ఆ తరవాత ఏమైందీ' అని అడిగే విధంగా ఉంటాయి తెలుసా?"

"హూఁ"

"దేవీ!"

"హూఁ"

"అలకా?"

"అలకెందుకు? నాకు తెలుసు. ఆవిడగారి కథలే మీకు బాగుంటాయి. నా దృష్టి సర్వదా మీ పాదాల మీదే కానీ, మీ బుద్ధి సర్వదా ఆమె పదాల మీదనే...." అంది శ్రీదేవి నిష్ఠూరంగా.

"అది కాదు ప్రాణేశ్వరీ! కథ చెప్పినపుడు చెప్పినదే చెప్పకుండా కొత్త సంగతులు కొత్త మలుపులు ఉంటేనే గదా ఉత్సాహం?" అన్నాడు శ్రీహరి. శ్రీసతి ఆలోచించింది.

"సరే ఉత్కంఠ కలిగించే కథ చెప్తాను వినండి. అనగనగా ఒక రాజసేవకుడు. అతను ప్రతి రాత్రి రాజుగారికి పాదాలు వత్తి, వారు నిద్రపోగానే ఇంటికి వచ్చేవాడు. రాగానే అతడి భార్య అతడికి పాదాలు వత్తేది."

"అవును పతివ్రత కదా! అది సహజం కదా. ఇందులో మెలికేముంది?"

"వినండి. ఒకనాడా సేవకుడు తన భార్య పాద సంవాహనాన్ని మెచ్చుకుంటూ ఇలా అన్నాడు. 'ఓ ఇల్లాలా! నీ పాద సేవ బాగుంటుంది గాని రాజుగారు నా చేతి వాటాన్ని ఎంత మెచ్చుకుంటారో తెలుసునా? ఓ సేవకా! నీ చేతులలో ఏదో గొప్ప శక్తి ఉందిరా. నీవు పాదాలు వత్తితే ఉండే సుఖం బహుశా ఆ మహావిష్ణువుకు కూడా దొరకదు' అని మెచ్చుకుంటారు అన్నాడట."

'అంటే నీకన్న గొప్ప చేతులా?" అన్నాడు విష్ణువు.

"కాబోలు... వినండి.... ఆ మాటలు వినగానే, అతడి భార్య అతడికి వందనం చేసి అడిగింది. 'ఓ నాథా! మీ చేతులలో ఉండే ఆ మహిమను, ఆ ఒడుపును నాకు బోధపడేలా ఉపదేశిస్తారా?" అంది లక్ష్మి.

"ఆ తరవాత ఏమైంది?" అన్నాడు విష్ణువు.

"అదే ఉత్కంఠ. చెప్పమంటారా?" అందావిడ ఓరగా నవ్వి.

హరికి అర్థమైంది.

"వద్దులే వద్దులే" అన్నాడు కంగారుగా.

"ఎందు కా కంగారు? భయం? ఆవిడలాగే నేనూ పాదాలందించి వత్తమంటాననా?"

"దేవీ!?"

"ఏ దేవి? శ్రీదేవా? భూదేవా? ఈ దేవి అలాటి పనులు చేయదు. ఆ దేవే - ఆ భామాదేవే ఆ సత్యభామా దేవి - నా విద్యని మీ ద్వారా నేర్చుకుంటుంది.... అప్పుడేమో...."

❀ ❀ ❀ ❀ ❀

పద్మనాభస్వామి పైన - పద్మంలో కూర్చున్న బ్రహ్మదేవుడు ఈ కలవరం విని - కూర్చున్న పళంగానే, కాస్త ముందుకు వంగి కిందకి తొంగి చూశాడు.... తల్లితండ్రులు గొడవపడుతున్నారు....

"అత్తగారేనా? ఆవిడ గారంతే" అంది సరస్వతి అటు చూడకుండానే వీణ వాయిస్తూ.

"సరస్వతీ, ఇటు చూడకుండానే - నేనేమీ చెప్పకుండానే - ఆవిడగా రంతే అంటున్నావు.... ఆవిడ శ్రుతిపెంచి మాట్లాడ్డమే నీకు వినిపించింది కాని - మా తండ్రిగారు గుట్టుగా చేసిన చిలిపి పని కనబడదు గదా! అమ్మ నేమనకు-" అన్నాడు బ్రహ్మ.

"అంటే అలాటి కథ చెప్పడం ఆవిడ తప్పు కాదంటారా?"

"అలాటి కథ ఆవిడ చేత చెప్పించడం ఆయన తప్పుకాదంటావా?..... చేసేదీ, చేయించేదీ, వాగేదీ, వాగించేదీ అన్నీ తానే అంటాడు గదా?"

"మధ్య నన్నెందుకు హేళన చేస్తారు?"

"నిన్నేమన్నాను?"

"వాగేదీ, వాగించేదీ అంటూ - నా వాగీశ్వరి బిరుదు మీద శ్లేష వేస్తున్నారు."

"అపార్థం చేసుకుంటున్నావు దేవీ!"

"అపార్థమా? అదేం మాట.... వాక్కు - అర్థం - వాగర్థాలు అని ఉన్నాయి గాని అపార్థం అనేది వినలేదే..."

లోపలికి రాబోతున్న నారదుడు ఈ మాట విని అట్నుంచి అటే కైలాసానికి ఎగిరి వెళ్లాడు.

"శంభో మహాదేవ! వందనం!" అర్ధనారీశ్వరుడు ఇబ్బందిగా చూశాడు తనొక్కడి పేరే చెప్పి వందనం చేసినందుకు. పార్వతి మరోవేపు చూస్తోంది ఇది గమనించనట్టు. పైన గంగాదేవి నవ్వును అణచుకుంటోంది.

"నాయనా! నీ కలహాశనానికి కైలాసమే దొరికిందా?" అన్నాడు శివుడు.

"దేవా! నేనందుకు రాలేదు. మీరిద్దరూ వాగర్థాల వంటి వారని కవులు కీర్తిస్తారు. కాని వాగపార్థాలు అన్నవి ఉన్నవా అని తెలుసుకుందామని-"

"అపార్థమా! అదేవిటి?" అన్నాడు శివుడు.

"జగన్మాతా! మీరు చెప్పండి. 'అపార్థం' అనేది లేదంటారా?" అన్నాడు నారదుడు.

"ఎందుకు లేదూ... ఆయనలో అర్థాన్ని నేనిక్కడున్నాను. అపార్థం మా 'శిరస్సు పైన కొలువై' కూర్చుంది. మేమే కొని తెచ్చుకున్నాము. లోకోపకారం కోసం ఆనాడు గరళం. ఈనాడు గంగారళం" అంది సతి.

"ఇపుడు నేనేమన్నానని ఈ సూటీ పోటీలు" అంది సవతి.



"ఎవరేమన్నారని కాదు. ఏం చేశారని. అయినా నేను ఒకర్నెందుకంటాను. నా బంగారాన్నే అంటున్నాను. 'ఆకాశం నించి దూకే గంగను - భూమి బద్దలు కాకుండా తాకిడి భరిస్తాను' అన్నారు. ఇపుడు ధరిస్తున్నారు. 'భ' అనలేదు. 'ధ' అన్నాను నువ్వు 'భ' అని అపార్థం చేసుకున్నావు" అన్నారు.

ప్రమథ గణాలలో కలవరం నంది భరించలేక ముందుకు వచ్చాడు.

"మహర్షీ! వందనం! దయచెయ్యండి" అన్నాడు చెరుగ్గడ కొరుకుతున్నంత మృదువుగా.

"నాయనా నందీశ్వరా! దయచెయ్యండి అంటే రండి అని ఒక అర్థం ఉన్నా పొండి అని ఒక అపార్థం కూడా ఉంది. పదం అదే అయినా స్వరంవల్ల అర్థం మారుతుంది. నువ్వే అర్థంలో అన్నావో నువ్వే చెప్పు...."

నంది ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

"పోనీ నువ్వు చెప్పవయ్యా గణేశా!"

గణేశుడు హాయిగా నవ్వేశాడు.

"బాగు బాగు. మొత్తానికీ అపార్థం మీమాంస అనేది మంచి కాలక్షేపమే" అన్నాడు ఎటూ తేల్చకుండా.

"కాలక్షేపమేం కర్మ.... లాభసాటి కూడా.... లోగడ భూ ప్రదక్షిణానికి పోటీ జరిగితే - తల్లిదండ్రుల చుట్టూ తిరిగితే అదే భూప్రదక్షిణం అని అపార్థం తీసి నెగ్గేశావు.... అపార్థాలకి నిన్నే ముందు చెప్పాలి" అన్నాడు కుమారస్వామి.

❀ ❀ ❀ ❀ ❀

కలియుగం:

ఆంధ్రప్రభ కార్యాలయం.

"శ్రీకాంత శర్మగారూ! మీరు ఈ అపార్థ రచయితకి అసలు పురమాయించిన దేమిటి" అన్నాడు రచన చదువుతున్న సహ సంపాదకుడు.

"అదే... మన కృష్ణాష్టమికి ఏదైనా రాయమన్నాను."

"ఓహో. ఏదైనా అన్న మాటని ఏది పడితే అది అని ఈ రచయిత అపార్థం చేసుకున్నట్టుంది.... ఇన్ని పేజీలు చదివాను. ఇంతవరకు కృష్ణుణ్ని గురించి ఒక్క ముక్కయినా రాయలేదు.'

దూరవాణి:

"పొరబాటు సార్! నాది కాదు మీది... ఒక్కటేమిటి. ఈ రచనలోని అన్ని ముక్కలూ ఆయనవే. పాలలో వెన్నలా వ్యాపించి ఉన్నాడు."

'హనుమాన్లు గారూ! మధ్యలో తమరెవరు?"

"అదే అపార్థ రచయితనండి. అసలీ అపార్థం కల్పన ఆ పార్థసారథే."

"తమరు తప్పులో కాలేశారు. మీరు రాస్తున్నది కృతయుగం గురించి. అప్పటికి కృష్ణుడు పుట్టలేదు గదా."

"అంటే నా ఉద్దేశం.... విష్ణుమూర్తి అమాయకుడండి. ముక్కు సూటి దేవుడు. ఎవడేనా రాక్షసుడున్నాడంటే వెంటనే వెళ్లి చంపేసి వచ్చి పడుకునేవాడు.

తన చేతికి బురద అంటుకోకుండా దుష్టశిక్షణ పనులు జరిపించే శిల్పం శ్రీ కృష్ణుడిదే. జరిగిందేమిటంటే-

కృతయుగంలో ఈ 'మంచితనం - భరించలేని తనం' లోంచి పుట్టి పీడించే బోర్‌డం - అనగా విసుగు అనే రాక్షసుడిని ఎలా చంపాలో విష్ణువుకు పాలుపోలేదు. అటు ప్రజలు విసుగువల్ల అన్నిటా ఆసక్తి తగ్గిపోయి గడ్డాలు పెంచేసి (ఆడవాళ్లు కాదు) తపస్సులోకి వెళ్లిపోయేట్టున్నారు. అప్పుడు రాబోయే ద్వాపర యుగంలో పుట్టబోయే గడుసు కృష్ణుడి బుర్రలో ఆలోచించి ఈ అపార్థం అనే పదార్థాన్ని సంకల్పించి కల్పించాడు... అది మహా 'వృక్షమై శాఖోపశాఖలుగా కొమ్మలూ రెమ్మలుగా వర్థిల్లింది. అంచేత లలితస్కంధము కృష్ణమూలమే... తొలి ప్రయోగం విష్ణువే బాలవటుడు - వామన రూపంలో చేశాడు. బలిచక్రవర్తిని పొగిడి మెప్పించి దానం అడిగాడు. చేజారి దేహి అని కాళ్లాచి దండించాడు. అడిగింది మూడడుగుల 'మేర' అయితే బలి మూడడుగుల 'నేల' అని అపార్థం చేసుకున్నాడు. ఇంతే గదా అనుకుని అంతేలేని దానం ఇచ్చాడు.... దరిమిలా త్రేతాయుగంలో ఈ అపార్థ పదార్థం బాగా విజృంభించింది.

రాముడు మాయలేడి మంచిలేడిగా అపార్థం చేసుకుని తరిమాడు. రామబాణం తగిలి మారీచుడు 'హా లక్ష్మణా' అని పొలికేక పెట్టగానే - సీతమ్మ తల్లి రాముడికి ఆపద అని అపార్థం చేసుకుంది. 'రాముడు అసహాయ శూరుడు అజేయుడు' అని లక్ష్మణుడు గర్వంగా చెప్పబోతే - అతని భక్తిని కామంగా అపార్థం చేసుకుంది... ఆ తరవాత కథ ఎన్ని మలుపులు తిరిగిందో ఎలా ఉరకలు పరుగులు వేసిందో తెలుసు గదా. తెలిసినా కూడా - విష్ణుమూర్తి చెప్పినట్లు - తరవాత ఏమైంది అని మనం అడిగి చెప్పించుకునేటంత మహా ఇతిహాసం అయింది. అంతా అపార్థాల చలవేగదా! అంతేకాదు. సీతను చెర విడిపించిన రాముడు - లోకులు తనని కాముకుడని అపార్థం చేసుకుంటారన్న భయంతో - భార్యకి అగ్నిప్రవేశం ఏర్పాటు చేశాడు.... నిజానికి ఆయనే లోకాన్ని అపార్థం చేసుకున్నాడు. ఆ తరవాత ఎవడో ఒక పౌరుడి ఏకాభిప్రాయాన్ని లోకాభిప్రాయంగా అర్థం చేసుకుని నిండు చూలాలిని అడవిలో వదిలేశాడు.

"కొన్నేళ్ల తరవాత కుటుంబం అంతా ఏకమవుతున్న శుభవేళ - ఏది మరొక్క మారు 'హృదయేశ్వరి' " అంటూ మరొక్క శీల పరీక్షకై అగ్ని ప్రవేశం కోరాడు.

"భర్త తన పరిశుద్ధత చాటడం కోసం భార్యని అగ్ని పరీక్షలకు పెట్టడం రాముడికి అలవాటైపోతుందని అపార్థం చేసుకున్న సీతమ్మ తల్లి అగ్నిప్రవేశం బదులు భూగర్భప్రవేశం చేసి పుట్టింటికి చేరుకుంది."

'ఆడ' పిల్ల మళ్లీ ఈడకే వస్తుంది అని ఆ సీతమ్మ తల్లి - తల్లి అనుకోలేదు.

సత్య యుగాలు కరిగి అసత్య యుగాలు ద్వాపరం, కలి కదిలాయి. తన యుగం ద్వాపరం రాగానే జగద్గురువు అపార్థాల కథను ఉత్సాహంగా నడిపాడు. ఒక అమ్మ కడుపున పుట్టి ఇంకో అమ్మ చనుబాలు తాగి - అల్లరి చేశాడు. వీడు నా వాడే అని అపార్థం చేసుకుని యశోద-వాడిని రోలుకు కట్టింది. కొట్టబోయి ఏడ్చింది. కన్నతల్లికి దక్కని మాతృత్వ స్వర్గాన్ని ఏలింది.

దేవుడు తప్ప మరెవడూ చేయలేని మహత్కార్యాలు బాల్యం నుంచి చేస్తున్నా ఎప్పటికప్పుడు కృష్ణ మాయదారి దుప్పటీ కప్పి - వీడు చిన్న పిల్లడే అనీ, సాధారణ కాకపోయినా అసాధారణ మానవుడనీ అందరూ అపార్థం చేసుకుని రెచ్చిపోయేలా చేశాడు. లేకపోతే కౌరవులు తాళ్లతో కట్టేయగల మనుకోరుగదా!



కురుసభకు సంధికని రాయబారం వెళ్లి యుద్ధరాయబారంగా వినిపించిన మహాశిల్పిని ఏమని పొగడగలం? తీరా యుద్ధవేళ ఆయుధం పట్టననీ, కావాలంటే పగ్గాలు పట్టుకు రథం తోలగలననీ చెప్పాడు. పార్థ - రథ - సారథిగా పగ్గాలు చేపట్టిన ఆ జగద్గురువు నిజానికి రథసారథి కాదు; పార్థసారథే అయి పార్థుడినే నడిపాడు. ధర్మరాజు చేత 'అశ్వత్థామ హతః కుంజర' అన్న వాక్యానికి అర్థాపార్థ స్వరాలతో సంగీతం సమకూర్చాడు. కొడుకు చనిపోయాడని ద్రోణాచార్యులు అపార్థం చేసుకుని ఆయుధం దింపేశాడు. మరొకసారి ఆ గగన మండలంలోకి సుదర్శన చక్రాన్ని పంపి - సూర్యాస్తమయ భ్రాంతిని కల్పించాడు. సైంధవుడు మోర సాచి మెడ రిక్కించగానే అర్జునుడు అతడి తల తెగవేశాడు."

## కలియుగం:

కృష్ణాష్టమికి ఏదైనా రాయమంటే ఏదో రాసిన ఈ రచయితని సంపాదకులు అపార్థం చేసుకుని ఆనందంగా ఈ రచనని ప్రచురించారు/ లేదా/ తిరస్కరించారు. (ఏదైనా అపార్థమే.)

అసలివాళ అపార్థమే జీవనానికి ఆయువుపట్టు. బండిని సరదాగా నడిపే ఇంధనం.

గాలం చివర ఉన్న ఎర చేపని చూసిన సొరచేప బేవార్సు భోజనంగా అపార్థం చేసుకోకపోతే - జాలరికీ, జనానికీ భోజనం లేదు.

"ఒక్క రూపాయి జీతం చాలు మీ సేవకై ప్రాణాలు ధారపోస్తాను అనే దొరని ప్రజలు దొరగా అపార్థం చేసుకుంటేనే ప్రభుత్వాలు. (ఏవిటయ్యా నీ దేస్సేవ? దేశం కోసం ప్రాణాలు ధారపోస్తానన్నావు, మేమంతా పస్తులతో చస్తున్నాం అని తెగేసి అడిగితే - ప్రాణాలు ధారపోస్తానన్న మాట నిజమేకాని - నా ప్రాణాలు కావు; మీవి అని నా ఉద్దేశం. ఒక్క ప్రాణం ఏ మూలకని? మీరే నన్నపార్థం చేసుకున్నారు. నన్ను నొప్పిస్తున్నారు అని అనగానే మనం నాలిక్కరుచుకుంటున్నాం.)

చూడ్డానికీ వాడ్డానికీ బాగుండని కాకరకాయను ఛీ పో అంటున్నాం. చూడ్డానికీ వాడ్డానికీ షేపుగా ఏపుగా ఉండే అయిస్ క్రీముని అపార్థం చేసుకుని జబ్బులు కొని తెచ్చుకుంటున్నాం.

బీద బట్టల వాళ్లంతా దొంగలనీ, గొప్ప బట్టల వాళ్లంతా దొరలనీ, పాముని తాడనీ, స్వాములార్లు దేవదూతలనీ, మన తప్పుల్ని చూపే వాళ్లు శత్రువులనీ, ఒప్పుల్ని పొగడేవాళ్లు మిత్రులనీ, మన రచనలు అచ్చు వేసే పత్రికలు మంచివనీ, వెయ్యనివి కావనీ - ఇలా....

ఆ - శ్రీ అపార్థ సారథి మన జీవన రథాలను తోలుతూనే ఉన్నాడు.

"ఏమయ్యా స్వామీ నిజమేనా" అని అడిగితే నవ్వీ నవ్వనట్టు నవ్వుతాడు.... మనం దెబ్బతిన్నపుడు గొడవ పెడితే - "మీకు స్వయంగా ఆలోచించగల బుద్ధి నిచ్చాను. తెలుసుకోండి. తేల్చుకోండి నాదేముంది" అంటాడు.

"మా బుద్ధిని నడిపేది నువ్వే కదా" అంటే - "ఎబ్బే బుద్ధి: కర్మానుసారిణీ" అంటాడు. "మీపాటి లౌక్యం నాకూ తెలుసు. మీకు నచ్చినవన్నీ నా మహిమ; కాకపోతే మీ కర్మ" అంటాడు.

**దొంగ దొరకడు.**
**మనకే కాదు**
**తనకే దొరకని దొంగ**
**కృష్ణం వందే జగద్గురుమ్.**

**(1996)**

# మితభాషణం




**సభకు హలో పలికినపుడు మిభాణమును మరిచిపోకు అన్నారు పెద్దలు.**
**ఏవిటి సార్?**
**ఇంతకీ మిభాషణం అనగా**
**అర్థం యేమిటీ అంటారా?**

**మి**భాణం అంటే మితభాషణం అనగా ఎక్కువగా మితిమించి అనగా అధిక ఎక్కువగా అనగా వినేవాడికి హోవులింతలు వచ్చేలా అనగా చప్పట్ల బదులు చిటికెలు కొడుతూ బోరుకొట్టి పారిపోయేలా అంతగా మాట్లాడడమని అర్థం. అది ధర్మంకాదు! జీవహింస కోవలోకి వస్తుందని డాక్టర్ జంధ్యాలగారు అమితంగా సచిత్రంగా నిరూపించారు గదా!

నిజానికి నేను నంబర్ వన్ 'మిభా'ని అనగా అమితి మిత భాషిని అనగా మితిని అమితంగా మన్నించి మితిమించని మితిలో రెండు వాక్యాలకు అర్ధవాక్యాన్నీ

అర్ధమాటకు పావు మాటనీ పలికేవాడిని. మీరు వెంట వెంటనే చప్పట్లు కొట్టకపోతే నా ప్రసంగానికి ఇచ్చిన కోటా నిముషాల్లో కొంత వృథా అయిపోగలదు.

నేనెవరనుకుంటున్నారు? అనేక సభలలో 'మిథాగ్రేసర చక్రవర్తి' అని బిరుదాలు, సత్కారాలు పొందిన వాడ్ని. ఇహ నేను చప్పట్లకు ఆగను. దయచేసి కొట్టకండి. టైము ఆటో మీటరులా పరుగెడుతోంది. టైము అనగా కాలము. చాలా విలువైనది. దానికి విలువకట్టలేరు. ఎంచేతనంటే కాలము అమూల్యము. బజార్లో మనం మిరపకాయలు కొనగలం చింతపండు కొనగలం, వరుగులు కొనగలం, ఇడ్లీలూ - కిడ్నీలూ కొనగలం, మందులు కొనగలం, మందూ కొనగలం, వేరుశనక్కాయలు కొనగలం, పెట్రోలు కొనగలం, చెప్పులూ, బూట్లూ కొనగలం, గొడుగులూ గోంగూరా కొనగలం, కథలూ - కాకరకాయలూ కొనగలం, మరమరాలు ..... కొనగలం, దేవుడు మేలుచేస్తే ఇళ్లూ వాకిళ్లూ కొనగలం, జిలేబీలూ పూతరేకులూ, చ్యవనప్రాశా, చేంతాడు కొనగలం, ఇంకా మైకులు కుర్చీలు, షామియానాలు కొనగలం, బాల్చీలు లాల్చీలు కొనగలం, కానీ కాలాన్ని మాత్రం కొనలేం. కాలాన్ని వృథా చేయటం క్షమించరాని నేరం.

వెళ్లిపోయే నీరు వెనక్కి రాదు సీతా! అన్నాడు రావణబ్రహ్మ.... కాలమూ అంతే! ఈసభా నిర్వాహకులు ఉదయం మా ఇంటికొచ్చారు కుశలప్రశ్నలూ కాఫీలూ ఆత్మస్తుతులూ పరనిందలూ మితంగా కానిచ్చేశాం. అప్పుడు అధ్యక్షుల వారు నాకు మళ్లీ నమస్కరించి - నేనంటేవారికి కేవలం గౌరవం మాత్రమే కాదు, మహాభక్తిలెండి - అది వారికున్న అనురాగం ఆ సిగ్గులు చిరునవ్వులు చూడండి - సరే! వారు నాకు నమస్కరించి "అయ్యా! హనుమాన్లుగారూ! మీరు ఈనాడు మాసభలో మాఆడకపోతే-అనగా మాట్లాడకపోతే అన్నమాటల్లో 'ట్ల' శబ్దాన్ని సగానికి పైగా తగ్గించి 'మాఆడకపోతే' క్లుప్తీకరించారు. అది అన్నమాట 'మిథాశిల్పం'. అనగా మితభాషణ శిల్పం, అదే మీరు మా ఆడకపోతే మేము సాముహిక సూసైడు కమిట్ చేస్తాం" అన్నారు. సూయి సైడులో 'యి' తగ్గించి మితంగా 'సూసైడు' అన్నారు. అనగా ఆత్మహత్య అనగా ఆత్మను హత్యచేసి అధర్మ కార్యాచరణకు కంకణధారణచేసి - సారీ! మిథాశిల్పాన్ని విశ్లేషపరచబోయి శాఖాచంక్రమణం అనగా ఒక పాయింటు కొమ్మమీంచి మరో జాయింటురెమ్మమీదకి కోతుల్లా దుమికి - ఆ దుమికే దుర్గుణం చాలామందికుంది సుమండీ! ఆ చాలామందిలో మీరుండర్లెండి!

ఇంతకీ నేంచెప్పవచ్చింది వారు నన్నల్లా బెదిరించగానే అదే ఆత్మను హత్యచేసి అధర్మ మార్గంలో పేట్రేగిపోదామని వారు - చూశారా చూశారా? ఆ నిర్వాహకులు అనే బదులు 'వారు' అనే పదం ద్వారా క్లుప్తీకరణ సాధించాను. మిథాణం శిల్పరహస్యాలు ఇలా ఎన్నో. సరే! వారు అలా అనగానే నేను తలవంచి- "అయ్యా! మీరు ఆత్మహత్యలు మాత్రం చేయకండి. నేను మీక్కావలసినంతసేపూ మాట్లాడతాను" అన్నా. 'అన్నా'-'ను' అనలేదు. గమనించారా? అప్పుడు వారు "మాక్కావలసినంతసేపూ మీరు మాట్లాడలేరూ ఎందుకంటే మీరెంత మాట్లాడినా

మాకు తనివితీరదు. తనివే తీరని వారికి విసుగెలా వస్తుందీ? కానీ మీకూ మాకూ మధ్య అజ్ఞాన మూర్ఖాగ్రేసర చక్రవర్తులనే సభాసదులుంటారూ వారికి గంటలు కాదు సెకన్లలో విసుగు వచ్చేస్తుందీ అందువల్ల వారు భయపడి ప్రతివ్యక్తికీ ఒకే ఒక్క నిమిషం అంటే అక్షరాలా అరవై సెకన్లు కేటాయించారూ అందువల్ల మీరు కూడా అంతే మాట్లాడండీ అరవై సెకన్లు దాటారో ప్రేక్షక గూఢచారులు కరెంటు ఆపేస్తారూ ఆ చీకట్లో బయటికి మోసేస్తారూ తిరిగి లైట్లు వచ్చేసరికి ఇంకోవక్త కనబడి వినబడుతుంటారూ" అని హెచ్చెరుక చేశారు.

"ఛీఛీ! మితాగ్రేసర చక్రవర్తి బిరుదందుకున్న నాకే మితభాషణం గురించి పాఠాలు చెబుతారా?" అని ఛర్రున లేచాను. "సరే! ఇది అవమానంగా కాదు ఛాలెంజ్‌గా తీసుకుని అరవై సెకన్లలోనే నేనూ ముగిస్తాను. అనక ఏడ్చి మొత్తుకున్నా పెదవి కదపను ఖబడ్దార్' అని నేనూ వార్నింగిచ్చాను. అలా శపథం చేశాకనే మీముందుకొచ్చానని చెప్పడానికి నేను సవినయంగా గర్విస్తున్నానని సగర్వంగా మనవి చేసుకుంటున్నాను.

ఇందాక నే మనవి చేసినట్టుగా కాలం విలువైనది. బీరుకాయలు బీరకాయలు కొనగలం కానీ కాలాన్ని కొనలేం. కనక ఎక్కువగా మాట్లాడమంటే మీలాగే నాకూ మహాచిరాకు, అసహ్యం, కానీ చాలామందికి ఈ జబ్బుంది. ఇంట్లో వీధిలో సభలో గిభలో ఎదుటివాణ్ణి బోరుకొట్టేస్తుంటారు. వినేవాళ్లు అనగా తమరు ఒక్కముక్కలో చెబితే అర్థంకాని మూఢులా? చెవిటివాళ్లా? అర్థం చేసుకుని చప్పట్లు కొట్టలేని సంస్కారహీనులా? అర్థంచేసుకుని చప్పట్లు చివాట్లు పెట్టలేని అసమర్థులా? అ? కానీ ఈ జ్ఞానం చాలామందికి ఉండదు.

కానీ నేను అతివాగుడువాడిని కానేకానని మీరు ఈపాటికే పసిగట్టేసేవుంటారు. మితవాగుడువాణ్నని థ్రిల్లై పోతూ వుంటారు. అయినా మీకు నాకూ మధ్య సభా నిర్వాహకులనే అడ్డగోడవుంది. హుఁ! అరవై సెకన్లుట! అదీ మనకిచ్చిన కోటా! హైఁ! అరవై ఎందుకు? నేను తలచుకుంటే ఆరు సెకన్లలో అదరగొట్టి ముగించగలను. నేను ముందే మనవి చేసినట్లుగా కాలం వెలకట్టలేని వస్తువు. ఆవును కొనగలం, దూడను కొనగలం, దొంగనూ కొనగలం, ఉంగరం కొనగలం, కానీ కాలాన్ని కొనలేం!

అసలు ప్రసంగానికి నేనివాళ మీకిచ్చిన ప్రసంగం కోటా ఆరు కేవలం ఆరేఆరు సెకన్లు మాత్రమే. సభలో నిజంగా.... చీకటీ మైకు మాత్రమే ఉండాలి. అరె! అరె! కరెంటు పోయిందే! మా మాటలు వినిపించవా? ఒరే! ఒరే! నన్ను మోసేయకండి నేను నడవగలను? ఏమిటీ? నడిస్తే చాలదా? పరిగెత్తాలా? చెప్పులు విసురుతున్నారా? అలాగే. అయితే మీరే మోసేయండి. ఏమిటీ కేకలు, చప్పట్లు? ఇంకా కావాలనా? చాలనా? తిట్టేది నన్నా? నిర్వాహకులనా?

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హాస్యోత్సవాలలో శ్రీ ధర్మవరపు
సుబ్రహ్మణ్యంగారు చదివి పెట్టిన వ్యాసం - నవంబరు 1996)

# లెటరేచర్ వన్స్‌మోర్

(చూ: "జ్యోతి" తొలి సంచిక - దొరికితే)

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగార్కి,
ఆంధ్రప్రదేశ్ ముఖ్యామాత్యులు,
హైదరాబాద్.

ఆర్యా,

| | | రు. | పై. |
|---|---|---|---|
| చింతపండు (గింజతో) వీశ 1కి | | ... | ... |
| మిర్చి (నాసిరకం) | | ... | ... |
| పంచదార (పంచదారకన్న పరదారే తియ్యన) | | ... | ... |
| నూనె (కల్తీది) వీశ 1కి | | ... | ... |
| ఇంటి (??) అద్దె!! చ. అం. 1కి ... చౌన | | ... | ... |
| మందులు (ధర్మాసుపత్రిరేటు) | | ... | ... |
| డాక్టరు బిల్లు (డిటో) | | ... | ... |
| ఆవాలు, మెంతులు వగైరాలు | | ... | ... |
| కాఫీ (?) పవుడరు | | ... | ... |
| పా----లు | | ... | ... |
| బస్సులు | | ... | ... |
| బి...బి...బియ్యం బాబోయ్ (దొరికితే) | | ... | ... |
| చౌకడిపోదగ్గిర బ్లాకు | | ... | ... |
| డిపో రేటు (అమ్మబా...) | | ... | ... |
| రాబడి... లంచాలు...మీకు తెలుసు | ???-??? | ... | |
| డిటో జీతాలు... (చెప్పనులెండి) | | ... | ... |

ఇట్లు,
చిత్తగించవలెను,
భారీ కుటుంబరావు.

**తాజాకలం:** లోగడ శ్రీ గౌ॥ డా॥ సంజీవరెడ్డిగారు మా జీవిత సారధిగా ఉండగా ఈ కాపీ వ్రాసుకున్నాను. తిర్గి తమకు పంపడమైనది. తమకు చేరాలన్న పేరాసతో, ఏదో జరుగుతుందన్న దురాశతో శ్రీ అప్పొజిషన్‌వారి ద్వారా పంపితిని.

భా॥కు॥రా॥

**తా॥క॥:** శ్రీ సాహిత్య ఆకాడమీవారు ఈ రకం సాహిత్య మంతటినీకూడా 14 భారతీయ భాషల్లోకీ, ఆంగ్లములోకీ కూడా తర్జుమా చేయించి (చదవని పొరబాటువల్లనే అనుకోండి) ఇంటిగుట్టు రచ్చ కెక్కిస్తారన్న భీతిచే ధరల వైనాలు వెయ్యలేదు. ఐనా తమరు కావాలంటే తెలుసుకోలేరా యేవిటి? గూఢచారులను పంపగలరు.

భా॥కు॥రా॥

**తా॥క॥:** మన్నించాలి. పేరు అచ్చుపడాలన్న పేరాసతో దీన్ని రాశాను. మీరేం చెయ్యొద్దు. చేస్తే మీరు క్వ్యాలోనించుని బియ్యం కొన్నంత ఒట్టు.

భా॥కు॥రా॥

## "ధర" సింహాసనమై...

శ్రీ రైల్వేల వారికి వేలాది నమస్కృతు లొనర్చి వ్రాసుకునేది.

సరుకు రవాణావిషయంలో తమరు మాకు చేస్తున్న సహాయ సహకారాలను, ధరా–తలంమీద మేమున్నంతకాలం మరువబోము. ఇటీవల ఆంధ్రలో వరుణదేవులవారున్నూ దయతలచి పై యేడాదికూడా ధరలు వర్థిల్లడానికి దోహదం చేసినారు.

– *వెలగపాటి ధరవరరావు,*

'కొందరు' బియ్యం వర్తకుల సంఘ కార్యదర్శి

**తా॥క॥:** అయ్యా మీరేం చేస్తారు? రైళ్ళు గుద్దుకుంటున్నాయి. వరదలొచ్చి పట్టాలు కదిలిపోతున్నాయి. వంతెనలు కూలిపోతున్నాయి. సృష్టిఅంతా రవాణాకు వ్యతిరేకమని విశదం అవుతూంది. గూడ్సులు ఎన్ని గుద్దుకున్నా ఫరవాలేదు. ప్రయాణీకులయితే తప్ప ప్రజలు ప్రభుత్వం పట్టించుకోరు.

– *వె॥ధ॥వ॥రా॥*

# మధ్యప్రదేష్

శ్రీ రాష్ట్ర ప్రభుత్వము వారికీ

ఆళ్‌రడ్‌యా

సబ్జెట్: ఎండుకొక్షిన గొడవ (లేక డ్రై-శా)

మద్యపాన నిషేధమును ప్రవేషెపెట్టెయ్యరాదూ, మహారాష్ట్రములో తెగించి చేషారుట. దక్షిణభారత భాషలలో టెలుగు శ్రేష్ఠముగావున ప్రవేశపెట్టవలెను. -

ఇట్లు
మద్యాచారి
షృగిలింగ్ బార్డర్స్
మద్యప్రదేష్

# అన్యాయమ్

శ్రీ ప్రభుత్వమువార్కి

ఆర్యా,

ఈమధ్య ఆంధ్రలోగూడా మద్యపాన సరఫరా సక్రమముగా సాఫీగా సాగుటలేదని మనవి చేయుట కెంతయు చింతించు చున్నాను. రవాణాకీ దొంగ రవాణాకికూడా సమానమైన ఇబ్బందులు కలిగించుట తమకు తగవు కాదు.

సరఫరాల సఫరర్‌రావు
స్మగ్లర్స్ చౌక్
మద్యప్రదేష్.

# అ-సుర న్యాయము

శ్రీ మద్యసర్కార్ వార్కి
(కేంద్ర ప్రభుత్వం)

ఆర్యా,

సురాపానమును ఆంధ్రలో కొందరికి (తెలంగాణా) అనుమతించి మరికొందరికి (సర్కారు; రాయలసీమలకు) కాదనడంవల్ల కొందరు ఆయాప్రాంతాల ప్రజలకు సురాసుర సామ్యము చెప్పి. మమ్మల్నందర్నీ అసురులు అంటున్నారు. మామీద ఈ నింద లేకుండా చెయ్యడం మీకు ధర్మం.

తిరకా - సుర - ఘుపతిరావు
ఉసురుపాడు
మద్యప్రదేష్.

# "కల్తీ" నేరాలు

ఆర్యా;

దొంగ సారాలో ఈమధ్య కల్తీ దారుణంగా ఉంది. ప్రాణాంతకంగా ఉంది. అందువల్ల ఇటుపై దొంగసారా కేసులను దండించినపుడు, ఆ సారా కల్తీదనికూడా రుజువైతే కల్తీకిగాను అదనపు దండన వేయగోర్తాను.

సీ. మద్యవర్తి

శ్రీ - మదాంధ్రప్రదేష్.

**తా॥క॥:** ప్రజలమీద కనికరము చూపగోర్తాను.

- సీ॥మ॥వర్తి.

# కల్లు తెరవండోయ్

ఆర్యోయ్!

కల్లు తెరవండోయ్ బాబూ, కళ్ళు తెరవండోయ్.

కల్లు కనకారావు నిశానీ.

# కట్నుటు - "పన్ను"లు

శ్రీ ఆర్థిక మంత్రిగారికి

ఆర్యా,

నాలుగో ప్రణాళిక ఖర్చులో కొరత వసూళ్ళగ్గాను ఐదారు కోట్ల పన్నులు వెయ్యాలని పన్నుగడ జరుగుతున్నట్టు తెలుస్తోంది. వేసినపుడు వరవిక్రయం మీద అమ్మకంపన్ను, కొనుగోలుపన్ను రెండూ విధించినచో లాభము గల్గును.

ఒక ఆడపిల్ల తండ్రి,

కట్నప్రదేష్.

ఆర్యా,

మా అబ్బాయిలు ఐదుగురి పెళ్ళిళ్ళూ అయేవరకూ పై విధమైన శాసనాలు చెయ్యవద్దు. బాబ్బాబూ పిల్లలవాణ్ణి.

- కొడుకుల తండ్రి.

వరకట్న ప్రదేష్.

ఆర్యా,

సాహిత్యం నిండా పన్నులు (శ్లేషలు) గుప్పించి పేరు గడిస్తున్న సం-పన్నులమీద పన్ను ఒక్కింటికి రూపాయ పన్ను విధించాలి.

అపన్డితుడు
లేక అపన్నుడు?
పన్డరీబాగ్.

ఆర్యా,

ముగ్గురికి పైన పిల్లలు వుంటే సంతానంమీద (కొన్నాళ్ళపాటు) పన్ను వెయ్యండి.

– ఓ. బ్రహ్మచారి

ఆర్యా,

మీకిది న్యాయంకాదు. ప్రజలు పిల్లల్నికంటే, నా మీద పన్ను వేయడమేమిటి?

కె. సంతానం.

ఆర్యా,

బ్లాక్ – మనీ దండ(గ) యాత్రలు చాలాసరదాగా ఉన్నాయి. మీ పబ్లిసిటీ సిబ్బందికి నా ధన్యవాదాలు.

పే 'బ్లాక్' డెవలప్‌మెంట్
సమితి కార్యదర్శి.

ఆర్యా,

పత్రికలలో 'పేరాస' ఉత్త (చెత్త) రాల మీద పన్ను విధిస్తే పన్‌టుబాగున్‌టున్‌ది.

సిహెచ్. వి.కె. సుబ్బారావు

ఆర్యా,

బియ్యంకొట్టుక్యూలో నించుంటున్నామని ఇంత గొడవ చేస్తున్నారే – ఈ జనమంతా సినిమా క్యూలో నించోటంలే? అడగరేం!

– ఓ॥మం॥

*(నవంబరు 1964)*

# లెటరేచర్

ఆర్యా!

నేరాలూపిరిలాటివి
ఊరంతా పీలుస్తూ వుందురుకానన్
నేరము నేరము కాదిల
నేరములో "దొరకబడుటె" నేరము సుమతీ!

- బహ్వృచ కృత నేర విచికిత్సా సంహిత.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మాన భంగమందు
చకిత గోకులాగ్రజన్మ రక్షణమందు
బొంక వచ్చు నఘము బొందడధిప! - శుక్రనీతి

పంచాయితీ నుండి పార్లమెంటు దాకా ఎన్నికయ్యే దేస్సేవకులలో నేర చరిత్రగలవారు ఉండరాదని కొందరు దేశవిరోధులు దుష్ప్రచారం చేస్తున్నారు. కాని అది తప్పు. పదుగురాడుమాట పాటియై ధర జెల్లు అన్నట్లు మెజారిటీ జనం చేసేది తప్పే అయినా మెజారిటీ అయినందువల్ల అది ఒప్పే కావాలి. అయితీరాలి. కాబట్టి మన క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను, తదితర చట్టాలను ఈ క్రింది విధంగా పరిమార్చాలి:

హత్యలు చేయించుట/చేయుట.

మానభంగాలు చేయుట/ చేయించుట.

దోపిడీలూ రిగ్గింగులూ దొమ్మీలూ అన్నీ చట్టరీత్యా నేరాలు కావని నిర్ద్వంద్వంగా ప్రకటించాలి.

లేదా నేరము చేయడము నేరం కానేరదూ-

దొరికిపోవడమే నేరమూ అనే సవరణతో చట్టానికి పట్టం కట్టాలి.

సంకీర్ణ కేంద్రంలో గయ్యాళి రాష్ట్రప్రభుత్వాలకు అదనపు సహాయం చేసి ఆకట్టుకోవడంలాగే పార్లమెంటులో గవర్నమెంటు నిలుపుకోవడానికి ఇద్దరు ముగ్గురు ఓటర్లకు రెండు మూడు కోట్లివ్వడం కూడా నేరం కాదని విశదం చేయాలి.

- ఓ. టింగురంగారావు

ఆర్యా!

నేరాలనూ పాపాలనూ చులకన చేయడం నేరమేకాదు పాపం కూడా. నేరాలు చేసే అమాయక పౌరులను భయపెట్టి మంచి దారికి మళ్ళించడం దారుణం. అసలు నేరాలు లేకపోతే బతుకేలేదు. రావణాసురుడు, దుర్యోధనుడు లేకపోతే రామాయణ భారతాలు పుట్టేవా? ఆనాడెందుకు? ఈనాటి పోలీసు యిండస్ట్రీ, కోర్టు యిండస్ట్రీ, లాయరిండస్ట్రీ, జైలు పరిశ్రమ, బుక్స్ పబ్లిషింగ్, సినిమా, టీవీ ప్రొడ్యూసింగ్ పరిశ్రమలూ యివన్నీ బతికేవా - వీటిమీద ఆధారపడి కొన్ని కోట్ల మంది బతుకుతున్నారు. నేరాలను నిరోధించడం నిర్మూలించడం. పాలిచ్చేపాదుగును కోసివేయడం వంటివి. పళ్ళిచ్చే చెట్టును నరికివేయడం లాంటిది. కేవలం నేరం చేసినంత మాత్రాన దండించడం - దేశాన్ని అధోగతి పట్టించగలదు. తస్మాత్ జాగ్రత! జాగ్రత!

- దోషీ & నిర్దోషీ

❀ ❀ ❀

ఆర్యా!

నేటిమేటి చిత్రాలలో స్టూడెంట్సు లెక్చరర్లనీ, ప్రిన్సిపాళ్ళనీ నీచంగా చూడడం అవమానించడం సరికొత్త బోధగా ఉంది. అందువల్ల ఇటుపై పేర్లు మార్చి టీచర్లను స్టూడెంట్సు అనీ, స్టూడెంట్సుని టీచర్లు అనీ పిలిచే ఏర్పాట్లు చేయ ప్రార్థన

ఇట్లు

ఆచార్య దుర్గుణానంద

# సంభవామి యుగేయుగే

ఆర్యా!

అధర్మం పేట్రేగిపోయి ధర్మదేవత కాళ్ళు విరిగినపుడల్లా తాను భూమికి దిగివస్తానని శ్రీకృష్ణభగవానుడు ప్రకటించాడు. అట్టి అధర్మాన్నే అణచివేస్తే - ఆయనకి పనేముంటుంది? దేన్ని నిలబెట్టాలి...? అధర్మాన్ని నిర్మూలిస్తే - 'దేవుడుద్యోగానికే' ఎసరు... కృష్ణుడు మళ్ళీరాడు జాగ్రత!

తస్మాత్ జాగ్రత!

అ. ధర్మారావు

# రిమ్మతెగులు

ఆర్యా!

నేరం చేయడానికి చాలా టాలెంటు ఉండాలి. ధైర్యం ఉండాలి... నేరం చెయ్యనివాళ్ళు - చెయ్యకపోవడానికి పెద్దకారణం పిరికితనమే తప్ప మంచిగుణం కాదు. అవకాశం యిస్తే అభయం ఇస్తే అందరూ ఇంతో అంతో నేరాలు ఆనందంగా చేస్తారు.

ఒకసారి బెల్లమ్ముక్క బ్రహ్మదగ్గరకు వెళ్ళి - అందరికీ నన్ను చూడగానే నోరూరి మింగేస్తున్నారు. అని మొరపెట్టుకుందిట. వెంటనే బ్రహ్మ కళ్ళు మూసుకున్నాడుట! తిలోత్తమను సృష్టించినపుడూ అంతేట! బ్రహ్మదేవునికైన రిమ్మతెగులు అన్నారందుకే. కాబట్టి నేరస్థులను చిన్నచూపు చూడకండి. వారిని సమాజానికి, పాలక సంఘాలకు దూరం చెయ్యకండి.

- జి.కె. నేర్రాజు



చెడ్డవాడు పట్టపగలయినా కన్నుకొడతాడు. మంచివాడు అమావాస్యనాడు కన్నుకొడతాడు.

- అపరాధాకృష్ణ

*(2003)*




అందుకున్న పళ్లకన్నా అందనివి బహుతీపిరా
కొంటికి చూసిన వాటికన్నా దొరకనివి తీపిన్నరా

– శృఙ్గార నస తరఙ్గిణి. 23.35

పంచదార కన్న పరదార తీపిరా

– దేవులపల్లి కృష్ణశాస్త్రి

వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కన గాదె ఏరికిన్

– అల్లసాని పెద్దన

అడగక యిచ్చిన ముద్దే ముద్దు

– ఆత్రేయ

అడిగిన యివ్వని ముద్దే ముద్దు

– అనవుడు, నావుడు

బినా యాచిత్, దియా చుంబన్

- కింతు పరంతు

ప్రేమ పస; పెళ్లి నస

- యానన్

పెళ్లాం తీరిన కోరిక
ప్రియురాలు తీరని కోరిక

- బివ్వణ్ణ ఇడ

తీరేవరకే కోరిక
తరవాతంతా బో-రిక

- శ్పాగెట్టీ మొడిగ్లియానో

ము మ్ము మ్ము ముద్దంటే చేదా
నీకా ఉద్దేశం లేదా

- ఆరుద్ర

బంగారం కన్న శృంగారం బరువు

ముద్దెట్టుకున్నాట్ట - ముక్కట్టు కున్నాడు గాదు

- గురజాడ వెంకటేశం

మ్ము... ముద్దులు మూడు విధమ్ములు
ఇచ్చే ముద్దు రుచి; ఇప్పించుకున్నది రుచిన్నర;
ఒప్పని ముద్దు రుచిమ్ముప్పావు

- శృఙ్గార నస తరఙ్గిణి- 68:14

ఆల్ కామెడీస్ ఆర్ ఎండెడ్ బై మారేజ్
పేమ్ర కథలన్నీ పెళ్లితో 'అంతం' అవుతాయి

- డాన్ జువాన్ & లార్డ్ బైరన్

సిద్ధాంత మద్వైతంచ అర్థ రహితం తథా కదా ।
ఇద్దరు (మిథునం) లేనిదే మైథునం అసాధ్యం కదా
అందువల్ల అద్వైతము అర్థరహితం

- చార్వాక సంహిత

వెదురింట తేటె కాటేస్తే
వెదురు వేణువై పాడింది - కాళిదాసు

మైథునం దేహి బ్రహ్మేంద్ర!
ద్వైతాద్వైత సమన్వితమ్
ఇద్దరమ్ సమ్‌గరమ్ జరిపి
ఒక్కరమ్ ఐపోవడమ్! - కేళిదాసు

రతి సర్వత్ర వర్జయేత్ - యతి
మితి సర్వత్ర వర్జయేత్ - రతి
పతి సర్వత్ర వర్జయేత్ - 'బహుపతి' - వ్రత
సతి సర్వత్ర వర్జయేత్ - స-వతి
ఎవ్విరియాక్షన్ పొడ్ర్యూసెస్ ఈక్వల్ రియాక్షన్
- సర్ ఐశాక్ న్యూటన్
(ప్రతి క్రియకూ దానికి సమానమైన ప్రతి క్రియ)
ప్రతి క్రియాణాం శోభన్తే
రతిక్రియాం ప్రతిక్షణమ్-
- రంభోగ చిన్తామణీ
కోరిక అనే కర్పూర హారతి
పరిమళ విహారాలే - శృంగార విన్యాసాలు
- కర్పూర వసంతరాయలు

కర్పూరం కాబట్టే యిది చిరకాలజీవి కాదు. బతుకుబాట బారెడైతే, శృంగారం పొడుగు బొత్తిగా బెత్తెడే. కోరిక తీరేవరకే శృంగార రసం; ఆ తరవాత నీరసం. అయినా గంగిగోవుపాలు గంటెడైనా చాలు. సంసార సారం ఇదే నన్నట్టు, జీవకోటికి దీనిపైన మక్కువ ఎక్కువ.

శృంగారానికి పరమావధి సంభోగం; దానికి పరమావధి ఆనందం.

కుంభ గత ప్రదీప కళిక వలె - నిశ్చల నిర్మలానందం. ఆనందో బ్రహ్మాయనిపించే తురీయావస్థ.... అదీ కొన్ని క్షణాలే.... తరువాత ప్రమిదలోని స్నేహతైలం నిండుకోగానే, దీపం ఆరి వత్తి కొడిగట్టి - పొగలు దిగులుగా లేస్తాయి.

చెట్టుమీద దోర జామపండును చూడడం, నోరూరడం, కోయడానికి ఎగరడం, అందడం, కోయడం, కొరకడం (తొలిసారి), నమలడం - ఇదంతా సరదా - శృంగారం - దానిని నమిలి మింగివేశాక ఒక్క క్షణం తృప్తి - ఉత్తరక్షణంలో - తేనుపు - బ్రేవ్!

అయినా - అశాశ్వతమూ, అసత్యమూ, క్షరమూ అయిన ఈ శృంగారాన్నే పదునాలుగు భువనాలూ యుగయుగాలుగా ఆరాధిస్తున్నాయి.

సంభోగం స్వర్గంలో కూడా ఉంటుంది. కాని శృంగారానికి కరువే-అడగ్గానే ఒప్పుకుంటారు కదా - అంచేత సర్వసాధారణం. లేనిదీ కోరుకునేదీ శృంగారమే. అక్కడ చాలామందికి శృంగారం గురించి తెలీనే తెలీదుష!

ఒక కవిరుషి స్వర్గానికి వెళ్లాడు. చాలా ఆత్రంగా వున్నాడు. - ఏం కావాలయ్యా అని అడిగాడు ఇంద్రుడు. 'రంభోగం' అన్నాడు రుషి

అంటే?

అదే స్వామీ - రంభతో.... అంటూ సిగ్గుపడిపోయాడు.

'రంభా సంభోగం' కుదించి రంభోగం అన్నావా! సెబాష్ కవీ

ఆ తోటలోకి వెళ్లు. రంభ వస్తుంది - అన్నాడు ఇంద్రుడు.

తోటలోకి రంభ వచ్చి నిలుచుంది - మెకానికల్‌గా బట్టలు వూడదీస్తూ,

కవి కవితావేశంతో పేట్రేగిపోయాడు.

ధన్యుడిని రంభాదేవీ అన్నాడు దండం పెట్టి.

అప్పుడే? ఇంకా....

అంటే నిన్ను చూసి ధన్యుడినయాను. నీ కళ్లు కలువరేకులు. పెదిమలు దొండపళ్లు. కుచములు కుంభస్థలములు. తొడలు అరటి బోదెలు. ఘనజఘనాలు ఇసుక తిన్నెలు అంటూండగా రంభ బెదిరి చూసి దుప్పటి కప్పేసుకుంది.

వాటితో పోలుస్తున్నావు కవీ - నా అంగాలకన్నా అవే అంత బాగుంటే వెళ్లి వాటినే వాటేసుకు పండుకో అంటూ రంభ జంభారి యింటికి వెళ్లిపోయింది.

స్వర్గానికి వచ్చిన అతిథుల కోసం పెట్టిన భేటీ కుదరకపోతే ఆనాటి రంభా సంభోగం ఇంద్రుడి కోటాలో పడుతుందిట. (దాన్ని మాత్రం శచీదేవి అభ్యంతర పెట్టకూడదు - అది డ్యూటీ - బహ్వృచుడు)

అయ్యో! శృంగారం కోసం నాలుగు పంక్తులంటే పొమ్మంటావా! ఈ ఉపమాన భంగం భరించలేను అంటూ కాలుజారి పడ్డాడు కవి.

సంభోగం అనేది కేవలం విధి నిర్వహణ అయినందువల్ల - రంభకి శృంగారం బొత్తిగా తెలీదు. అందుకని కవిగారు లొట్టలు వేస్తే అలా అపార్థం చేసుకుంది.

కానీ స్వర్గంలో సంసారాలు చేసుకుంటున్న ఇతర దేవగణాలకూ - వారే యేమిటి - సాక్షాన్మహా విష్ణువుకూ శృంగారం అంటే ఎంతో సరదా. కాని స్వర్గానికి అందుబాటులో లేదు.

అందుకే-

ఎల్లవేళలా భయభక్తులతో కాళ్లుపట్టే లక్ష్మీదేవితో శృంగారం కొరవడి తనను కాళ్లతో తన్నే సత్యభామ శృంగారం కోరి, శ్రీ వైకుంఠుడు విరక్తుడై భూలోకానికి దిగివచ్చాడు.

ఆయనే కాదు - ఎందరో దేవతలు, స్వర్గం చేరిన ఋషులూ, ఊర్వశిలాటి అప్సరసలూ శాపాలు ఇప్పించుకుని మరీ భూలోకానికి దిగివచ్చారు ఉబలాటంతో.

శృంగారానికి ముడిసరుకు సౌందర్యాకర్షణ, వికర్షణ. కృష్ణం కలయ సఖి 'సుందరం' అన్నాడు కవి. సుందరుడైన కృష్ణుడిని చూడు అన్నాడే తప్ప పరమాత్ముడైన కృష్ణుడిని చూడు అనలేదు.

శృంగారం అంటే భోగ చైతన్యం. అల్లరి, నవ్వడం, కన్ను కొట్టడం,- (కె.పి.ఎస్.) గిల్లడం, లెంపకాయలూ, కావి తన్నులూ తినడం వగైరా సరదాలు.

భోజనం కూడా కొందరికి శృంగారం; కొందరికి ఆహారం. వంటకాల సౌందర్యం చూస్తూ, కొత్తిమీర సౌరభం ఆఘ్రాణిస్తూ, ఆవ రేవను ఆస్వాదిస్తూ భోజనాన్ని ఆరగిస్తారు. మరికొందరు - ఆకలి తీరడం కోసం అన్నం మింగడం.

ఆకలి లేనివాడికి అన్నం రుచి తెలీదు; సరదాలేని వాడికి సంభోగం రుచి తెలీదు. స్వర్గంలో ఈ సరదాలు లేవా - అంత చప్పగా వుంటుందా?

సకల దుర్వ్యసనాలూ గల ఒక మహాపాపి మరణించి పొరుగులోకం చేరాడు. దిగగానే స్కాచ్ విస్కీ అన్నాడు. సీసాల కొద్దీ యిచ్చారు. చికెన్ పులావ్, ఫిష్ కర్రీ, కముజు మాంసం అన్నాడు; తెచ్చారు. నరమాంసం అన్నాడు; రంభా వాళ్ళు వచ్చారు. ఇలా అడగ్గానే అన్నీ యిస్తున్నా ఒక పదిరోజుల్లో బోరుకొట్టాయి అన్నీ - 'దరిద్రం. ఇంతకన్న నరకం బెటరు. అక్కడికి తీసుకుపొండి' అని అరిచాడు. 'నాయనా! ఇదేరా నరకం - ఇది నరక మేరా!' అని జవాబు వచ్చింది.

రామాయణ కథలో సీతారాములు అయోధ్యలో పదేళ్లు హాయిగా కాపరం చేశారు. పదమూడేళ్లు అడవిలోనూ సుఖంగా వున్నారు. ఆ కథ టూకీగా నడిచింది. శూర్పణఖ వచ్చి కాస్త శృంగారం చెయ్యగానే చెరువులా వున్న జీవితం సెలయేరై పరుగెత్తింది.

సంగీతంలో కూడా సరిగమ పదనిస అంటూ మాయామాళవగౌళ రాగం ఒకటీ వుండేది. తినగా తినగా గారెల్లా వినగా వినగా కనరెక్కసాగింది. అప్పుడు స్వరాలు తుంచీ వుంచీ మార్చీ పరిమార్చీ తేడాలు తీసుకువచ్చారు.

సరిగపదస అంటే మోహన. సగపదనిస అంటే హంసధ్వని. ఒక మధ్యమానికి మస్కాయిచ్చి నిషాదాన్ని చేరదీస్తే - ఎంత రుచి!

ఇలా సాగగా క్రమంగా మేళకర్తల కడుపుల్లోంచి వేలాది రాగాలు మేలుకొన్నాయి. కృష్ణుడి పదారువేల రమణులలాగా - ఎందరువున్నా అందరిలోనూ సత్యభామ వికర్షణే కృష్ణుడికి పెద్ద ఆకర్షణ.

ఆకర్షణ బలం వల్లనే సూర్యుడి చుట్టూ గ్రహాలు తిరుగుతున్నాయి. భూమికి గల ఆకర్షణవల్ల చెట్టుమీద పట్టుతప్పిన పళ్లు కిందపడిపోతున్నాయని ఐశాక్ న్యూటన్ కనిపెట్టాడు. ఇందులో ఒక విచిత్రం! భూమి ఆకర్షణ ఎంత శక్తిగలదైనా పైన వున్నదాన్ని మాత్రం కిందకి లాగేస్తుంది. కాని శృంగారం వేరు. పైనా కిందా కాక కుడీ ఎడమా అటూ ఇటూ ఎటుపడితే అటూ నిలువుగా అడ్డంగా ఐమూలగా ఆకర్షించగలదు.

ముఖ్యంగా కనుదోయిని ఆకర్షించే చనుదోయి శక్తి అంతటిది! దేవతలూ ఋషులూ యోగులూ వాళ్ల గురించి పాడిన మహామహాకవులూ చనుదోయి ఆకర్షణ నుండి తప్పించుకోలేకపోయారు.



శ్రీ వెంకటేశ్వరస్వామి - కాంతా కుచాంబురుహ 'కుట్మల' లోల దృష్టుడు. కమలాకుచ చూచుక కుంకుమతో; నియతారుణిత అతుల నీలతనుడు.... శ్రీ వక్షోజ కురంగనాభ మెదపై చెన్నొంద.... శ్రీ కుచోపరి చేలాంచలమైన వీడడు...కుచోన్నతం కుంకుమరాగం....కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో హాటకగర్భురాణి - (ఏడుస్తున్న కన్నులకన్న ఆ కన్నీటి బిందువులు రాలిపడే చనుకట్టే దృశ్యమానం... సంగీతంచ సాహిత్యంచ సరస్వతీ స్తనద్వయం... ఆండాళ్‌ని స్తుతిస్తూ పరాశర భట్టరులు - 'నీలమ్మ చనుగొండ నెత్తమ్ములందు సోలి నిద్రించు కృష్ణుని మేలుకొల్పి' అన్నారు.



**ఆముక్తమాల్యద కథలో కళ్యాణవేళ, పెళ్లికూతురు ఆండాళ్-పెళ్లికొడుకు తలమీద తలంబ్రాలు పోసేవేళ ఆ మురారి 'గుబ్బపాలిండ్ల క్రేవ గ్రక్కున కన్నువేయుటగని' ఆండాళ్లు బాహువులను ముడుచుకుని ముత్యాలను దోసిళ్లతోనే ఎగజిమ్మిందట! కొద్ది ఘడియలలో తనది - తనదేకాబోతున్న స్తనసంపద పై రంగనాథుడు దొంగచూపుల బాణాలు గుప్పించడం దేనికి? అవి దగ్గిరై తన కౌగిలి చేరిపోతే చూపుల తూపులు వేసే దూరం ఉండదనా?**

'ధరా ధరేంద్ర నందినీ కుచాగ్ర చిత్ర పత్రక
ప్రకల్పనైక శిల్పిని త్రిలోచనే రతిర్మమ...'
-దశవక్త్ర భుజంగ ప్రయాతగీతం - రావణాసురుడు
(పార్వతి కుచాగ్రాల మీద చిత్రాలు వేస్తున్న శివుడిని పూజిస్తాను)
దేవుడూ భక్తుడూ రక్తుడూ విరక్తుడూ - అందరూ కుచాగ్ర బుద్ధులే!

పెద్దవాళ్లు సరే - పిల్లలను కూడా విడిచిపెట్టలేదు ఈ ఆకర్షణ.

అయిదారేళ్ల పసిబాలుడు ప్రహ్లాదుడు కూడా 'అన్యకాంత లడ్డంబైన' - రాకూడని వూహాలు వచ్చిగాబోలు - 'మాతృభావము చేసి మరలువాడు'ట!

తన రొమ్మును పట్టుకున్న పోకిరీ బాలకృష్ణుడిని తప్పుగాదా అని గోపిక నవ్వుతూ మందలిస్తే - పాలకోసం అని నవ్వాడట! సిగ్గారోషంతో తలమునకలైపోయింది. ఇటు వాత్సల్యం - అటు శృంగారం అనే 'రెండు తనం' వున్న నిండుమనసు స్త్రీమూర్తిదే! ఒక వంక పసిబిడ్డ ఒక రొమ్ము పాలు తాగుతూ వుండగా పారవశ్యం - మరొక వంక భర్తగారి కరకృత శృంగారానికి వలపుల పులకరింతలూ.

ఈ నిత్యానిత్య సత్యాసత్య ప్రేమ శృంగారాలు ఎలా ఆవిర్భవించాయి?



ఆదిమానవుడి బతుకు భాషలో ఈ పదాలు వుండేవి కావు. ఆడది కనిపిస్తే, కోరిక మేలుకుంటే దగ్గరకు వెళ్లి సూటిగా పాయింటు చెప్పేసేవాడు 'ఓ కామినీ - నిన్ను మోహిస్తున్నాను. / ఓ మోహినీ! నిన్ను కామిస్తున్నాను. కావున సంభోగం అనుమతించవలె' అనేవాడు. ఆవిడ 'సరే' అంటే సరే - లేకపోతే మరో మగువకోసం క్షేత్రయాత్ర.

మత్స్యగంధితో పరాశరముని ఇలాగే మాట్లాడాడు. నదిపై పడవపై మహిమాహిమాచ్ఛాదన మరుగున సంభోగం అనే కార్యం నిర్వహించాకనే వ్యాసుడు సంభవించాడు!

అసలీ సంభోగం ఏమిటి? చెట్టంత మనిషిని పడుకోబెట్టి - ఈ పరకాయ ప్రవేశం ఏమిటి? హవ్వ!

'రవణా! ఒక్క క్షణం ఆగి ఆలోచిస్తే వికారంగా విడ్డూరంగా తోచదూ? కళ్లు మూసుకు వూహించు! ఈ ప్రధానమంత్రులూ-32 బత్తాములున్న లాంగ్ కోట్ గల ప్రెసిడెంట్లూ, ట్రూమన్, స్టాలిన్, దేవుళ్లూ రాక్షసులూ, యోగులూ, భోగులూ అందరూ ఈ సృష్టికార్యం నిర్వహించే క్షణాలకు చెట్టంత మనిషిని వెల్లకిలా-ఇంకో చెట్టంత మనిషి బోర్లగిలా.... హవ్వ!' అంటూ బుగ్గలు నొక్కుకుంటూ కళ్లుమూసుకునేవారు గురుమిత్రులు పిలకా గణపతిశాస్త్రిగారు!

పత్రికలలో ఆ ప్రముఖుల ఉద్ఘోషణలూ ఉద్ఘాటనలూ అభిభాషణలూ గుర్తుచేసుకుని ఠీవిగా పెర్‌పెన్డికులర్ పోజులో వున్నవారు - హారిజాంటల్‌గా పరివర్తన చెందడం తలచుకుని విరగబడి నవ్వుకునే వాళ్లం. ఆ సమయంలో ఆంధ్రపత్రికాఫీసులో మా టేబుల్ దగ్గరకు వచ్చి పలకరించే పెద్ద పెద్ద రాజకీయ నాయకులని చూస్తే నవ్వు అణచుకోలేక దాన్ని దగ్గుగా పరిమార్చి సర్దుకునే వాళ్లం.

వాళ్లు వెళ్లిపోయాక నేను గొంతు తగ్గించి 'మనమూ అంతే - కానీ - మీకు తలమీద మీ యింటిపేరు ముడేసుకుని ఎగురుతూంటే అపుడెలా వుంటుందో!' అన్నాను సన్నగా - ఒక్క క్షణం ఆలోచించారు. భళ్లున నవ్వారు.

నిశ్శబ్దంగా తలవంచుకుని వార్తలు రాసుకునే సబెడిటర్ కార్యాలయం అదిరిపోయి తలెత్తి చూసింది. శాస్త్రిగారు ఓ పుస్తకం తీసి తెరచి చూస్తూ 'చూశావా రమణా! ఈ గాథా సప్తశతిలో ఈ హణ్ణాలుడూ భల్లటుడూ వాళ్లూ-వాళ్ల జోకులూ - వీళ్ల అసాధ్యం గూల - వీడిల్లు సింగారంగానూ!' అన్నారు జనాంతికంగా. సంపాదక సభ ఓహో అన్నట్టు చూసి తలవంచి రాతలలో మునిగిపోయింది.

'ఏమీ ఎరగనట్టు రాసేస్తున్నారు. వీళ్లందరూ-ఇంటికెళ్తే యింతే' అని గొణుక్కున్నాము.

❀

గ్రూచో మార్క్సు రాసిన హిస్టరీ ఆఫ్ మేన్‌కైండ్ గుర్తొచ్చింది - వినండి.

ఆదిమానవుడూ, మానవీ ఒక రోజు గుహలోంచి బయటకొచ్చారు. దుంపలూ పళ్లూ చేపలు తెచ్చుకోడానికి బయలుదేరారు.

ఆహార నిద్రా భయ మైథునాలలో వాళ్లకి మొదటి మూడే తెలుసు.

ఆడా మొగ తేడాలు కూడా అంతగా తెలీవు. కళ్లు చెవులూ కాళ్లు చేతులూ వగైరా ఎక్విప్‌మెంట్ ఇద్దరకీ సమానంగానే వుంది - బొడ్డు కింద ఒక చోట తప్ప - కొంచెం అటూ యిటూగా సమానంగానే వున్నారు.

ఆ ఒక్క తేడా గురించి చెప్పబోతూ ఒక సభలో వక్త - "దేరీజ్ ఎ ఫండమెంటల్ డిఫరెన్స్ బిట్వీన్ మేన్ అండ్ వుమన్" అని ఆరంభించాడు. 'వైవా లా ద డిఫరెన్స్' (ఆ తేడాకి జిందాబాద్) అని అరిచాట్ట సభలోని ఒక ఫ్రెంచి శ్రోత-

సరే - ఆదిమానవులిద్దరూ గుహబైట నిలచి అటూ ఇటూ చూస్తూండగా కారుమబ్బులు మీద కురికాయి. చీకటి. చీకటిలో మెరుపులూ ఉరుములూ - దగ్గర్లోనే పెద్ద శబ్దంతో గుండెలదిరేలా అరడజను పిడుగులు పడ్డాయి. కుంభవృష్టిగా వర్షం.

ఇద్దరూ గుహలోకి పరుగెత్తి భయం కొద్దీ ఒకరి నొకరు గాఠిగా కౌగిలించుకున్నారు... కున్నారు... కున్నారు... అలాగే వున్నారు... కొన్ని విఘడియల తరవాత చలి తగ్గింది. అంతేకాదు. అంత చలిలోనూ చిరుచెమటలు పట్టాయి. కళ్లు

తేలిపోతున్నాయి. ఒళ్లు తూలిపోతోంది. ఈ భయం - తిండికన్న నిద్రకన్న బాగుందే అనుకున్నారు. వాన వెలిసింది.

మళ్లీ పిడుగులూ వర్షం ఎప్పుడొస్తాయీ అని ఎదురుచూడసాగారు. అవి వస్తే గుహలోకి వెళ్లి భయంతో వాటేసుకోవచ్చు.

చివరకి విసుగేసి బయట నిలబడి - 'వానారా! పిడుగూరా!' అంటూ చప్పట్లు కొట్టారు. అదే ఆదితాళం.

చిందులు తొక్కారు అదే ఆదినాట్యం

అరిచారు. హోహో అన్నారు. ఢాం ఢాం తప తప అన్నారు.

ఆదిశబ్దం ఆది సాహిత్యం.

కొన్నాళ్లకి వర్షం పడింది. వాళ్లు భయం నటించి గుహలో దూరి వాటేసుకున్నారు. ఈసారి వర్షం ఎడతెరిపి లేకండా నాలుగు మాసాలు కురిసింది. భయపడిపడి వాళ్లకి విసుగేసింది.

ఇంక చాలు అని చప్పట్లు కొట్టారు.

ఇద్దరు పిల్లలు పుట్టారు.

సంభోగం మీద విరక్తిలోంచి సరికొత్త రక్తిలోకి సంతోషంలోకి మేలుకొన్నారు. అర్థవంతంగా సృష్టి సాగింది.

సుబ్బరంగా వున్న సంభోగ పర్వంలో అబద్ధం ఎలా పుట్టింది?

శ్రీ మహావిష్ణువు నాభినుండి పద్మము, అందులోంచి బ్రహ్మ ఆయన నాభి నుండి భాష, ఆ భాష నుండి బద్ధమూ అబద్ధమూ పుట్టాయి.

'రెండెందుకూ? మనిద్దరం ఒకటే కదా! అంతా పరబ్రహ్మమే కదా-మరి ఈ బద్ధాబద్ధాలు రెండు ఎందుకు?' అని అడిగింది సరస్వతి.

'రెండేసి వుండాలి దేవీ. నీ చేతి వీణా నువ్వూ ఒకటే అయితే వాయించేదెవరు? వినేదెవరు? చెరుకు గడా నేనూ ఒకటే అయితే రుచి తెలిసేదెవరికి? ఎలా? నువ్వు నేనూ ఒకటే అయితే సంయోగం ఎవరితో? ఎలా?'

'అంటే మనిద్దరం ఇద్దరం అంటారు. రెండు అంటారు.'

'అంతే కదా'

'ఒకటే అనుకుని పెళ్లికి ఒప్పుకున్నాను.' అందావిడ చిరాకుపడుతూ,

బ్రహ్మ మందహాసం చేశాడు.

'దేవీ! అబద్ధం లేనిదే బద్ధానికీ, దానవుడు లేనిదే దైవానికీ, చీకటి లేనిదే వెలుగుకూ, ఉప్పులేనిదే కారానికీ, తప్పులేనిదే ఒప్పుకీ, ఆడది లేందే పురుషుడికీ విలువలు కలుగవు కదా' అన్నాడు.

'అయితే మరి మీ త్వమేవాహాలూ అహం బ్రహ్మాస్మిలూ ఇవన్నీ అబద్ధాలేనా? మాయిదారి మాటలేనా?'

'దేవీ! మాయ అనేది సత్యానికి మరో విన్యాసం. కేవలం బ్రహ్మపదార్థం తప్ప అన్నీ మాయలే. సత్యప్రభ విన్యాసాలలో నువ్వు-'

'అంటే నేను ఒక అబద్ధాన్ని అంటారు' అందావిడ కోపంగా.

'నీవు నాకు సత్యానివే. నిన్ను పవిత్రంగా ప్రేమిస్తున్నాను'

'వావి వరస చూడకుండా మీరు నన్ను బద్ధవిరుద్ధంగా కామించారు. ఇపుడు ప్రేమించానంటున్నారు. ఇది అబద్ధం కాదా?'

బ్రహ్మ గుర్రుగా పక్కకి చూశాడు.

'అవును బుద్ధిగలవాడు ప్రేమించడు'

'మరే. ప్రేమించేవాడికి బుద్ధి వుండదు'

'ఉన్నది కామమే అంటున్నావు. మంచిది. నిన్ను కామించి కలయికలేకుండా నా మానస పుత్రుడిగా - ఇదే - నారదుడికి జన్మ నిస్తున్నాను.' అన్నాడు సృష్టికర్త.

'అతడు అబద్ధాలలా వినిపించే నిజాలు చెప్పుగాక. అతనికి ప్రేమ, శృంగారం లేకుండుగాక.'

'పొరుగు జన్మలో అవన్నీ చవిచూచుగాక. ఇది తథ్యం. ఇది సత్యం' అన్నాడు బ్రహ్మ.

నారాయణ నారాయణ అంటూ వచ్చాడు నారదుడు.

'మాటలో వచ్చావు - చిరంజీవ' అన్నారిద్దరూ వాత్సల్యంతో

'ఉమ్మెత్త చెట్టున తుమ్మెదా<br>ఉమ్మెత్తలే పూచు తుమ్మెదా' అన్నాడు నారదుడు.

'ఇది సత్యమే కదా. నువ్వు పెద్దగా ఉద్ఘాటన చేసి చూపడానికేముంది' అన్నాడు బ్రహ్మ.

'తండ్రీ, సత్యం సత్యం అంటావు. నీ సృష్టే మాయ. బతుకే ఒక అబద్ధం అయినప్పుడు - సత్యం ఎక్కడుంది? ఉమ్మెత్తలాగే బతుకు అనే అబద్ధపు చెట్టుకు పూసే కాసేవన్నీ అబద్ధాలే కదా - నిజాలు పూయవు.'

'అసాధ్యుడా! ఇది నీకెవరు చెప్పారు?'

'వామనుడికి బలి దానమివ్వబోతుంటే శుక్రాచార్యులవారు వారించారు. బలి సత్యాన్ని విడవనన్నాడు. నీ బతుకే అసత్యమైనపుడు ఆ అన్నృత వృక్షంలోంచి పూచే

వాక్కులు ఋతాలు కానేరవు అంటూ ఒక బహ్వృచుడు ప్రవచనం చేశాడు. సుబ్బరంగా అబద్ధం చెప్పు. ఇంతకీ ఆ బాలుడే పెద్ద అబద్ధం. అతగాడు నిజానికి విష్ణువు.' అన్నాడు శుక్రాచార్యుడు.

'అయినా బలి సత్యాన్నే పట్టుకు వేళ్లాడుతూ పాతాళానికి దిగజారిపోయాడు. సత్యసంధతకిదే గదా ఫలితం' అన్నాడు నారదుడు.

బ్రహ్మ జవాబు కుదరక తాను కూర్చున్న తామరపువ్వులోంచి దిగి దాని తూడు పట్టుకుని తండ్రిగారి ముజ్జగాల బొజ్జ దగ్గరకు జారిపోయాడు.

ఆదిమానవులకు క్రమేపీ ఒక సత్యం ఆవిష్కృతం అయింది.

సంభోగానికి పిడుగులూ వర్షం అక్కరలేదు అని. కావలసిందల్లా చాటున్న చోటు, కోరికా, తీరికా - సరదా కావాలంటే ఒక అరడజను అబద్ధాలూ అరకేజీ శృంగారమూను.

ఒక రోజున మచ్చిక ఎరగని అడవిగుర్రం లాటి ఆదిమానవి జలపాతం కింద జలకాలాడి గట్టుమీదకు వచ్చింది. తలమీద నీళ్లు చనుగొండలమీదుగా సెలయేళ్లలా జారుతున్నాయి. త్రివళీయుత రోమరాజిపై వయారంగా నాట్యాలాడుతున్నాయి. అక్కడ నుండి అగాధమైన లోయలోకి ఉరుకుతున్నాయి.

హుర్రే! వర్షం! అన్నాడు ఆదిమానవుడు.

'ఏమిటి పాయింటు?' అందామె. నీరోడే శిరోజాలను దులపరించి జల్లుకొట్టి ఉరోజాలమీద ఆరవేసుకుంటూ-

'కామినీ నిన్ను మోహించాను' అన్నాడతను ఆ జల్లును చప్పరిస్తూ లొట్టలేస్తూ.

'అలాక్కానీ' అంటూ చేతులు బారజాపి ముందుకు వచ్చి ఒక బండకు జేరబడింది.

అతడామె మీదకు వంగాడు.

అంతలో-

'మోహినీ నిన్ను కామించాను' అని వినబడింది.

ఇద్దరూ అటు చూశారు.

వృషభరాజులా పుష్టిగా, ఏనుగులా ఎత్తుగా మంటలా ఎర్రగా వున్నాడు.

వీడికన్న వాడు నదరుగా కనబడ్డాడు.

ఆమె ప్రథమ పురుషుడిని కాదని రెండోవాడికేసి నడిచింది.

మొదటి వాడికి రోషం దుఃఖం-

'ఓ భామినీ - ఇలా చేస్తే నేను నిన్ను కామించడం కాదు. ప్రేమిస్తాను జాగర్త' అన్నాడు ధాటీగా.

'ప్రేమిస్తానడం అంటే?' అందామె వెనక్కి తగ్గి

రెండోవాడికి ఒళ్లుమండి అసహనంతో రెచ్చిపోయి తనని తానే కౌగిలించుకున్నాడు.

'వాడిని చూడు. నువ్వు నాకేసి తిరగ్గానే నీమీద కోపంతో గిలగిల్లాడిపోతున్నాడు. ప్రేమించడం అంటే అలాక్కాదు. నువ్వు వాడి కౌగిట్లోకి వెళ్లిపోయినా నాకు కోపంరాదు. నిన్నే చూస్తూ ఇలా చేతులు జాపి వుసూరుమంటూ ఏడుస్తాను. ఇలాగే చచ్చిపోతాను' అన్నాడు.

'అమ్మబాబోయ్!' ఆమె ఝుడుసుకుని మొదటివాడి కౌగిట్లోకి పరుగెత్తి బందీ అయిపోయింది.

రెండు ఘడియలు ఇద్దరూ ఘర్షణపడ్డారు.

చెమటలు సెలయేళ్లలా జారుతున్నాయి. అతడు ఒగురుస్తున్నాడు.

ఆమె అలసినా వయ్యారంగా వెనక్కి వాలి వృషభుడిని చూసింది. వీడి అందం వాడి పుష్టి కలిస్తే ఎలా వుండేదో అనుకుంది.

పొదచాటునించి ఇదంతా గమనిస్తున్న భర్తృహరి ఓ చిన్న బండనెక్కి ఆకాశాన్ని చూస్తూ ఆవేశంతో శ్లోకం ఆరంభించాడు.

జల్పన్తి సార్ధమన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః..... అని ఆగాడు.

అప్పటికింకా దేవభాష భువికి దిగి రాలేదు.

వీళ్లకి తెలుగేరాదు. సంస్కృతంలో కోప్పడితే ఏం లాభం అనుకున్నాడు. ఆయన పైకందువా మీద కూర్చున్న లక్ష్మణ కవి ఇలా అన్నాడు.

ఒకనితో గూడి భాషింతు రొక్క నరుని<br>
జూతురు విలాస సంపద సొంపుగులుక<br>
మరియు నొక్కని దలతురు మనసులోన<br>
గూర్చు ప్రియుడెవ్వడొ ముద్దుగుమ్మలకును!



ఈయనెవరో - పిట్ట కొంచెమైనా కూత ఘనం అంటూ అలవోకగా లక్ష్మణ కవిని చూసింది వనసుందరి.

భర్తృహరికి ఒళ్లు మండింది.

'కూత వాడిదైనా రాత నాది' అంటూ పై కందువాతీసి అందు మీదున్న కవిని దులపరించాడు.

ఇదంతా గమనిస్తున్న మొదటివాడికి ఒళ్లుమండింది. తన కౌగిటిలో వుంటూనే ఇంత కథ నడిపించిన ఈ గ్రంథసాంగ్సురాలిని విడిచి వెనక్కడుగేసి మేనక దగ్గర విశ్వామిత్రుడి భంగిమపెట్టాడు.

'ఓ కామినీ పిశాచీ! నీ ప్రేమ అబద్ధం. ముందు నన్ను కోరి తరవాత వాడికేసి తిరిగి, మళ్లీ నా కౌగిలిచేరి, నా భుజాలమీంచి వాడిని చూస్తున్నావు. నీ మనసు అక్కడే వుంది. ఫో అటు ఫో' అంటూ జలపాతం కింద స్నానం చేస్తున్న మరొక వరారోహకేసి పరుగెత్తాడు.

భీష్మ పితామహుడు ఘోటక బ్రహ్మచారి. ఈ కథ చదవలేదు. కారణం - నేను రాయలేదు. అందుకని అంబ బతుకుతో చదరంగమాడి ఓడి, చివరకి శిఖండి చేతిలో చావుకు తెచ్చుకున్నాడు.

సంభోగాత్పూర్వ శృంగారం ఎంత సరదాగా వుంటుందో సంభోగోత్తరం అంత గంభీరంగా - అదే - దతగా చిక్కగా వుంటుందంటారు కాని మొగాడు దగాలు చేస్తూ తుమ్మెదలాగా రకరకాల పూలమీద షికార్లు చేస్తూ దాగుడుమూతలాడుతూ తిప్పలు పెట్టినపుడు విప్రలంభ శృంగారం చెలరేగుతుంది. అందులో ఎన్నో కవిత్వాలూ చమత్కారాలూ మిరియాలూ ఊహాపోహలతాంతాల సౌరభాలూ, ఎండనీ నీడనీ చెమటనీ చలినీ వెన్నెలనీ వేడినీ పొగుడుతూ తెగుడుతూ భువన మోహన కల్పనలూ - అష్టవిధ నాయికల కష్టాష్టక విరహ విన్యాసాలూ..... వాహ్!

కాని లేరా దనుజ మర్దన కందుకూరి జనార్దనా....

చెక్కిలెవ్వతె నొక్కెరా.... నిను వీథిలో కనుగొంటిరా.... తెల్లవారిన దాక

ఎక్కడ తిరుగులాడితి చెప్పరా..... (నా) ఒడలిపై చెయి వేయకూ.....

గండి దొంగవు దనుజమర్దన కందుకూరి జనార్దనా - అంటూ నాయిక న - సాధిస్తూంటే-

రావే చిల్కల కొల్కి! రూపవతి రామా మనోహారిణీ!.... బాలా మ్రొక్కెద కౌగలియ్యగదవే ప్రామంబులిక నిల్పవే - అంటూ నాయకుడు ప్రాధేయపడతాడు.

నాయిక కరిగిపోతుంది.

జంట నేత్రములంటి చూసితె జాజి పూవులు పూసెరా!.... కంటిలో నొక పండు వెన్నెల కాయుచున్నది ఏమిరా! అంటూ ముద్దు చేసి

కదియరారా దనుజమర్దన కందుకూరి జనార్దనా
అంటూ శయ్య మీదకు పిలుస్తుంది.

జారిణి దారివేరు.... మొగుడు వూరలేదు. అత్తమంచం పట్టి - చెవిటిదీ గుడ్డిదీ - ఇరుగు పొరుగు లేని లంకంత కొంప - నాకు భయంగా వుంది అంటుంది హాలుడి గాథల జారిణి - జనాంతికంగా - కోడెగాడికి వినబడేలా-

సంభోగానంతరం (వెంటనే కాదు) చాలాకాలం గడిచి,
జవసత్వాలుడిగి కోరికలు పండువెంట్రుకలలా రాలిపోయాక కూడా-
కొందరికి భార్య/ భర్త/ లపై ఆపేక్ష ఆదరణ స్నేహం తగ్గవు. పెరుగుతాయి
'నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము-'

అంటాడు సుదాముడు. దేవుడు వరమిస్తానంటే సంపదలో - ఏకంగా ఏ మోక్షమో కోరకుండా - నీపట్ల భక్తి కావాలి అనడం భగవద్భక్తికి పరాకాష్ఠ.

అలాగే భార్యాభర్తలు కూడా - ఓపికపోయి కోరికలు తీరి శృంగారావసరాలు లేని వయసులో ఒకరి నొకరు ప్రేమించుకోడమే అత్యుత్తమ శృంగారం. వారి చుట్టూ పెరిగి అల్లుకునే అనురాగమనురాగలత శోభాయమానమైనది. లోకోత్తర సౌరభాలతో వెల్లివిరిసేది. పెనుగాలి వీచినా చెదరని ప్రదీప కళిక. అటువంటి దీపాన్ని మనకి చూపించే గొప్ప కథ - శ్రీరమణగారి 'మిథునం' ఆ కథలో ఆలుమగలు పండు



ముసిలివాళ్లు. పసిపిల్లల చురుకుతనం పడుచువాళ్ల శక్తి చైతన్యాలూ పెద్దల వాత్సల్య వివేకాలూ అక్షరమైన స్నేహం కలబోసిన వాళ్లు - ఒకరి నొకరు వెక్కిరిస్తూ తిట్టుకుంటూ దెప్పుతూ గిల్లుతూ (కె.పి.ఎస్. కాదు) అల్లరి పెడుతూ నవ్వుతూ నవ్విస్తూ పున్నమినాటి సముద్ర కెరటాల్లా ఎగసిపడి లేస్తూ బతుకే నిత్యకల్యాణ మంటపంగా ఇలసాటి లేని జంటలా వుంటారు.

ఇక వేళ అయిందనిపించిన వేళ తానులేని ఒంటరితనాన్ని భర్త భరించలేడని తలచి-

భర్త వడిలో సుమంగళిగా వెళ్లిపోవాలనే ఇల్లాలి కోరికను చంపుకొని- తన వడిలో తలవుంచి ఆయనే ముందుగా హాయిగా వెళ్లిపోవాలని కోరుకున్న ఉత్తమా యిల్లాలు ఆవిడ.

జీవికి జాగ్రత, నిద్ర, స్వప్నం, అది దాటాక తురీయమైన ఆనందం - ఇలా నాలుగు అవస్థలుంటాయంటారు.

అలాగే రసరాజమైన శృంగార పథయాత్రికులకు - కోరిక, ప్రయత్నం, ప్రతిఫలం తరవాత తురీయమైన ప్రేమ సామ్రాజ్యసిద్ధిని ఈ కథ ఆవిష్కరించింది.

శృంగారం అనగానే కామక్రీడల గొడవ అని రూఢ్యర్థం ఏర్పడిపోయింది కాని చూడగలిగే వారికి అనేక విషయాల్లో శృంగారం భాసిస్తుంది.

వంటకోసం కూరలు తరగడం తాళింపు సామాను అమర్చుకోడం....

వేయబోయే బొమ్మకోసం వచ్చే ఊహలు, వాటి ప్రకారం పెన్సిలుతో స్కెచెస్ వేసుకోడం....

పాటకు రాగాలు వెతుక్కోవడం స్వరాలు అమర్చుకోవడం మార్చుకోవడం.

కథకు వస్తువు, దాని కోసం పాత్రలూ, వాటి వేషభాషలూ వూహించుకోడం.

ఇలా నిత్యజీవన వ్యాపారాలన్నిటా శృంగార దృష్టితో ఆలోచిస్తే జీవితం చాలా సరదాగా ఉత్సహాభరితంగా శోభిస్తుంది.

దేవుడిని ఆరాధించిన భక్తులు కూడా స్తోత్రాల్లాగా - నీకు నాలుగు చేతులున్నాయి మంచి మంచి నగలున్నాయి అని పొగడకుండా ఆయనను భక్తి సంగతుల ద్వారా అనురాగంతో అర్చించి శోభించారు.

శృంగారం పరమార్థం సంతోషం; మోక్షం కాదు
పుట్టినప్పటి నుంచి వేళయేదాకా సరదాగా బతకడం.
నిన్నరాతిరి నిన్ను కూడిన కన్నె ఎవరని అడగనూ
రేపురాతిరి చేరబోయే రేవు ఏదని అడగనూ
నేటి రాతిరి నన్ను చేరితె మాటిమాటికి డాయనూ
పొందుకొరకే వందనాలుర కందుకూరి జనార్దనా!



(ప్రక్షిప్తము)

శోభానే....





మందిస్తూ డాక్టరు రోగికి ధైర్యం చెప్పాడు.

"మీకేం ఫరవాలేదు. పథ్యం మటుకు జాగ్రత్తగా చెయ్యండి. నూనె సరుకులు తినొద్దు, రోజుకి ఒక చుట్ట త్రాగండి."

రెండు వారాల తరువాత రోగి తిరిగి వచ్చాడు.

"డాక్టరు గారూ – మీరు చెప్పిన పథ్యం అంతా బాగానే ఉంది. కాని ఆ చుట్టల వరస నాకు నచ్చలేదు. ఛస్తున్నాను, రోజూ ఓ చుట్ట కాల్చలేక. దగ్గుతో ఊపిరాట్టం లేదు. జన్మలో చుట్ట కాల్చి ఎరగను!" అన్నాడు. ★

"ఏవిటండి, ఈ భక్తికీ, పూజలకీ అర్థం పర్థం లేదు. తృప్తి – అంటారు."

"ఏవిటి నా మొహం, హారతి కర్పూరం కొని ఆ గుళ్ళో తగలేస్తే ఏవిటి తృప్తి? నాకు తెలీకడుగుతా." అన్నాడు ఒక రావుగారు ఇంకో సిగరెట్ ముట్టిస్తూ. ★

పొగ తాగితే క్షయ, కాన్సరు వగైరాలు వస్తాయని, ఆయుక్షీణమని తరచు శాస్త్రజ్ఞులు ప్రకటనలు చేస్తూ వుంటారు. వ్యాసాలు రాస్తూ ఉంటారు.

"ఇవన్నీ చదివి చదివి ఇక లాభం లేదని కొనడం మానేశానోయ్" అన్నాడొకాయన.

"ఏదీ సిగరెట్లే?"

"అబ్బే, పత్రికలూ, పుస్తకాలూను." ★

బీర్బల్‌చేత ధూమపానం మాన్పించాలని ప్రయత్నిస్తున్న అక్బర్ ఒకనాడు ఒక గాడిద నోటికి హుక్కా గొట్టం అందించమన్నాడు నౌకర్ని. గాడిద మొహం తిప్పుకుంది.

"చూశావా, చివరికి గాడిద కూడా పొగాకును ద్వేషిస్తోంది."

"అవును ప్రభూ, పొగాకును ద్వేషించ గలిగింది కాబట్టే 'గాడిద' అన్నారు." అన్నాడు బీర్బల్. ★

ఒక "పొగ తాగనివాడు," ఇంకో "పొగ తాగుబోతును" మరమత్తు చెయ్యదలచాడు.

"మీరు రోజుకు ఎన్ని కాలుస్తారండి?"

"రెండు"